# కవికొండల వెంకటరావు

## కృతులు - సమీక్ష

(ఆంధ్ర విశ్వవిద్యాలయము వారిచే 1985 లో ఉత్తమ సిద్ధాంత గ్రంథముగ ఎన్నికై శ్రీ త్రిపురనేని గోపిచంద్ మెమోరియల్ అవార్డును పొందినది.)

డా॥ జిడ్రప్రోలు విజయలక్ష్మి
ఎం.ఏ, బి ఇడి, పిహెచ్.డి.

శ్రీ పబ్లికేషన్సు
106/3 మువ్వలవానిపాలెం, విశాఖపట్నం-17.

ప్రథమ ప్రచురణ : 1989

ప్రతులు : 1000

ముఖచిత్రం : భాస్కర్, విజయవాడ.

తెలుగు విశ్వవిద్యాలయమువారి
ఆర్థిక సహకారముతో ప్రచురితము

వెల : రు. 60/-

ప్రచురణ : శ్రీ పబ్లికేషన్స్
106/3, మువ్వలవానిపాలెం
విశాఖపట్టణం-17

ముద్రణ : శ్రీ కృష్ణా ప్రింటర్స్
విజయవాడ-10.

# అంకితము

శ్రీ కవికొండల వెంకటరావు దివ్యస్మృతికి

—జడప్రోలు విజయలక్ష్మి

'ఎవ్వాని కొఱకు కోయిల పిట్ట యెలుగెత్తి
కొమ్మ 'కోకో' యని కొసరు విసరు;
ఎవ్వానికై సెలయేరు ఝల్లలమని
పెను కొండలోయఁ బింపిళ్ళ గూయు;
ఎవ్వాని పొంచె యుయ్యేల దూగు చిఱిపాప
మవ్వంపు చిన్నారి నవ్వుఁ నవ్వు;
ఎవ్వాని గూర్చి హాయిగ పేదగోపండు
గొల్ల పిల్లంగ్రోవిఁ బల్లవెత్తు:
అట్టి చిద్రూప మూర్తి కనశ్వరునకు,
సకల జంగమ స్థావర సాధుజీవ
లలిత సద్భావ సరసకళాలయునకు,
పురుష సూక్తన కంజలి పుటి ఘటింతు '

— కవికొండల వెంకటరావు.

# ముందుమాట

పందొమ్మిదవ శతాబ్ది అంతమున ప్రభవించి, కవితాశక్తిని తన తపః ఫలముగభావించి, తెలుగు సాహిత్య ప్రక్రియ లన్నిటిలోను నిర్విరామముగ రచనా వ్యాసంగము నొనర్చి సఫలత నొందిన ధన్యజీవి కవికొండల వెంకటరావు. అట్టి సారస్వతో పాసకుని రచనలను పరిశీలించి, సమీక్షింపుమని, 1976 సంవత్స రములో నేను పరిశోధనకు పూనుకొనినప్పుడు గురువర్యులు ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారుతమ అమూల్యమైన సూచననిచ్చి, ప్రోత్సహించిరి.

ఆ సందర్భమున నేను కవికొండల రచనల కొరకు ప్రయత్నించగా ఆంధ్ర విశ్వవిద్యాలయ గ్రంథాలయమునందు కొన్ని మాత్రమే లభించినవి. వీనిని పరిశీలించగ వీరిరచనలలో మరుగు పడినవి, అముద్రితములు పెక్కులు కలవవి తెలిసినది. వానిని వెలికి తీయుటకు నా శక్తిమేరకు యత్నము కావించితిని. అందులకై నేను గుంటూరుకుపోయి కవికొండలవారికుటుంబమును కలిసితిని. అక్కడ కవికొండలవారి కుమారులు కీ శే నరసింహరావు, శ్రీ సూర్యనారాయణగార్లు అనేక పుస్తకములు,వ్రాత ప్రతులు,వ్యాసములు మున్నగునవి నాకు అందచేసి సహక రించిరి తరువాత కావలిలో కీ శే, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, శ్రీ కె వి. రమణారెడ్డిగార్లను కలుసుకొంటిని వారు సహృదయతతో అడిగినదే తడవుగా కవి కొండల జీవిత, కవితా విశేషాంశములను నాకు తెలియ చెప్పిరి.

ఈ గ్రంథమున కవికొండల రచనలను ప్రక్రియానుసారముగా సంప్ర దాయ, నవ్య కవిత్వములు, నవల, కథ, నాటకము, ఏకాంకిక, వ్యాసములు అను ప్రకరణములలో సమీక్షించితిని.

దీనివలన వీరి రచనలలో ప్రకృతి, జానపద, గ్రామీణ, కవిత్వములు కథలు, ఏకాంకికలు, వ్యాసములు మున్నగు ప్రక్రియలలో వస్తు విస్తృత, వైవిధ్యములతోబాటు విలక్షణతయు గోచరించుచున్నది కనుక పైశాఖలను ప్రత్యే కముగ, కూలంకషముగ అధ్యయనము చేయుట జరిగినది మిగిలిన శాఖలను కూడా యథాశక్తిగ అనుశీలనము చేసితిని

పై పరిశోధన వలన కవికొండల అధునిక సాహిత్య రంగమున 'ప్రకృతి కవి'గ, 'కార్మిక కవి'గ, 'కథక చక్రవర్తిగ' వాసిగాంచి శాశ్వతముగ నిలిచి పోయి రని తెలియనగును.

విశాఖపట్టణము
12-2-1989

డా॥ జడ్రపోలు విజయలక్ష్మి

# కృతజ్ఞతలు


నా పరిశోధనకు పర్యవేక్షకులుగ నుండి, నా సిద్ధాంత గ్రంథమును ఆమూలాగ్రముగ పరిశీలించి, అమూల్య సలహాలనిచ్చి చేయూత నిచ్చిన గురువర్యులు ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారికి నా హృదయ పూర్వక నమస్సుమాంజలులు.

కవికొండలవారి పుస్తకములను, అముద్రిత రచనలను, అందచేసిన వారి కుమారులు కీ శే. నరసింహరావు, శ్రీ సూర్యనారాయణగార్లకు; జీవిత విశేషములను దయతో తెలియ చెప్పిన కవిగారి భార్య శ్రీమతి దమయంతీదేవిగార్లకు నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

కవికొండలవారి కవితా విశేషములను సహృదయతో తెలిపిన కీ.శే. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, శ్రీ కె. వి రమణారెడ్డిగారికి నా నమో వాకములు.

నా పరిశోధనకు ప్రోత్సాహమిచ్చిన డా॥ కోలవెన్ను మలయవాసిని, డా॥ అంతటి నరసింహంగార్లకు, సహకరించిన శ్రీ సింగవరపు సూర్యారావుగారికి, విశాఖ మహిళా కళాశాల ప్రిన్సిపాల్‌గారికి, నాతోటి అధ్యాపక బృందమునకు నా ధన్యవాదములు

నేను విద్యావంతురాలగుటకు, నా ఉన్నతికి కారకురాలైన పూజ్యురాలు మా తల్లి శ్రీమతి సిద్ధమ్మగారికి, నన్ను అడుగడుగున ప్రోత్సహించిన మా అన్న శ్రీ సిద్ధయ్య మా అక్క శ్రీమతి భాగ్యలక్ష్మిగార్లకు నా హృదయ పూర్వక నమస్సులు.

నా పరిశోధనకు ప్రేరణ, ప్రోత్సాహమునిచ్చి నా అభ్యుదయ కారకులైన మా శ్రీవారు డా॥ జె విజయ మోహన్ నాయుడుగారికి నా అభివందనములు. నా పరిశోధన యందు ఆసక్తి చూపిన మా చిరంజీవులు కవిత, ప్రశాంత్‌లకు శుభాశీస్సులు.

గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయమిచ్చిన తెలుగు విశ్వవిద్యాలయ అధికారులకు, స్వల్పకాలములో ముద్రణాభారము వహించిన శ్రీ కృష్ణా ప్రింటర్సు అధినేత శ్రీ ఎస్ వెంకటేశ్వరరావుగారికి, ముఖచిత్రమును ముచ్చటగ రూపొందించిన శ్రీ భాస్కర్‌గారికి, ఈ విషయంలో తగు సలహాలిచ్చిన శ్రీ భమిడిపాటి అనంతంగారికి, ముద్రణ కాలములో సహకారమిచ్చిన శ్రీ కె ఎస్ రావు దంపతులకు, శ్రీ యన్ జె ఎన్ శర్మగారికి కృతజ్ఞతలు.

నా యీ కృషిని ప్రోత్సహించిన బంధు మిత్రాది వర్గమునకు ధన్యవాదములు.

# విషయ సూచిక

# జీవిత చరిత్ర

"దాక్కొని వుంటాయి
దారంత గడ్డిని
రుక్కొని వుంటాయి
తలపంగరాని పూలు
పిలవంగబోని పూలు
నిలుపంగలేని పూలు"

అనుచు సృష్టిలోని గడ్డిపూవును సైతము కవితా వస్తువుగ స్వీకరించి 'ప్రకృతి కవి'గ వాసిగాంచిన ఆధునిక కవి కవికొండల-కవిత్వమే తన ఊపిరిగ నెంచి, జీవితమును హారతి కర్పూరముగ సరస్వతీదేవికి నీరాజనము గావించి ధన్యత నొందిన సారస్వత కళోపాసకులు కవికొండల వెంకటరావు

**జననము :**

వీరు నందననామ సంవత్సర (20-7-1892) ఆషాడ బహుళ ఏకాదశీ మృగశిరా నక్షత్రయుక్త బుధవారమున, తూర్పుగోదావరి జిల్లా రాజమహేంద్ర వరము తాలూకాలోని శ్రీరంగపట్టణమను గ్రామములో జన్మించిరి వీరిది భారద్వాజస గోత్రము యాజ్ఞవల్క్య సూత్రము

వీరి 'విప్రసందేశము' అను నాటకమున నటీ సూత్రధారుల సంభాషణము నందు వీరి వృత్తాంతము తెలియుచున్నది

శృంగారవంతమౌ శ్రీరంగపట్టణ
జనపద రాజంబు జన్మభూమి
సకల వేద జ్ఞాన సంపన్న సత్తముం
డల భరద్వాజుండు కులగురుండు
కవి కొండలాన్వయార్ణవ పూర్ణచంద్రుండు
నరసింహామతి యశోన్నతుడు దండ్రి
గాడిచర్ల కులాబ్ధి గర్భ ముక్తాఫలం
బమల సుగుణి శేషమాంబతల్లి

పేరు వేంకట్రావు విఖ్యాత రాణ్మహేం
ద్రవర నగరమందు దనరునతడు
ప్రథమ యత్నమిదియ, పద్యగద్యయుతంపు
రూపకము రచించె జూపమనము

**బాల్యము :**

భూస్వాములైన నరసింహారావుగారి ముగ్గురి కుమారులలో కవి కొండల జ్యేష్ఠులు 1890వ సం॥లో కవికొండలకు ఏడేండ్లయినను నిండకనే మాతృ వియోగము కలిగినది తరువాత వీరి తండ్రి ద్వితీయ వివాహము చేసికొనిరి. ఆమెకు ఒక్క పుత్రిక మాత్రమే పుట్టినది ఆమె తన సవతి పిల్లలను స్వంత పిల్లలవలె చూచుకొన్నది

కవికొండల 'నయనరేఖ' అను వ్యాసములో తన బాల్య స్మృతులను నెమరు వేసికొనిరి "నేను పుట్టినట్లు చెప్పిన ఒక మిద్దెపై గది నాకనులముందు తోచు చున్నది 5,6 ఏండ్లప్పుడు చల్లని చూపులలో తల్లి చూచుట, నృసింహశతకము బామ్మ ఒప్పచెప్పుకొనుట, ఆముదపు దీపమునెమ్మి బామ్మ పెద్ద సత్తెపాలతో పెరుగు దెచ్చి కెరళ్ళవోలె గరిటెతో పదిమంది పిల్లలకు వడ్డించుట, వేసవిలో మామిడి, పనస, వానాకాలమున బత్తాయి, శీతకాలమున తేగలు, రేగుపండ్లు తినుట" మొదలగు విషయములను తలచి మురిసిపోయిరి

సమిష్టి కుటుంబమయినను పినతండ్రులు ఎంతయో దయగ, ప్రేమగ చూచిరి తండ్రి ఎప్పుడును కసిరికొట్టలేదు బాల్యము ఏ కొదువయు లేక హాయిగా, సం తృప్తిగ గడపిరి తల్లి మరణింపగ, ఆమె స్వరూపము తన స్మృతిపథమున లేనందులకు ఉక్కిలి చింతించుచు "నీ చూపులు, నీ శరీరము, నీ ఊహలు నావే" అని తల్లిని గూర్చి తృప్తిపడిరి

బాల్యమున వీరి విద్యాభ్యాసము శ్రీరంగపట్టణములో జరిగినది తరువాత బి.ఏ పట్టము (1913) రాజమండ్రిలోను, బి ఎల్ పట్టము మదరాసులోను పొందిరి

**వివాహము ;**

1906వ సం॥లో తమ పదునాల్గవఏట కవికొండలకు వివేకవర్ధనమ్మతో వివాహమైనది ఆమె 1909వ సం॥లో సంతాన ప్రాప్తిలేకనే స్వర్గస్థురాలయినది

పిమ్మట 1910వ సం॥లో దమయంతీ లక్ష్మీదేవమ్మతో వీరికి ద్వితీయ వివాహమయినది వీరికి ఇరువురు కుమారులు, అయిదుగురు కుమార్తెలు

వీరు పిల్లలపట్ల మిక్కిలి శ్రద్ధ చూపెడివారు భోజనపుటలవాట్లలో మొదటి నుండి చాల నియమంగా ఉండేవారు సాయంత్రపు భోజనము సర్వసాధారణముగా పిల్లలతో కలసి ఒకే పంక్తిలో చేసేవారు ఆ సమయమున వార్తాపత్రిక విశేషములు పిల్లలతో ముచ్చటించెడివారు

వీరు అనుకొనిన పని వెంటనే జరుగునటుల సాధించువ్యక్తి ఒకసారి స్వగ్రామమైన శ్రీరంగపట్టణము వెళ్ళినపుడు - తిరిగి రాజమండ్రికి ఉదయం అర్జెంటు కోర్టు పనిమీద బయలుదేరి, బస్సులు దొరకకపోవుటచే పదమూడు మైళ్ళు కాలినడకన వచ్చిరి శారీరకముగ మంచిదార్ఢ్యము, ఆరోగ్యముగల వ్యక్తి గాకున్నను మానసికముగ ధీశాలి

## న్యాయవాదవృత్తి :

కవికొండల 1915లో బి ఎల్ పట్టము రాకమునుపు పశ్చిమగోదావరిజిల్లా నరసాపురములోని టైలరు ఉన్నతపాఠశాలలో హిస్టరీ ఉపాధ్యాయులుగ పనిచేసిరి. ఆ కాలములో వీరు విద్యార్థులకు అత్యంత ప్రీతి పాత్రులుగ నుండిరి "విద్యా బోధనలోని ఉత్సాహము, నవీనపద్ధతుల ద్వారమున విద్య బోధించుట, ఆటపాటలలో ఆసక్తికలిగించుట, తమపై చూపిన మిత్రభావము మరపురానివని విద్యార్థులు 'ఫేర్‌వెల్ అడ్రెస్'[1] లో తెలిపిరి

వీరు రాజమహేంద్రవరములో 1916 నుండి 1922 వరకు లాయరువృత్తిని చేపట్టి కొనసాగించిరి 1922 నుండి 1933 వరకు నరసాపూరులో లాయరుగ నుండిరి అనంతరము రాజమండ్రికి వచ్చి అక్కడ స్థిరపడిరి

వీరు 1920వ సం॥లో "ఎడిషనల్ వర్నాక్యులర్" పరీక్షలో ఉత్తీర్ణులై 'డిస్ట్రిక్టు మునిసిఫ్' ఉద్యోగమునకు ఎన్నికైరి కాని వారు దానిలో చేరలేదు కారణము తెలియదు న్యాయవాదవృత్తి వీరికి లాభదాయకము కాలేదు కవికొండల గోదావరీ మండల సంఘ సంస్కరణాభివృద్ధిసమితి, రాజమండ్రికి కార్యదర్శిగా నుండి, సంఘసంస్కరణలకు సంబంధించిన కేసులను ఉచితముగ చేసెడివారు

వీరు కోర్టులో మేకవలె ఉన్నను సారస్వతరంగములో సింగంపుకొదమ [2], వీరు చదివినది, పట్టముపొందినది న్యాయశాస్త్రములోనే అయినను ఆసక్తి చూపినది కీర్తి గడించినది తెలుగు సారస్వతరంగములోనే తన వృత్తిలో, ఏకాగ్రత చూప

లే-పోయినట్లు వీరే ఒక చోట తెలిపిరి "పాత పుస్తకములు అయిపోయినగాని క్రొత్తవి ముద్రింపబుద్ధి పొడమలేదు దానికొరకు విశేషకాలము ఆ రూపేణ శ్రమ పొంద కొంచెము నా న్యాయవాదవృత్తికి నీళ్ళిచ్చాను ఇంగ్లీషు చదువు, న్యాయవాద వృత్తి అంటేఅంటక ఏదియో వ్యవహారమునకు మాత్రమే ఉపయోగపడినవి"[3] అనిరి

వీరికి డెబ్బయి సంవత్సరములు దాటిన తరువాత కూడ, రాజమండ్రిలో చురుకుగా జీవితము కొనసాగించినంతవరకు కోర్టుకు వెడలుచుండెడివారు

## సారస్వత జీవనము :

కవికొండల జన్మతః కవి వీరి జన్మస్థలమగు శ్రీరంగపట్టణము సహజ సౌందర్య విలసితమైనది వీరిలో నిద్రాణమైయున్న ప్రతిభ కవితా హృదయము ఈ పరిసరములకు స్పందించినవి కవికొండల అను వీరి వంశనామమే వీరు కవుల వంశములోనివారని స్ఫురింపచేయును "వీరి పూర్వీకు లెవ్వరూ కవిత్వముచెప్పినట్లు కనబడదు కాని వాఙ్మయములో శ్రద్ధాభిరుచులు గలవారని తెలియుచున్నది"[4]

"ఇంటిపేరు ఏనాడు పుట్టినదోగాని వీరి జన్మతో అది సార్థకమైనది కొండలెంత విచ్చలవిడిగా ఉంటాయో వారి ఊహలు కూడ అంత విచ్చలవిడిగా ఉంటాయి"[5] అని కృష్ణాపత్రిక సంపాదకీయం తెలిపింది

## ప్రకృతికవి :

ప్రకృతి రామణీయకమును మనసారాగ్రోలి, చెవులార విని, నోరార భాషించి జగమునకు ప్రసాదించిన ప్రకృతికవి కవికొండల అందులకే న్యాపతి కృష్ణారావు గారు "ఈ కవి నిలువెల్ల కవియే తనువెల్ల కవియే"[6] అనిరి

ప్రకృతిలో ప్రతి అంశమును వీరికి అర్థవంతముగ, కవితా స్ఫోరకముగ గోచరించును గవ్వనుండి గోదావరి నది వరకు తెల్లుపూవునుండి రాదారి బండి వరకు అన్ని విషయములు వీరి మనస్సును కదలించి కవితా ప్రేరకములైనవి శివరాత్రినాడు శివుడు చేయు ప్రళయతాండవమును 'శివరాత్రిప్రభ' అను గేయములో అద్భుతముగా చిత్రించగల్గిరి

వీరిని ప్రధానముగా ఆకర్షించిన మరొక విషయము జానపదుల జీవితము. వీరు పుట్టి పెరిగిన పల్లె, పల్లీయుల జీవనము చిన్ననాడే వీరి హృదయమున చిత్రితములై రూపు దాల్చినవి జానపద జీవితమున ప్రత్యేక పక్షపాతము అనాడే

వీరి మదిలో చోటు చేసికొనినది సుబ్బుతునుకను చూచినను, మలయమారుతము ననుభవించినను, పచ్చని కేదారంపు మడి సౌభాగ్యమును వీక్షించినను పరవశించి గ్రామీణ జీవనమును నైసర్గిక సుందరముగ చిత్రించగల నేర్పు వీరిలో కలిగినది. ఇట్టిదృష్టియే వీరిని ప్రకృతికవిగ భాసిల్ల చేసినది.

"ఏనాడో ఏతపఃఫలముగానో కవితనాలో ఉదయించినది నాటినుండి దానిని నేనొక విశ్వాసముగా, ఒక విశ్వాసముగ భావించితిని ఎక్కడ చూచినా చైతన్యమూ, దేవే నాకు కనిపించేవి ఆ చైతన్యము, దేవ నాలో ఒకరూపము దాల్చి ఒక పద్దెమో, గీతమో వెలువడుతూ వుండడము పరిపాటి అయినది"[7] అని కవికొండల తనలోని కవితా శక్తిని తపఃఫలముగ భావించిరి

ఈ విధముగ తనలో కవితావేశము పొంగిపొరలుచున్న దశలో వీరు రాజమండ్రి కళాశాలలో విద్యాభ్యాసము చేయుచుండిరి వీరు వర్డ్స్‌వర్త్, బర్న్స్ మొదలైన పాశ్చాత్యకవుల రచనలను కూడ చదివి ఆ దినములలో ఆనందించు చుండిరి సంప్రదాయ సాహిత్యమును ఆనాటికే మధించి యుండిరి

## కూల్డ్రే శిష్యరికం ;

కవి, చిత్రకారులైన ఆస్వాల్డ్ కూల్డ్రే ఆ కాలమున రాజమండ్రిలోని గవర్నమెంటు కళాశాలకు ప్రిన్సిపాలుగ ఉండిరి వీరేగాక హంటర్, మెట్కాఫ్ గార్లు కళలలో ఎంతయో కృషి చేయుచుండిరి బంగారమునకు తావి అబ్బినట్లు కవికొండలకు కూల్డ్రేదొర సాహచర్యము, ప్రాపు, వాత్సల్యము లభించినవి. కళా చతురుడైన కూల్డ్రే త్రిరత్నములైన అడివి బాపిరాజు, దామెర్ల రామారావు, కవికొండల వెంకట్రావు వంటి కళాకారులను సానబట్టి ఆంధ్రదేశమున కర్పించిరి

కవికొండల తన పదునారవ ఏటనే (7-9-1910) వినాయక చవితి శుభ సంధర్భమున ఆంగ్లమున గేయములు వ్రాయుటకు ప్రారంభించిరి. కాని కూల్డ్రే ఆంగ్లములో ప్రోత్సహింపకపోవుటచే తెలుగులో గేయరచనా ప్రారంభించి కొనసాగించిరి

"వీరిలోని ప్రకృత్యుపాసనను గాంచిన కూల్డ్రే వీరిని 'ఆంధ్రావర్డ్స్ వర్త్' అని 'కవీ' అని 'కవి కొండలా' అని పిలిచెడివారు దామెర్ల రామారావూ, దామెర్ల వెంకట్రావు, కవికొండల, గురువు కూల్డ్రే, నేను భువనేశ్వరము మున్నగు పుణ్య క్షేత్రాలన్నీ దర్శించాము గురువు చేయి పట్టుకుని నడిపించుకునిపోతూ వుంటే కవికొండల గోదావరి పాటలు పాడేవాడు" అని అడివి బాపిరాజు గారు తెలిపిరి.

కూల్డ్రే గారికి కవికొండలపై గల అభిమానమునకు గుర్తు ఈ క్రింది పద్యము—

A spring of graceful fancy
Breaking sweetly in the desert of
College exercises
First made us friends'[9]

దీనికి కవికొండల అనువాదము—[10]

కళాశాలా కార్యక్రమమను నెడారిలో
తియ్యందనాన వెల్లివిరిసిన
ఒకానొక యొయ్యారపు టూహాస్రవంతి
మా యిరువురి నెయ్యమునకు నాది కారణము

కూల్డ్రే గారు తాము వ్రాసిన 'South Indian Hours' అను గ్రంథమును తమ శిష్యులకంకితమిచ్చిరి

**'To His Scholars and Teachers Kavikondala VenkataRao, Adivi BapiRaju, Damerla Venkata Rao This book is inscribd by their teacher and scholar'[9] —O J Couldrey**

కూల్డ్రే ప్రత్యేకముగ, కవికొండలపై 'వర్డ్స్ వర్త్ ఇన్ ఆంధ్రా' అను వ్యాసమును వ్రాసిరి అందులోని కొన్ని ముఖ్యాంశము లివి.—

"లలితాత్ములము కొందరము ప్రతి ఆదివారము సాయంత్రము సమావేశములము, సాహిత్యగోష్ఠుల నేర్పరచు చుంటిమి అడివి బాపిరాజు, కవికొండల వెంకటరావు, దామెర్ల రామారావు, దామెర్ల వెంకట్రావు. జయంతి గంగన్న మున్నగు వారు ఆ సమావేశములలో పాల్గొనుచుండిరి వీరి స్నేహము ఎంతో ఆనందముగ ఈ సుమారమైన దేశములో నా స్మృతియందు నిలచిపోయినది

కవికొండలను పదహారేండ్ల వయసులో ఇంటరు మొదటి తరగతిలో నుండి నేనెరుగుదును. అతని కాలేజీ వ్యాసాలలో అవలోకనమూ, మౌలికభావనా మెరుపు

ల్లాగ మెరుస్తూండేవి కాని బి.ఎ. మొదటి ఏటికి వచ్చేదాకా అతడు తన కావ్య రచనలు నా దగ్గరకు తీసుకురాలేదు అవి ఇంగ్లీషు రచనలు కవికొండలకు విదేశ భాషలు నేర్చుకునే ఉత్సాహము లేనేలేదు అయినా ఆ రచనలు అతి వాస్తవిక రచనలుగా ఇప్పుడు చెలామణి అయిపోను గాని, ముప్పయి ఏళ్ళు దాటిపోయాయి చింపి పారవేసి వుంటాడు లలిత మనోహరంగా చెప్పలేక పోయినా ప్రతీఖండమూ లలిత మనోహరభావాన్ని ప్రతిపాదించేది ఈ యువ పండితుడు తన ఖండకావ్యాలకి వ్యాఖ్యానము కూడా చేర్చుతూండేవాడు

ఈతని రచనాకన్య ఆంగ్లనృత్యము చేయలేదని కనిపెట్టి తెలుగులో ప్రయత్నించమని సలహా ఇచ్చాను కాని అప్పటికి అతడు తెలుగులో రచన ప్రారంభించి సాగించడము కూడా జరిగిందట ఈ గేయాల్లోని క్లుప్తతా, చిన్న ధ్వనీ, సామాన్య సుందర సత్యమూ గల ఈ రకపు ఖండకావ్యాలు జపానీయ కావ్యాల్ని గుర్తుకు తెస్తాయి కాని పోలిక యిదా లాభమే వీటి ఉత్సాహము పర్ద్వవర్తీయమే

కవికొండల మొట్టమొదట కవి, తర్వాత ఇంకేదైనాను అతని ఖండకావ్యాలు వాటి సుగుణాలు మట్టుకే నాచేత యీ వ్యాసం రాయించాయి ప్రతి సమావేశానికి జేబులో ఏదో ఒక ఖండకావ్యంతో వచ్చేవాడు ఇతడు లాంతరు పట్టుకుని కలువ పువ్వు రాత్రి వికసిస్తుందో లేదో చూడ్డానికి వెళ్ళేవాడు. ఈ ఖండకావ్యాలలో మూగ సౌందర్యము, వాస్తవికత, లలిత సౌందర్యము కనిపిస్తుంటాయి

సత్కవిని గుర్తించుకోలేకపోవడము మానవకోటికి పురాతన జబ్బు[11]

కవికొండల వారి గేయములు స్వాగతము, కళ్ళము, నిశ్శబ్దగీతిక, ప్రయాణము' అను నాలుగింటిని శాద్రిగారు స్వయముగ ఆంగ్లములోనికి అనువదించిరి

శాద్రిగారు ఇంగ్లండు వెళ్ళిపోయిన తర్వాత ప్రతికియున్నంత వరకు కవికొండలకు ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుచుండెడివారు

ఇట్టి కళాకారుడు సహృదయుడునైన శాద్రిగారి ప్రోద్బలముతో,కవికొండల వారి కవిత బహుముఖములుగ వ్యాప్తి చెందినదని చెప్పవచ్చును

కవికొండల వారు 'శతపత్రమ్' అను ఆంగ్ల పుస్తకములోని పీఠికలో 'విలువైన సలహాలనిచ్చి ఆదరించినందులకు' గురువుకు కృతజ్ఞతలు తెలిపిరి

**ఆర్ద్రత :**

నవనవలాడే తీగలకంటె నవనవలాడే హృదయం కవికొండలది అందులకే తాను పెంచిన తీగ పెల్లగింపబడినపుడు ఎంతో నిర్వేదమును ప్రకటించును ప్రతి

దినము సాయం సమయమున పొలము గట్లపై పోవుట వీరికి అలవాటు అంతకు మునుపు చూచిన ఒకతీగ ఏమైనదోనని జ్వరముతో బాధపడిన నాలుగైదురోజులను కలవరపడిరి. జ్వరము తగ్గిన వెంటనే మూడు నాలుగైదు మైళ్ళు నడక సాగించి, ఆ తీగ యథాస్థానములో నుండుట చూచి స్థిమితపడిరి [12] అంతటి సుకుమార హృదయు డీతడు

**కవితా హృదయము :**

కవికొండల తనలో కవితావేశ మంకురించుటకు గల కారణములను, కవిత్వ మును గూర్చి తమ అభిప్రాయములను పలు సందర్భములలో క్రింది విధముగా తెలిపిరి___

"నాలో యీ కవిత్వమన్నది కళాశాలా వాతావరణాన్ని, గౌతమీ విలాసాన్ని, మా వూరైన శ్రీరంగ పట్టణపు ప్రకృతిరమాప్రమేయాన్ని బట్టి పుట్టుకొచ్చి యిప్పటికి ఇన్నూరు ఋతువులై అక్షరకోటికి పడగలెత్తింది"

"మందిల గౌతమీతోయమే నా హృది స్పందమై యందమై యలరారు చున్నది" అను కళాశాల గీతికలో గోదావరి నదిని, "అంధ్రభాషకు రాజమహేంద్ర వరముపుట్టినిల్లని" రాజమహేంద్రవరమును, తనకు ప్రేరణములుగ పేర్కొనిరి,[14]

"నేను సారస్వత ప్రపంచంలో ఒక కోవకు చెందినవాణ్ని కాదు నేను వ్రాసిన వన్నియు నా దృష్టిలో సమానములే నా కష్టెదుట నా రచనలను ఇవి ఉత్తమములు అని కేటాయిస్తూంటే సహించలేను ఉన్నంటిలో మంచి తీసుకోండి ఒకరు నన్ననుసరించినా అనుసరించకపోయినా, నా మార్గానికి అడ్డురాకుంటే చాలు నన్ను నా వ్రాతలను వేరుచేయొద్దు" [15]

"నేను పుట్టినటుఃంటి గదిలోనే నా తల్లి చనిపోయింది నేను తిరిగే పొలం గట్టునే నా తండ్రికి దహనసంస్కారం జరిగింది నేను నిలుమండుటకు మఱి తావు లేక పాఠకుల హృదయాల్లో ప్రవేశించాను అక్కడ గనుక నా గీతికకు నాస్తిక భావం పట్టేటయితే నేనెక్కడ వుంటానో చెప్పలేకుండా వున్నాను"[16]

"నాకు కొన్ని విశ్వాసాలున్నాయి ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లాగు నేను వ్రాసేది ఆలోచించే వ్రాస్తానని, వ్రాసినదంతా సరిఅయిన భాషకు సరిఅయిన భావాన్ని పురి గొలిపేదే అది, నేను వ్రాసినదాన్ని కూడా అందరూ చదువుతూ అందలి సత్యాల్ని చూడగలరు"[17] "చివరకు మనము ఏమి ఆడినా ఏమి పాడినా, ఏమి వ్రాసినా అంతయు భగవంతునికొరకే, కవిత యనున దాక తత్వాభిమంత్రణము"[16] అనిరి

"Poetry is a Faith" అన్న నమ్మకం వున్నవాడ్ని. ఏమి వ్రాసినా కళాన్వేషణలో నాకూ దేశానికి ఇది కావాలని కుతూహలంతో వ్రాసినవాణ్ని అందరూ అర్థము చేసుకుని ఆనందించాలనే నా ఆశయము - నా ఉబలాటము"[12].

"నిను నే భువికి రమ్మనను, నను నీవు దివికి రమ్మనకు, చనెడి మార్గము లోన మాత్రము చల్లు మక్షరము" అని[15] సరస్వతీదేవిని తనకు కాస్త సాయపడమని ప్రార్థించిరి

## స్ఫురణలు :

కవికొండల తాము రచించిన గీతికలకు అన్నిటికి 'స్ఫురణ'ను పేర్కొనెదరు అందు రచనకు ప్రేరణ కలిగించిన సందర్భము, రచన చేసిన ప్రదేశము, రచనాకాలమును వివరింతురు "ఒక ప్రత్యేక సమయమున అప్పటి పరిస్థితులనుబట్టి, కొన్ని భావములు మనస్సు నుండి బయల్వెడలును ఆ భావములే ఒక గీతికగా పరిణామ మొందును కీర్తిగాని, ఆ భావములు గల మరియొకరు గాని ఆ గీతికల నెలుగెత్తి పాడిన వాని సహజభావములు ప్రత్యక్షమగును"[1] అని వారే పేర్కొనిరి

వీరు చివరకు ఆధ్యాత్మిక ధోరణిలో ఆలోచించుట ప్రారంభించిరి

సాధనమీదగాని సత్యం సక్షాత్కరించదు ఆ సాధన ఒకనికి తన సంసారాన్నిబట్టి కొలదికాలం మాత్రమే చాలును. మరొకరికి ఎన్నాళ్ళు చాలకపోవచ్చును కాబట్టి సందేశమన్నది సత్యమన్నది తలచినకొలదీ తట్టగలవు

"ఊహించే మనసోట ఉంటే చాలు
దేహంబు వద్దన్నా రోగాలపుట్టద్ది రాగాల తట్టద్ది''[15]

## ఉద్యమముల ప్రభావము :

1920 ప్రాంతములో తమపై స్వాతంత్ర్యోద్యమ ప్రభావము పడినట్లు కవికొండల తెలిపిరి "మొదటి ప్రపంచయుద్ధం అయిపోయాక సత్యాగ్రహోద్యమం ప్రారంభమయి ఎటుమాసినా స్వతంత్రతను గురించిన శంఖమే పూరించబడినది నాలో దేశభక్తి గీతికలు పాడనూపినవి 1942లో ప్రపంచయుద్ధ ప్రభావముతో బాంబుల దాడిచూచి కొన్ని గేయములు వ్రాసితిని "[16]అనిరి

2)

ఇదియేగాక ఆంధ్ర రాష్ట్రోద్యమ ప్రభావముతో ఆంధ్రుల వైభవమును చాటుగీతికల రచించిరి తనపై గాంధియవాద ప్రభావమున్నదని ఆ ప్రభావముతో 'చరఖా, గాంధీ' మున్నగు గీతికల వెలయించితినని తెలిపిరి

## సాహితీ సేవ ;

వీరు కవితారచన ప్రారంభించుసరికి 1920 ప్రాంతములో నవ్యాంధ్ర సాహితీ రాజధానులయిన గుంటూరు, బందరు, రాజమహేంద్రవరము, విజయ నగరములలో, అనేక మార్గములలో నవ్యసాహిత్యోద్యమములు మొలకెత్తుట ప్రారంభించినవి ఆ ప్రభావముతో వీరు నవ్యకవితా శాఖలలో పలుగీతికలు రచించిరి సమాజములో అట్టడుగున నున్న శ్రామికుల కష్టముల జూచి అభ్యుదయ ధోరణిలో కొన్ని రచనలను చేసిరి

"ఆ రోజుల్లో బహుళంగా చిలకమర్తి వారి గయోపాఖ్యానము, బ్రహ్మాండంగా వడ్డాది వారి వేణీ సంహరము, చక్కగా కందుకూరివారి శాకుంతలము, నిక్కపుజూపుగా శ్రీపాదవారి బొబ్బిలి నాటకము రంగస్థలముమీద నటకావతంసులాడి చూపిస్తూ వుంటే - నాటకాలమీద నాటకాలు ఎవరికి వ్రాయబుద్ధి పుట్టదు"[18] అనుచు ఆనాటి నాటకోద్యమ ప్రభావముతోనే తాను నాటక రచన గావించినట్లు కవికొండల తెలిపిరి.

ఈ కాలములోనే శతకముల నైదింటిని రచించి ముద్రించిరి ఒక ప్రబంధము, ఆరు దండకములు రచించినట్లు తెలపిరి అవి అలభ్యములు

ఇక గద్యరచనలో కూడ వీరు తీసిపోలేదు నవలా రచనను చేపట్టి 1916లో మొదటి నవల, 1933లో రెండవ నవల రచించిరి 1934లో నాటక రచనమును ప్రారంభించి ఏడు నాటకములు రచించిరి వానిలో ఒక్కటి మాత్రమే లభ్యము, ముద్రితము 1928 ప్రాంతములో కథలు రచించుటకు ప్రారంభించిరి చిన్న కథలు 300 వరకు రచించి ఆ దినములలోనే ఆ ప్రక్రియకొక రూపము కల్పించిరి ఇవి చాలవరకూ ఏడు సంపుటములుగ ముద్రితములైనవి మిగిలినవి లభింపవు

వీరు శ్రవ్యనాటికలు పెక్కింటిని రచించిరి. ఇవి చాలవరకు 1950 ప్రాంతమున విజయవాడ, మద్రాసు రేడియో, కేంద్రముల నుండి ప్రసారమయినవి మధ్య కాలములో ఆయా సంవత్సరములలో 100 వ్యాసములు రచించినట్లు తెలిపిరి పది వ్యాసములు ఒక సంపుటముగ ముద్రింపబడినవి. వీరి రచనలు పెక్కులు భారతి, వినోదిని, కిన్నెర, కృష్ణాపత్రిక, ఢంకా మున్నగు పత్రికలలో ప్రచురింపబడినవి

తమ రచనలు పదివేల పుటలవరకు గలవని వీరు చెప్పుకొనిరి. వీరి రచనలు కాలానుక్రమణ పట్టి[19]కలో ఇవ్వబడినవి.

వీరు తమ గేయములను కొన్నింటిని ఆంగ్లములోనికి అనువదించిరి. ఇది ఆ కాలములో అరుదు. ఇట్లు కవికొండల 1960 వరకు రచనా వ్యాసంగమును కొనసాగించిరి.

కవికొండల రచనలను ప్రక్రియానుసారముగా పద్య, గద్య రచనముల క్రింద విభజింపవచ్చు. పద్య రచనములు సంప్రదాయ, నవ్య కవిత్వములుగను, గద్యరచనలు నవలలు, కథలు, నాటకములు, ఏకాంకికలు, రేడియో ప్రసారములు, వ్యాసములుగ విభజింపవచ్చును. ఇవి అనుబంధ పట్టికలో[20] ఇవ్వబడినవి.

వీరి జీవితములోని కొన్ని సారస్వత ఘట్టములను గురించి ఒక వ్రాత పత్రికలో[21] ఇట్లు కలదు. దాని ప్రకారము—

20-7-1892 — జననము
7-9-1910 — కవితారంభము
1915-16 — వివిధ కుసుమావళి ఖండకావ్య ప్రచురణము
1924 — సంవత్సరాది - అభినవాంధ్ర కార్యస్థాన ప్రతిష్ఠాపన 'కొంకకొలకువికసితోత్పల' శీర్షిక ప్రచురణము
1932 — అభినవాంధ్ర యువసదస్సు ప్రారంభము
1933 — శ్రీరామనవమి-నవ వసంతోత్సవము, నర్సాపురము
1934 — భావ వసంతోత్సవము, రాజమండ్రి
1935 — యువ వసంతోత్సవము, ఏలూరు
1936 — పుష్కర వసంతోత్సవము, శ్రీరంగపట్టణము
1940 — త్రిదశోత్సవము
1941 — 'సుమనోహ్లాదిని' శీర్షిక ప్రారంభము
20-7-41 — రాజమహేంద్రవర కేంద్ర ప్రారంభము
8-2-42 — సమరసకవి సమావేశ మహోత్సవము
20-7-42 — రాజమహేంద్రవర ప్రథమ వార్షికోత్సవము
26-7-42 — అభినవాంధ్ర సదస్సు
1950 — నలుపది ఏండ్ల పండుగ

**అంకితములు :**

వీరు తమ కృతులను అంకితమిచ్చు విధము విచిత్రముగనున్నది 'త్రయి' అను పుస్తకమును 'చన్న పట్నమునకు, అందు ముఖ్యముగ తిరువళిక్కేని-రాయపురము-ప్రశాంత సముద్రతీరమునకు'
'చదువులదుత్త'ను 'పిల్లలలాలించు పెద్దలకు, పెద్దలఁదేలించు పిన్నలకు'
'నెలబాలుడు'ను 'నన్నుఁ దనంత నాకర్షించుకొన్న అత్తవారింటికి'
ప్రకృతిచందనము'ను 'నేఁజదువుకొన్న 1909-1913 కళాశాలకు'
'ఆత్మవ్యక్తిని' 'నేఁబుట్టి పెరిగి ప్రేమించునట్టి ఇంటికి - వాకిటికి - వీధికి - వాడకు'

అంకితమిచ్చిరి

విప్రసందేశమును "దమనయని యాగిముకునకు బ్రమమెయినామకును జేర్చి రంజిదులువడిన్"
అని తమ భార్య దమయంతి (దమన-ముద్దుపేరు)కి అంకితమిచ్చిరి

**ప్రచురణలు ;**

తమ గ్రంథము లన్నిటిని తామే అచ్చువేయించుకొనవలయు ననెడి కాంక్ష వీరికి గలదు అది ధనార్జన నిమిత్తము కాదు 1915 నుండి 'అభినవాంధ్ర కార్య స్థానము' అను ప్రకాశ సంస్థను నెలకొల్పి తద్వారమున పుస్తకములు ప్రచురించిరి 'కాండకాలకు-వికసితోత్పల-సుమనోహ్లాదిని' శీర్షికను కొన్ని పుస్తకములు ప్రచురించిరి తాను రచించిన వన్నియు ఒక్కొక్క కూర్పు అయినను తన చేతుల మీదుగ చేయవలయునని యుండెడిదట [21] కాని చివరకు వారి కోరిక తీరనేలేదు నాటికలు, వ్యాసములు, గీతికలు, ఎన్నియో అముద్రితములుగ మిగిలిపోయినవి. 1940లో 'వెన్నెల' అను మాసపత్రికను నడిపిరి

వీరి 'ఇనుపకోట' అను నవల వారికి బి ఏ వారికి పాఠ్యగ్రంథముగ 1927లో నిర్ణయింపబడినది. 'భావమురళి, వివిధ కుసుమావళి' అను పద్య కావ్య సంపుటములు మాధ్యమిక పాఠశాలలకు పాఠ్యగ్రంథములుగ నిర్ణయింపబడెను.

## సభలు-సమావేశములు :

కవికొండల తమ కవిత్వమును ప్రజామోదముగ చేయుటకు 1924 నుండి అభినవాంధ్ర సమావేశములను రాజమండ్రి, నరసాపూరు, ఏలూరులలో ఏర్పాటు చేసిరి వీనిలో నూతన కవిత్వ—విధానములను గూర్చి ఉపన్యాసములను చేయించుచు, తన గీతములను ఇతరకవుల గీతములను గానము చేయించుచుండిరి రాజమండ్రిలోనే 'కొండకోలకు—వికసితోత్సవ' వార్షికోత్సవములు జరిపి సాహిత్య ప్రచారము కావించుచుండిరి ఈ సభలలో బాలబాలికలు వీరి రచనలు అభినయ పూర్వకములుగ పఠించుచుండిరి

రాజమండ్రిలో స్థిరనివాస మేర్పరచుకొనిన కాలములో 1933 నుండి 1964 వరకు వీరు సారస్వతమండలిని స్థాపించిరి ప్రతినెల ఒక్కొక్క స్థలములో చిన్న చిన్న సమావేశములు ఏర్పాటుచేసి, సారస్వతాభిమానులను ప్రోవుచేసి సాహిత్య గోష్ఠిలో కాలము గడుపుచుండిరి ఆ కాలమునందు వీరి రచనలను లోకమునకు విపులముగ వెల్లడిచేసి ప్రజాదరణము సంపాదింపవలయు ననెడి తలంపుతో కొంతమంది పండితులు, కవులు, రసికాగ్రేసరులు ఒక సంఘముగా కూడి సమావేశములు జరుపనుండెడివారు

వీరు చేసిన ప్రసంగములలో ముఖ్యమైనవి రాజమహేంద్రవరములో 'నేను వ్రాసిన వేమిటంటే' శీర్షికను చేసిన పది ప్రసంగములు ఇవి తరువాత దేశసేవ, అను పత్రికయందు ముద్రితములు కవి తన రచనలపై తానే కూలంకషముగ విమర్శ గావించి సభ్యులకు వానిలోని సారస్యమును చవిచూపినట్టి ఉపన్యాసములివి ఇట్టివి తెలుగు సాహిత్యమున అరుదుగ నున్నవి

ఇంకను వీరు మద్రాసు, ఏలూరు, విశాఖపట్టణము మున్నగు పట్టణముల లోను, గ్రామములతోను పలు సందర్భములలో ప్రసంగములు గావించిరి. ఈ సభలలో వీరు తమ రచనలలోని వైశిష్ట్యమును తెలుపుటయేగాక, విద్యార్థుల కర్తవ్యమును ఉపదేశింపుట కూడ జరిగినది

## సన్మానములు షష్ఠిపూర్తి :

కవికొండల సారస్వత సేవకు గుర్తింపుగ రాజమండ్రి, మద్రాసు, ఏలూరు, విజయవాడ మున్నగు పలు ప్రాంతములలో వీరికి సన్మానములు జరిగినవి.

ఈ సన్మానములలో షష్ఠిపూర్తి మహోత్సవములు ముఖ్యమైనవి 1952 జూలై 20వ తేదీన సాహిత్యాభిమానులు, పుర ప్రముఖులు రాజమండ్రిలోను, మద్రాసులోను వీరికి ఈ ఉత్సవములు జరిపించిరి సన్మానసంఘము వారు కవికి

సన్మానపత్రమును సమర్పించిరి[22]. శ్రీ నార్ల వెంకటేశ్వరరావు, శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, శ్రీ చేమకూర సత్యనారాయణ మున్నగువారు ప్రసంగించిరి. ఈ మహోత్సవ సందర్భముగ ఆనందవాణి, కిన్నెర, ఆంధ్రపత్రిక, మహోదయ మున్నగు పత్రికలు వీరిని గురించి ప్రత్యేక వ్యాసములను ప్రచురించినవి

ఈ సందర్భమున కవి జీవితము, వారి కవిత్వజీవితము మున్నగు అనేక విషయములను వివరించు పండ్రెండు వ్యాసములతో 'శ్రీ కవికొండల వెంకటరావు షష్ఠిపూర్త్యుత్సవ సంచిక'ను సన్మాన సంఘము వారు వెలయించిరి.

## సందేశములు :

వీరి షష్ఠిపూర్తి సందర్భమున ప్రముఖ రాజకీయవేత్తలు, సాహితీవేత్తలు, ఈక్రింది శుభసందేశములనంపిరి.

"జాతీయ నిర్మాణము కేవలము రాజకీయ వేత్తలచే కాక కవులు, గాయకులు, పండితులు, చిత్రకారులు మున్నగు మహనీయులచే పరిపక్వము పొందును. స్వతంత్ర భారత్‌లో అగ్రస్థానము ప్రథమతాంబూలము వీరిదే"

—శ్రీ భోగరాజు పట్టాభిరామయ్య

"కృత్రిమ యశోలోభమునకు వశపడని ధీరులలో వెంకట్రావుగారు అగ్రేసరులు వారికి వచ్చిన కీర్తి వారి రచనల గుణమును బట్టియే"

—పింగళి లక్ష్మీకాంతం

"కవికొండల వారి రచనలు – అధునికాంధ్ర సారస్వతమున కలంకారములు. వీరి ప్రతిభ సర్వతోముఖమైనది"

—శ్రీ శివశంకరస్వామి

—"నీ కవిత్వము, నీ గద్య కావ్యాలు ప్రజలకు ఎంత అహ్లాదాన్ని కలిగిస్తున్నాయో చూచేందుకు చిరకాలం జీవించాలి నీ అనంతరం కూడ ఇది అట్లాగే కొనసాగుతుంది. నువ్వు పుట్టి పెరిగిన ప్రకృతి పరిసరములను, రమణీయమైన భాషలో రచించి, ప్రఖ్యాతి గడించినందుకు భగవంతునికి కృతజ్ఞుడై యుండు నీ వృద్ధుడైన గురువు నీకిట్టి సంతోషకరమైన జన్మదినములు అనేకములు కావాలని కోరుకుంటున్నాడు"

— కూర్మి

జరిగిన సన్మానమునకు కవికొండల, కృతజ్ఞతలు తెలుపుచు "అందరి నుండి పలుకులను ఏర్చి పేర్చుకోనిచ్చినందులకు, భావాలను చేకూర్చుకోనిచ్చినందులకు మీ కందరికూ, యావదాంధ్రావనికి, సువిశాల విశ్వానికీ, నాయవి జోహార్లు"అని వినయముగ సభలో సమాధాన మిచ్చెను.

**అభ్యుదయ ధోరణి :**

'గడ్డిపూవుల' నుండి 'శివరాత్రి ప్రభ' వరకు, 'సుకారి పిల్ల' మొదలు 'గని కార్మికుని' వరకు కవితా వస్తువులుగ స్వీకరించిన కవికొండల వెంకట్రావు గారు సమకాలీనమైన భావకవితోద్యమము నందు భాగస్వామి మాత్రమే గాక, ఆగామి కాలికమైన అభ్యుదయ కవిత్వమునకు మార్గదర్శి

రోడ్డుపై గుండ్లులాగు శ్రామికుని శ్రమ, అంత్యకులజుని జీవన భారము, కలప అడితిలోని కూలి, జాలరి వాని నికృష్టపు బ్రతుకులు చిత్రించిన కవికొండల అభ్యుదయ కవి కూడ అగును కవికొండల తన కవితలలోనే యిట్టి అభ్యుదయ మార్గమునకు దారితీయలేదు. వీరి శతకములలో, కథలలో, వ్యాసములలో, ఏకాంకిక లలో కూడ ఇట్టి ధోరణులు కానవగును

దేవులపల్లి వారు కూడ ఈ విషయమునే "ఓడరేవుల సరంగులూ, ఉత్తరాల సంచి నెత్తినెట్టుకు పోవువాళ్ళు— ఇట్టి జనానికి ఇంత సన్నిహితుడైన తెలుగు కవి ఈ యుగంలో లెడని" 1949 ప్రాంతములో తెలిపిరి [23]

కవికొండల వారు తన మహాప్రస్థాన గేయమునకు ప్రభావము కలిగించిన వారిలో ఒకరని మహాకవి శ్రీ శ్రీ తెలిపియున్నారు "మహాప్రస్థానం(12-4-1934) ఆవేశానికి ప్రోద్బలాలు 'లామర్సెయ్యే, లా ఇంటర్ నేషనల్ బరన్స్ కవి రచించిన 'బెన్నాక్ బరన్' అలెగ్జాండర్ బ్లాక్ వ్రాసిన 'ది ట్వెల్వ్' దరిమిలాని యీ ట్వెల్వ్‌ని నేను 'నల్లని రాత్రి-తెల్లని మంచు - ప్రభంజనం - ప్రభంజనం' అని ప్రారంభించి కొంతవరకు తెనిగించాను హరీంద్రకవి 'షురూహుఅ హైజంగ్' అనే పాట నజ్రుల్ ఇస్లామ్‌గీతాలు నా మనస్సులో ఏవో మారుమూలల్లో మారుమోగుతూ ఉండి ఉండాలి అలాగే కవికొండల కంఠం కూడా" [24] అని శ్రీ శ్రీ అన్నారు.

కవికొండల భావకవియై, భావకవితాశాఖ లన్నిటిలో కవితలను వెలయించి, అభ్యుదయ కవిత వెలుగులోనికి రాని దినములలో అట్టి కవితాధోరణులలో రచనలు గావించి అభ్యుదయ కవులకు మార్గదర్శకులైరి

**అభిప్రాయ వేదిక .**

"వీరిని గూర్చి వీరి కుటుంబ సభ్యులు, మిత్రులు, సాహితీవేత్తలు తెలిపిన అభిప్రాయము లివి—

వీరికి చిన్నప్పటి నుండి పట్టుదల జాస్తి విపరీతమైన స్వతంత్ర మార్గము ఒకిరు చెప్పినది వినుట కష్టము తోటి పిల్లలతో ఆటలాడక ప్రకృతి పరిశీలనలో కాలము గడుపుతుండేవాడు".[25] —అదుర్తి భాస్కరమ్మ

"కవికొండల విషాదచ్ఛాయ లెరుగని నిరతోల్లాసి, సహజ కవితా ధోరణికి న్యాయవాద వృత్తి నైశిత్యముఁ జేకూర్చుట జేసి మన కవి సృష్టిలోని సమస్త వస్తువులను కవితాదృష్టితో నవలోకించెదరు"[26] —పోడూరు రామచంద్రరావు

"ఒకనాడు సాయంకాలము విహారము కోసము రాజమహేంద్రవరపు పొలిమేరలు దాటిపోయినాము ఆయనా, నేనూను దారి ప్రక్కన గడ్డితో పాటు మొలిచే మొక్కనీ, దాని సన్నని కాడ చివర గంధపు గిన్నె ఆకారముతో రేగు గింజంత సైజులో, మిరపగింజల వంటి తెల్లని దళాలతో ఉన్న పువ్వుని కాడతో తెంపి, 'దీన్ని ఏమంటారు?' అని గడ్డికోసే మాలెత నడిగారు 'ఇరికల బాబూ!' అంది ఆమె 'ఎంత చక్కని పేరూ!' అన్నారు మర్నాటికి ఒక లలితమైన కథ 'ఇర్రికల' తయారైంది వీరు విచిత్ర ఊహాశాలిత్వం కల మనిషి"[25]
—శ్రీ పాదగోపాలకృష్ణమూర్తి

"కవికొండలవారు 19 వ శతాబ్దిలో ప్రభవించిన అఖండులలో ఒకరు 'లీడింగ్ పాయల్' అయినా ఆయనను అనుసరించినవారు కొద్దిమంది మాత్రమే. సమకాలికులలో కృష్ణశాస్త్రికి వీరిపై గౌరవం వుంది ఏ పత్రికకు ఎలాంటిగేయాలు పంపాలో వీరికి బాగా తెలుసు ఎక్కువగా కవి సమ్మేళనాలకు హాజరయ్యే వారు కారు 'రిజర్వుడు' గా వుండేవారు బాగా పట్టుదల కల మనిషి సామాజిక స్పృహతో రచనలు చేయుట వీరిలో గోచరించును" —ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

"ఆధునికమైన ప్రాచ్యపాశ్చాత్యుల ధోరుణల అవగాహన ఉన్నా అచ్చమైన తెలుగుగొంతుతో ఆధునిక కవితారచన సాగించగల అద్భుతశక్తి వీరి రచన, ఏది పరిశీలించినా అడుగడుగునా సాక్షాత్కరిస్తుంది ఈ శక్తి వీరి కవితకొక ప్రత్యేక వ్యక్తిత్వం కలిగించింది"[27] —పిలకా గణపతిశాస్త్రి

"గురజాడ చూపిన మార్గాన్ని అనుసరించి కృతకృత్యులైన కవులలో బసవరాజు, నండూరి, కవికొండల ముఖ్యులు జీవితానికి సన్నిహితమైన కవిత్వమును వ్రాసినవారు వీరు అదియే వీరి కవితలోని విశిష్ట ధర్మము"[28]
—కొత్తపల్లి వీరభద్రరావు

ఇక వెస్టలేక్ అను ఐ ఏ ఎస్ అఫిసరుకు కవికొండలకు పరిచయముండెడిది. కవికొండల వీరికి తమ అనువాద గేయములు, తెలుగు గేయములు చదివి వినిపించినపుడు వీరు తన్మయులై 'శతపత్రిమ్' పీఠికలో ఇట్లు వ్రాసిరి.

"Telugu is a musical language admirably adapted to tho reciting or chanting verse and those who have heard the poet singing his own verse, in some green garden on Godavari will realise how much has necessarily been lost in the translation".

ఇట్లు సుదీర్ఘమగు కవితాప్రస్థానము గావించ కవికొండల వెంకటారావుగారు 4-7-1969న గుంటూరులో తమ చిన్న కుమారుని ఇంట స్వర్గస్థులైరి వీరి చివరి దినములలో ఆస్త్మా వ్యాధితో బాధపడెడివారు బహుదినములు సంజ్ఞామాత్రజీవియై యుండిరి వీరి స్మృతికి సంతాప సూచకముగ పలు తావులలో సంతాప సభలు జరిగినవి. వీరి ప్రతిభను కొనియాడుచు ఆ సందర్భమున అనేక వ్యాసములు పలు పత్రికలలో వెలువడినవి.

"నేననుభవించివేస్తున్నా లోకంలో సౌందర్యం—లోకంలో ఆనందం—లోకంలో గానరసం—నేననుభవించవేస్తున్నా" అను అనుభవముతో కవికొండల అసంఖ్యాకమైన రచనలు చేసిరి. అయినను వారి కట్టి అనుభూతితో తృప్తి కలుగలేదు కనుకనే—

సంతుష్టిలేదు మదికిన్
సంతసమేలేదు తుదికిన్
ముత్తెసది కెరుగు వరకు
చుక్కజిగి కెరయు వరకు

——అని ఆరాటపడిన మహాకవి కవికొండల

3)

# కవితారీతులు
## సంప్రదాయ కవిత్వము

కవికొండల వెంకటరావుగారి కవిత్వము రెండు విధములుగ కలదు ఒకటి సంప్రదాయ కవిత్వము. రెండు నవ్యకవిత్వము సంప్రదాయ కవిత్వము నాలుగు ప్రక్రియలందు కలదు 1 ప్రబంధము, 2 లఘు కావ్యము, 3 శతకము, 4. దండకము.

**ప్రబంధము :**

కవికొండల వారు రచించిన ప్రబంధము పేరు 'సుకన్య' ఇది అలభ్యము అయినను దీనిని గూర్చి కవికొండలవారు అందిచ్చిన సమాచారమిది[18]

"ఇది 'ది ఎడ్వర్టైయిజరు' పత్రికలో ప్రచురింపబడినది. దీనిపేరు 'సుకన్య' చ్యవనమహర్షి భార్య సుకన్య కథ ఇది ఇష్టదేవతా ప్రార్థనముతో యథోచిత ముగ ఈ గ్రంథము ప్రారంభమైనది

అష్టాదశవర్ణనలు, అశ్వాసాదిమ అంతిమ పద్యాలు, శైలిఖ్యాత ఒక్కొక్కప్పుడు మంచి పాకాన్ని పడింది అని సంతోషిస్తూ వుంటాను" అని అన్నారు.

**దండకములు :**

కవికొండలవారు రచించిన దండకములు నాలుగు – 1, శ్రీకృష్ణదండకము, 2 గజదండకము, 3 సూర్యదండకము, 4 శనేశ్వర దండకము ఇవి అలభ్యములు

**శతకములు :**

కవికొండలవారు రచించిన శతకములు అయిదు – 1. హరి వినోదము, 2, మహైక దైశసంప్రార్థనము, 3 శతథా, 4 కందకుక్షి, 5 ద్విపదలాక్ష

ఇవి 1932 ప్రాంతమునందు రచింపబడినవి వీనిలో కొన్ని పద్యములు 1933–37 మధ్య కళ్యాణి, చంద్రిక, దేశసేవ, దేవాలయ ప్రతిభ, ప్రాథమిక విద్య, ప్రజ్ఞామిత్ర, పత్రికలందు ప్రకటింపబడినవి అయిదు శతకములు ఒక సంపుటముగ తొలి శతకము హరివినోదమను గ్రంథనామముగ 1950వ సం॥ నందు ప్రకటింపబడినది. ఈ శతక సంపుటి 'అనంతలక్ష్మి సత్యవతీదేవీసమేత శ్రీ వీర వెంకట సత్యనారాయణస్వామి వారికి' అంకితము

## 1. హరివినోదము :

దీనికి స్ఫురణ శ్రీమద్భాగవతము ఇది కేవలము భక్తి శతకము

జనన మరణములు లేనిదై, సమస్త జగత్తున కాశ్రయ మిచ్చునట్టి భగవానుని నుతించుటతో శతకమును ప్రారంభించును

> “ఏయది పుట్టుకలేనిదయి యెత్తెనో భూమి దశావతారముల్
> ఏయది మిత్తిలేనిదయి యెక్కటి ముక్తిపథంబు చూపెనో
> ఏయది సర్వమన్ దెలిపి యెక్కుడి మాయకు మూలమయ్యెనో
> ఆయఖిలాండకోటి సతతాశ్రయశక్తి నుతింతు నిత్తెమున్”

‘జేనెడు పొటకొఱకు, చిన్న నోరు కొఱకు ఎల్ల వేళల తిండి సంపాదించుటలో మునిగి, భగవంతుని దలపోయకున్నచో మానిసి మానిసే నిలువు మ్రానంగు గాని’ యని మానవజన్మలోని పరమార్థము పరమాత్ముని ధ్యానమే యని చాటును.

“చీమకు దోమకున్ చీమల జీవముకున్ గరికిన్ మృగేంద్రుకున్” హేతు భూతుడా పరబ్రహ్మయే యని నమ్మి ప్రణతు లర్పించును.

“మదికాపేక్షలు లేవనుటయే భ్రమ యనును ‘భవత్పద పంకేరుహ మార్దవంబునకునై తాపత్రయాలోలునై యెదియో పద్యమొ, గీతమొ,శతయొ నే సృష్టించుకొందు” నని, అట్లు భగవంతునిపై కవిత లల్లవలయునను కోరిక కూడ అపేక్షయే కదా అని చింతించును

భగవంతుని ధ్యానించునటులే అయన పాదారవిందములను నమ్మిన భక్తాగ్రేసరులను స్మరించిన పుణ్యము వచ్చునని నమ్మును. అట్టి భక్తాగ్రేసరుల నెందరినో తలంచి తనకు ఆ మార్గమే చూపుమని పరాత్పరుని వేడును

కుచేలుడు తన చెంతనున్న అటుకులను సిగ్గుతో ఈయలేకపోయినను కృష్ణుడు బలిమితో స్వీకరించెను గదా? అట్లే తానడకువతో చిత్తసమర్పణ చేయజాలకున్నను, బల్మినో, చెల్మినో, బంటు తనాననో ఆ పరమాత్మయే తన్ను నుగ్రహించునని నమ్మును

మోక్షమునకు భక్తియే ప్రధానమని కులములు గాదని ‘విదురుడు శూద్రుండగును, పెమ్మింతు క్షత్రియుండౌను, అట్లయున్ బదమిడి వాని యంట సహపఙ్క్తి భుజింపలేదా?’ యని నిదర్శనము చూపును,

'జనకుని జించి, ప్రత్రికుని జయ్యానంబోధించిన', 'అఖండకీర్తి నన్నను బొలియించి, చమ్మున కనంతరపట్టము గట్టిన' శ్రీహరిని స్తుతించి, భక్తితో తరించిన ప్రహ్లాదుని, విభీషణుని ధన్యులుగ తలయును.

'కౌపీనము ధరింపకయే శుకుడు నిష్కాముడగుట, శంకరుండా పంచాబ్దంబుల యీడుఁ నాడె సన్యాసంబు కొనుట' వారి పరీక్షయేనా? లేక పరమాత్ముని పరీక్షయా అని తర్కించును

ఇందు పలుమార్లు శ్రీకృష్ణుని లీలలు వర్ణించును.

తోటన్ నిన్ను యశోద కట్టునెడ నుల్కున్ జూపులన్ జూపి నా
వాటన్ బాటను గోపికాతతికి నాహ్లాదంబు సంధించె

నని 'ఏటన్ కాళియ నాగునిన్ నిలిచి పాదివ్యట్టోద్భతో నాడెనా'వని 'దేకేటప్పుడు తన్నితే పడిగ దుక్కుతుక్కునటుల్ చేసె' నని వాని లీలలను పాడెను

'స్త్రీకిన్ స్త్రీకిని మధ్య నీవగుచు, మధ్యే నీకు స్త్రీనుంచుకొంధదోవో కల్యాణమూర్తి! కేశవ ' యని సర్వప్రకృతిని మోహమున ముంచి వేసిన మురారి రాసక్రీడను వర్ణించును

ఇందు చివరి పది పద్యములలో దశావకార వర్ణన కలదు
ఇట్లు మొదటి శతకము సంపూర్తిగ భక్తిత్వమును చాటుచున్నది.

## 2. మమైక దైవసంప్రార్థనము:

ఇది కూడ కేవలము భక్తి శతకమే స్ఫురణ, ప్రార్థన మందిరాదులు; ఇందుగల 100 పద్యములును 11 నవకములుగ విభజించిరి.

ఇందు భగవంతుని స్తుతించు పద్యములు కొన్ని, భగవంతుని దయాదృష్టి తనపై బ్రసరింపజేయుమని వేడుకొను పద్యములు కొన్ని, సర్వసృష్టియు పరమాత్మునికొరకే విలసిల్లియున్నదని యెంచి చెప్పిన పద్యములు కొన్ని కలవు.

ఈ శతకము ప్రారంభించుటకు ముందు 'నిరంతర ప్రార్థన పద్యము'.

"ఎవ్వానికొఱకు కోయిలఅట్టయెలుగెత్తి
కొమ్మ కొకో' య్యని కొసరు విసరు .. . "

ఇట్లు భగవంతుని దయామృతమును దనపై కురియింపుమని వేడుటతో శతకము ప్రారంభ మగును సూర్యభగవానుని వలె ధృతితో కృషి జేయించుమని, ధృవ నక్షత్రపు టర్ధ్వము వలె దారి తప్పనిదిగ తిన్నదిగ గూర్చుమని ప్రార్థించును

'నీవువినా ఎవరయ్యా నాకిఁకన్' అని భగవానుని శరణు వేడును

సకల చరాచర సృష్టి కాధారభూతుడే తన కాధారమని నమ్మి —

'వేదికు నాధారుం డెవ

డాధారుం డెవఁడు జలధి కాధారు డెవం

డీ ధరణీ జిలకకు మొలక

కాధార్మికుఁ డలఁతు నాకు నాధారుడు'

అని నిశ్చింతు డగును.

'నా శరీర మిది నీచోద్యాలకుం దంబురై నిగమానంద సువేద్య మ్రోగు నది మన్నింపంగఁ జెల్లున్ ఖ్రితిన్' అని పరాత్పరుని లీలల కనుగుణముగ యాడెడి సాధనముగ తన్ను భావించును 'కోరికలు కూడ్డవనుచునె నీ దర్శనంబు కోరెద నని' చమత్కారముగ బలుకును 'విను నత్యావ క్తిఁ బూజింప నయినను అయు ర్ధాయ మొసంగు' మని ప్రార్థించును

ఈ శతకము నందలి ప్రధానాంశము భ క్తియో అయినను నీతి, ప్రబోధము కూడ అటనట కాననగును "చేసను జాగు బుద్ధినిడ చెప్పటద్దప్పుడు చప్పు చప్పు నన్ నీవనిగా నానర్చుటకు నీతిని, శ క్తిని, యుక్తి నీయు' మని వేడుకొనును. సోమరితనము వదలి ఎప్పటిపని అప్పుడే అవధానముతో జేయవలయునను ప్రబోధ మిందు కలదు.

అక్కడక్కడ పురాణములలోని కొన్ని విషయములను విమర్శించుట చూడ వచ్చును. పరంధాముర సృష్టి యగు పంచభూతాత్మకమైన ప్రకృతిలోని వింతలైన ఆరామములు, నదులు, గిరులు మున్నగువానినే కరువుదీర బూచుటయే అసంభవము. ఇక స్వర్గమును జూచినారమని చెప్పువారలు వెర్రివారే కదా యని విమర్శించును,

భగవంతుని పలుమార్లు స్తోత్రము చేయుమనే, దానివలన ప్రయోజన మేమైన యున్నదా అని సంశయించును,

'జపమేలా, తపమేలా? నీకొలకునై సంసిద్ధుడన్ సత్కృతిన్

వపువును మాలగఁదిప్పెదన్, మనమునుం బంధించెదన్ భిత్ప్రభా'

అని చివరకు సర్వాంతర్యామిని చేరుటకు జపతపము లావశ్యకములు కావని నిశ్చయించుకొనును

సర్వమానవ సమానత్వమును చాటుచు తొలుత ఎక్కువ తక్కువలు, జనులకు లేవని, అందరును ఇల్లరికమువోలె భువిపైకి ఏగుదెంచినవారే యనును

గడ్డిపూలపై కవికి ప్రత్యేకాభిమానము కలదు, పలు సందర్భములలో వానిపై పలు కవితలను వెలయించిరి. ఈపూలపై ఇంతటి ఆదరము మరి ఏ కవికిని ఉన్నట్లు కానరాదు తుదకు భక్తి శతకములో కూడ వానిని కవి మరువలేదు. సృష్టిలో, భగవంతుని దృష్టిలో ఏదియు అల్పమైనది కాదని ఋజువు చేయ నెంచును

చిటిపొటిపూలు గిట్టుపయి పిగ్గును గొన్నటు పచ్చగడ్డిలో
నిటునటు దాగి పచ్చగను నెట్టగ నీలముగాను విఱ్ఱనీ
చిటపట పడ్డ వానలకుఁ జిక్కన లేచిన వంచు నెంతునా
దట భగవానుడా! కడు ముదాన రహింతువు సర్వరక్షకా!

అని వాని సోయగమునకు ముదము పొందును,

క్షాణికక్షణముగ గడ్డిపూలను సృష్టించి, తొక్కబడుటకు పోవు మార్గము చూప వైచితివని భగవంతుని ప్రశ్నించును,

గడ్డిగలట్టి పువ్వులను గొల్చిత సాగకముందు నాకహో!
దొడ్డగబూపి యర్థమిది త్రొక్కుకు త్రోవజేసి కొమ్మటం
బొడ్డెదు నీదు పందెమును ఓ పరమాత్ముడ! యప్రమేయుడా!
గొడ్డుగఁజేయవైతి నను గ్రుడ్డినైనను జేయవైతయో

అని అచిన్నారి పూవులను త్రొక్కుట కంటె గ్రుడ్డివాడగుటయే మేలని తలంచును ఇట కవి హృదయ మెంత సుకుమారమో ద్యోతక మగును.

ఈవిధముగ రెండవ శతకము ప్రధానముగ భక్తిపరముగ నున్నను అటనట జ్ఞాన, వైరాగ్యములతో కూడి యున్నది,

## 3. శతథా :

ఇది భక్తి వైరాగ్య నీతి సమ్మిశ్రిత శతకము స్ఫురణ : ఐహికాముష్మిక మహాప్రపంచము ఇందు ఉద్బోధ, శపథము. దేవుడు- మతము, అవతారవర్ణనము, నిర్గుణ స్తవనము, పురాణచాతురి, జిజ్ఞాస, సంప్రశ్నములు, నిర్వచనములు, ప్రకృతి ధర్మవర్ణాలు, నాలుగువర్ణాలు వేషభాషలు అనంతము అను 14 నవకములు గలవు. ఈ శతకము నందు దైవస్తుతి, లోకనీతి, సంఘవిమర్శ మున్నగు పలు అంశములు కలవు

'ఉద్బోధ' అందు 'ఏ రూపము అంధకార నిశిని చైతము కానవగునో, సతంబేరూపంబును లోకమందు గల యన్నింట ప్రదర్శింపబడునో అట్టి సత్య జ్ఞాన దీప్తిని కొలిచెద' నని భగవంతుని విశ్వవ్యాపకత్వమునకు శిరస్సు వంచును

మిగిలిన శతకములకు వలెనే ఇందు పలువోట్ల భగవస్స్తుతి కానవగును.

"పురాణచాతురి" అను విభాగములో పురాణములలో వర్ణింపబడిన భగవానుని గూర్చి తెలుపబడినది భక్తిలో జ్ఞానభక్తి, వాత్సల్యభక్తి, ప్రేమభక్తి మున్నగు మార్గము లనేకములు కలవు భక్తియే ప్రధానముగ ఏ మార్గము ననుసరించినను, పరమేశుడు వారి లనుగ్రహించునని చాటును

'సంప్రశ్నము' అను విభాగములో కవి జిజ్ఞాస, తార్కిక దృష్టి గోచరించును.

కారణమేమి పుష్పము సకాలముకున్ విడి గాలిలోన నా
యూరుపుతో సువాసనల నొక్కటఁగల్పుచు మక్కువొలుకున్।
కారణమేమి? పచి మధుకంఠముతోఁ దన కంఠమూదిఁ పం
ధ్యారమణీయ రాగకలితంబగువేళల దివ్యమాటకున్

పక్షి కలకూజితమునకు, పుష్పము సౌరభములీనుటకు కారణ మెవరని ప్రశ్నించును

గడ్డిపూవు నెట్టి తరుణమునను కవి మరువడు

'దారిని మొల్చు గడ్డి తా ధారుణి గాలినాడి పువుదాల్చి
వికాసము నొందుట ఆ పరమాత్ముని లీలయే'

అని గడ్డిపూవు శోభకు కూడ కారణము పరమాత్మ యని తలంచును

కవి అవకాశముబట్టి అభ్యుదయ మార్గమును బోధించుచుండును "దేవుడు-మతము" అను విభాగములో "దేవుండొక్కడు - భావమొక్కటి" అని భగవంతు డొక్కడే యను సందేశ మిచ్చెను

మతభేదములు, మరల ఆయా మతములలోని అంతర్విభేదములు మానవ కల్పితములని సూచించును ముఖ్యముగ శైవ వైష్ణవ భేదములు తగునని బోధించును.

ఒక్కడు నల్లచుక్కను, మఱొక్కడు తెల్లని పంగనామ మిం
కొక్కరుఁ డడ్డగీటుఁ బరుడొక్కడు నిల్వుగ బెండకాయని -
ట్టొక్కని మోముపై నొకనికున్నది లేదని పితు రన్నిటన్
నక్కనదేమిః బీమ్మ తెలినాడున వ్రాసిన వ్రాత యొక్కటే

అట్లే "రక్తము గోసినంత యొకరంగు జగంబున జంతుకోటికిన్" అని ప్రపంచములోని ప్రాణులన్నియు భగవంతుని దృష్టిలో సమానమని చాటును

"నాలుగ వర్ణములు" అను విభాగములో ఆయా వర్ణముల వారి ఒకనాటిస్థితిని జూపి, నేటి వారిలోని లోపముల ఎత్తిచూపును నాలుగవ జాతివారు పడు ఇక్కట్టులను తలచి విలపించును

"నేలను దున్నువాడొకడు, నేల ఫలంబును భుక్తపర్చుకొం
చీలుగువాడు వేఱొకడు "

అని అట్టిస్థితి రూపుమాపవలయు నని ప్రబోధించును. అందరును కలసి ఒక్కటిగ ఏనాడు జీవింతురో యని తలంచును.

"ధర్మపన్నాలు" అను శీర్షికను కొన్ని ధర్మములను సరళముగ బోధించును-

"వేషభాషలు" అను విభాగమున అధునాతనముగ లోకుల అభిరుచులు మారుటను గూర్చి ప్రస్తావించును "పెట్రోల్ బంకులు పోయి యీ పయిని కాఫీ బంకులే వచ్చునో" అని ఆధునికులు కాఫీగత ప్రాణు లగుటను విమర్శించును

చివరగా తన కవితాశక్తి అంతయు ఈశ్వరుని దయాయే అని తలంచును ఈ అభిప్రాయమును వీరు పలుతావుల వెలిబుచ్చుచుందురు

తరువులు శాఖచాగి ఫలజాలము లందని కందగా భువిం
కరము రహించుచొప్పం మమ.ంరసు గేయముపాడుకొంచున
య్యోఖక సమస్తలోకమువకు నింపుగ బంచగ నుత్సహింపు దే
వః రతివి నీవుగా పరమభావము నీవుగ కంరమీవుగా

అని అవనతశిరస్కు డగును

ఇట్లు శతథా అను శతకము భక్తి భావములతో, నీతిబోధలతో కూడి యున్నది ఇందలి శీర్షికల నామములు విచిత్రములుగ యున్నవి.

## 4. కందకుక్షి.

ఇది కూడ సంకీర్ణశతకము స్ఫురణ: సర్వసామాన్య ప్రవృత్తి మొదటి మూడు శతకములు భక్తి ప్రధానములు కాగా దీనియందు జిజ్ఞాసాపూర్వకములగు పలు విషయములకు సమాధానములు కలవు. ఈ శతకము మొదలగుటకు ముందు "అనుబంధ కందార్థము" అను శీర్షికను రెండు పద్యములు కలవు మొదటిది కంద పద్యము యొక్క మాధుర్యమును, విశిష్టతను చాటును.

చిందము మకరందము గో
విందమ్మరవిందమి సువివేకానందం
బందము హృదయస్పందము
కందము మకరంద మాంధ్రకవిబందము కను

రెండవది కవికి తెలుగుభాష పైగల మమకారమును ఇట్లు చాటును

అతనితోడను కలిసి నీవను
తెనుగుబాసను తీపితెరలు దానికేను
కణుగు చెణుగులేక కాలందె ఘలుఁ జను
కవిబంధముకను
అతనితోడను కలిసి నీవను—— అనియు

కొలిచిన విగ్రహమయ్యెడుఁ
గొలవనిచో శిలయగును

అని విగ్రహారాధనమును ఖండించును అట్లని నాస్తికతావాదమునకు తావీయ వలదని "మఱు వేసినంత పొద్దుకు ప్రళ లేదనుట యెట్టిదో ప్రాపంచ పంథాను భవమునను బడి యజ్ఞత నభవుడు లేడనుటయు యట్టిది" అని బోధించును. ఇది బ్రహ్మసమాజమత ప్రభావము

లోకమున చెడు విషయమునకు ప్రచార మక్కరయుండదని, మంచితనమును మాత్రము చాటిచెప్పవలయునను చేదు నిజమును చక్కని పోలికతో చెప్పును

కల్లమ్ము నంగడుండును
చల్లమ్మగ వీధి వీధి జరియించుచు మేల్
చల్లోయని యఱవవలయు
పెల్లడి సేయుమురా తలచి విజ్ఞానంబున్

ఆరోగ్యమునకు హానిచేయు కల్లు నమ్ముటకు అంగళ్ళు వెలసి యుండగ, ఆరోగ్య ప్రదాయినియగు చల్ల నమ్ముటకు అంగడి లేకపోగా వీధి వీధిని 'చల్లో' అని అరచుచు తిరుగవలయును. కనుక విజ్ఞానమును తలచి లోకమునకు వెల్లడి సేయు మనును

కాఫీ దురలవాటుపైనిట మరియొక విసురు కలదు ఆనాటి ఆర్యులు రెండు పూటల సూర్యునకు మ్రొక్కగ ఆధునికులు భార్యకు మ్రొక్కుచు 'కాఫీ కుర్యాత్' అనుచున్నారని ఎత్తిపొడుచును.

దుర్జనుడు సజ్జన సాంగత్యము చేసినంతమాత్రమున సజ్జనుడు కాలేడని, సజ్జనుడు దుర్జనసాంగత్యము వలన దుర్జనుడు కాడని చక్కని దృష్టాంతము చూపును.

సత్యమును అన్వేషించుటయే మనకు ధ్యేయమని, అందులోనే ఆనందము గలదనును

నిత్యానందం బెవనిది?
సత్యాన్వేషణ పరునిది

"శ్రీరాముని సద్ధర్మము, అ రాధామాధవుని కర్మానుసరణములే" మనకు తరుణోపాయములని ముక్తి మార్గము చూపును

ఈ శతకమిట్లు పలు నీతులతో, తత్త్వచింతలతో నిండియున్నది.

## 5. ద్విపదలాశ :

ఇది కేవలము నీతి శతకము స్ఫురణః నీబహుళాంధ్రోక్తి ద్విపదచ్ఛందముగ కావింపబడినది, దీనియందు పెక్కు సూక్తులు, లోకోక్తులు హృదయంగమమున కలవు.

ఆడి తప్పనివాడే అత్యుత్తముడని చాటి చెప్పెను. ఆస్తి, అంతస్థులు భూమి మీద జీవించునంతవరకే అను సత్యమును దృష్టాంతముతో చూపును.

"పేదకు గుడిసె కుబేరునకు మేడ
మేదినిపైగాని మింట మేఘాలే"

అని ప్రాణములు పోయిన పిదప అందరును ఆ ప్రకృతిలో కలసిపోవువారే అని చెప్పును

"కేశంబు దీసిన కేశంబు లాంటి
దాశకు నంతంబు అగ్గిముట్టింపె"

మున్నగు నీతులు సూటిగా చెప్పబడినవి

"దయకు సమానంబు ధరపి నాందేది"

అని ధర్మసారమును చవిచూపును

"పోగొట్టు కొనకురా పొద్దురకేను
ఆగదురా యది ఆగమన్నాను"

ఇందు కాలము విలువను గూర్చి స్పష్టముగ తెలియచెప్పను

"వీధిలోఁ బడ్డాక ఫిన్నదెవ్వారుః
వీధివారే కారు, విశ్వంబువారు"

గుట్టు అనునది మానవునకెంత అవసరమో సూటిగ చెప్పును.

"చెఱకున దీయంబు చేదు వేమునకు
విఱిచిన కఱచిద వెడలిపోవన్న"

పుట్టుకతో వచ్చిన బుద్ధి పుడకలతోగాని పోదను మాటను చక్కని పోలికతో చెప్పెను

"వీధికి గుమ్మాలు వేయి పెట్టుకొని
వీధి తల్పులు మూయ విశదమెవ్వారు?"

భగవంతుడు సర్వప్రకృతియం దావరించియున్నను సాధనతోనే పొంద వలయునని ఉదాహరణముతో చెప్పును

"మనసులో పుట్టాక మతిపోదు శంక
పనస బంకట్టుల పట్టుక సాగు"

అనుమానము ప్రాణసంకటమను మాటను చక్కగ చెప్పును

చివరగ కవి ఈ శతకముల రచించినది జ్ఞానేయని తన పేరును చెప్పుకొనెను

"ఇవియెల్ల లెస్స రచించె నెవ్వండు?
కవి: కవికొండ్ల వెంకటార్రావు సుండు"

ఇట్లీ శతకమున మాణిక్యముల వంటి నీతులనేకములను సరళసుందరముగ కూర్చిరి,

ఈ శతకములను గూర్చి క్రింది అభిప్రాయములు ప్రకటింప బడినవి

"హరివినోదము చదువ చదువ వీరి భక్తి అవపాంగోపాసన యను చిన్న సెలయేరై, త్రిమూర్త్యుల పెద్ద యేరై, శక్తిరూపమున విశదమై, ఏకేశ్వరోపాసనలో నేకముఖమై సగుణబ్రహ్మోపాసన యను జ్ఞానవాహినియై పరతత్త్వమను సచ్చిదానంద సాగరమున జేరినట్లు తోచుచున్నద"ని భువనగిరి లక్ష్మీకాంతమ్మగారు తెలిపిరి[29]

"భక్తులూ, జ్ఞానులూ అయిన కవులు తమకిష్టమైన దైవనామముతో శతకాలు వ్రాయడం కూడ తెలుగునాట ఉన్నదే. మకుటం లేకపోయినా మనసైక దైవ సంప్రార్థనము అట్టి శతకమే కందకుక్షి పద్యాలు పిల్లలకు పఠనీయం చేయడం మంచిది ద్విపదలాత్మకోని పద్యాలు చిన్న బిడ్డలు కంఠస్థం చేయదగినవిగాను, స్త్రీల దంపశ్ళ పాటలుగా పాడదగినవిగానూ కూడా ఉన్నాయి" అని కనుపర్తి వరలక్ష్మమ్మగారు తెలిపిరి[30]

ఈ శతకములను పరిశీలించిన గోచరించు ప్రధానాంశము లివి :

1. సర్వసాధారణముగ ఒక శతకములో ఒకే విషయమును అధికరించుట జరుగును కాని వీరి శతకము లందుకు భిన్నముగ కలవు. ఒకే శతకమున పలు అంశములను

అధికరించుట కలదు మొదటి మూడు శతకములు భక్తి ప్రధానములే అయ్యు జ్ఞానము, వైరాగ్యము, నీతి వంటి ఇతర విషయములు కూడ ప్రబోధింపబడినవి నాలుగు, అయిద శతకములలో నీతిబోధ ప్రధానమైనను పరాత్పర స్తుతి, భగవంతుని లీలలు, సంఘముపై విమర్శ, లోకరీతి మున్నగు పలు అంశములను కూడ ప్రస్తావించిరి ఈ కవి ఇతర ప్రక్రియ లందును ఇట్టి వస్తు వైవిధ్యము కలదు

2 శతకమునకు మకుట లక్షణము నియతము కాని వీరు మకుట నియమమును పాటింపలేదు మకుట రాహిత్యమును గూర్చి క్షేమేంద్రగారి అభిప్రాయ మిది[31].

"మామూలు శతకము లందునట్లు భక్తి వైరాగ్య స్వభావముల యొక్క మకుటము లేదు పరమేశ్వరుడు నామరూపరహితుడు కదా అని వీరిట్లు మకుటము లేకుండ చేసి యుందురు".

ఇది ఊహ అయినను ఉచితముగనే కలదు.

3. శతకమునకు మకుటమునుబట్టి నామ ముంచుట సర్వసాధారణము గాగా, ఇట శతకము లందలి అంశములనుబట్టి, ఛంధస్సునుబట్టి శతకములకు నామముల నుంచుట జరిగినది పలు శీర్షికల నామములు విచిత్రముగ తోచును

భగవంతుని లీలలు వర్ణించునదిగ మొదటి శతమునకు 'హరివినోదమ'ని, భగవంతుని సంప్రార్థనను గూర్చినది కనుక రెండవ దానిని 'మమైక దైవ సంప్రార్థ'మని, భగవంతుని గూర్చిన భిన్న అంశములను తెలుపునదిగ మూడవ దానికి 'శతధా' అని శీర్షిక లుంచినట్లు తోచును చివరి రెండు శతకములకు వానిలోని ఛందోరీతుల ననుసరించి, 'కందకుక్షి', ద్విపదలాక్ష' అను నామము లుంచినట్లు చెప్పవచ్చును

4. అయిదు శతకములును వేనికవి భిన్నములుగ గోచరించినను అన్నిటిలోను కవితాత్త్విక దృక్పథము స్పష్టమగు చుండును. వీరు తెలిపిన అంశములు విశిష్టత, వైవిధ్యము గలవి

'హరివినోదము' నందు వీరి భక్తిసోపానములు, జ్ఞానసౌధము గోచరించును, ఈ భక్తిమార్గము రాముని, కృష్ణుని స్తుతించుట మొదలు బ్రహ్మజ్ఞానము నన్వేషించుట వరకు సాగిపోవును ఒకవో సనాతన సంప్రదాయ వాదము, మరియొకవో తార్కిక అభ్యుదయ వాదము పెనవేసుకొని భగవంతునిపై గాఢమగు నమ్మకము నుంచి ఇహపరముల గూర్చి విచారము చేసిరి, లోకుల ఉత్తమగతుల నుద్దేశించి తత్త్వ విచారము గావించిరి,

'మహైక దైవసంప్రార్థనము' భక్తిపర మయినది అయినను వైరాగ్యము, జిజ్ఞాస మున్నగు విషయముల ప్రస్తావన కలదు ఇందు కవికి గల అధ్యాత్మిక జ్ఞానము, తృష్ణ పూర్తిగ వెల్లడి అగుచున్నది

'శతథా' యందు శతవిధ విషయములు పరామర్శించిరి అయినను అధికముగ ఐహికాముష్మిక పరములగు అంశములే కలవు తరువాత ప్రధానముగ సంఘముపై విసుర్లు కలవు కవి సంఘసంస్కరణా ధోరణి ఇట స్పష్టమగును పై మూడును ప్రధానముగ భక్తి శతకములే

'కందకుక్షి,' 'ద్విపదలాక్ష' ప్రధానముగ నీతిశతకములు. బాలలకు కూడ సుబోధకముగ నున్నవి చక్కని ఉపమానములతో, దృష్టాంతములతో నీతులు బోధించిరి. పలు ధర్మములు సరళసుందరములుగ చెప్పిరి

ఇట్లు కవికొండల వారి శతకము లన్నియు భక్తి జ్ఞాన వైరాగ్యములను చాటుమనే నీతిబోధకములు గను, సంఘ సంస్కరణాత్మకములు గను కలవు, ఇవి తెలుగు శతకవాఙ్మయమునకు తేజోరేఖలు

## 2. లఘు కావ్యములు

కవికొండల వెంకటరావు గారు రచించిన లఘు కావ్యములు తొమ్మిది- 1. రావి రవళిక, 2 సంగ్రహ శాకుంతలము, 3. పురాగమనము, 4 కవితాన్వేషణము, 5 రాధిక-రాజిగాడు, 6. సింహాచలం-శ్రీరంగపట్నం, 7. హిహిడా నారాయణమ్మ. పై ఏడింటిని కవికొండల వారు అయత నిర్వచన కావ్యములుగ పేర్కొనిరి. "అయత అనగా దీర్ఘమైనది నిర్వచన అనగా వచనములేని పద్య కావ్యము అని అర్థము. ఇవి సామాన్య ఖండకావ్యాల వలె ఇరువది పద్యాల్లోనో, ఏ ఎనభై తొంభై చరణాల్లోనో ఇమడకపోవుటచే అయత నిర్వచన కావ్యాలు అనవలసి వచ్చింది" అని వారే వివరించిరి.[12]

పై ఏడు కాక 8 సారంగధర, 9 ఆర్యాంగనాస్వప్నము అని మరి రెండు లఘు కావ్యములు కలవు.

ఈ తొమ్మిది లఘుకావ్యములలో "రాధిక - రాజిగాడు", "సింహాచలం-శ్రీరంగపట్నం", "హిహిడా నారాయణమ్మ" అను మూడును అలభ్యములు

"వివిధ కుసుమావళి" అను సంపుటిలో "రావి రవళిక", "సారంగధర", "ఆర్యాంగనా స్వప్నము" అను మూడు కావ్యములును కూర్చి 1913 లో ప్రకటించిరి,

"త్రయి" అను సంపుటిలో "సంగ్రహ శాకుంతలము", "పునరాగమనము" "కవితాన్వేషణ" అను మూడును ప్రచురితములు ఇది 1930లో ప్రకటితము

## 1. రావి రవళిక :

స్ఫురణ పెనుమంచిలి. ఇందలి కథ కల్పితము. పల్లెపట్టున జరిగిన అమాయకపు టనురాగ వృత్తాంతముపై ఆధారపడిన కథ. వైవాహిక బంధము నందలి పవిత్రత, నూతన దంపతుల నిర్మల ప్రేమబంధములు చక్కగ చిత్రించబడినవి. పల్లీయ ప్రకృతి మనోహరముగా వర్ణితము " ఓ పథీవల్లభు బండు వన్నె కను బండు వానర్చెడుఁ బంటచేనులన్ సల్లలితానిలంబు పెదజల్లెఁడు జల్లదనము ఱూఁకు లన్" అను ప్రకృతి వర్ణనముతో కథ ప్రారంభమగును

ఇంటి ముంగిలిలో అరుగుపై కూర్చునుండిన యువకుడు పరిసర ప్రాంతము నందలి చోద్యములను పరికించి మురియుచుండును. భార్యతో సరసము లాడబోగా ఆమె బిడియపడుచు పరులు చూచిన ఎకసెక్కము లాడుదురని పలుకును అందుల కాతడు ఎవ్వరును లేరనును అప్పుడామె ఎదుటనున్న రావి వృక్షమును చూపును. ఆ యువకుడు తమ ప్రణయమున కామోదము తెల్పునది, సంతసించునదియు ఆ రావిచెట్టే యని ఎంచి గతమును తలపోయును

అతడు తండ్రితో కలసి మొదటగ పెండ్లి చూపుల నిమిత్తమా ఊరికి వచ్చెను ప్రథమ వీక్షణముననే ఆ బాలిక అతని మనస్సును దోచెను ఆ తరుణిని తప్ప మరి ఎవరిని వివాహమాడరాదని, తిరిగిపోవునపుడా రావి చెంత నిలచి తల పోసెను ఆ బాలిక మనస్సు కూడ అతనిపైననే లగ్నమయినది కనుక ఆమె వారు వెడలిపోవునప్పుడు రావి మాటునకు వచ్చి వారిని చూచి ప్రక్కకు తప్పుకొనెను సిగ్గుదొంతరలలో వారు పరస్పరము వీక్షించుకొనుటను గాంచి రావి యిట్లు తలంచినదంట—

"సిగ్గులొగ్గినవారల చేష్ట లెంచి
రావికొమ్మంతఁబూనెను బ్రీతిన నిట్లు
యిప్పు డింతఁగ లజ్జించు నీ యిరువురు
నొండొరుల్ ముద్దులిడుకొనుచుండఁజూతు"

అని ఆ విషయమును యువకుడు చమత్కారముగ భార్యతో చెప్పను ఆమె అతని ఇంగితము నెరిగి "తత్ప్రతిజ్ఞనె యీ రావితలంచి యున్న పూర్తి నెఱవేఱకే సిద్ధింబొంగుచుండె"నని నాధుని అరుణ హస్తాబ్జతలమును ముద్దాడినది ఈ వృత్తాంత మును కవి రమణీయముగ కావ్యరూపమున మలచెను

ఈ కావ్యమున కవి భారతీయ వైవాహిక సంప్రదాయములోని ఔన్నత్య మును ప్రకటించుచు, ప్రథమ వీక్షణముననే ఆ యువతీ యువకుల కొకరొకరిపై ప్రగాఢపు అనురాగము ఏర్పడుటను సమర్థించును. వివాహములు దైవ నిర్ణయము లని, దంపతుల మధ్య శారీరకపు ఆకర్షణకన్నను మించినది అంతరంగిక అను బంధమేనని చాటును దంపతుల మధ్యగల శృంగారభావము లలితముగ, సున్నిత ముగ, మనోహరముగ చిత్రించెను

తెలుగుదేశపు ఆచార సంప్రదాయములు కనులకు కట్టినట్లు వర్ణించెను ఇరువదవ శతాబ్దపు తొలినాడులలోని సాంఘిక జీవనమునకిది దర్పణము వంటిది పెండ్లి చూపులకు వచ్చినవారికి ఆడుపెండ్లివారు చూపు గౌరవము, వినయము వారు నెఱపు స్వాగత సత్కారములు చక్కగ తెలిపిరి కన్య తల్లిదండ్రులు కాబోవు వరునిపై పెట్టుకొను ఆశలు సహజముగ చూపిరి

పెండ్లిచూపుల కమ్మాయిని కూర్చుండబెట్టుట, ఆమె విద్యాసామర్థ్యములను పరీక్షించుట మున్నగునవి సంప్రదాయము ననుసరించి యున్నవి పూర్వము బాలి కలు విద్యనేర్చుట యనిన అమూలాగ్రముగ కావ్యములు, పురాణములు పఠించుటగ నుండెడిది. సంగీతము నేర్చుకొనుట, స్త్రీలు ఆచరింపదగు ధర్మములను తెలుపు కుమారీశతకము నుండి యొక పద్యములు చదివి శ్రోతల వీనుల విందొనర్చునటుల స్వాదురస మొలికించునటుల తన గానమును వినిపించినది

గృహస్థు భోజనము చేయుడని ఎంత బ్రతిమాలినను "కతికితే అతుకదను" నమ్మకముతో వారు సంతృప్తిగ తిరుగు ప్రయాణమునకు సిద్ధమైరి ఆ నమ్మక మింకను మనలో కలదు.

వైవాహికబంధములోని పవిత్రత, గాఢత, శాశ్వతత్వము పలుమార్లు ప్రద ర్శింపబడినవి.

వివాహబంధమునకు బాహ్య సౌందర్యముకన్నను అంతరంగిక సౌందర్యమే ప్రధానమని చూపును

"కన్నె సౌందర్య సంపద గరిమ కంటె
స్వాదు కలకంఠ కంఠ భూషణము కంటె
జూడ సొబగైన కనుఁగవ చూకి కంటె
గడు మనోజ్ఞత లొలికించు నడలకంటె
ఘనతరంబుగ నెద్దియొ కడలు కొనుచు
మామకాత్మను హరియించు మరల మరల"

—అని తలచి ఆమె పట్ల అమరాగ పూర్ణ హృదయుడగును ఇట్లు గృహస్థాశ్రమము నందలి ఔన్నత్యమును చూపును.

ఈ కావ్యమున చంద్రోదయ వర్ణనలు, వెన్నెలవర్ణనలు కడు హృద్యముగనున్నవి చంద్రుడు సానబెట్టిన వజ్రము వలెనున్నాడట

"ఇరులు కవిసెడు నింతలో నెందునుండొ
తోయ దాచ్ఛాది తుండయ్యెఁ దొగలఱేఁడు
ఓహో! చిమ్మెడు చక చకద్యుతులనందు
సాన రాపిడించేఱు వజ్రంబుసరణి"

నీలి మబ్బులు తెల్లని చందమామను తమలో దాచుటను కవి ఇట్లు చమత్కరించును.

'తెల్లనగుఁ బూల గుత్తులఁ దెలివలిట్లు
తమ వినీలంపు సికలను దాల్చుచుంటఁ
జూచి మబ్బులు చందురు దాచుమండు' నని ఇంతులు తమ నీలి కురులలో తెల్లనిపూలను దాల్చుట చూచియే నీలి మబ్బులట్లు చంద్రుని దాచెనని మనోజ్ఞముగ ఊహ చేసెను.

పక్షి సంతతులు ప్రొద్దు గ్రుంకుటతో,సద్దుమణగి యుండుటను ఉపమానముతో వర్ణించును

"డోలికలఁ బండుకొనుఁ బసి బాలలట్లు
కెంపు లొలికించు చిగురాకు జొంపములను
గూర్కు నొందెను బోలు శకుంత తతులు
కానిచోఁ జెవిని బడదె కలవరమ్ము"

ఇట్లు ప్రాచీన సంప్రదాయ తత్త్వమున కద్దము పట్టినదీ కావ్యము.

## 2. సారంగ ధర :

దీని రచనా కాలము 1913. ఇందు మొత్తము 36 పద్యములు కలవు స్ఫురణ రాజమండ్రి. ఇందలి ఇతివృత్తము ఒక శ్రుతి సారంగధరుని కథ ఆంధ్ర సాహిత్యమున కావ్యరూపమున, కథల రూపమున, నాటక రూపమున ప్రసిద్ధి కెక్కినది అందుచే కవి ఈ ఇతివృత్తమును స్వీకరించి ఖండకావ్యమును రచించి యుండును.

కథా ప్రారంభమున మిత్రులిరువురు రాజమహేంద్రవర విహారమునకు బయల్వెడలి ఒక మిద్దెనెక్కిరి అటనుండి ఆ పురవైభవమును వీక్షించి దాని ప్రాశస్త్యము నుగ్గడించిరి కవికి ఆ పురముపైగల అభిమాన మిట ద్యోతక మగును.

ఇది చరిత్రాభాసమైన రచన. ఇందు కవి గతవైభవమును స్మరించుట చూడ వచ్చును. ఆనాటి రాజ మహేంద్ర వర శోభ మన కనుల ముందు నాట్యమాడును!

'ధరనలరు రాజ మహేంద్ర పుర వరంబు
అందు బ్రాహ్మణ పాండిత్య మగ్గలంబు
రాజ భుజ బల మెవ్వేళఁ బ్రకటితంబు

వైశ్యభాగ్యంబు సత్కార్య భాజనంబు' - ఇందు ఆ కాలమున వర్ణ ధర్మమును ఎంత చక్కగా కాపాడు చుండిరో తెలియును

'అదె యల పాతాళ పాదప శిఖాంతరమందున ధూమ ధూళులన్
జదలను నింప నంపుచు బ్రశస్తరుచిన్ దన రారు చుండెన
య్యేదకద తత్పురంబహా'-అని పురవర్ణన చక్కగ చేయబడినది.

సారంగధరుడు బాల్యమును వీడి యౌవనవంతు డగుటను 'మొగ్గ విడిచి యల్ల పూవగు పోలిక-నతని శైశవంబు యౌవనంబు బొందె" అని చక్కని సామ్యముతో చూపెను. ఇట్లు వీరి చారిత్రక గాథను సరళ సుందరముగ మలచిరి

## 3. ఆర్యాంగనా స్వప్నము :

రచన 1913. స్ఫురణ రాజమండ్రి ఇది 29 పద్యముల చిన్నికావ్యము కవి ఒక వేసవి సాయంతనమున బడలికతో నిద్రించి కాంచిన స్వప్న సారాంశమిది ఇందు పురాణ స్త్రీల ప్రాశస్త్య ముగ్గడింపబడినది.

'గాటంపు నిదురఁజొక్కి గాంచిన స్వప్నము' కనులకు కట్టినట్లు తోచినది కవికి. వాసి గాంచిన ఆర్యాంగనలు శకుంతల, సావిత్రి, చంద్రమతి, దమయంతి, సీత, ద్రౌపది ఒకరి వెనుక ఒకరు స్వప్నమున సాక్షాత్కరించి తమ దయనీయ గాథలను మొరపెట్టుకొందురు.

నిండు చూలాలై పేరోలగమున పతి తిరస్కృతయై తల్లిని శరణు వేడిన శకుంతల, పతి ప్రాణములు కోలుపోవగా, యముని ప్రార్థించుచు దక్షిణ దిక్కువైపు పరువులు తీయు సావిత్రి, శ్మశానములో మృతసుతుని ఒడిలో నుంచుకొని విలపించు చంద్రమతి, నట్టడవిలో కట్టుబట్టలతో మిగిలి పతిని గానక పరితపించు దమయంతి, అశోకవృక్షము క్రింద కుందు సీత, నిండుసభలో పరిభవింపబడుచున్న ద్రౌపదీ సతులను వరుసగా కవి తన కలలో గాంచును.

కవికి వెంటనే మెలకువ వచ్చి స్వప్నమును తలచి 'ఆ నెలతలు పుణ్య భారతావనియందు దొడ్డ మెలతలని మెచ్చగ నౌనాః లేక యంతటి కష్టములను ఓపికతో సహించి, కీర్తి గాంచినందులకు వారి ఓర్మిని మెచ్చవలయునాః' అని వితర్కించుకొనును. కవి ఇట వారి ఔన్నత్యము, పవిత్రత, దయనీయస్థితిని స్ఫురింప జేసిరి ఇందరు కులసతులను వేరు కాలములకు చెందిన వారిని ఒకే సన్నివేశమందు గూర్చుట అసాధ్యము కనుక కవి ఎంతయో చాతుర్యముతో స్వప్న సన్నివేశమును సృష్టించెను. పురాణములలో తన కథిమాన పాత్రలను, కరుణరస స్ఫోరకములును నగు పాత్రలనే కవి స్వీకరించెను.

ఈ రచన చేయబడిన కాలములో స్త్రీ జనాభ్యుదయమునకు నిర్విరామముగ కృషి జరుగుచుండెడిది. పురాణ స్త్రీలను ఆదర్శప్రాయలుగ జూపి స్త్రీలలో మానసిక చైతన్యము కలిగించి, సంఘములో స్త్రీని ఉన్నత స్థానమున అధివసింపజేయుటకు ఈ రచన ద్వారా కవి యత్నము చేసి రనవచ్చును ఈ దృక్పథముతో మనోహరముగ, సందేశాత్మకముగ తీర్చిదిద్దిన కావ్యమిది

## 4. పునరాగమనము :

రచన 1913. ఇందు 98 పద్యములు కలవు స్ఫురణ లౌకికము పునరాగమనమనగ తిరిగి వచ్చుట. ఒక యువకుడు వివాహము జరిగిన కొన్నినాళ్ళకే సంసారమును త్యజించి, సన్యాసియై ఇల్లు వెడలిపోవును. ఇరువది సంవత్సరముల తరువాత అతడు స్వగ్రామమునకు తిరిగి వచ్చును. బంధు జనులెల్లరును గుర్తించు

నట్లుగ తన ఆనవాళ్ళన్నియు చెప్పి అందరు సంతసిలునట్లు గృహస్థాశ్రమమును తిరిగి స్వీకరించును.

"అద్దమందున సొంపు దిద్దుకోఁ దలపమి
కుదిరి కుదురని బొట్టు నుదుటఁ బెట్టి
చాకి మడతలు సవరింప గోరమి
మాసిమాయని చీరమైధరించి"

తన భార్యను అట్టి స్థితిలో చూడగనే ముని మనస్సు కరగి ఆమెపై అను రాగము కట్టలు త్రెంచు కొనినది

"ఉష్ణ బాష్పరాశి మౌని కనులనుండి మానిని యరచేత జాఱఁ దొడఁగె నేకధార యగుచు" వివాహ బంధము త్రెంచరానిదని మన హిందూ వైవాహిక సంప్రదాయమెంత ఉన్నతమైనదో తెలిపి దానికి సాటి మరి ఏ బంధమును లేదని చూపును

చివరకు అందరును మౌనిననేక విధముల పరీక్షించి ఆతని నామె భర్తగ అంగీకరింతురు "తాపసుం డొక్కరుడు పరితాపమునను జోగి పదవిని ద్యజియించి భోగియయ్యె" ననుచు ప్రజలు ఇండ్లకు మరలిరి. ఇట్లీ కావ్యము సుఖాంతముగ ముగియును.

ఇది కరుణ రసాత్మకము మన ప్రాచీన ఆశ్రమ ధర్మములీ కావ్యమున సమర్థింపబడినవి క్రమముగ బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థాశ్రమములను ధర్మబద్ధముగ గడపి చివరగ సన్యాసాశ్రమమును స్వీకరింపవలయునను సనాతన ధర్మమిందు స్థాపించిరి. మనమున కత్తుకొనునట్లు సరళ సుందరముగ రచన సాగించిరి

పద్య రచనా శిల్పమున కవికౌశలము ప్రకటితమగును. మునీంద్రుని వర్ణనముతో కావ్యము ప్రారంభమగును మౌని వరునకు ప్రకృతితోగల తాదాత్మ్యమును చూపుటలో కవికి ప్రకృతిపైగల మక్కువ వ్యక్తమగును.

"వదులు చింకి కషాయ వసనంబు గెంజిగి
వేకువ పంజతో విశద పరఁగ
మోమున బురణించు బూదె క్రొందెలి దాలు
పల్లోత్పలములతోఁ బుఘడ సూప"

కవి లోకజ్ఞత, నిశిత పరిశీలనా దృష్టి ఎల్లెడల వెల్లడియగు చుండును.

భర్త దగ్గరలేని భార్య స్థితిని "తరువులేమి నోసరిల్లదు లత" వోలె, "ఉదధిలేమి నింకు నేరు" వోలె యుండునని పోల్చును

ఇట్టి కావ్యము వైవాహిక బంధములోని పవిత్రతను, దాంపత్య ధర్మమును చక్కగ చాటి చెప్పును

## 5. సంగ్రహ శాకుంతలము :

రచన 1914 స్ఫురణలు మహాభారతము, అభిజ్ఞాన శాకుంతలము. కథ ప్రసిద్ధము.

కథా నిర్వహణము కడు మెలకువతో సాగినది సుదీర్ఘమైన కథను సంక్షిప్త సుందరముగ మలచిరి మూల కథకు భంగము కలుగనీయక ముఖ్య సన్నివేశములను పరిహరింపక కథ నడిపిరి కొన్ని యెడల మహాభారత కథకు దగ్గరగా, కొన్ని సందర్భముల యందు అభిజ్ఞాన శాకుంతలమునకు సన్నిహితముగ రచన సాగినది. ఇందు గావింపబడిన మార్పులు కావ్య సౌందర్యము ఇనుమడింప జేసినవి

కథను ఆరంభించుటలోనే కవి క్రొత్త పుంతను త్రొక్కిరి చైత్రమానపు ప్రాతఃకాల వర్ణనముతో కావ్యము ప్రారంభమగును.

'కలకల రవంబెసగ మెలకువం గులాయములు
వెలువడు శకుంత కుల మలనత విదల్పన్'

అడవిలో పుష్పాన్వేషణకై వెడలిన కణ్వమహర్షికి శకుంతల దొరకుటతో కథ మొదలగుట వలన క్రమము కుదిరినది

శకుంతలా దుష్యంతుల ప్రథమ సమాగమము అభిజ్ఞాన శాకుంతలము నందు వలె గాక, భారతమునందువలె పర్ణకుటీరమున, అర్ఘ్యపాద్యాదుల నిచ్చుతరి జరుగును. దుష్యంతు డామెను గాంధర్వ విధిని పరిణయమాడ కోరినపుడు శకుంతల భారతమునందువలె ప్రౌఢగా గాక ఇందు అభిజ్ఞాన శాకుంతలము నందలి ముగ్ధవలె ప్రవర్తించును ఇచట శకుంతలయే స్వయముగ తన వృత్తాంతమును చెప్పినను ఒకే వాక్యములో అతి క్లుప్తముగ జెప్పుటలో ఔచిత్యము పాటింపబడెను

దుష్యంతునిచే తిరస్కృతయై శకుంతల తన దురదృష్టమునకు వగచునే కాని దుష్యంతుని ఒక్కమాట అయినను పరుషముగ పలుకదు. దీనివలన ఆమె

పాతివ్రత్యమునకు, సౌశీల్యమునకు, ముగ్ధత్వమునకు మరికొంత మెరుగు పెట్టబడినది. అంతియేగాక ఆమె ఔన్నత్యము ప్రకటితము

దుష్యంతు డామెను మరచుటకు గల ప్రధాన కారణము శాపము కావచ్చునని సూచనాప్రాయముగ జెప్పును అభిజ్ఞాన శాకుంతలము నందలి దుర్వాస శాప వృత్తాంతము ఇట పరిహరింపబడినది.

"నానాథు రాక ధ్యానించు బరాకు
నే ఋషి కాతిధ్య మిడగ మఱచితినో"

భర్త తిరస్కృతయైన ఆ సాధ్వి అభిజ్ఞాన శాకుంతలము నందువలె మారీచాశ్రమమున కేగాక, తిరిగి ముని కుమారులతో కణ్వాశ్రమమునకే వెడలును ఇది ఇందు చేయబడిన ప్రధాన మార్పు.

"అత్తిలు తప్ప పుట్టిలె
యెత్తరి సత్తనయాలకు నిరవగు ననుచున్" అని చెప్పి ఈ విషయము సమర్థింపబడినది.

అంగుళీయకము చూచిన వెంటనే దుష్యంతునకు శకుంతల స్మరణకు వచ్చి పశ్చాత్తప్తుడై విలపించుచు రాజ్యమును వీడి ఆమె నన్వేషించుచుండును ఇట్టి మార్పు వలన దుష్యంతున కామెపైగల అనురాగము మిక్కిలి గాఢమైనట్లు చూపిరి.

ఇట్లు కవి స్వతంత్రముగ చేసిన కొన్ని మార్పులు కావ్య సౌందర్యమునకు దోహదము చేసినవని చెప్పవచ్చును

వర్ణనలు :

ప్రకృతి వర్ణనలు కవికి మిక్కిలి ప్రీతి పాత్రములు అడుగడుగున ప్రకృతి లోని అందములను గని పరవశించుచుండును చైత్రమాసపు కాననశోభను కనుల ముందుంచిరి

'ఒత్తగు జొంపముల్ బలిసి యూపలనిల్చి లతాలవాలమై
మెత్తని పూలదాలికల మేలగు నీడఁ బొల్చు పెద్ద వృ
క్షోత్తమ పీటఁ జిప్పిలుచు నుండెడు దేనెల యుగ్గు లానుచున్
గుత్తుకలెత్తు కీరనవ కోకిల లాలన లాలకించుచున్'-

అల్లే చిన్నారి శిశువు శకుంతల వర్ణనతో అందాలు చిందు చిట్టిపాప మన ముంగిట ప్రత్యక్షమగును.

'ముడుగుచు విడదీయ ముడిగెడు కల్హార
కలికంబులనుఁ బోలు కరతలములు
కదియుచుఁ నెడలించఁ గదిసెడు జుంటి తే
నియతెరన్ దీపించు నెయలు మోవి'

రసము :

ఈ కావ్యము కరుణరస భరితము లలిత శృంగారము, విప్రలంభ శృంగార ములు ఇందు చోటుచేసికొనినవి

శకుంతల నత్తవారింటికి పంపు దృశ్యము కరుణరస భరితము "కనుల కొనలఁ దొణకు కంటినీరు తనదుకూలమునను దగనొత్తి యక్కున జేరదీసికొనుచుఁ జిబుకమెత్తి" అని కుమార్తె వియోగమునకు విలపించు కణ్వునిస్థితి మనమును కలచి వేయును.

'వంచిన లతలను, జెట్లను బెంచిన హరిణాల వేత్వేఁటుగ పై నుంచుడు' అని శకుంతల తపోవనమును వీడుతరి తండ్రి కప్పగించు సన్నివేశము హృదయమును ద్రవింప జేయును ఆమె దుష్యంతునిచే తిరస్కృతమై 'చేల చెరంగు మోము మఱు జేసుక బాష్పము గ్రుడ్ల గ్రుక్కు కొంచేల జనించితిన్ విధి యిదేమిటి వంచనమంచు' విలపించు దృశ్యము కంట నీరు దెప్పించును ఇట్లీ కావ్యమును కరుణ రసాత్మకముగ తీర్చిదిద్దిరి.

## 6. కవితాన్వేషణము

రచనాకాలము 1914 కథ కల్పితము. కవి కవితా కన్యక నన్వేషించుచు అడవిలో గోప కుమారులను చూచి ఆమెను గూర్చి అడుగుటతో కావ్యము ప్రారంభ మగును 'నాదు మాపులో చూపయి నాదు పల్కులను జొక్కపు బల్కయి... మాయమయ్యెనని' విచారించుచు తిరుగాడు చుండెను 'వలపుఁగత నొండు విని పింప వచ్చి నేయితిః యలయికను బండె నియ్యెడఁ దెలియ రారె' అని కవికి చెప్పి, ఆకలికి పలికిన పలుకుల నాలకింపుమని గొల్లవాడు కథ చెప్పును అ కథయే ఇందలి ప్రధానాంశము ఇది అమాయక రాజకుమారీ, రాజకుమారులు ప్రణయ గాథ, సుఖాంతము.

ప్రశాంత మనోహర ప్రకృతిలో, ఏకాంతమున, యౌవనములో నున్న

నాయికా నాయకులు ప్రథమ సమాగమములోనే ఒకరిపై నొకరు అనురాగ మనస్కు లగుదురు. ఆ యువకుడామెను గొల్లెతగ భావింపగ ఆ యువతియు నట్లే ప్రవర్తించినది. ఆ సాన్నిహిత్యమా యిరువురి మధ్యను ఆత్మీయతను పెంపొందింప జేయగ అతడు తానొక రాకుమారుడనని వెల్లడి చేయును.

'ఇంతలో నేగు దెంచితివంత యీవిట్లు నా తోంటి
ఫలమనగ పూవనగ పరమైత్రిపై నాకు
లలిత జీవనమిమ్ము లలితాంగి
నేను నీకు సహవాసినై యుందును
సంతతము మనమిందు సహర్షిక
మందలను సను గమించు చుందుమని'

ఆమెను వేడగ ఆ రాచ పట్టి అందుల కంగీకరించును. ఆ ప్రకృతియే సాక్షిగ వారి పాణిగ్రహణము జరుగును వారు నాగరిక ప్రపంచమునకు దూరముగ ప్రకృతిమాత బిడ్డలుగ ఆ యడవిలోననే నివసించుటకు నిశ్చయించుకొందురు.

నిర్వహణ :

ఈ కావ్యమున అడుగడుగున కవికి ప్రకృతిపై గల ప్రేమ, మమకారము, ప్రకృతి సౌందర్యమును గాంచి పరవశించుట గోచరించుచుండును ఇతి వృత్త మంతయు నూతన భావములతో నిండియున్నది.

వర్ణనలే ఈ కావ్యమునకు పట్టుగొమ్మలయినవి అడవిలోని విసర్గ సౌందర్యమును చక్కగ వర్ణించిరి.

"తెల్లని తేటవెన్నెలలఁ దెల్విని జల్వను దేలు కల్వ సం
పుల్ల కుడుంగ రాజముల ముచ్చటఁ జేరు చకోర దంపతుల్
మెల్లన నొత్తిగిల్లు, పరమిత్రు వికాస యోగ భారము
దల్లముడుంగు కంజ కలికాంతరముల్ గొసరించు తేనెవు
త్రిల్లిన భృంగభృంగినులు దిగ్గున రేకులఁ దొంగి చూచెడున్."

ఘోర కానన సీమను కనులకు కట్టినట్లు వర్ణించిరి

"కుటిల కఠోర కంటకని కుంజపుఁ బూవులరేకు మెత్తనల్
చటుల భయంకరార్భట విచంచలమౌ హవిణింపు నేత్రముల్"

అంతఃపురములో లేని సోయగములన్నియు ఆ కాననమున గలవని రాజ కుమారిక పరవశించును.

"చిగురుంగొమ్మల నుయ్యేలెక్కి పికముల్ సేవించు సద్గీతికన్
బగులం బండిన పండ్లమెక్కి శుకముల్ భావించు సంభాషణన్"

ఇట్టి కావ్యము స్వచ్ఛంద ప్రణయమును చాటుచు, ప్రకృతి వర్ణన లెల్లెడల నిండియుండి వర్ణనాప్రధానాత్మకముగ నున్నది కవికి గల ప్రకృతి ప్రియత్వమును చాటుచున్నది

ఇట్లు వీరి లఘు కావ్యము లన్నియు రసమయములై యొప్పుచున్నవి.

# ఆ ధ స్సూ చి క లు

1 అనుబంధము—1

2 కవికొండలవారి షష్ఠిపూర్తి మహోత్సవము — మహోదయ శుభాకాంక్షలు, మహోదయ జూలై 18, 1952

3 నేను — కవికొండల వెంకటరావు (వ్రాతప్రతి)

4. శ్రీ కవికొండల వెంకటరావుగారు—చేకుమళ్ళ కామేశ్వరావు, కిన్నెర, ఆగస్టు 1952

5. కవితా రచనోన్మాది కవికొండల—కృష్ణాపత్రిక, ఆగస్టు 9, 1952

6. అరువదేండ్ల కవి—కవికొండల వెంకటరావు—న్యాపతి కృష్ణారావు, షష్ఠిపూర్త్యుత్సవ సంచిక

7. షష్ఠిపూర్తి సభలో కవి సమాధానము— వ్రాతప్రతి

8. ఆస్వాల్డ్ కూల్డ్రే గురువు—అడవి బాపిరాజు, కిన్నెర, అక్టోబరు 1950

9. సౌత్ ఇండియన్ అవర్స్—అస్వాల్డ్ జె. కూల్డ్రే

10. ప్రకృతి చందనము—ప్రబోధసూక్తిలోని కళాశాల గీతిక - కవికొండల వెంకటరావు.

11. వర్డ్స్‌వర్త్ ఇన్ ఆంధ్రా— అస్వాల్డ్ జె కూల్డ్రే, బేకన్

12. నేను వ్రాసిన వేమిటంటే ఖండ కావ్యాలు—కవికొండల వెంకటరావు, దేశసేవ, ఫిబ్రవరి 1948

13. ఖండకావ్యము సింహావలోకనము—కవికొండల వెంకటరావు, భారతి, అక్టోబర్ 1949

14. ప్రకృతి చందనము—కళాశాలా గీతిక—కవికొండల వెంకటరావు.

15. సావనీర్ 1853—1953, 100 years Progress of Govt Arts College Rajahmundry.

16. కవికొండల సూక్తులు—వ్రాతప్రతి

17. కవికొండల కవితలో తత్త్వము — కవికొండల వెంకటరావు, హిందూ సమాజము రాజమండ్రి సభలోని ప్రసంగమునకు వ్రాతప్రతి

18. నేను వ్రాసిన వేమిటంటే—నవలలు, నాటకాలు, ప్రబంధం—కవికొండల వెంకటరావు, దేశసేవ, మే 1952

19. అనుబంధము—2

20. అనుబంధము—3

21. వ్రాతప్రతి

22 అనుబంధము—4

23 పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వం—దేవులపల్లి కృష్ణశాస్త్రి, 1940 భారతి, రజతోత్సవ సంచిక

24 శ్రీశ్రీ సాహిత్యం, రెండు, వచన విభాగం—శ్రీశ్రీ, పు-528

25 కవి కొండలవారి బాలగీతావళి— అదుర్తి భాస్కరమ్మ, కవికొండల షష్టి పూర్త్యుత్సవ సంచిక

26. కవికొండలవారి ఘనత—పోడూరి రామచంద్రరావు, త్రిలిఙ్గ

27. కవికొండల వెంకటరావుగారి కవిత్వం—శ్రీ పిలకా గణపతిశాస్త్రి, భారతి విజయపుష్యము

28 కవికొండల కవిత్వం—కొత్తపల్లి వీరభద్రరావు

29 హరివినోదము, పీఠిక—ప్రకాశకులు

30. కవికొండలవారి రచనలు—భువనగిరి లక్ష్మీకాంతమ్మ, సౌభాగ్య, ఆగస్టు 1952

31. కవికొండలవారి, మూడు శతకాలు—కనుపర్తి వరలక్ష్మమ్మ, కవికొండల షష్టిపూర్త్యుత్సవ సంచిక

# నవ్య కవిత్వము

## 1. ఉపోద్ఘాతము

నవ్యకవిత్వోద్యమము ఇరవయ్యవ శతాబ్దముతో ప్రారంభమైనది. ఆంగ్ల కాల్పనిక ప్రభావముతో ఈయుద్యమము ఆంధ్రదేశమంతటను వ్యాపించినది.

ఈ నవ్యకవిత్వములో ప్రధానశాఖలు రెండు 1. భావకవిత్వము. 2.అభ్యుదయ కవిత్వము. 1940వరకు భావకవిత్వ ప్రభావమునకు లోనుగాని కవిలేడనిన అతిశయోక్తికాదు.ఈ శాఖకు ఆద్యులైన రాయప్రోలు వారు తన'రమ్యాలోకనము అను గ్రంథములో భావకవిత్వ లక్షణములను నిర్దేశించిరి

'భావము యొక్క స్వభావము' భావకవిత్వమని కవికొండలవారు మొదటగా నిర్వచించియున్నారు.[1] భావ ప్రదానమైనది భావకవిత్వమని వీరి అభిప్రాయముగ డోచుచున్నది "వేంకటరావుగారి నిర్వచనముఅత్యుత్తమము అగాథమునైయున్నది." అని పాటిబండ మాధవశర్మగారు తెలిపిరి [2]

భావకవిత్వ ప్రవాహములో ఆంధ్రదేశము మూడుదశాబ్దములపాటు మునిగి తేలినది రాయప్రోలు, వేంకటపార్వతీశకవులు, దువ్వూరి, పింగళి, కాటూరి, బసవరాజు, నండూరి, కవికొండల, కృష్ణశాస్త్రి, వేదుల, విశ్వనాథ,నాయని మున్నగువారు భావకవులుగ ప్రసిద్ధిగాంచిరి

కవికొండల వెంకటరావుగారు పందొమ్మిదవశతాబ్దాంతముల్లో జనమ్మనంది, ఇరువదవ శతాబ్దములో పెరిగిరి కనుక వీరిపై ఆ శతాబ్ద ప్రభావ మధికముగకలదు భావకవిత్వము ఆంధ్రసాహిత్యమున మొలకెత్తు దినములలోనే కవిత్వమును వ్రాయుట కారంభించిరి. సమకాలిక సాహిత్యవేత్తలలో తమకొక విశిష్టస్థానము నేర్పరుచుకొనిరి.

---

1-భావకవిత్వము-కవికొండల వెంకటరావు. ప్రబుద్ధాంధ్ర, జూలై 1943

2-అధునికాంధ్ర భావకవిత్వ తత్త్వము-పాంటిబండ మాధవశర్మ, పుట, 43

'అంతియేగాక తెనుగుకవిత్వమును క్రొత్తదారులలో నడిపించడమునకు ప్రయత్నించిన భావ స్వాతంత్ర్య ప్రియులలో తొలుదొలుత బయలుదేరినవారిలో వెంకటరావుగారొకర్కరు" అని ప్రఖ్యాతి గాంచిరి.[1]

కవికొండలవారు 1910వ సంవత్సరములో రచనలు చేయుట కారంభించి; అనతికాలములోనే భావకవిత్వపు శాఖలన్నిటిలోను కవితలను వెలయించిరి.

వీరి నవ్యకవిత్వము తొమ్మిది విధములు. అవి దేశభక్తి, ప్రకృతి,ప్రణయ, జానపద, గ్రామీణ, స్మృతి, ఆధ్యాత్మిక కవిత్వములు, బాలవాఙ్మయము మరియు ప్రకీర్ణకములు.

## 2. దేశభక్తి కవిత్వము

స్వాతంత్ర్యోద్యమ ప్రభావముతో తెలుగుసాహిత్యమున వెలసినది దేశభక్తి కవిత్వము. మనదేశమునకు స్వాతంత్ర్యము రాక పూర్వము సమాజము యావత్తును చైతన్యవంతమై స్వేచ్ఛకొఱకు అలమటించినది. అప్పుడు కవులుకూడ ఉత్తేజితులై, జాతి జాగృతికి వైతాళికులైనారు. దేశనాయకుల బోధల ప్రభావము వలన నవ్యసాహిత్యములో దేశాభిమానము పొంగులెత్తినది. ఆనాటి రాజకీయ, సాంఘిక సమస్యలు దేశభక్తి కవిత్వములో వ్యక్తమైనవి. ఇది రెండు విధములుగ జాతీయభావ ప్రబోధకమైనది. రాష్ట్రాభిమానమును ప్రకటించునదిగనున్నది

ఇట్టి కవితలను పలువురు ప్రముఖకవులు రచించిరి. వీరిలో గణనీయులు కవికొండల. వీరు దేశాభిమానముతోను, రాష్ట్రాభిమానముతోను పెక్కు గేయము లను రచించిరి. "దేశభక్తికి, దేశాభివృద్ధికి సంబంధించి 1947 నాటికి 100 గీతిక లకు పైగా వ్రాసితిన"ని వీరు చెప్పుకొని యున్నారు [2]

'మాతృదేశ సంకీర్తనము' అను పుస్తకమును వీరు 1927లో ప్రచురించిరి. ఇంకను 'కవికొండల గేయాలు, కవికొండల గీతాలు, చిట్టికైత, వివిధకుసుమావళి, ప్రకృతీ పాంచజన్యము,' మున్నగు సంపుటములలో గూడ దేశభక్తికి సంబంధిం చిన గీతికలు పద్యములు కలవు. కొన్ని 'భారతి', 'కృష్ణాపత్రిక' మున్నగు పత్రికలలో ప్రచురింపబడినవి. మరికొన్ని అముద్రితములు కలవు

1-ఆత్మవ్యక్తి— ప్రబోధసూక్తి, సుజనరంజని
2-నేను వ్రాసిన దేమిటంటే—ఖండకావ్యములు—కవికొండల

'మొదటి ప్రపంచయుద్ధం అయిపోయి సత్యాగ్రహోద్యమం ప్రారంభమయి, ఎటు చూచినా స్వతంత్రతను గుఱించిన శంఖమే పూరింపబడినది. నాలో దేశభక్తి గీతిక పొడసూపింది ' అని కవి కొండలవారు తెలిపిరి.

1. జాతియాభిమానమునకు సంబంధించినవి :

భారతదేశాన జన్మించడమే తన పూర్వజన్మ పుణ్యముగ భావించి కవి పులకించును.

"నాపూర్వజన్మ సువాసన కొలది
నా పున్నెముల పంట నాణెంబు కొలది
భారతదేశాన ప్రభవించినాడ"

మనదేశమే ప్రపంచమున శ్రేష్ఠమైనదని, అట్టిభూమి మరి ఎందును లేదని గర్వించును.

"ధర ఎచ్చోటనైన దారసిలునె
యిట్టి వరధరరాజి ఎన్నదేని"

అంతియేగాక 'దీని మఱువనేర నే నిమిషము' అని ఎందున్న 'నిందు పొందెడు నానందమందనేర' నని కవి భావించును.

"చప్పన్నదేశాలనొప్పైన దేశంబు నాతల్లి
దేశంబెగా–ఓయమ్మ నేమన్న దేశంబె" అని తలంచును.

"పీదు పాదయుగళమేది నీరవ నిత్యాభిషేక శీకర శీతలంపు ద్రోవి" అని మాతృభూమిని కీర్తించును.

భారతదేశము రత్నగర్భయని, పాడిపంటలకు నిలయమైనదని—

"ఏనుపుట్టినట్టి యీదేశమెట్టిది
సారమైన మట్టి చాలగలది" అనుచు తనదేశ విశిష్టతను తలచి మురిసి పోవును.

"నాదు జన్మభూమి యేదివ్యలోకమో
కొలనుకొండ కమమ పొలము వెలసి
యూహాలుప్పతిల నుత్సాహమెసగించి
మేళవింపఁజేయు మేలుపల్కు–" — అని స్వర్గంకంటె మిన్న అయిన తన జన్మభూమియే తన్ను కవిగా తీర్చినదని భావించును. కొండలు, కొలకులతో మనో హరమై ఒప్పు తన గ్రామమనిన కవికి ప్రాణము.

జన్మమిచ్చిన జననికన్న జన్మభూమియే మిన్న అని వీరి తలంపు.

"మట్టిలోన బడిన మాయమ్మ నను గొట్టు
పడిన దానికంటె పడిగ దగుల
అమ్మకంటె మాతృదేశమునకె దయ

లెక్కుడంచుఁ దలతు నిక్కువముగ" — అని లోక మెరుగని పసిబాలుడు తల్లి కంటె పుడమితల్లియే గొప్ప అని భావించుట బాలబాలికలలో దేశభక్తిని జాగృతం చేస్తున్నది.

'మాతృదేశ స్తవము' అను గేయము వీరి దేశభక్తిగీతికలలో ప్రముఖ స్థానము నాక్రమించుచున్నది

—"నమో నమో జయః భరత మహాశయః సఫలోదయమంజులహాసీ
"మాతృస్థానే పుణ్యస్థానే సేతు హిమాచలః మధ్యస్థే
గంగాసింధుర్దక్షిణ గంగాకృష్ణాలహరీః కావేరీ"—అను చరణములలో
దేశమునందలి నదుల స్తవము గావింపబడినది

అట్టిదే మరియొక గీతము "జాతీయగీతిక" ఇది పాఠశాలలయందు బాలికలకు ఆనాడు నేర్పినారు. కవికొండల అనేక జాతీయోత్సవములలో ఈ గీతము పాడినట్లు దీనిని కాంగ్రెసు వారు తమ "మాతృదేశ స్తవము" అను పూర్వనందు చేర్చుకొనిరని వీరే తెలిపిరి. [1]

"హిమగిరి శిఖరము వింధ్యవసీంద్రము
కన్యా కుమారీ పద డిండీరము
స్ఫురితము, భరితము, చలితోల్లలితము
స్వాతంత్ర్యముచే, స్వాతంత్ర్యముచే
స్వాగతమనవోయి — కని పని వినవోయి
మనవోయి అనవోయ్ — జయ్ జయ్ జయ్"

—పై గేయము ఆకాశవాణి ద్వారా పలుమార్లు ప్రసారితమగుచున్నది.
తనమాతృదేశము రమ్యమైన నివాసమని తలచును.

---

1. నేను వ్రాసిన వేమిటంటే — గీతికలు — కవికొండల

"మమ్ము గన్న మాతృదేశమా ।
రమ్యమైన మా నివాసమా ।
భాగీరథి యమున సింధు
గోదావరి కృష్ణవేణి
కావేరి నర్మదమును
నదుల కెల్ల తావలమగు
నీ హృదయం బెవరి కెరుక
నీ సుతులకె నీ సుతులకె"

ఇందు మాతృదేశపు రామణీయకత. శ్రేష్ఠత భరతమాత పుత్రులైన తమకు తప్ప అన్యులకు తెలియదని భావించును.

హిమాచలము మొదలు కన్యాకుమారి పర్యంతము గల భరతభూమిని కన్నులార వీక్షింపవలయునను కాంక్ష కవికి గలదు. కాని అది సాధ్యము కాకున్నను మనో వీధిలో ఆయా ప్రదేశములు కవికి సాక్షాత్కారించును.

'హిమవన్నగముల నేనెన్నడు గనుగొనలేదు
కానీ మోహన దృష్టికి - ఓహో యనఁ బొడసూపెడు
నీ హారపు సిత కాంతుల మెఱసెడు నరుణోదయము
సింధు నదంబున నేనెన్నడు గ్రుంకిడలేదు
కానీ దేహ స్పర్శకు - ఓహోయనఁదగులుచుండె'

దేశమాత స్వరూపమును కథవలె కన్నులకు కట్టునట్లు చెప్పి బాలబాలికలలో దేశభక్తిని జాగృతము గావించును.

"మంచులోనేముంది మా యమ్మకాన ।
రతనాల రాసులు రారా కుమార ।
సంద్రాన నేముంది మా తల్లికాన ।
ముత్యాల మల్లెలు ముద్దుల సుతుడ ।
నదులలో నేముంది మా యమ్మ కాన ।
మధురాంబులహారి రా నా కన్న సుతుడ ।

క్షేత్ర ప్రశస్తి దేశభక్తి కవిత్వములో నొకభాగము ప్రసిద్ధికెక్కిన పుణ్యక్షేత్రములను ప్రశంసించుచు కీర్తించుచు దేశాభిమానమును రేకెత్తించుట చూడవచ్చును.

"కోటిలింగ క్షేత్రవాటి భద్రాద్రిని
గౌతమీతోయ ప్రపూత లహరి
శ్రీరంగమయ గావేరీ విలాసమ్ము
రామేశ్వరమున నగ్రంపుశోభ
తిరుపతి కొండను వరవారి పాతంబు
సింహాచలంబునఁ జిన్నసొగలు"

అట్టి పుణ్య భూమికి దాస్య విముక్తి కలిగింప వలయునను ఉత్కంఠ ప్రజలలో కలుగును.

అట్లే కాలప్రవాహములో కనుమరుగైన వీరులను తలంచి వారి త్యాగశూరతను ఆదర్శముగ చూపుట కూడ ఇందులోని భాగమే మహారాష్ట్రవీరుడైన శివాజీ స్థైర్యమును, అకుంఠితమైన దేశభక్తిని సరళ శైలిలో బాలల కొరకు రచించిరి

"శివాజి యను నొక - మరాటివీరుడు
అరంగజేబుకు - చేఁజిక్కెన్
మొగల్ నవాబగు - అరంగజేబు
శివాజి వీరుని - ఖైదుంచెన్"

"ఉయ్యాలా! దంబాలా! భారత నవజీవన బాలా!
పూరిత సత్యాగ్రహశీలా! పరిభవ దుఃఖిత పాంచాలా!
తొలినాటి వేదాలు—పులివోని చనుబాలు
మలినాటి కావ్యాలు-ఊకొన్న వాక్సుధలు"

భారతదేశ విముక్తి కొఱకుద్దేశింప బడిన ఈ గీతిక హిందూ సాంస్కృతిక పునరుజ్జీవనమునకు దారి జూపుచున్నది. దీని నడక మన జానపదగేయములలోని దంపుడు పాటల రీతిలోనున్నది.

స్వాతంత్ర్యము కొరకు కవి మనస్సు తపించిపోయినది.

"సంద్రంపుదరగపైని-జాబిల్లి నురుగుపైని
స్వాతంత్ర్య మూగుచుండె-ఉయ్యాల దూగుచుండె
ఆకసపుఁ జుక్కలోన-అవనిగల మొక్కలోన
స్వాతంత్ర్య మెసగుచుండె-మిస మిసలు కొసరుచుండె"

అని స్వాతంత్ర్యము వచ్చినట్లు మురిసిపోవును

జాతీయ పతాక మన స్వాతంత్ర్యమునకు, జాతీయతకు ప్రతీక. దేశము కొఱకు అసువులు బాసిన మహనీయుల ఆత్మార్పణమును తెలుపు మన జండాను జూచి కవి రక్తముప్పొంగి దాని ప్రతిష్ఠనిట్లు గానము చేయును.

"కవులు కఱవులు దీర నిను గన-కఱవులెల్లను దీరినటు
విన వచ్చుచున్నది రాటపుంరుతి-విచ్చుచున్నది సేవకాభృతి
నడుము కట్టుక నిన్ను జేకొన-భేదభావము బాసినటు మన
మూగుచున్నది జాతితత్వము-మానుచున్నది బానిసత్వము
సుప్రతిష్ఠ వహింపుమమ్మా! భారతక్షేత్రాన నిలుమా!
చరక చిత్రిత వరపతాకమ! శాంతి రంగపు జాడిక్కైకమ"
స్వేచ్ఛా స్వాతంత్ర్యములను చాటునది జాతీయపతాకయే యనును.

"కోటి సూర్య ప్రభల కాంతిని
కోటి కొండల యెత్తుకెత్తు
ఒక్క జెండా యుర్వి కంతకు
అంటు నిక్కపు స్వేచ్ఛ"

జాతీయ పతాకలోని అశోకచక్రపు ప్రాశస్త్యమును క్రింది గీతిక చాటుచున్నది.

"అశోక చక్రం-పరాక్రమంతో- పురాక్రమంగా
స్వరాజ్య దీధితి వెలిసింది."

కవి కొండల గాంధీ సిద్ధాంతములకు ప్రభావితులై రాట్నముపై పలు గేయముల నల్లిరి. వానిలో ఇద్దరు ప్రయోజనములను తెలుపు క్రింది గీతము ప్రసిద్ధి కెక్కినది.

"ఓ చిన్ని రాటమా! ఒయ్యారి రాటమా!
ఒప్పైన రాటమా! వడివడి వడుకు
మమ్ము గన్నా మా తల్లి మా తల్లి దేశంపు
మర్యాద నిలుపంగ వడివడి వడుకు
నీ బట్ట గట్టేరు వడివడి వడుకు
జాబిల్లి కిరణంపు జందాన సాగెడు
నీ దార మెంతురు వడివడి వడుకు"

"రాట్నమును గురించి భావకవులలో చక్కని గీతములు రచించిన వారు వీరు" అని నారాయణ రెడ్డిగారు తెలిపిరి [1]

"పాశ్చాత్యమ్ మోహాంధమ్-ప్రాచీనమ్ ప్రియబంధమ్
ఆధ్యాత్మమ్ కల్యాణమ్- స్వాతంత్ర్యమ్ శతమానమ్"

అని పాశ్చాత్య మోహము తగదని, ప్రాచీన ఆధ్యాత్మిక సంపదయే మన వారసత్వమని బోధించును,

ఉప్పు సత్యాగ్రహమును గూర్చి "వరుణదేవ తరుణ మిది పూరించు పెద్ద సంకు" అని దేశభక్తిని ప్రబోధించిరి.

జాతీయోద్యమ ప్రభావముతో ఆయా సన్నివేశములకు స్ఫూర్తి నొంది వీరు పలుగేయములు రచించిరి.

"అజన్మాంతపు హక్కు- స్వతంత్రము
ఊహాపోహల ఉక్కు- స్వతంత్రము
ఆత్మోద్ధరణకు దిక్కు- స్వతంత్రము
మాతృదేశమున కది యేనాడో"-ఇది 'స్వరాజ్యము నా జన్మహక్కు' అను తిలక్ వినాదమును ప్రచారముచేయును

## 2. రాష్ట్ర సంబంధిగేయములు :

స్వాతంత్ర్యోద్యమ కాలములోనే ప్రత్యేక ఆంధ్రరాష్ట్రము కొరకు ఆంధ్రులు ఆందోళన ప్రారంభించిరి. దీని ఫలితముగ తెలుగునాట రాష్ట్రభక్తి కవిత్వము వెలసినది.

ఆంధ్రులకు మార్గదర్శకులై, నూతనోత్తేజమును కలిగించిన వారిలో కవి కొండల పేర్కొనదగినవారు. ఆంధ్రభాషయనిన, ఆంధ్రదేశమనిన, తాను పుట్టిన స్వస్థానమనిన వీరికెంత ప్రేమయో, అభిమానమో వీరి కవితలు అడుగడుగున చాటు చుండును.

'గంటంబెక్కడ-తాటాకెక్కడ
ఆంధ్రుని కవులు-నన్నయ్యెక్కడ

---

1- ఆధునికాంధ్ర కవిత్వము- సి నారాయణరెడి, పు-389

తిక్కన యెక్కడ-ప్రగ్గడ యెక్కడ
—అని ప్రాచీనకవులను,
'కత్తియెక్కడ-కటారుయెక్కడ'
—అని ప్రాచీన శూరుల పౌరుషమును, శౌర్యమును,

'శ్రీశైలంబెక్కడ-ముఖలింగంబెక్కడ' అని పవిత్ర పుణ్యక్షేత్రములను స్మరించుట ద్వారా కవి ఆంధ్రులకు ప్రాచీన వైభవమును స్మృతికి దెచ్చును.

'అందం బెక్కడ చందం బెక్కడ
ఆంధ్ర వధూటికి అరచాపెక్కడ
ఆంధ్రావని శ్రీమహాలక్ష్మికి హారతిపట్టుక
మేల్కొలు పందోయి మేల్కొలు పందోయి'

-అని జాతికి నూతనోత్తేజమును కలిగించును. పై గేయమును గూర్చి కవి కొండల ఇట్లు తెలిపిరి.

"ఈ గేయము ప్రజాశక్తిలో 1946 లో ప్రకటింపబడినది మా సరస్వతీ మందిర సమావేశమందు పాడగా నామిత్రులొక కొందరిని పరవశుల్ని గావించింది"[1]

'తెనుఁగు తెలివికై - తెనుఁగు కలిమికై
పట్టిన పట్టు విడిచి పెట్టకురా
పుట్టిన దిచ్చట పెట్టేదిచ్చట
మట్టైతే మన నాగావళికిన్
తుంగ భద్రకున్ మధ్యనుగల
అమర లోకమున'

-అని ప్రత్యేక రాష్ట్రము సాధించువరకు ప్రతిఆంధ్రుడు పోరాడవలయునని చివరకు ప్రాణములను సైతం మర్పించుటకు వెనుదీయరాదని ఉద్బోధించును.

తెలుగు భాష కంటె మిన్నయైన భాషలేదని దానిపై తన మమకారమును వ్యక్తీకరించును మన భాషయొక్క గొప్పతనమును ప్రతి ఆంధ్రుడు చాటి చెప్ప వలయుననును

---

[1] నేను వ్రాసిన వేమిటంటే గీతికలు-కథికొండల

'తెలుగులో లేనట్టి దేమిటి?
తెలుగులో రానట్టి దేమిటి?
తెలుగు తల్లికి దోసిలొగ్గి
తెలియఁ బల్కుమురా
తేనెచినుకులు చిలకరించుమురా
జ్ఞానమార్గము లలంకరించుమురా'
'బాలచంద్ర బల్ రంగారావు వెంగళరావు
పాపారావూ బళాబళీ'–

–అని అలనాటి పలనాటి, బొబ్బిలి వీరుల పరాక్రమమును కీర్తించి ఆంధ్రుల వీరత్వమును జాగృతము చేయును.

'కృష్ణరాయల కీర్తిన్ కాంతకు
పోతనాదుల పుట్టు కయితకు
త్యాగ రాయల రాగ సుకృతికి
మంత్రియుగంధర్ మంచి యుక్తికి
ఆట పట్టయినట్టి భూమికి
ఏకనామంబి డదగున్
ఆంధ్ర రాష్ట్రింబనదగున్'

ఇందుకళలకు కాణాచి అయిన మన భూమియంతయు ఆంధ్ర రాష్ట్రముగా ఏర్పరచవలయునను

ఆంధ్ర రాష్ట్ర మవతరించిన శుభ సందర్భములో కవి ఆనందోత్సాహములతో

'ఆంధ్ర అక్షర దీప్తి దిగువన్
ఎగువ సింహత్రయీ శిఖరం
నడుమ బుద్ధుని ధర్మ చక్రం
గడప అమరావతీ ద్వారం
ప్రజ్ఞగొలుపున దోహా: చిరతర
పూర్ణ కుంభం: శుభారంభం

మూర్తి రూపం! ముద్రనీదీక
వర్ధిల్లుము మాతా! ఆంధ్ర మాతా!'
అని స్తోత్రము చేయును

ఆంధ్రరాష్ట్రమును సాధించినంత మాత్రమున తృప్తి జెందకూడదని, ఆంధ్రుల సంస్కృతిని ఉన్నతశిఖరముల నధిరోహింప చేయవలయునని ఆంధ్రులకు కర్తవ్యము నుపదేశించును

'విద్య మా లక్ష్యం
విజ్ఞానం మాలక్ష్యం
అజంతా సంస్కృతి మా లక్ష్యం
గోల్కొండ సంపద మా లక్ష్యం'

ఆంధ్రుల ఆకాంక్షకు ఫలితముగా వెలసిన రాష్ట్రము తన ప్రాంతముల నెన్నింటినో కోలుపోయి అసమగ్రముగ నున్నదని విలపించును.

'రాయల రాజ్యము మాయము కాగా
కుడి చేయి విరిగిన చొప్పయ్యావు
తంజావూరున అరవం గ్రమ్మ
నోరడి పోయి మూగై పోయావ్
ఉరియాకు గంజామును గూర్చ
శిరమే త్రుంచుకు పోయిందిస్మీ
మొండెము తుండెముల లాగున్నాయి
దత్తమండలం - ఉత్తర సర్కార్
తెలుగు తల్లి! నిన్నేమని కొలుతు?
తెలుగు తల్లి! నిన్నేమని పిలుతు?'

ఏనాటికైనను ఆంధ్రులు నివసించు ప్రాంతములన్నియును ఒక గూటి క్రిందకు చేరవలయునని వీరి ఆశయము.

ఇట్లు దేశభక్తి కవిత్వము ఆంధ్రప్రాంతమున వెలసిన తొలిదినములలోనే కవి కొండల ఇట్టి కవితలను వెలయించిరి జాతీయ సంబంధి గీతములలో రాట్నమునకు సంబంధించినవి, జాతీయ పతాక ప్రాధాన్యమును తెలుపునవి, మాతృ

భూమి ఔన్నత్యమను తెలుపునవి గలవు, అట్లే రాష్ట్ర సంబంధ గేయములలో గూడ పలు విషయములను స్పృశించిరి. ఈ విధముగ వీరు స్వాతంత్ర్యోద్యమమునకు ఇతోధికముగా సేవచేసిన కవులలో గణనీయులని చెప్పనగును.

## 3. ప్రకృతి కవిత్వము

ప్రకృతిని గూర్చి చెప్పు కవిత్వము ప్రకృతి కవిత్వము. ఇది నవ్య కవిత్వములో ఒక ప్రధాన శాఖ. ఆంగ్లవాఙ్మయ ప్రభావితులైన అధునిక కవులు ప్రకృతిని ఆత్మానుభూతిని, స్వీయ సుఖదుఃఖములను వెలిబుచ్చుటకు ఆలంబనముగ గ్రహించిరి

ఆంగ్ల వాఙ్మయమున కాల్పనికోద్యమ ప్రభావితులైన కవులలో, వర్డ్స్ వర్త్, కాల్‌రిడ్జ్ ప్రకృత్యుపాసకులుగా పేరుగాంచిరి అధునిక కవులలో పలువురిపై వర్డ్స్‌వర్త్ ప్రభావము కలదు. ప్రకృతిని అనుస్యూతముగ వచ్చుచున్న సంప్రదాయ దృష్టితో గాక భావనారమ్యముగ పరిశీలించుటకు వర్డ్స్‌వర్త్ పద్ధతి. మానవునిలో సైతము ప్రకృతి స్వరూపము నితడు దర్శించెను. ప్రకృతి ప్రీతి, ప్రకృత్యారాధనము కాల్పనిక కవిత్వమునకు ప్రధాన లక్షణములు ఇట్టి ప్రకృత్యారాధనము చేసిన కాల్పనిక కవులలో వర్డ్స్‌వర్త్ ప్రథముడని చెప్ప వచ్చును. ప్రకృతిలోని ప్రతి వస్తువు భగవంతుని సందేశము నందించునట్లు అతనికి గోచరించెడిది వానినన్నిటిని అతడు కవితా వస్తువులుగ స్వీకరించెను

ఇట్టి కవిత్వ ప్రభావమునకు లోనైన అధునిక కవులు ప్రకృతిని తన కావ్యమునందొక భాగముగనే కాక దానిని కావ్యవస్తువుగ స్వీకరించి కవితలల్లిరి. కొద్దిగనో, గొప్పగనో ప్రకృతి కవితలను వెలయించని అధునిక కవి లేడన్న అతిశయోక్తి కాదు ప్రకృతియే తాము, తామే ప్రకృతియగుటకు వీరు ప్రయత్నించిరి వీరు ప్రాచీన ప్రబంధకవులకు వలెనే కోకిలను మలయానిలుని, చంద్రుని, సూర్యుని వర్ణించినను భేదముకలదు, వీరి వర్ణనలు ఆత్మాశ్రయములు, వారి వర్ణనలు వస్త్వాశ్రయములు అనవచ్చును

అధునిక కవిత్వమునకు ఆద్యులైన గురజాడ, రాయప్రోలు ప్రకృతి గీతములకు నాంది పలికిరి. వేంకట పార్వతీశ కవులు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, దువ్వూరి రామిరెడ్డి, అడవి బాపిరాజు వంటి భావకవులు ప్రకృతిని ఆరాధించి దానిలో

తాదాత్మ్యము చెందిరి. ఇట్టి వారిలో కవికొండల వెంకటరావుగారు ప్రకృతి కవిగా ప్రత్యేక స్థానము ఆక్రమించిరి.

కవికొండలవారికి ప్రకృతిపైగల ప్రత్యేక అభిమానమును గుర్తించిన వీరి గురువు ఆస్వాల్డ్ కూల్డ్రేగారు వీరిని ఆంధ్రా వర్డ్స్‌వర్త్ అనిరి.[1]

ప్రకృతి సోయగములను గాంచిన మానవునిలో కలుగు చైతన్యమే వీరి దృష్టిని ప్రకృతి వైపుకు మరల్చినది. వీరు శ్రీరంగ పట్టణపు కొండలలో జన్మించిరి చుట్టును కొండలు, కొలకులు, పల్లెలు, పొలములు, కలవు. ఈయన పుట్టి పెరిగిన పరిస్థితులు, వాతావరణము, పల్లీయులతోగల సన్నిహిత సంబంధములు. దేశీయ సంప్రదాయములపై మక్కువ వీరి ప్రకృతి కవితకు ప్రేరణము లైనవి. ప్రకృతిని తనధ్యేయముగ, పరమార్ధముగ వీరు భావించిరి. ప్రకృతిని పలు కోణములలో పరిశీలించి, వర్ణించి ధన్యత నొందిరి.

సూర్యోదయ వర్ణన :-

అనాది కాలమునుండిమానవునికి లోకమునకు వెలుగును ప్రసాదించు సూర్య భగవానుడు ప్రత్యక్ష దైవమగుచున్నాడు. ఆ ప్రభాకరుని సూర్యోదయ శోభలు, సంధ్యాకాలపు సోయగములు కవుల మనములను అలరింపజేయుచునే యున్నవి. కవికొండల ఇట్టి వర్ణనలను పలు సందర్భములలో చేసియున్నారు.

'వేగుచుక్క పొడిచి వెలవెలబాతె  
బళ్ళున తెల్లారె పలసలమనుచు  
అరుణోదయంబయ్యె నానందముగను  
మంకెన పువ్వనట్లు మఱి బొద్దు పొడిచె  
కొక్కొరో కోయంచు కోడి కూసింది  
కలకల తామర కొలను పూసింది  
కావు కావని చెప్పి కాకిలేచింది  
చల్లని గాలి పూల్ చెట్లు వీచింది'

ప్రభాత సమయములో ప్రకృతి మేల్కొంచుటను కవి బహుచక్కగ

1—Words Worth in Andhra —Oswald J. Couldrey

చిత్రించెను. అరుణోదయములోని ఎరుపు, మంకెన పూవులోని ఎరుపుతో ఉపమిం చుట మనోహరముగనున్నది. ప్రకృతి దృశ్యము మన ముందు సాక్షాత్కరించును.

'తొగరుటంచునె తూర్పు దిక్కున-పగటి పొద్దుదయించు శోభలు' అని ప్రత్యూషకాలమునందు సౌందర్యమంతయు తూర్పుదిక్కునే రాశీభూతమైయుండు నని చెప్పెను.

చెట్టు చిగిర్చిన ఎర్రగ కనిపించినట్లుగ సూర్యబింబమంతయు చిగిర్చిన కాని ప్రభాతవేళ ఎర్రని జిగి దోపదని కవి విచిత్రమగు ఊహ చేసెను

'ఈ ప్రపంచమునంతను నెర్రనిజిగి
పూసి పూరించి తనలేత పొద్దుపొడుపు
సొగసు చూపించవలెనన్న సూర్యుడు మును
తనదు బింబంబు సర్వస్వము జిగిర్చి
వెలయగావలె, లేకున్న కలుగదుజిగి'

తన బాహ్యనేత్రమునకు గోచరమగు ప్రకృతిశోభలు కవికి తృప్తిని కలి గింపవు. అందులకే 'ఆ కొండకనుక నాకడ్డము-లేకపోతే బాలసూర్య, దేకడ నగు పించువాడొ; ఎంతదూరముండు వాడొ!' అని తూర్పుకొండలు లేకున్న సూర్యుని ఉదయము ఎచ్చోటనుండి కాననగునో కదా యని ఆశపడును.

"కొండమీద కెండపచ్చె
కొలని పువ్వు కులుకులెచ్చె"-అనుచు సూర్యోదయ కాంతులతో
వికసించు కమలముల శోభను వర్ణించును
సూర్యోదయముతో అస్తమించు పోవు చుక్కను గూర్చి
"చందాయి తెరచాటు-చక్కని చుక్కా-
తొంగి చూడే-నన్ను పొంగి చూడే
ఆకాశగంగలో-కరగిపోయినచుక్క-
పిలచిచూడే-నన్ను పిలిచిచూడే
అంబూధి గుటకలో-అస్తమించిన చుక్క-
పలికి చూడే నన్ను-పనవిచూడే"-
అని అది మాయమైపోవుటను చూచి చింతించును

**సూర్యాస్తమయ వర్ణణ :-**

సూర్యాస్తమయ శోభలను, సాయం సంధ్యాసొబగులను పరిపరివిధముల దర్శించి కవి పరవశించి పోయిరి.

'అసుర సంజను-చుక్క అగుపించెను
అది అపరదిక్సతి-తిలకమనిపించె'
'సకియ చూడ్కి రక్తి సాంధ్యరాగమునందు
బెరయు చిన్నిచుక్క పెరిమఁదోచు'-నని సకియ చూడ్కులలోని రక్తిమ సాంధ్యరాగమునందొప్పు చిన్ని చుక్కతో పోల్చెను పడమటి దిక్కున గ్రుంకు లిడు భానుబింబము మోదుగు పూవువోలె కవికి భాసించినది.

'గోదావరి గట్టెక్కగ
మోదుగు పువ్వట్లు పెద్దమోమునఁదోచెన్
ఆదరి యంచునె సూర్యుడు
సాధు తరంపు సాంధ్య మేఘసాలంకృతుడై'

'సంజచుక్క-అణి ముత్తెంబట్లు: మునగాల కొండపై; కొస చింత కొమ్మెక్కె: సంజచుక్క; ప్రతిదినపుజుక్క-యిలాపక్క జుక్క' అని అస్తమయ బింబమును అణిముత్యముతో పోల్చును.

తన ఆనందమును నలుగురితో కలిసి పంచుకొనవలయునను కోరిక కవికి తీరలేదు.

'చూడలేదు రైతు నాకూడనుండి
చూడనే లేదు రయితుతోఁగూడనున్న
కూలిచేడియ'

పశ్చిమాద్రి శోభలు కవికి పలువిధములుగ సాక్షాత్కరించుచుండును. ఒక పరి సంధ్యాకాంతి కవికిట్లు కానవైనది.

'చికిలి బంగరు అంచు-చేలమట్లున్నదోయి
మేఘాన్ని అలముకొని -మెఱయు చరమార్కజిగి'
'సాధ్వి కుంకుమ తిలకార్ద్రశ్రీ శోభయనఁగోమల సాంధ్య విలాస మొప్పె' నని కవి యొక పరి యూహించును.

ఇంకొక తరి ఇట్లు భావించును.

'సూర్యుఁడపరాశఁ గ్రుంకుచు శుద్ధరక్త
దీధితిని బింబ మూర్తియై దిగుచు దిగుచు
తరళశోభను దీపించి తనిపెనన్ను'- సంధ్యాకాలపు అరుణిమను శుద్ధ రక్త దీధితునితో పోల్చుటతో కవి అభ్యుదయ ధోరణిని కాంచవచ్చు.

కవి సూర్యస్తమయ శోభను క్రమముగ కనులకు కట్టించును 'మెఱకకునెక్కి-చూడఁగ నమేయముఁగా గనిపించెఁ, బళ్ళెమం బెఱుపయి, సొంపునై, దిగువ కెల్లయి, శోభనదీప్తిమంతమై, క్షీయరుదయి, యానవాలునయి, యందఱకందయి, అంబుదింబడే యెఱుకను నేటవాలునయి, ఎక్కడిదోయన నక్కఱంబునై' ఇది దృశ్య సాక్షాత్కారమునకు చక్కని ఉదాహరణము.

'ఎఱ్ఱ ఎఱ్ఱని సంజ
నల్ల నల్లని పిల్ల
పచ్చ పచ్చని గడ్డి
కోయు చుండెన్'

—ఎర్రవి సంధ్యలో నల్లని పిల్ల, పచ్చగడ్డికోయు వర్ణచిత్రము మనము కాఁచగలము.

సంధ్యా కాలమున పడమటి దిశ మార్చుకొను వివిధ వర్ణములను కవి విభ్రాంతుడై వీక్షించును "దిఙ్మండల ద్వార బంధాలు కడిగికొని పసుపు కుంకుమ మద్దెమలు సంజ!" అని తలంచును. 'వెండి పళ్ళెరము మొందు తా విస్తరించి, వెల్లగోడ చేరువు గొన్న విధముగాను, సూర్యుడు గ్రుంకు చుండె' ననును. ఎంత అద్భుతమగు ఊహయో ఇది. మరియొకచోట "జలజాప్తుడొాలిగేడు ఇల యంచె కునుకుతూ" అని వర్ణించును.

భగవంతుడు తన కుంచెలతో ఎన్ని వర్ణములనిట్లు దిక్కులకు పులుము చుండునో అని విస్మయము చెందును

"సాయపు సంధ్యయందు విస్మయము గదుర
లేఁత యాకుపచ్చ, పసుపు లేతరంగు
ఇంకనేదొ యెదో కాంతిఁగన్పించు పుట్టు
సొబగు కాంతులు, తూర్పున జూడ్కిమీఱె'

ఈ కాంతులే కన్నుల మిరుమిట్లు గొలుపుచుండ ఇంకను 'అంత అద్భుత ముగ నొక యంబరంబు, వాన గురియునట్టిది లేచి దాని గర్భమందు ఒకి రెండు ఇంద్రధనస్సులు పొడసూపిన' వట అంత 'జూలులా లేచిన బంగరు మేలు కాంతి కాలునల్లన' అయినది చివరకు 'నల్ల బెలగి-యెఱ్ఱ సంధ్యగ' వెలసినది. తూర్పు తట్టున లేలేత కాంతులలో పెద్ద మార్పేమియు లేదని, ఇన్ని పోకిళ్ళు, పడమటనే యని కవి విస్మయము నొందును.

భానుని సాంధ్యారుణ ప్రభలు సర్వప్రకృతిపై తమ ప్రభావము జూపు చుండుటను కవి గమనించును.

'మింటఁ బశ్చిమమునఁ గంటికింపగు-శోభ
నెఱుపులో బ్రొద్దు క్రుంకెడిని వడిన్,-అంతలో
నా యెఱ్ఱ నందంబు చందంబు పంటకాలువనీట-ప్రతిఫలించు'

అని కాలువలో ప్రతిఫలించు భానుని యెర్రందనమును వర్ణించును. ఇది నీరవసాయంకాలపు శోభను చక్కఁగ స్ఫురింపచేయుచున్నది.

ఆ సమయమున సూర్యకాంతులతో పచ్చగడ్డికికూడ స్వచ్ఛత నాపాదింపబడి నట్లు కవికి పొడసూపును

"మునుముందుఁ గ్రుంకెడు ముదుసలిపొద్దు
అద్దరి నీళ్ళలో అందగించెడిని
చిన్నారి మాతంగి చెంగలిగడ్డి-తడపుచుమలుపుచు దరిని బెట్టుచును-ఇద్దరి నీళ్ళల్లో నింపు వహించె
వర్చస్సు గొల్పెడు పడమటిపొద్దు
స్వచ్ఛతఁ జూపెడుఁ బచ్చనిగడ్డి"

కవి తన పల్లె ప్రక్కన గల కాసారమును ప్రాణప్రదముగ ప్రేమించును. వివిధవేళలలో, ఋతువులలో నది సంతరించుకొను సౌందర్యములను గని సంబర పడును.

'కలువపూలు మంచి కమలాలుగలయట్టి
కొలనియందు నిలిచి కొలువరయ్య
చక్కనైన సంధ్య సంతసపీయమై
యరుణారాగ శోభనందగించు'

'కొండదారిని నొక్క ఱెండెడ్ల బండి
శీతాకాలపు సంధ్య చిఱుచలి సంధ్య
ఎఱ్ఱని సంధ్య నిల్వేఱుగని సంధ్య'

సుందర శీతాకాలపు సాయంసమయమున కొండదారిలో పరుగులు తీసెడి ఎడ్లబండి, పరువులెత్తు ఎద్దులు కనులకు దూరముగ మాయమగును "శీతాకాలపు సంధ్య-చిరుచలి సంధ్య" అనుమకుటము పలుమారులు ఆవృత్తమై సాంధ్యవాతావరణము, ఎడ్లు, వాని గంగడోళ్ళు, గంటలు స్ఫురింపజేయును

కొండెక్కి చూచిన సూర్యాస్తమయ మెట్లు చూపట్టునోనని కవి కుతూహలము అటనుంచి గాననగు మనోహర దృశ్యముల గాంచి పరవశుడగును. ఇట వీరి నిశిత పరిశీలనా దృష్టి చూడవచ్చును

'కొండెక్కాను—వీక్షించాను—వేసంగిసూర్యుడు క్రుంగిపోవుటలు
కొండెక్కాను—వీక్షించాను—శుక్లార్ధేందుడు శూన్యంబౌటలు
కొండెక్కాను—వీక్షించాను—అక్షయతారలుస్వప్నాలల్లుట

"ఎఱుపులో ప్రొద్దుగ్రుంకుతూంటే యెఱ్ఱనందంబు చందంబు పంటకాలవ నీట ప్రతిఫలిస్తూంటే" ఎంతటి శోభగనుండునో అనుభవించినగాని తెలియదనును. లోకబాంధవుడు పడమటి దిశను గ్రుంకులిడుట ఒక్కొక ప్రాంతమున ఒక్కొక రీతినుండుట వారి దృష్టిని దాటిపోదు

'మొన్నటి దినంబు సంధ్య—కెంబొద్దు మొగము
మబ్బులోఁగాక విడిగ దిఙ్మండలమును గ్రుంకుచుండెను
అద్దరిఁజెట్లలోన మఱి? యావలి యూఱున?—అల్ల అబ్ధినా?
అద్దరిఁజెట్లలోనయిన నయ్యవి నల్లపొదలుగ—నేటికిన్
ఆవయి నూరు నందయిన నందలి యిండ్లను దివ్వెలుండునా
ఆపెడ నబ్ధిలోనయిన నాతరఁగల్ చుంయిచుంయిలీన—
ఆ ప్రతిభా ప్రపాతము మహాద్భుతమే — కనులకందదే!

చెట్లలోన గ్రుంకులిడిన నల్లపొదలుగను, ఊరు నందయిన ఇండ్లలో దివ్వెలుగ, అబ్ధిలోనయిన తరగలు చుంయిమని కాలునట్లుగ నుండుననుకవి ఊహాశాలినత్వము అద్భుతము,

ఇన్నితీరులుగ, వివిధ దశలలో, పలుప్రాంతములనుండి వీక్షించినను కవికి సంధ్యాకాలపు టందములు తృప్తినీజాలకున్నవి. అందులకే

"ఎంతోసేపు నిలువ దింపైన యీ సంధ్య
సూర్యుడందె తొంగి సురిగిపోవు
లేత చందమామ లీనమై యందగు
సంజ చుక్కతాన సన్ననౌదుగు — "

అని అసంతృప్తిని వ్యక్తము చేయును. సంధ్య శాశ్వతము కాదని నిరాశ పడును

## చంద్రోదయ వర్ణన

సూర్యాస్తమయినదని బాధపడిన కవి అప్పుడే ప్రారంభమగు చంద్రోదయ కాంతులను చూచి ఆశాజీవియగును ఈ వర్ణనలను కూడ కవి కడు మనోహరముగ చేసెను.

'చిట్టి పాపని తొలి చూపు చెలువు మెఱసి
యొక్క చుక్కొక్క చుక్కింక నొక్క చుక్కయనఁగ
సాంధ్యారుణపుఁబోక నందగించెఁ జిన్నిచుక్కలు
మింటిపైనెన్ని యెన్నో' —అని ఆకసమున గోచరించు లక్షలాది చుక్కలను జూచి భానుడస్తమించిన విషయమును మరచి ఆ నూతనానందములో లీనమగును

జగములెల్ల చంద్రికా కాంతుల మునిగియుండుటను కవి భావుకతతో పరికించును.

'తెల్లని వెన్నెలలు
పచ్చని మొలకలను
చల్లగను నిలిచియుండె
పచ్చని మొలకలు
తెల్లని వెన్నెలల
పల్లసిలు చొప్పచుండె'

గొలను కొద్దిపాటి జలములతో, చిట్టి పొట్టి అలలను గట్టుకు కొట్టచుండ,

'అలలందు వెన్నెల కలుష ముడిగి, పైడి మలామ యనఁగఁ గాయు చుండె' నట. కళంక సహితుడైన శీతకరుని నుండి వెలువడిన వెన్నెల తనలోని కలుషమును కొలనులోని కొద్దిపాటి జలములలో కడిగివేసికొని స్వచ్ఛమైనదట. కవి యూహ అద్భుతముగ నున్నది

బాలేందుని వెన్నెలలో మునిగిన కవి 'ఈనాడిచ్చట లేడిలాగు నడకంతా సాగఁ బర్వెత్తదన్' అని బాలునివలె పులకించును. 'సంధ్యాంతమౌ రాణన్ గని గృహానకేన్ మఱలబోన'ని దృఢ నిశ్చయముతో నుండును. 'ఈనాడొప్పునదర్ధ చందురుడ కారే, వారు బాలేందుడే' అని చంద్రుని సోయగముల వీక్షించుటతో తృప్తిపడును

ఋతు వర్ణన :—

ఋతుక్రమమును 'కాలచక్రము' అను గేయమున మనోహరముగ వర్ణించెను. ఋతురాజైన వసంతము అందరి మనములను రంజిలజేయును.

'చిత్రమగు నవ్వసంతంబున చిగురుటాకును దాల్చు మాకులు, సొగసుగను బూచెడి మల్లియ, ఒగరు తిని కూయు, కోయిలల'ను వర్ణించెను.

"మామిడిమారేడు మంచిగంధంబు
అనుకున్నవేళకు నవలెత్తి మెఱసె
మాలతి మల్లియ మంచి సంపెంగ
కోరిన కోమలి కొప్పులో విరిసె"—నని వసంతగామనముతో ప్రకృతి చైతన్యవంతమై అలరారుటను చూపును

దాని వెనువెంటనే చూచులోపలె 'చుఱ్ఱుమనుచును, వేచునెండలు వీచు గాడ్పులు గ్రీష్మమది యొకరేతి గడువగ' అని తాపమును గూర్చు గ్రీష్మమును చూపును

పిదప 'తొలకరించును, మొలచు మొక్కలు, పొలము పచ్చన పొలుపు మీఱును' అని ప్రజలకు ప్రాణాధారమగు వర్షరుతువును, 'కడిగినట్లాకసము తేట యగుట, పడుగు పేకగ కొలకలు పూయుట' అని స్వచ్ఛతకు నిలయమగు శరదృతువును కవి నిసర్గ సుందరముగ వర్ణించును.

శరత్కాలమునందలి అందములను చూపుచు

"తేటనీటఁ దెలివిదేటి తేలుచగొన్న కలువపూల
నిర్మలాకాశవీధి నీహారంబువుల మాల
వట్లతద్దియాటలాడ 'జెట్లపట్లఁ'జనెడు బాల
సుందరతర శరదిందు కందళిత కౌముదినిగందు" వని మైమరచును.

'ఎంతలో మాఱినది ఋతువెంతలోన
మంచు గురియుచున్నది గ్రామములంట
చెట్ల యాకులు రాలెను శట్లకొలది

ఆకులేదు పూవుగనమయారె! సుంత ' అని రంగు, రూపు మార్చుకొను ప్రకృతి శక్తికి జోహార్లర్పించును' కాలగమనమునకు విస్తుపోవును

మనస్సున కాహ్లాదము గొల్పు మందమారుతమునకు పలకించి పరవశించును. వీరికి అనుదినము వాహ్యాళికి వెడలుట అలవాటు 'దవ్వుదవ్వుల నదీతల ప్రవిమల పులకితస్పర్శ అవిరళ సుందరమయ్యెన్' అని పులకించును.

'చేల నడుమ నడుచునప్పుడు పచ్చనగు చేలరంగు అచ్చెరువిడుచుండగ కమ్మనగు పాల వాసనలు చెలగుదారినే పట్టిపోదు' నని చెప్పును

## వర్ష వర్ణన :-

కవిని మిగుల ఆకర్షించిన అంశములలో వర్షమొకటి. దీనిపై పలు గీతికలను వెలువరించిరి వర్షము కురిసిన పిమ్మట ప్రకృతి స్వచ్ఛముగ మనోజ్ఞముగ ఒప్పు చుండుటను గూర్చి పలుతావుల ప్రస్తావించును. వాన పడిన తరువాత 'భాస్కరుండు ఎఱ్ఱని మహజ్జ్వాలకాంతి నూనె'నట ప్రకృతిలోని సమస్త వస్తువులు ఎరుపెక్కి తోచుచున్నవట. శుక పికావళి తెక్కల నార్చుచు గానపరంపరల తేలియాడుచున్నవట 'అకుమళ్ళెల్ల నిర్మలమైన వాన దడిసి యొక వింత చెలువంబు దాల్చియుండెనని, 'ఆకసంబెల్ల యెప్పటియట్ల తనదు సహజ నీలంపు ఛాయల బరపుచుండెననీ, వర్షానంతర దృశ్యమును మనోహరముగ మన కనుల ఎదుటకు రప్పించును

చెట్ల కొఱకే పూల కొఱకే-చిగురు జొంపంచెలగు కొఱకే చిలుకుదేవా! చిన్నవర్షము——చిమ్మరించుము తీవ్రవర్షము'——అని భగవంతుని వర్షము కొఱకు ప్రార్థించును.

తొలకరి చినుకుల ప్రభావమును ఇట్లు చూపును.

"తొలివాన మలివాన
నెలదిరిగి రాకుండ
తొలకరించిన కార్తి
నిలిచి కురిసిన వాన
జలలెక్క మలలన్ని
మొలచెఁ బచ్చికలు'

నీటిబొట్టు తన చరిత్రనంతయు చెప్పినట్లుగ కవి దాని మనోభావములను చక్కగ చిత్రించెను

'నీలసంద్రములోన నీటిబొట్టును నేను నీలవర్ణము నాకు లేదు సుంత' అని దాని కథ మొదలుపెట్టును 'జిగికెంపు పగడాలు, సొగసైన ముత్యాలు నాతోడఁ బుట్టువులు' అనును

'నేను నీరాలపై నీటుగా దేలుచును
శీకర డిండీర వీచి మరీచికల
మలయానిలాలోల దోలికా పాళికల
ఆశాంత వలయి తానంత శుభసూచనల
నాడుకొనుచునుండ నార్చువేసంగి
నొక్క కిరణము తోడ నెక్కుదును పైకి
గాటంపు మబ్బులో కలిసిపోవుదును
మండుటెడారుల మైదానములను
చల్లని వానకే చాల గురియుదును
అల్లకల్లోలమగు సముద్రమున
సాగర సంగమ శాంత విముక్తి
నీటి బొట్టు నగుదు నీలంపుజేయ'

— మొదట నీటి బొట్టుగ వుండి, మబ్బుగా మారి, వర్షపుచినుకై చిట్టచివరకు సముద్రములోని తన యథాస్థానమునకెట్లు చేరుచున్నదో కవి శాస్త్రీయ దృక్పథముతో సుందరముగ చూపెను.

'చిన్ని చిన్ని మంచుబొట్లు

సన్న వరిముల్లు మీద

మాపు నిల్చి రేపు రాలెను' అనుగేయములో అనంతభావములు, దృశ్యములు గోచరించును. ఇది మనోహరమైన కల్పన

వర్షపు చినుకులలో అపాదమస్తకము తడిసిన కవి ఆ చినుకులు క్రమముగ శరీరముపై పడుటను మనోహరముగ వర్ణించెను

"ఱెప్పల తుదపై నించుక చప్పుడు చేయకయె

చల్ల చల్లఁగ బడితో!

ముప్పిరిగొను మొగులును విడితెప్పుడు

పడితెప్పుడు పరితెన్నునె చినుకా!"

ఇందు సడిలేక రెప్పలపై బడిన చినుకు చల్లని స్పర్శ మనకనుభూతికి వచ్చును

వర్షపునీరు దాల్చు పలురూపములను కవి వర్ణించును. అది నిశ్శబ్దగీతికను వినిపించుచుండను.

"ఒకచో పాపి కనుమ పగులగొట్టి

అపరాని దగుచుఁ దొట్టి

బొళుకు బొళుకు ముఖరిత రుతి అని

మఱొకచో కిచకిచలాడే నీటియూటయని

వేఱొకచోట జలజల జాలువారునొక సన్నని తీయ పంటకాలువ

ఇంకొకచో కొండకాలంకు తూమునన్

గళగళ శబ్దగుంఫన మనర్గళమై వినిపింప"

ఇందు వర్షధార నదిగ, నీటి ఊటగ, పంటకాలువగ, "కొండకాలకుగ రూపొందుట, వాని ప్రవాహపు శబ్దములు బొళుకు బొళుకు, కిచ కిచ, జలజల గళ గళ' అను ధ్వన్యనుకరణములుగ సహజముగ వినిపించెను.

వర్షమునకు కారణభూతములగు మేఘములు కూడ కవి కన్నులయందు వలుభోయనములతో ఆటలాడినవి.

'నన్నుఁ దఱుముకు రాకు నా చిన్ని మేఘమా
నన్ను దరుపగఁ బోకుమో నీలమేఘమా'

అని మేఘమును చూచి పరవశించి భావమురశిని సారించి మధుర గీతికను పాడును కోనలో, కోన క్రింది 'చేలపైనడిచేటి దూది మేఘాలు' మేఘాలు విడనడు నీలంపు జాలు' అని సుదూరమున కానవగు మేఘమును వర్ణించును: 'మేఘాలు! మేఘాలు! నల్లన్ని మేఘాలు! మృగశిరమేఘాలు! చల్లన్ని మేఘాలు' — అని వానిని చూచి పరవశుడై పాడును

మేఘములను పడమటి దిక్సతి చేతులలోని అభరణములుగ, కన్నుల పండు వుగ మన్నవని భావించును

మేఘము 'ప్రాగ్గిశాచల దేవళ ద్వారమునకు నడ్డముగవేసు తామ్రపుకడ్డి' వలె కవికి భాసిల్లును అట్లే 'రవిశశి బింబ శోభితాంబరం బెల్ల రాజమార్గము' వలె నున్నదమను

మేఘము చేయుపనుల్లను కవి ఇట్లూహించును
కురిసితివి కురిసితివి కోమలపు నీ చినుకు
మెఱసితివి మెఱసితివి మేలైన నీ మెఱపు
ఉరిమితివి ఉరిమితివి యూఱకే నీయుఱుము'

మేఘము లాకాశముపై క్షణక్షణము తమ అకారములను మార్చుకొనుచు కవికి ఇట్లు కన్పించును.

'ఏనుగువలెబోలి సింగముబోలి
లీలగనంబడు లేడింబోలి
మాఱుపునుం గొను చుండెనొకానొక
మేఘము పడమర మలుసంజ'— కవి నిశిత పరిశీలనమిట చూడవచ్చును

సముద్ర వర్ణన :

కవి విశాఖ పట్టణములో సముద్రమును చూచి సూతనాత్రేయునితో పలు గేయములు రచించిరి

అల్లకల్లోలమైన సముద్ర తలమున పండు వెన్నెల కాసెడు వగిది చూడ దొడ్డ విజ్ఞానమొసగుచు తోచుచుండు'నని ఎంచును.

'కెరటాల ఫేనముతో శోభిల్లెడు సంద్రపు సుందరి, మిన్ను విశాల నీల రమ్యత తో, 'పాలదారి భువి నవతరించినట్లుగ' ఉన్నదని కవి ఊహించును నీల సముద్రములోని తెల్లని కెరటాల వరుస, నీలాకాశములోని పాలపుంతను బోలివదను ఈ ఉపమ కడు రమ్యముగ నున్నది.

విశాఖపట్టణములోని ఏరాడ కొండనుండి సముద్రము మిగుల మనోహర ముగ పొడసూపును 'ఏరాడ కొండెంతో పచ్చగా నున్నది దారి ప్రక్క కదలి స్వేచ్ఛగా నున్నాది' అనుచు 'పాతదైనాతాడి పాతింది తననీడ పారమావల చూడ గాబోలు నీళ్ళనే' అని తాడినీడను చూడయత్నించును.

సముద్రుని త్యాగబుద్ధిని, పరోపకార పరాయణత్వమును కవి చక్కటి ఉదాహరణములతో చాటెను.

'[illegible] ధన్వంతరిని వేల్పు కవణంబుగాజేసి', తాను నురగలతోడనే, తృప్తి నొందినదని, 'తీయని యమృతంబు దివిజుల కర్పించి, తాను కేవలము లవణము తోనే ఒప్పుచున్నదని, 'ఐరావతోచ్చైశ్రవాదు లింద్రునకిచ్చి' తాను చేపలతోడ నూర[illegible], 'కౌస్తుభ లక్ష్ముల కమలాక్షునకు నంపి' తాను నత్తలతో నెగడు చున్నదని, పరిపరివిధముల ఉదధి యొక్క ఔన్నత్యమును కీర్తించెను. తుదకు తన కవితలోని ఘనత కూడ దాని ప్రసాదమే యని ఎంచును.

ఇట్లు ప్రకృతియే తనలోని కవితాశక్తికి ప్రేరకమని కవికొండల పలు సందర్భలలో చాటి చెప్పుచుండును.

నదీవరన:-

రాజమండ్రి పరిసరములు, గోదావరి కవికి మిగుల ప్రాణప్రదములు గోదావరి ప్రశాంత ప్రకృతి, మనోజ్ఞ వైభవములను గాంచి మురిసిన కవికి దాని వరద విజృంభణ విభ్రమమును గొల్పెను.

"ఇసుక తిన్నెల తోడనెసగు చుండు నీ
వీవరి కాదరి కేకమైతి
ఒక చిన్న కొలంకట్లు లొప్పచుండెడునీవు
తరియింప జాలని ఝరిణి వైతి
చలనమించుక లేక యలర్చు చుండునీ
వాప జాలని ప్రవాహంబవైతివి"

అని తానెరిగిన కొలకువంటి గోదావరి మహాసముద్రమువలె సాగివచ్చుటను చూచి ప్రకృతి వైపరీత్యమునకు విస్తుపోవును

'ఏనీటి కతన నీ కింత కలిమి కలిగె'నని దానిని ప్రశ్నించును.

వరద అనంతరము ఏమియు నెరుగని ముగ్ధవలెనున్న గోదావరి శోభలను గాంచి వీరిలో కవితావేశము ఉరకలెత్తును 'సూర్యరుచితో శేమాణిక్యము లారబెట్టిన యటుల' మెరయుచున్న దానిని చూచి పులకించి పోవును

ఎంత మాత్రము క్రూర చింతలేని శిశువు లాగు చరించు' చిన్నచిన్న తప్పటడుగుల నిడుచు తడుముకొనుచు' ఉన్నదని దానిపై వాత్సల్యము కురిపించును

అట్టి వరదవేళ లోకములను ఊపివేసిన ప్రభంజనమును గాంచి కవి యుత్తేజితుడగును. "ఎంతకాలమునుండి క్రిక్కిరిసి యుంటివో-ఈనాడు వెలువడితి" అనియు, "కప్పుపైగల కాగితము పోలికను ఎగురచేసితి" వనియు, "చెట్ల వ్రేళ్ళకునంట శివమెత్తి నటుల ఊపిపెకలించితి" వనియు దాని ప్రభావమునకు విస్మితుడగును.

* * * *

కవి తన స్వస్థలమగు శ్రీరంగ పట్టణమునకు సమీపమున గల పెద్ద వెదురు పొదలను చూచి ఉత్తేజితుడై 'వేణువు' అను ఖండకావ్యమును వ్రాసెను. దీనికి "దండుపుంత" అను పేరు గలదట.

ఈ వెదురు బిడెమును ఒక మిత్రుడు చూపెనని అతని సంస్మృతితో దీనిని రచించితినని వారు చెప్పుకొనిరి [1]

వెదురుపుంత సృష్టిలో సాధారణమైనదిగ తోచినను దానికి సృష్టిలో గల విశిష్టత, ఇతరులకది ఎంత ఉపయోగ దాయకమో కవి చక్కగ విశదపరచును. 'ఎవరువిన్న నెవరుకన్న నెవరు చూడకుండినన్ రవములొనర చేయుచుందు రాత్రి పవలు వీయ్యేడన్' అని వేణురాజము విశ్రాంతి ఎరుగదని చెప్పును.

'వివిధ విహగ యుగములు తొవరుటాకు గుబురులందు దూరి గూండ్లు కట్టినవి' అని 'చువులతోడ్ వెలయుచుండు పొదుగు తీవెలెన్నొ నా చివరకొమ్మలందు

1 వేణువు- అంకితస్మృతి- కవికొండల

కొనఁగ జిక్కనలము కొనినవి' అని, అట్లు వానికాశ్రయమిచ్చుటయే వెదురుపొదల ధ్యేయమని చాటును

అంతియేగాక 'కొండవారు కోయవారు కోటి యేరుకొనుచు నాపండిరాలు బియ్యములను వండుకొని భుజించెదరు' అని, 'మండు రెండు జాములపుడు మసలు గొల్లగుంపు నానిండు పొదలొసంగు నీడనిలిచి శ్రమను బాపు' ను అని దాని పరోప కారగుణమును కొనియాడును.

అట్టిదానిని 'ఘనులనుచు కనఁబోరు కాసంత గౌరవంబిడబోరు' అని చింతించును. గౌరవించుటమాని 'ముండులని, ముండ్లని ముట్టసందేహింత్రు'' అనియు, గొప్పవారనిభావించువారు దానిని అల్పముగనెంచి 'కొండవారికె యిద్ది కూడుననుచు నిందింత్రు'అనియు కవి వగచును.

నాగరకులు దాని విలువను గుర్తించకున్నను పల్లీయుల కన్ని సుఖముల నిచ్చెదనని వెదురు తలపోయునట

'మేపుకొనుచు నాలవెంట మెలఁగు గోపకుండునన్
దేపతేవ కూడుకొని మదిన్ ముదంబు నొందెడున్,
కాచుతనదు పంటపైరు కాచుకొనఁగ లేకనన్
గాపువెట్టుకొనుచు తా సుఖమ్ము నొందుచుండెడున్ ।
నాపని యెవరెంచకున్న, నన్ను కదపకుండినన్,
జూపు ముందు నున్ననాదు సొబఁగు చేవలియ్యెడన్'

అని 'ఎవరు మెచ్చిన మెచ్చకున్నను 'మంటి బుట్టి మంటఁబెరిగి మన్నుమ మందు నియ్యెద' అని వెదురు తృప్తి పడునట.

ప్రకృతిలో ఒక అణువుగా మారిపోవుటకు తహతహ లాడును. "కదలి నట్టడుగు పొదము ముత్తియముః నీదుకాంతిన్ బడయగమ మునుగ వలెనా!" అని కడలిలో ముత్యము కాగోరును అట్లే "ఆకసమునట్టె పొడుచు చుక్కల్! నీదు కాంతిన్ జేపట్ట నెగురవలెనా తెక్కలూనంగవలెనా" అని ఆకసములో కాంతులీను చుక్కకాగోరును

తనమాతృ గడ్డపైగల మమతను కవి పలుచోట్ల వ్యక్తము చేయును. మన ప్రాంతమును వదలి వేరొక ప్రాంతమునకు పోయినతృప్తి యుండదని పరోక్షముగ సూచించును.

"ఆకాశంలో అంధులమైతే
సూర్యుడు నవ్వేన్ చంద్రుడు నవ్వేన్-చుక్కలు పకపక చుట్టూ మూగేన్
భూమిమీదనే పడియుందామొసి-పచ్చగడ్డిపైపడుకొందామొసి"
అని తాపత్రయపడును —
"ఇక్కడ కోయిల వినబడినట్లు-ఎక్కడ కోయిల వినబడదోయి
ఇక్కడ కొండలు గనఁబడురీతి-ఎక్కడ కొండలు కనబడవోయి
ఇక్కడ కొలనులు నిండెడు లాగు-ఎక్కడ కొలనులు నిండవువోయి
ఇక్కడ నాహృది నినదించెడు బలె-నెక్కడ నాహృది నినదించదువోయ్"-
అని తన జన్మస్థలముసాటిలేదనును

తన ఊరి సమీపమునగల కొలను కవికి ప్రాణప్రదము. దానిని మానస సరోవరముతో పోల్చుకొని తనియును

"అలరాజ హంసయుగళిని
విలసిల్లెడు సుమ సువర్ణవిధము తోడన్
పులదూగెడు మనకొలనిన్
దలపోయరె మానస హ్రదంబని కనుచో"
ఆ కొలను గూర్చియే మరియొకచోట చిత్రమగు ఊహజేయును.

"తమ సౌందర్యము దామె దిద్దుకొన నత్యాసక్తిన్ కొండల్ కడున్ గమనీయంపు గొలంకులన్ గెలకులన్ గావించు కొనెనో" — ఇందు కొండలు తమ అందచందములను కొలనులో చూచి దిద్దుకొనుచున్నవని చిత్రమగు ఊహజేయును.

ప్రకృతిలోని పక్షులు, జంతువులు కవిదృష్టినిదాటి పోలేదు
'కోకిలమ! కోకిలమ !
క్రొత్త క్రొత్త కోకిలమ !
ఏచోట — కోకిలమ
పాటపాడు కోకిలమ్మ
పరువంపు బసరుటాకు
పరసింపు జల్లగాలి
తెల్లవన్నె — మల్లెపువ్వు
లామనిదొర- ప్రేమలతో
నందిచ్చు సందుననె వచ్చినావ, కోకిలమ!'

ఇట కోయిలపాట ఏయేటి కాయేడు ఎంత నూత్న మధురముగ నుండునో "మాపుపాటె రేపు పాడి – ముందటేటిముద్దు పాటె ఈయేడు నింపు, పాడి క్రొత్త క్రొత్త కొసరింపులో–చిత్తమందు చిగురొత్త – జేయుచుండును" అని మనోహరముగ చూపును.

అట్లే కోయిలతోబాటు కాకము గూడ కవిదృష్టిలో సమానమే. అందులకే దానిపై గూడ గీతికల నల్లును.

"తమకంటెన్ నలుపైన రాత్రికని యాత్మన్ భీతిలంగన్ గులాయములన్ డాగెడు బోలు కాకములు" ఉన్నవట కనుక వానికి సూర్యుని తేజమనిన ప్రీతి సూర్యతేజములో రాత్రి బోవుచుండుటను గాంచి ప్రమదమునొంది 'కావుకావని కడున్ రావంబులన్ నల్పెడునని' చమత్కరించును

చిన్నారి చిట్టి తువ్వను గాంచి 'మల్లెపూవన్నియల మంచితువ్వ – ఎందాక గంతు మ్రోగింతు మువ్వ' అని దానిని లాలించును.

ప్రకృతిలో ప్రతిజీవిలోను వారికి సౌందర్యమే గోచరించును మేకలను గూర్చి 'చాపిన మీమేని సౌకుమార్యములు అటునిటు వోవువారను శంకలేక హాయిగా దలయెత్తి యతి శయించు అని పలికి ముగ్ధుడగును అప్పుడే కనులు విచ్చిన మేకపిల్లను గాంచి 'బొడ్డూడంగను లేదు, కన్నుగవనుం బూర్ణంబుగా విప్పలేదు' అని జాలిపడును

'నడ్డిన్ దెల్లని మచ్చతోఁ గడమ మేనన్ నల్లరంగొప్పెడిన్' అని మురియును.

'అప్పన్న ! అప్పన్న! సిమ్మాదిరప్పన్న! పప్పులెడతా నీకు కదులన్నా! దారినుంటె ఎట్లా! రాదారి అప్పన్నా' అని ఎద్దును మచ్చిక చేయును.

నిండు వఱదలో సైతము జంటపీదని బాతులజంట కవి నాకర్షించినది. 'నిండువఱదలో నిద్దంపు జంట, పరువంపు ముద్దుల జంట, పరిశుభ్రపుఁదెలివన్నియ జంట' అని స్వచ్ఛతకు చిహ్నములైన ఆ విహంగముల అన్యోన్యతకు అబ్బురపడును.

చిలుకలు పండ్ల చెట్లపై వ్రాలుట పరిపాటి. కాని శిరీషవృక్షముపైన చిలుకలను చూచి కవి ——

'ఎన్ని చిలకలూ! ఎన్ని చిలకలూ! చెలిమివాటికి – ఆ శిరీషమూ! ఫలము లివ్వవూ! పప్పులొండవూ! పప్పులెట్టవూ! ఆ ప్రియ మేమో!' అని ఆశ్చర్య పోవును. వానిరెండిటికినీ గల సామ్యమును 'ఎఱ్ఱ ముక్కులూ! పచ్చరెక్కలూ!— ఎఱ్ఱపువ్వులూ! పచ్చనాకులూ!' అని గుర్తించును ఇటకవి నిశిత పరిశీలనా దృష్టి వ్యక్తమగును.

పేరు తెలియని చిన్నిపిట్ట లెన్నియో గుంపులుగ చెట్లపై వ్రాలియుండును "చిన్నిపిట్ట లెన్నియో తుమ్మపై – వ్రాలి కిచకిచమని రవమొనర్చును" అని ఆ రావమునకు తన్మయుడగును

"శాద్వలంలో ఆరుద్ర క్రిమి – చక్కగా నాకుమడి – ప్రక్కన గువ్వ"— అనుచు ఆరుద్ర క్రిమిని సైతము కవి తన దృష్టిని దాటనీయడు.

"గోదావరి వడినొక్కటేదో పక్షి యీకె యీదరికి గొట్టి కొంచేగుదెంచినది–" దానిని శల్యపరీక్ష చేసి 'తుడిచి వానిమైపరికించె వ్రాయుటకో! ఓసి కనుమ నుండో, నాసికాత్ర్యంబక వాసంబు నుండియో వచ్చితనుచు" విచారించును. సాధారణ సుందరమైన సత్యము, సంక్షిప్తత ఇందు చోటు చేసికొనినవి.

కవి తన వర్ణనా చాతుర్యముతో ప్రకృతి దృశ్యములను చక్కటి వర్ణ చిత్రములుగ మలచి మన కనులముందుంచును

'నదిలోన తెల్లుమబ్బు — నవ్వుచుండెఁ దెల్లపువుల
నది కావల — ప్రొద్దు కునుకు — ప్రేమ గొలిపెనెఱ్ఱ జిగుల
నది ఉత్తరమందు గిరుల—మొగులు కలవుదీఱ
నదికి దక్షిణమున లంక — లొప్పుచుండె నొక్కపచ్చ'–

నదిలో పెరిగిన తెల్లు తెల్లని పూవులతో హసించుచు, నది కావలి వైపు సంధ్యా సమయమున ఎర్రనికాంతులు, ఉత్తరమందు పర్వతములు, దానిపై మబ్బులు దక్షిణమున ఆకుపచ్చని లంక – వివిధ వర్ణ సమ్మేళనములతో నొక మనోహర చిత్రము మనకు ప్రత్యక్షమగును.

పంటపొలాల దృశ్యమును చక్కగ చిత్రించెను 'ఊడుపు మళ్ళనుండి, తడియూటలు, బిల్చిల నడ్డు చెక్కులన్ పీడక జాలువాఱ, దరిఁబెంపగు పచ్చిక

కప్పి పుచ్చుటన్' పై పద్యమున ఊడుపు మళ్ళు, దానిలో వదలిన నీటి ఊటలు, దాని నానుకొని పచ్చని పచ్చికలను చూచి కవి వేడుకపడును.

కవి ఎంతగా ప్రకృతిని ఆరాధించునో, ఆ ప్రకృతిలోని బీభత్సముల కంతగా క్రుంగిపోవు సున్నిత హృదయుడతడు. కవి ఎటనుండియో ముద్దుల చిన్నితీవ నొకదానిని చూచి తెచ్చి పందిరి కల్పించినాడు. దానిని ప్రేమగా పెంచుచు పూలు పూయునని వేచియుండును కాని ఒకనాడు 'ఎద్దియొ పెల్లగించినను నీక్షణమందు రూపు మాపెగా' అని ఆతీగ నేల వ్రాలినందుకు విలపించును అంతటితో దానినాతడు మరువలేడు "నీ మృదులంపు గ్రొంజివురు, నీరమణీయంపు యల్లనీ కోమల రాగపుం గలుపుకోలు తనం బొక కొన్నినాళ్ళయున్ నామనమందు నాటుకొని నన్ను విడంగను జాలకున్నదో కంటికి గట్టిన యట్టులుందువే" అని దానిని తలచి తలచి అతడు దుఃఖించుటలో అతని కరుణాంతరంగము సుస్పష్టము.

వెన్నెల కాంతిలో గరిక శోభను గాంచి 'పచ్చని సస్యరాజమః విపంథను రాతిరివేళ నూరకే నిచ్చమెయిన్ జలించుచును, నింపు వహించెదవు చుక్కబిగిలో గాదంబినీ కాంతిలో యందంబందె' అని అతడు ముగ్ధుడగును

కేదారమధ్యము నందలి కలువను చూచి మురిసిన కవి, తాను వానిని విడచి వెడలిన ఎవరైన కోసివేయుదురేమో అని తల్లడిల్లును. "హాళికుఁడెవ్వడేని నిను నక్కట కక్కటాః పెల్లగించునో —— కూలికి వచ్చునాతఁ డెటుకోయుచుఁ బచ్చిక మోపుగట్టునో" అని అందోళనచెందును. "వెంగలులె యెవరైనన్ సింగారంబైన నిన్ను జెండుదురంచు" ముంగల గల పూవును విడిచి వెడలుటకు సంకోచించును.

ఇట్లే గడ్డిమోపులో త్రెంపబడిన చిరుమొక్కలను చూచి జాలిపడును. "తాళపత్ర విశీర్ణ బంధము దగిలి . కోరకావస్థనే కొడవలిఁ దెగియెనాఁ దలవాల్చె నొక కాడ తలిరుటాకు" అని కొడవలితో నరుక బడినపుడు, తాటియాకుతో కట్టబడిన పుడు వానికెంత నొప్పిదగిలెనో యని ఆవేదనపడును. కవి కరుణాతరంగమిక్కడ స్పష్టమగును.

ప్రకృతిలో అల్పమైన దేదియు లేదని, భగవంతుని దృష్టిలో అన్నియు సమానమేనని వీరి నమ్మకము.

"ఓచిన్ని మొలకా! ఊరకే కనిపించు ఓ గడ్డిమొలక
ఓ చిన్న తరగా! ఒడ్డునను విఱిగేటి ఓ కూనతరగా'
మొలక : నీ పరిమళపుఁ బువ్వు వికాసమ్ము
తరఁగ : నీతెలి నురుగు సుందరహాసమ్ము"

ఇట చిన్న మొలక, చిన్ని తరగ కూడ సౌందర్య స్వరూపములే యని చాటును అవిభగవంతుని ప్రతీకలే అని నమ్మును.

గడ్డి పూవులను గూర్చి కవి పలుచోట్ల పలురీతులుగ వర్ణించును కవి ఒకనాడు 'జలజలవాఱు నొక సన్నని తీయని పంటకాలవ దరి'ని 'నిర్జనంబయిన పచ్చని మెత్తని శాద్వలాంకురంబుల పఱపు'పయి మనోహరముగ పొద్దు పుచ్చుచుండును. అంతట నా శాద్వల సుమము పెదమోము పెట్టుకొనగా అతడు దాని నోదార్చుచు "నీజీవనమునకు సాటియెద్ది? వాగుతుంపగలలో తడిసి తుహిన కణంబులతో విదాహము తీర్చుకొని వానలలో నైక్యమై, వెన్నెలలో ప్రకాశించి, మందమారుతములో క్రీడించు నీకు సాటియెద్ది"—అని పలుకును అందులకా,సుమము "అన్న! ఆఘనమగు భోగముల్ వడయఁ గన దగుటల్ మును నీదు పాదఘట్టనమును దప్ప జాలిన కదా" అని నిరాశతో పలుకును. కవికి గలిగిన నీయూహ చిత్రముగనున్నది. గడ్డిపూవులను త్రొక్కివేయుట, కోయుట వీరు సహించలేరు.

గడ్డిపూవునకు నక్షత్రమునకిచ్చు దివ్య గౌరవము నిచ్చును.
"దాక్కొనివుంటాయి దారంట గడ్డి నిరుక్కొని వుంటాయి
తలపగరాని పూలు — పిలువగ బోనిపూలు

నిలువగరాని పూలు"— అనుచు పేరుసైతము లేని గడ్డిపూలు ఎవరిగుర్తింపును పొంద లేకున్నవని కవిని విచారించును అ పూవులు ఒకరి నాకర్షింప ప్రయత్నించవని, ప్రకృతిలో నొక భాగముగ అలరారుచుండునని భావించును.

"గ్రుక్కెడు వాననీళ్ళకు — పక్కన నవ్వుతాయి" అని వాని అల్ప సంతోషత్వమును చూపును. చూచుటకు కుప్పలుగ ఉన్నను "లెక్కకు రావోలక్ష — చిక్కవు మాలను గ్రుచ్చ" — అని వాని సౌందర్యమును బంధించుట అలవి మాలిన పని అని చాటును.

"ఒక్కడ పడుస్తూవుంటే — చుక్కలు పొడుస్తూవుంటే — మక్కువ

గూర్చేమంటాయి." అవి అంతటి సుకుమార హృదయము గలవి కావున కవి వాని నంతగా ప్రేమించెను. వానికి గల విలువ అపారమని కవి తలంచును.

"పేరులేని చిన్ని పువ్వ ! దారి ప్రక్క చిన్నిపువ్వ
గట్టు పొడుగు గడ్డిపచ్చ? పూసినట్టి చిన్నిపువ్వ
వీరి వారి పేరునడుగు — పేరులేని చిన్నపువ్వ
వెలయు దీవు పేరులేకె" —

ఇట గడ్డిపూవునకు పేరు లేనంత మాత్రమున లోటేమియు వాటిల్లలేదని అవి తమ ప్రత్యేకతను నిలుపుకొనగలవని కవి వానికి ధైర్యము చెప్పును.

"ఆకసము వర్షానంతరము తన సహజ నీలంపు జాయల బరపుట వలన అడుగులడుగున నలుగుచు నడగియుండ గడ్డిపూవులకు దొడ్డరంగు గల్గెను" అని ఎంచును. భగవంతునికి వానిపై చిన్నచూపు లేదని తృప్తిపడును. "చిన్నిపువ్వ చిఱుగాలికి జెలగి యాడ" నను

మరియొక చోట "నల్లమబ్బాగి యాగి నీ పయిని వాన కురియింప నేత్రపర్వమగుదు ! నీదు పేరేమి ! యే మంత్రదునిన్ను! రంగు రంగుల చిన్ని దొంగపూవ!" అని వర్షానంతరము నేత్రపర్వము చేయు గడ్డి పూలను ముద్దుమురిపెములతో ప్రశ్నించును.

"ధగమని కాంతులీను రత్నంబులెన్నొ
కడలి నోరులకంట బడకుండ నడగిపోవు
ఘుమ ఘుమని తావులల మెడు సుమములెన్నొ
నడవి నరులకు దెలియక వడలిపోవు"

ఇట ప్రకృతిలో ఎన్నియో అందములు మన మనుభవింపకనే మాయమగుచున్నవని కవి చింతించును గడ్డిపూవుల కింత విలువనిచ్చి ఇన్ని కవితల నల్లిన కవి కవికొండలయే.

ఎఱ్ఱకలువ పూవు కాపుదృష్టిని అకర్షింప లేక పోయినదని "గట్లచుట్లు పండ్ల చెట్లుఁ బెంచును" "నిలిచి పూచు విన్నను నేరడుగద కాపు" అని బాధ నొంది "ఓ ! ఎఱ్ఱ కలువ పువ్వా ! నా చెంత కీవురావ !" అని దానిని పిలుచును

ప్రకృతిలో శోయగముల నీనుచు, సుగంధ భరితమై ఒప్పు పూవులన్నియు

వీరికి ప్రీతిపాత్రమ లే సన్నజాజిని గూర్చి "తెల్లవారెకు సరికి తెల్లపూల నెన్ని పూయంగ : గల్గితే నన్నజాజి" అని అబ్బురపడును"నింగిలో చక్కని చుక్కలు నెగడునట్లున్న"వని అని తలంచును.

పొగడ పూలను గూర్చి "అప్పుడొకటి, యప్పుడొకటి చుక్కలటురాలి వాసనఁ జొక్కుచున్న పొగడ పూవులనేరంగ దగును సఖుడ : కొసరి కొసరి కమ్మని తావి విసరుచుండె" అని వాని సువాసన కబ్బురపడును చిన్నసున్నమైనను నొక చిత్రపు జీలిక రేకుల నొప్పు" అని, "సన్నని దారము మూరు వృంతమున్" అని దాని స్వరూపమును మన కన్నుల ముందుంచును. కొత్తిమిరి సుగంధారోగ్య కోమలంపుగాలి" కి ఆకర్షితుడగును పున్నాగము గూర్చి"పచ్చవి జీబుటాకు శిఖపై తెలిగుత్తుల వ్రేలు మొగ్గ సొంపెచ్చగ, నిల్వనిల్చి యలరించు" అని కమ్మనితావి గుప్పచు, విచ్చినపూవులు పయిని రాల్చుచు పాందుల నాకర్షించు చుండును." అని చెప్పును. అవి "పైకి జల యంత్రములు చిమ్మ వసుధ పెండి పడెడు నచ్చపు బిందువుల్ పగిది సురలు"అట. అంతియేగాక"వర పురాణ సాధ్వీదేవి తురుము మెల్ల సడల జారెడు ముతియాల సరములట్లు" ఒప్పినవని కవి మురిసిపోవును.

తురాయి పూలు "చెల్లెల్లన్ హరితార్ద్రి సాంద్రదళ విస్తీర్ణంబుగా నొప్పు, నా తట్టుంగొనన్ విధిన్ .. దానెట్టినా రంగుతో " చోద్యముగా తోచునవి చూపును.

మల్లెపూవుల వాసనకు మనస్సు రంజిల్లగా -
"దోసెడు దొడ్డ పూవులను దొడ్డిలో పూచిన మల్లె పందిటిన్
గోసి యనంటి యాకునొక కొంచెము గ్రొచ్చగ నావసన వర్ణమున్
బొగడ పద్దెమ : నీ పెటు రాకయుందువే" అని వానిని చూడగనే
కవిత్వము తనలోనుండి పొంగి పొరలుచున్నదని చెప్పును
"ధవళంబౌ రుచి వేగు చుక్కలను, నీ తావుల్ ప్రభాతానికిన్ నవ
మార్గంబులు గొల్పుచున్నవ"ని మల్లెలను ప్రశంసించును.
ప్రతి ఏటా చిగిర్చి, పూయు మొక్కలు ప్రాణుల కెంత హాయిని గూర్చు
చున్నవో గదాయని అతడు తలపోయును

"ఏటేటా చిగురు పట్టి - ఏటేటా పూత పూసి
కోటి సంవత్సరాల ప్రేమ - ఖూద భెదతఖి

రావిచెట్టు ఎఱ్ఱ చిగిర్చి - వేపచెట్టు తెల్లవిరిసి
కుఱ్ఱతనపు గోరికొక్కొద్ది - కూడియుంటవి - చెట్లు చేరియుంటవి"

అనివాని వివిధ వర్ణములను సాక్షాత్కరింపచేయును
"పిట్ట లారువేళఁ బెద్ద బీరపువ్వు పచ్చగా
వస్తై ముడుచు కొన్న దిస్తై యందముగను విడుచు"

బీరపూవు ముకుళించుట, వికసించుట గూడ వీరి దృష్టిని ఆకర్షించును

మానవునికి జీవితాధారమై అతని మనస్సున కాహ్లాదమును గొల్పు ప్రకృతి ఎంతటి క్షమామూర్తియో కవి వెల్లడిచేయును.

"ప్రకృతీ నీ క్షమ యెట్టిదోకద
మహా పాషాణ గుప్తార్థమున్
శకలంబుల్, శతముల్, సహస్రములుగా
వానడన్ ద్రవి విన్ వికృతిన్ జేసినఁ గావి
వేఱు విధిఁ గన్పించిచ్చుచున్ జూపఱనే సుకృతిన్ జేసెదు
వైపరీత్యములకున్ కుపిక్కింప కావంతయున్"

తన్ను త్రవ్వి ముక్కలుగా చేసినను ధరిత్రి కోపింపక మానవునిపై దయ చూపించుచున్నదనును భూమాత క్షమాశక్తికి జోహార్లు అర్పించును.

అట్టి ప్రకృతిలో లీనమయి పోవలయునని కవి ఆకాంక్ష కానీ ఆ కోరిక తీరుట అసాధ్యముగ తోచును.

"అంతరిక్ష మందలేను- అచటి రిక్క అక్షిమూయు
కాల గర్భ ఖననమేమొ - కడుపు తలగు కటికమిత్తి"

అని అంతరిక్షము చేరుదుననినను నక్షత్రములకాంతి కన్నులను మూసివేయునని, కాలగర్భమున లీనమగుదుననిన అఁకటికమిత్తి అని పరితపించును

ప్రకృతికి తనకు ప్రాణస్నేహమని ప్రకృతిలోని భాగములన్నియు తనలో ప్రతిఫలించునవి మురిసిపోవును

"కొండల్లో నాగుండియవుంది
చెట్లల్లో నా గొంతుక వుంది

చెరువుల్లో నా చిత్తం వుంది
వాటికి నాకూ ప్రాణస్నేహం
నే పాట పాడితే అవి
ప్రతిధ్వనిస్తవి
పల్లవిస్తవి
ప్రతిఫలిస్తవి
వాటికి నా యెడ తీరని మోహం

.......... ......

నా గుండె యులివు
నా గొంతు గద్గదిక
నా రూపు రేఖలు
వాటిదీ నాదీ యొకటే దేశం–"

ఇట్లు ప్రకృతిలో అంతగ తాదాత్మ్యము చెందును.

"శ్రీ కవికొండల వెంకటరావుగారి ప్రకృతి కవిత్వంలో ఉన్నంత విషయ వైవిధ్యంగాని, విస్తృతతగాని, సహజతగాని మిగిలిన వారిలో కనబడవు. మన అధునిక కవిత్వంలో మొట్టమొదటగా అచ్చమైన ప్రకృతి కవిత్వము, జానపద కవిత్వము వెలయించిన గౌరవం వీరికి దక్కుతుంది"[1] అని పిలకా గణపతి శాస్త్రిగారు ప్రశంసించిరి

కవికొండల ప్రకృతిమాత ఒడిలో ఊయలలూగి చక్కని, అపూర్వ భావనా పటిమతో ప్రకృతిని వర్ణించిరి. వీరు ప్రకృతిని పలుకోణములలో, నిశితముగ, పరిశీలించుటచే వీరి చేతిలో ప్రతి అంశము నవ్య రూపమును సంతరించుకొనినది తెలుగు దేశ ప్రాంతమంతయు, ముఖ్యముగ ఉభయ గోదావరీసీమలో కనిపించు సుందర దృశ్యములు వీరి కవితలలో సంక్షిప్త సుందరముగ, మనోజ్ఞమగు రీతిలో మనకు దర్శనమిచ్చును వీరి దృష్టిలో ఏ అంశమును అల్పము కాదు అతి సామాన్య భావమునైనను వాస్తవదృష్టితో చూచి చమత్కారముగ చిత్రించుటయే

---

[1]– కవికొండల వెంకటరావుగారి కవిత్వం– పి గణపతిశాస్త్రి– భారతి, విజయ పుష్యము పు– 5, 9.

వీరి విశిష్టత. వీరికి సముద్రము, నది, పక్షులు, జంతువులు, పూవులు మొదలగునవెన్నో కవితా ప్రేరకాలయినవి. వీరి ప్రకృతి వర్ణనలు వర్ణచిత్రములుగ, దృశ్య సాక్షాత్కారానికి ప్రతీకలుగ మనముందు నిలుచును

గడ్డిపూవుపై మొదటగ కవిత్వము చెప్పిన వారు కవికొండలవారే యన వచ్చును ఇంతకు పూర్వము దువ్వూరి గరికపై కవిత నల్లియున్నారు గడ్డి పూవును వివిధ దృక్పథములతో దర్శించి పలు గేయములను రచించిన వీరివిశిష్టత, ప్రత్యేకత నిందు గాంచవచ్చును

ఉదయ భానుకాంతి, అస్తమయ సంధ్యారాగములు, చంద్రోదయ వర్ణనలు వీరి చేతిలో నూతన సోయగములను దిద్దుకొనినవి. చిన్నిమేఘము, వర్షపుచినుకు, ఉరకలెత్తు సముద్రము, వరదతో విజృంభించు గోదావరి, గలగలపారు పంట కాలువలు, కేదారపు మడి మున్నగు వానికి నూతన శోభలను కూర్చిరి. మల్లె పూవునుండి గడ్డిపూవు వరకు, కోయిల నుండి కాకి వరకు, చిన్నారి తువ్వనుండి సింహాదిరప్పన్న వరకు వీరి దృష్టిలో భగవత్స్వరూపముతే నీటి బొట్టును వర్ణించు సందర్భములో వీరి శాస్త్రీయ దృక్పథము, అస్తమయ సూర్యకాంతిని రక్త దీధితులతో పోల్చుటలో వీరి అభ్యుదయ ధోరణి కాంచవచ్చును

పందిరి కల్గించిన తీగ వాలిపోతే కలతపడును. కేదారములోని కలువకాడను ఏ కూలివాడైనా కోసి గడ్డిమోపు కట్టునేమో అని, మోపును కట్టునపుడు గడ్డిపూలు నలిగి పోవునని తల్లడిల్లి పోవును. ఇంటి ముందు పూవును తాను కనుమరుగైన ఎవ్వరైన కోసి వేసెదరని సంకోచించును ఇట కవి కరుణాంతరంగము, సున్నిత మనస్తత్వము గోచరించుచున్నది.

ఇంతగా ప్రకృతిని చూచి పరవశించి, స్పందించి, దానిలో తాదాత్మ్యమును చెంది, భగవంతుని చేరుటకు పరితపించిరి కనుకనే కవికొండల ప్రకృతి కవిగా వాసికెక్కెను.

## 4. ప్రణయ కవిత్వము

నవ్య కవిత్వ శాఖలలో ప్రాముఖ్యము నొందినవి ప్రణయ కవిత్వము. ప్రాచీన కవులు, లాక్షణికులు ప్రణయ శబ్దమును స్త్రీ పురుషుల మధ్య శృంగార పరముగ నుపయోగించిరి. కాని అటనట నీ శబ్దము సాధారణ స్నేహపరముగ కూడ వాడబడినది.

నవ్య కవులలో ప్రణయ సంకీర్తనము చేయని వారరుదు. వీరు తాను ప్రేమించిన పడతిని గూర్చి, తన్ను ఆకర్షించిన సుదతిని గూర్చి ప్రణయ గీతములను రచింప దొడగిరి కొందరు దీనితో తనివి చెందక తమ ఊహలన్నింటిని రాశీకృతము గావించి అద్భుతమగు ఊహా ప్రేయసిని సృష్టించిరి.

కవికొండల ప్రణయ జలధిలో మునిగిపోయి ప్రణయ గీతములను పాడిరి కానిమాటలకందని మధురానుభూతులకు, భాష కతీతమగు భావములకు, రాగమునకు అనువైన గీతముల రచించిరి జానపదుల ప్రణయముపై వీరి దృష్టి మరలి వారి శృంగార జీవితమును కోమలముగ చిత్రించిరి స్త్రీ బాహ్య స్వరూపమునకు గాక అంతరంగిక స్వరూపమునకే ప్రాధాన్యమిచ్చి రచనలు చేసిరి.

వీరు దంపతుల నడుమనుండు మమతానురాగములను కడు రమ్యముగ వర్ణించిరి ఇది 'కులపాలికా ప్రణయము' క్రింద వచ్చును

అద్దమున తన సౌందర్యమును వీక్షించి మురియుచున్న అర్ధాంగితో నాథుడిట్లనును

'అద్దమున చూచుకోవద్దు అడుగు నన్ను
అందముగ నున్నదాననా?" అని శుభాంగి
అద్దమందున జూచిన నగపడు మటి
ఏడు వారాల నగలు, నీవెంచు కొందు
వాని సొగసు వానివెల; సొబంగులీను
నీదు నవయవ నిజశోభ నెమ్మొగ నీవు
నన్నడిగిన; దెలుపుదు నైజశోభ '

స్త్రీ తన బాహ్య సౌందర్యమును మాత్రమే దర్పణమున కాంచి ఆనందించిన భర్తర భార్యలోని అలంకారాతీతమైన సౌందర్యమును దర్శింపగలడు. కనుకనే అద్దముప చూచుకొనక తననే అడుగుమని చెలిని కోరును.

కవిభార్యాభర్తల నడుమనగల అనురాగబంధమును పవిత్రముగ చిత్రించుము

'ఒక్కచోట బుట్టుకాంత వేఱొక్క చోటఁ బుట్టు పురుషుండు
వారలు చెట్టఁబట్టి, కూడి యుందు రిసుమంత క్రొత్తలేక
దంపతుల ప్రేమ చిత్రంబు దలఁచిచూడ'

'ఏను గేవలంబు మనిషిని' అని 'నీవు దివ్యాంగన వప్సరసవు, మెఱుపు దీగవలరు గొమవు' అని భార్యను అపురూపముగ నెంచును

భర్తపట్ల అనురాగము గలిగి, అనుకూలవతియై యుండు భార్య భర్తకు ప్రాణ సమానముగ నుండును ఆమె పాతివ్రత్యమే తనను కాపాడునని భర్త నమ్మును.

'నీ పతివ్రత నియతి— నీదు పున్నెపు గాథ
నీ ప్రేమమయ కళన్— నా ప్రాణముల్ నిల్చు
ప్రణయినీః ప్రణయినీ'— అని ఆతడు భార్య కొఱకు పరితపించును.

ఆమె దూరము కాగా వియోగముతో 'నిన్ను తలపోయుచు నే జిదుముకొని పోతి' నని నైరాశ్యములో మునిగిపోవును.

తనకేమియు మిగిల్చికొనక సర్వస్వమును తన జీవిత భాగస్వామి కర్పించు తపన భర్తలో కాన్పించును

'నేను చినిగిన పాత్ర — బైని పైచుక చన్న
నిను బనారసు చీర— గొనబుగా గట్టింతు
మోము ముడుతలు వడుచు— నే ముదిమి బైకొన్న
నవ వయో విభవమం-— దరివిగా నిన్నెంతు'-

జన్మజన్మల సుకృతఫలమే తన భార్యను పొందగలుగుట అని తల పోయును

'జన్మ జన్మాంతర సుకృత సఫలత యిది,
నాదు ముందు మూర్తిగొని యామోద మిడెడు
ననుచు; నమకొన నేరని యప్పుడున్న
దానికంటె నెక్కుడు రిచ్చదలపుగొంటి'

'చేతలోనే నీకు- నాకు సఖ్యం గూర్చినాడు బ్రహ్మ' అని తలపోయును.

'ఆది మధ్యాంత రహిత వేదలక్ష్మివి మద్యశః ప్రియవుః కాంత' అని ఆమెలో భగవత్స్వరూపమును గాంచును ఆతని ప్రేమ చివరకు అద్వైత స్థితికి చేరును. స్త్రీని ప్రణయమూర్తిగ ఆరాధించుటయేగాక, ఆదిశక్తిగ నుపాసించుట కూడ నవ్యకవితా రీతులలో నొకటియే

'పదునాల్గు భువనాలు- పరిసుప్తి నుండంగ
మనము మేల్కొని యుంట- మఱచిపోతె?'
'నీ కంటి కొలికి నొక
నీటిబిందువు నిల్చి
ఖేదమో మోదమో
భేద పరుపరాని నిశ్చలశోభ

మానసీయంబయ్యె'- అని నిశ్చల మనస్కుయగు తన చెలి కంటి నీటి భేద ప్రతిరూపమో, మోద ప్రతిరూపమో తెలియలేననను. ఆ బిందువు ఆమె కెంతయో శోభ నిచ్చినదను

'ఒకరు పుట్టినపుడొకరు పుట్టకయున్న
ఒకరు పోవునపు డొకరు పోవ
నూహగొనుచు ముందు యుల్లంబు లలరంగ
ఏమి ఈడు జోడు ప్రేమమాది'.

ఇట భార్యాభర్త లిరువురు ఒకే పరి మరణింపవలయునని భర్తయే కొరుకొనుట విచిత్రము.

'ఎదురైన యప్పుడే—ఎదల కలయిక కాదు
పిదపకూడా కలదు—తుదిదాకా నుండేదె యీ ప్రేమ ఓ చెలీ!'

అని చూపులు కలిసినప్పుడు, మనసులు కలసినప్పుడు మాత్రమే ఉండునది ప్రేమకాదని వయసు మళ్ళిన పిమ్మటకూడ నిలచి యుండునదియే ప్రేమ అని చాటును

తన ప్రేయసి విముఖత్వమును సహింపలేక ఇట్లు ప్రార్థించును

'ఓ మనోహరమూర్తి! నా మనో మకుటమా!
మోమోటమున నేమ ముచ్చటపడ
ప్రేమానకే దోసిలొగ్గి ఒగ్గిచూడు
నా మహారాణి! నా ఆమనీ! నామణీ!'

ప్రియుడు తన చెలిని దివ్యస్వరూపిణిగ నెంచి ప్రసన్నురాలిగ చేసికొను టకు ప్రయత్నించును ప్రేయసి రూపలావణ్యాదులను పూర్తిగా పరికించకయే

ఆమెకు సేవకుడనైతిననుట కవి ఆత్మసౌందర్యమునకే ప్రాధాన్యమిచ్చుట చూడవచ్చును.

'నీసొబంగెట్టిదో—నీసురూపంబెదో
తెలిసికొనకుండనే—మనసు కలుసుకుపోయె
రూపురేఖల వివర—మేర్పరింపకమున్న
చేపట్టితిని—నీ సేవకుడనైతిని'

ప్రేయసి వియోగము నే మాత్రమును భరింపలేడు

'నీయశాతనితాంత— నేత్రద్వయపు శోభ
నైక్యమౌదునటన్న —గానీయవుగా చెలీ!
ఎడలేని కలయిక లేనేలేవా మనకు?
కనుమూతలో దాగి — కనుపించవా చెలీ?'

అని వియోగమును సహింపలేనని చెలికి విన్నవించును ఎడలేని కలయికకు తహ తహలాడువాడును

"ప్రేమ పూర్ణమైన నా హృదయపాత్ర
నీ దినము నీ పెదవులకందింతు ననెడు
నాసలోఁ గన్ను విచ్చితి నమృత సరసి
ప్రాతరున్మిషితమైన పద్మమట్లు"
'చదువులన్నీ అడికి వెదకి చూస్తే ప్రేమ
చిన్ని పూదేనెలా చిలుకుతుండు"

అని ప్రేమ మాధురిని చిన్ని పూదేనెతో చక్కగా పోల్చును అట్టి ప్రేమను అనుభవయోగ్యము గావించుకొనుటకు ప్రేయసీ ప్రియులకు భాగ్యములేదు. ఇరువురును వియోగముతో శోకము ననుభవించుచున్నారు.

'నేడుశోక బాష్పంబులు నేలరాలు
మనల యిర్వురి కన్నుల కొనలనుండి
గానియందమెయ్యది యందొ? తలపనేరఁ"

అని ఆ ఆవేదనలోనే అందమున్నదని, అట్టి నిష్ఠురమైన శోకమును భరించుటలోనే శాంతి లభించునని ఓదార్పు పొందును.

ప్రేయసీ వియోగానలమున దగ్ధమగుటను ప్రియుడు చమత్కారముగ చెప్పును, ఒకసారి ప్రేయసికి లేఖ వ్రాయుచుండగా అతని వ్రేళ్ళకు సిరా అంటినది.

'కాదు కాదు! సిరామసి కాదు కాదు!
నీ కౌఁగిటనయి యేరీతి నిబిడ విటపిఁ
బూయు నాకాశమల్లికా పుష్పమొకటి
నీ కౌఁగిటనయి వేచిన నిష్ఠురనిశిఁ
దీవ్ర తప్తాంజలి నది గతించిమండి
మిగిలిపోయె నిసీ ! మసి మిగిలిపోయె'

— అని అది సిరామసి కాదని, ప్రేయసి కౌఁగిట పూచిన పుష్పము నిష్ఠుర నిశిలో తీవ్ర తాపమునకు మండి మసిగా మారినదని మనోహర భావమును వెలిబుచ్చును.

'పొల్లుమాటలే నావి,
కాని
యుల్లము చీల్చుకు వచ్చాయి'

అని తనమాటలు కల్లలుగ దోచినను అవి గుండెలోతునుండి వచ్చినవని పలుకును

పూవులను కోయ వలయుననిన ప్రియునికి మనసు రాకున్నను చెలికోసము ఎట్టిపని చేయుటకైనను వెనుకాడడు.

'నాచెలి వేనలినుండి — వాడిపోవ నూడిపడగ
నిన్ననే గోసికొని పోదు — క్రొన్ననరో క్షమియించు'

అందులకా విరి 'ఎటులైనను వాడిపోదు కుసుమగాత్రి కుంతలము మెటిసి పడుట భాగ్యముగద' — అని ప్రియుని ఓదార్చును.

ప్రకృతిని చూచి పరవశించు ప్రియునికి, ఆ అందములకన్న ప్రేయసి సోయగమే మిన్న అని మురిసిపోవును.

'వేకువ సంధ్యా ఎట్టిన తెలియదు
సాయం సంధ్యా ఎట్టిన తెలియదు
నీ మోవికున్నా ఎఱుపూ వొక్కటె
తెలుసును పిల్లా! వలచితి పిల్లా'

వీరు జానపదుల అమాయకపు ప్రణయ ప్రవృత్తిని నిసర్గ సుందరముగ వర్ణించిరి.

"చక్కిలాలొండామరా — చక్కన్ని నా బావ!
    యొక్కచే యుంచానురా!
వక్కాకు నివుతెస్తే — సుక్కకూరేనేస్తె
అక్కఅకు వస్తుందిరా — చక్కన్నినాబావ
అటకపై పెట్టానురా!
నిశిరేత్రి నివ్వవస్తె — దిశ తిరుగనే సూస్తె
మక్కువలు నిలిపించురా — మామంచి నా బావ
మనసోయి దాచానురా!"

— అని భర్తకు ఇష్టమైన వంటకము చేసి అతని కొఱకు అమె దాచి యుంచినది. వక్కాకుతో ఒక్కచేయైనను భద్రముగ ఉంచి మనసారా అతని కొఱకు ఎదురు చూచినది.

ఒక పల్లెపడుచు తనమామయొక్క స్వభావమును గూర్చి ఇట్లు తల పోయును.

"మామంత మంచోడు మఱి దొరకబోడు
    మామంత పెద్దోడు మహా బుట్టబోడు
నా బూరి బుగ్గలో బూరి లాగుంటాడు
    నా పూరి గుడిసెలో ముల్లులాగౌతాడు
నాకన్ను తెలసైగ రంగులేస్తాడు
        నా నల్లసిగజూచి తెల్లబోతాడు
కనబడక పోతినా కిదలికాస్తాడు
        కనబడితినా వీధి గర్వపోతాడు."

పైగేయమున పల్లెపడుచు తన మామను ఎంత అపురూపముగా భావించునో చక్కగా చిత్రింపబడినది.

అనిష్కళంక ప్రేమజీవికి తన ప్రేయసి కన్నుల యెదుట సన్న లోక మంతయు ఆమె స్వరూపముగనే తోచును 'ఆకాశంలో నీలం తెలియదు, అంబుధి లోని నీలం తెలియదు! నీ కొప్పులోని నీలం వొకటె తెలుసును పిల్లా! తలచితి పిల్లా" అనును.

"కళ్ళల్లో ముద్దెట్టుతూ తెల్లారనీ నంటది
తెల్లారిపోతుంటే తా — నెల్లాగో అయిపోతదీ
ఒక్కాళ్ళపై యున్ననూ — నక్కి తా నలుసౌతదీ
ఊదేస్తే గాలౌతదీ — రోదిస్తే నభమౌతదీ"

— కవి భావనా చాతుర్యమునకిది మచ్చుతునుక. భార్యాభర్తల ఏకత్వమిట చూపబడినది

నావపై కూర్చుండిన వయస్సులోనున్న పిల్ల ప్రియునికి పూదేనెగా, పున్నమినెల బరణిగా కన్పించినది. 'నక్కి తా నలుసౌతది' అను భావన ఉన్నత ముగ నున్నది

"నీకిచ్చినా పువ్వు వాడిపోదింక
నీపెట్టినా ముద్దు వీడిపోదింక
నీలికోకాకట్టి నీ టొంక సూస్తాను
నీ జాలి గుండెలో చీకట్లో మెఱయిస్తి —
గాలి కబురూ పెట్టి కడవెత్తులేస్తాను
నీ గుబులు గుండెలో జేగంట మ్రోగిస్తి
కితగాను వూకొట్టి కడవంచు రాస్తాను
నీలోతు గుండెలో నాకు తావిస్తి'

ఇందు ప్రియుడు తన సహచరి స్మృతులు తనలో ఎంత శాశ్వతముగ నిలిచిపోయినవో తెలుపును.

తన సర్వస్వము ప్రేయసియే అని తలచును. ఆమె వలన ప్రపంచ మంతయు సుఖమయముగనే తోచును

"ఇది మధురమన్నాక
ఏ యదీ చేదగును
ఇది సౌఖ్యమన్నాక
ఏయదీ దుఃఖమగు
ఆ ఇది నీవునూ చెలీ!"

ప్రియుని సర్వభావములకు ప్రేయసియే ఆలంబనమని హృద్యముగ వ్యక్తము చేయును.

"నీవైన నీమోము చాటంగ చూస్తుంటే
పాటిరేవూ ఎడః పాటిదనిపిస్తాది
వాలుకన్నుల చూపు జాలర్ల నగుమోము
సోగకన్నుల మూగ చోద్దాల వగమోము
కామిస్తునంటాను, మోహిస్తునంటాను
ప్రేమిస్తునంటాను, ప్రణయిస్తునంటాను'

'నిత్యంబన్నది సత్యంబైతే-సత్యంబన్నది నిత్యంబైతే-కృతికిన్నర్థాలెందుకు బావా!' అను ఆ ప్రశ్నలో జీవితమునుగూర్చి జిజ్ఞాస గోచరించును

ఆమె వియోగమునాతడు సహింపలేడు
'కన్నీరముతో గంటిని నింపి
జల తరంగిణిగ మ్రోగిస్తున్నా
ఊహాతంత్రుల హృది సవరించి
వీణానాదం వెలయిస్తున్నా' అని తన దుఃఖమును వెల్లడిచేయును
'నాకూ నెవ్వారు లేరు
నీకూ నెవ్వారు లేరు
ఏటి యొడ్డున ఇల్లు కడదము పదరా
ఆకోడెకాడు ఎవదో!'

పైగేయమున ప్రేయసీప్రియులు ఒకరికొకరై బాహ్యప్రపంచముతో సంబంధము లేక జీవింపవలయునని కోరుకొందురు. వారి తీవ్రమైన తపన ఇందు ప్రకటితము.

"బల్లకట్టూ లేదు
మెళ్ళోతు నీళ్ళలో
ఎల్లాగురా మావ
మళ్ళెయ్యరా! నీళ్ళ
మళ్ళెయ్యరా!
పిల్ల ఇన్నాళ్ళ కాల్వలా
ఈ వేళ లేవాపే!'

బల్లకట్టు లేకుండుటచే కాలువ దాటుటకు 'నీళ్ళ మళ్ళించుమ'ని పిల్ల తన

మామను అడుగును. జీవితము ఎల్లప్పుడు ఒకే విధముగ నుండనట్లే నీటి ప్రవాహము ఎప్పుడు ఒకే విధముగ నుండదు. ఆ విషయమునే 'ఇన్నాళ్ళు కాల్వలా ఈవేళలేదొసే' అని అది అసాధ్యమనును. కనుక ఎదురీది అవలిగట్టు చేరుటయే మార్గమని ఎంచును.

'నదినిండ నీరున్నది-నావపై పిల్లున్నదీ
పిల్లాకు వొళ్ళున్నదీ-వొళ్ళెల్ల వయసున్నదీ'—

అనునది లలిత శృంగారగేయము. దీనిని గూర్చి "నదినిండ నీరున్నది. " మొదలైన శృంగార గీతాలు మరుపురానంత మధురమైనవి శ్రీ కవికొండల కలం కుంచెయై గోదావరి తీరములోని సుందర ప్రకృతిని, ముఖ్యంగా కష్ట జీవుల, కడగండ్లను రసరమ్య చిత్రాలుగా తీర్చిదిద్దింది[1] అని కడియాల రామమోహనరావు అనిరి

తన ప్రియురాలిని ప్రకృతిలో భాగముగ నెంచును. ప్రకృతిలో చుక్కాయై, వెన్నెలయై, దక్షిణానిలమై వ్యాపించిన తన ప్రేయసిని ఎవరని ఎంచగలనని ప్రశ్నించును

"చుక్కాల్ల చూపులా — చూపు చూచేను
వెన్నెల్ల నవ్వులో — నవ్వు నవ్వేను
ఎవతె ప్రియురాలు-ఎవతెనాదయిత?"

ఆమె 'భానూదయపు తెల్లగావంచేపేన'ని, 'పక్షుల పూవుల్లపలకరించేన'ని 'నిశ్శబ్దవర్షాన నిదురపోయేన'ని చెప్పును

అమాయకపు పల్లీయుల మధ్యనుండు సరాగ విరాగములను చక్కగా చిత్రించును.

'ఎందుకీ మూతి విఱుపు — ఎవరి మీదనో పడతి
ముందు తీర్థములోన — పూలంచు చీరకొంట
పదపద పడవెక్కు — పాటువేళ తప్పునంట
అందగాడ! అలాగుననే — ఆసపెట్టి తీసికొస్తి
పాలకొల్లు సంతలోనె — నీలిచీర కొందునంటి
నడిపించినావు నీవు — వడివడి కాల్వగట్టె'

1_తెలుగు కవితావికాసం-కడియాల రామమోహనరావు, పు-1౭౪

ఇందు ఆనాటి తీర్థములు, సంతలు, జానపదుల చిన్నచిన్న కోరికలు, అప్పటి సాంఘిక స్థితులు ప్రకటితములు. ఇట పల్లెపట్టు, అచటి కష్టజీవులు కన్నులకు కట్టుదురు.

శ్రామిక జీవు లిరువురు కష్టించి పనిచేసి ప్రశాంత జీవనము గడుపుట మేలని చాటును.

'భార్య యింట నుంట బతి వేఱు పనిమీద
రాజవీథినుంట లచ్చనంబుగాదుగాదు
మేము కలిసి యిర్వుర మొక్క పొలమునందు
చేయదలతుము పని, ఊడ్పు నీటనీడ లొక్కకళ్ళవి
వేఱు తెలియబోక మొలక తేటడాగు'

వారిరువురు వేరుగ నుండలేక పోవుటయేగాక వారి నీడలు వేరగుట గూడ వారు భరింపలేరు

'నూర్పుడపుడు పాట తూర్పారువేళ నే
మొదలు పెట్టునంత నదియుపాడు
ఒక్కగాలి మేము చక్కగ బీల్తుము'
అని శ్రమను పంచుకొనుటలోని ఆనందము ఇందుచాట బడినది

తన ప్రేయసి సంతోషముగ నుండుటయే ప్రియుని ధ్యేయము. అందులకే ఆమెను ఎల్లవేళల నవ్వుచుండుమనును.

'పైరుగాలికి పూలవాసనలు వనమెల్ల
వలపించి వలపించి నిలిసిపోనాయెల్ల
హద్దు పద్దులులేని యాకసములో
ముద్దులా కనురెప్ప ముణుసుకొనులో
సుక్కలో సుక్కొడిచి మొక్కమామిడి నిలిచె
లేడిచూపుల పిల్లలెగవేమే!
బేడిశాకళ్ళ నగవేమే!' —

ఇట్లు ప్రేయసికొరకు పరిపరి విధముల వీరు తపించుట చూడనగును.

కవికొండల ప్రణయ కవిత్వములో వివిధ రీతులు గోచరించును. కుల

పాలికా ప్రణయములో భారతనారీ ఔన్నత్యము, భార్యాభర్తల పవిత్రబంధము చక్కగ చిత్రింపబడినవి ప్రాణశఖికొఱకు పరితపించి కొన్ని గేయముల వెల యించిరి అమాయక జానపద శృంగారమును సరసముగ తీర్చిదిద్దిరి ఇట్లు విభిన్న విషయములను స్పృశించుచు వీరు ప్రణయ గీతికలను అల్లిరి.

## 5. జానపద కవిత్వము

జానపదులకు సంబంధించిన వాఙ్మయము జానపద వాఙ్మయము జనపదము లందుండు వారు జానపదులు. జనపదమనగా పల్లెటూరు. జానపదులు పాడుకొను గేయములు జానపద గేయములు ఇవి జానపదుల మానసిక స్వరూపమును, అనగా సుఖదుఃఖాది భావావేశములను యధాతధముగ అవిష్కరించునట్టివి

తెలుగు వాఙ్మయములో ఈ విధముగ వివిధచ్ఛందో రీతులలో చెప్పబడిన జానపద కవిత్వమొక ప్రత్యేక శాఖగా నిల్చినది, కొందరు ఔత్సాహికులైన సాహిత్యాభిమానులు, పరిశోధకులు మారుమూల గ్రామములలో, పల్లె ప్రజలలో మౌఖికముగ మాత్రమే నిలిచియున్న పలు జానపద గేయములను సేకరించు చున్నారు. పండితాదరణమునకు నోచుకొనక పోయినను కొందరి విమర్శకుల ఆదరణకు పాత్రమైనవీ గేయములు. ఆధునిక కవులు కొందరు జానపదగేయముల లోని భావములను మెరుగులు దిద్ది రచించుట కలదు. వీరిలో గురజాడ ప్రథములు.

ఆధునికులలో బసవరాజు అప్పారాజు, నండూరి సుబ్బారావు, అడవి బాపిరాజు అట్టి గేయములను రచించిరి.

కవికొండల ఈ శాఖలో చేసిన కృషి ప్రశంసనీయమైనది 'శ్రీ కవికొండల వెంకటరావుగారి కవిత్వము తలచుకునేసరికి మన హృదయాలలో ఒక్కసారిగా ఉభయ గోదావరీ ప్రాంతాలలోని జానపదుల జీవిత మంతా చిత్ర విచిత్రమైన భంగిమలలో మెరిసిపోతుంది '[1] అని పిలకా గణపతి శాస్త్రిగారు తన వ్యాసములో తెలిపిరి. జానపద కవిత్వమును పునరుద్ధరింప చేయుటకు కవికొండల కొన్ని జానపద గేయములను వ్రాసిరి

---

[1] కవికొండల వెంకటరావుగారి కవిత్వము — పిలకా గణపతిశాస్త్రి, భారతి, విజయపుష్యము ; పు-4

ఆస్వాల్డ్ కూల్డ్రే గారి వద్ద శిష్యులగు కవికొండల, బాపిరాజు ఆ కాలములో వెలువరించిన పాటలు జానపదుల భాషలోనుండి, అర్థ సౌలభ్యముతోను, భావ సంపదతోను వెల్లి విరిసినవి.

జానపద వాఙ్మయముపై హుంషార్ క్లబ్, రాజమండ్రి సమావేశమున కవికొండల ఇట్లు చెప్పిరి. "జానపద వాఙ్మయము అన్నమాట ఇపుడు పరిపాటి అయిపోయినది. పూర్వమొకప్పుడు ఈ వాఙ్మయాన్ని వాఙ్మయంగా జమకట్టేవారు కారేమో! అధునాతనులు కొందరు బయలుదేఱి వాఙ్మయంలో భావాలు భాష నేర్చుకోదగ్గవే, అన్న తరువాత దానియందు శ్రద్ధా భక్తులెక్కువయినాయి ముద్రణాయంత్రము, రేడియోయంత్రము విపులమైన కొద్దీ ఇది అందరి యొక్క అందుబాటులో వున్నది. జానపదవాఙ్మయం అన్నది అక్షరరూపంలో ఇమిడి వున్నది కవిత్వము క్రింద జమ కట్టబడుతూంది. కాని ఈ వాఙ్మయాన్ని సృష్టించు కవులు ఏనాటివారో ఇది అతి నిసర్గమైనది. కవిని గురించి తెలియనంతమాత్రాన అన్నింటిని జానపద కవిత్వమని తలచరాదు. ఋతువులు, ప్రణయము, విషాదము, వినోదము మొదలైన వాటిని గురించి వినవస్తాయి."

వీరు పుట్టి పెరిగిన పల్లె ప్రాంతము లీతని కవిత్వమునకు ఆలంబనమైనది అయా చోటులందు కలసిమెలసి తిరిగి చూచిన జానపదుల జీవితములను వారి సరస సంభాషణములను తన గేయములందు ప్రతిబింబింప జేసిరి

'సరిగమ పదనిస — సనిదప మగరిస
తకతిక తకతిక — తధిమితిజంతరి
నావయ్యారీ ! రాధా! — ముద్దుగొమ్మా రాధా !
మల్లెమొగ్గా రాధా ! — మొల్లాతీగె రాధా !
చక్కని బుగ్గా రాధా, — చుక్కలసిగ్గా రాధా !
పాటే మనసా రాధా ! — పండేన పనసా రాధా !

జానపదులు పగలంతయు శ్రమించి రాత్రులందు ఒక చోట కూడెదరు, అట్టి సమావేశములలోను, పండుగల సందర్భములలోను పాటలతోను, నృత్యములతోను సమయమును గడుపుచుందురు. ఒక పాదము చివరగల పదము అన్నిపాదముల చివరను పునరావృతమగు ఛందను అట్టి కోవకు చెందినది పైగేయము. ఇందు స్త్రీ సోయగములు సున్నితముగ, మనోహరముగ చిత్రింపబడినవి.

తుమ్మెద పాటలు జానపదగేయములలో మిగుల ప్రసిద్ధి గాంచినవి. అట్టిదే ఈ క్రింది గేయము

'ఎడంబుజం బిందెనీళ్ళు — జుము జుము
బిందె అంచే కుడి చెయ్యి — జుము జుము
నీళ్ళలోన తమ్మి పువ్వు — జుము జుము
తమ్మి పువ్వు మీద తుమ్మెద — జుము జుము
చెరువు కూను నీళ్ళకెళ్ళి — జుము జుము
మంచి నీళ్ళు ముంచుతూంటె — జుము జుము
మించు నెఱ్ఱ మోవి తేనె — జుము జుము
మంచి పిల్ల ముంచు చోట — జుము జుము
ఉంచినట్టి అడుగు చిన్నెల్ — జుము జుము
కాంచినాది తుమ్మెదొకటి — జుము జుము
పెంచినాది తమీలోన — జుము జుము
మడుగులోన విజంపూలు — జుము జుము
విడిచినాది గుడి తుమ్మెద — జుము జుము
పైకిమోము పజ్జకెగిరి — జుము జుము
పాకులాడె పెదవి కోసం — జుము జుము
వెఱ్ఱి తుమ్మెద ఎఱ్ఱ చూచి — జుము జుము
పడతి దాన్ని జడిపి దులిపె — జుము జుము

పై గేయమున తుమ్మెద పూవులనువదలి పడతి ముఖపద్మము కొరకు ప్రాకులాడుటను రమ్యముగ చూపబడినది స్త్రీ ముఖమును పద్మముతో పోల్చు సంప్రదాయధోరణిని కవి ఇట అనుసరించెను

తరువాతి గేయము పడుమవారు పొలములో పనిచేయుచు పాడునట్టిది ఇది జాన పదుల సరస శృంగారమును చక్కగా చూపును

'కళ్ళములో చూచితినో — వరహాలరాజా
కాటుక కళ్ళని యంటూ — వరహాలరాజా
వట్టి గడ్డి మోపెత్తితివో — వరహాలరాజా
పట్టెడ మెడ పెఱిగింది — వరహాలరాజా
బంగారు పాయాలు — వరహాలరాజా

చెంగున నేల్జిమ్మాయి — వరహాలరాజా
వడ్ల గింజలంతేసి — వరహాలరాజా
వడ్లవొల్లు గలిసాయి — వరహాలరాజా
చేటనెత్తి చెఱిగితినో — వరహాలరాజా
చేతఁబోసి లెక్కిడితి — వరహాలరాజా
పయట దివర గట్టిగను — వరహాలరాజా
మూట గట్టు కొన్నాను — వరహాలరాజా
మూట గట్టుకొనినేమ — వరహాలరాజా
మోపు నెత్తుకెళ్ళాను — వరహాలరాజా
దిస్స మెడను జూచింది — వరహాలరాజా
కస్సుమంది నాయత్త — వరహాలరాజా
చెంగు చూచు కొన్నాను — వరహాలరాజా
దొంగ వీవ అన్నాను — వరహాలరాజా'

క్రింది గేయము పావలి తీగపై వ్రాయబడినది. అందరి నిర్లక్ష్యమునకు గురియగు తీగ కవి దృష్టి నాకర్షించినది

'నీళ్ళొవలుండఁ బోరెవరు — పావలి తీగా।
నీకాయ గసరు గోరెవరు — పావలి తీగా।
నీ కోటి పువ్వులొకసారె — పావలి తీగా।
మా కోనమణిగి పూస్తుంటే — పావలి తీగా।
పూట పూట మధ్యాహ్నం — పావలి తీగా।
నీటుగాను చూతునునే — పావలి తీగా।
ఏకాలఁ ద్రొక్కి మట్టేసిన — పావలి తీగా।
నీ కొక్కవముండ దది యేమే — పావలి తీగా।
నీవెందు కిలను బుట్టావు — పావలి తీగా।
నీ యొడుపు చెలికి గిట్టదుగా — పావలి తీగా।
నీ జాద సుంత చెలికి గిట్టదుగా — పావలి తీగా।
చెలి కాళ్ళు నిమ్ము మట్టేసిన — పావలి తీగా।
కలిమి నీదెవని — పావలి తీగా।
తొలగి చమఁచుఁ జూస్తుందు — పావలి తీగా।

మఱునాటికి పూస్తుందువ్ — పావలి తీగా!
నీకో్కపమంటు లేదు గదే — పావలి తీగా!
అవని నిన్నుఁబోలరెవరు — పావలి తీగా!'

పావలి తీగకు ఎవ్వరును కావలి ఉండరని, దాని పూవులు, కాయగసరు ఎవరికిని అక్కరలేదని కవి చింతించును పడతి పావలితీగకు పూచిన పూవులను తలమ ధరించదని, 'ఇలను ఎందుకు బుట్టితివని' దానిని ప్రశ్నించును.

మరల అంతలోనె చెలికాళ్ళతో దానిని మట్టినది గనుక కలిమి దానిదేనని తలంచును. ఎన్నిచేసినను కోపమును పొందని పావలితీగకు అవనిలో సాటిలేదని కవి చాటును.

వఱదలో కొట్టు కొనిపోవు మొక్కపై నొక గేయమును రచించిరి.

'నేను పచ్చ పచ్చ గున్నాను ముత్తైదువా ! నే పిల్లల్తోవున్నాను ముత్తైదువా!
నే మువ్వటాకు మన్నాను ముత్తైదువా! నేలంక విఱిగి వఱద బడితి ముత్తైదువా!
నీవు ఙెంకాయ విసరబోకు ముత్తైదువా! నామువ్వాకు చినిగిపోవు ముత్తైదువా!
నాకోటాకు పైకిరాదు ముత్తైదువా! నాపిల్ల జెల్ల విడిపోవు ముత్తైదువా!
నే తల్లక్రిందులై పోదు ముత్తైదువా! నన్ను బ్రదుకువదల లేదు ముత్తైదువా!'

ఆ చిన్నారి మొక్క దీనస్థితి కవి మనసును కలచి వేసినది. వరదలోనున్న నదికి కొబ్బరికాయలు అర్పించు ముత్తైదువను చూచి మొక్క, కాయ విసిరిన తాను మునుగుదునని, జాలి తలచి ఆయువు నిమ్మని కోరును. ప్రకృతిపై కవికి గల మమకార మిట గోచరించును.

'ఏతం పాట' సరళ సుందరముగ సాగిపోవు గేయము

"ఎవరితో ఎకా్కవో ఏతం! — ఎఱిగుండు పిల్లోడ ఏతం!
నీకైన పిల్లవని ఏతం — నీతోను ఎకా్కను ఏతం!
ఎక్కెక్కుమంటావు ఏతం — ఎనకాల నిక్కేవు ఏతం
చక్కని పిల్లవని ఏతం — ఒకరై ఉంటివని ఏతం
ఊరుపల్లే కాదు ఏతం — పొలం మళ్ళి సూడు ఏతం
గూనముంచేవోడు ఏతం — గూన నానేళాడు ఏతం

వాడొకడు ఉన్నాడ ఏతం? — మగడెక్కడున్నాడొ ఏతం?
మొత్తం మొత్తేసింది ఏతం — మొగని నెత్తిమీద ఏతం
కుంయిమన్నావాడె ఏతం? — కొంద్రంత తడిసిందో ఏతం?
మడిసిన్నదేగదే ఏతం? — వడివంకరంటావ ఏతం
వయిపుల్లు సూడకుర ఏతం! — పిల్లోడ ముల్లిరుగు ఏతం
వయ్యారి నీ త్రొక్కు ఏతం — పెయ్యేల్ల మనుపెక్కు ఏతం"

ఏతము త్రొక్కునపుడు దానికనుగుణముగ పదములు పాడుట రైతుల కల వాటు. 'ఏతం' అను ఊత పదముతో చక్కగ సాగిపోయిన పై గేయం అమాయక జానపదుల శృంగార జీవితమునకు అద్దము పట్టుచున్నది.

క్రిందిది బావామరదండ్ర సరాగమును గూర్చి తెలుపునట్టిది.

"ఏమాంటవూ? — నీవు రావనంటవా?

ఓడతెడ్డు గూద తోడు — ఒక్కలాగు చప్పుదౌను
రాజు కోట నిమ్మతోట — ఒక్కలాగు చల్లగుండు
ఏమంటవూ? నీవురానంటవా?

ఓడెక్కి రంగమెల్లి పోతనంటవా?
గూడచేతఁ బుచ్చుకోని గునుస్తనంటవా?
రాజుతోడ 'రాజమండ్రం' చూస్తునంటవా!
నిమ్మచెట్టు నీడపట్టు నిలుస్తునంటవా?
ఏమంటవూ నీవు రానంటవా?

తెల్లమల్లు మబ్బుజల్లు — ఒక్కలాగె చలువసేయు
సైను తాను కోత చేను — ఒక్కలాగె ఒళ్ళు మూయు
ఏమంటవూ నీవు రానంటవా?

తెల్లమల్లు గట్టుకోని దేశమెత్తవా!
మబ్బుజల్లు మలుపుకుంటు — మంచిగుంటవా
సైనుతాను చింపుకోని పీమకెత్తవా
కోతచేను కోసుకుంటు కులుకులాడవా
ఏమంటవూ? నీవు రానంటవా

పిల్ల పొగరు చింత చిగురు — ఒక్కలాగు పుల్లగుండు
మేనబావ చందమాంవ — ఒక్కలాగు మేళవించు
ఏమంటవూ — నీవు రానంటవా?
పిల్ల ఒంటి విజయనగరం లెగిసిపోతవా
చింత చిగురు పప్పుకూడు సిమడ పెత్తవా?
చందమామ గారి యూరు చక్కపోతవా?
మేనబావ తోడ మేంమాడ్తవా?'

కవి పై గేయమున బావమరదంద్ర సరసములు పల్లెపట్టులో సొగురీతిని లలితముగ సుతిమెత్తగ వర్ణించిరి పల్లె ప్రజలు పట్నవాసపు జీవితమునకై మోజుపడుట సహజమే కనుక రాజుకోట, నిమ్మతోట ఒక్కలాగు చల్లగనుండునని మరదలుతో చెప్పుచు రెంటింటిలో ఆమెకేది మనసైనదోనని అడుగును 'పిల్ల పొగరు, చింతచిగురు ఒక్కలాగు పుల్లగుండు' నని కవి గ్రలుపు కారణముగనే చింత చిగురు జనులకు ప్రీతి కలుగునటుల మరదలు పొగరు సైతము బావకు ఇంపుగ నుండునని కవి చమత్కరించును

'హరి హరీ నారాయణాది నారాయణా
కరుణించి మమ్మేలు కమల లోచనుడా?
ఆకిసంబు క్రింద — ఆరు బయలు నంద
గాలిలోన అహా? — జాలు వారె మాహా?
చెమట యూడ్చినట్టి — సిగలు చుట్టినట్టి
కూలి జనము చుట్టె — తమ్ము వినగనోహో
పదము పాడె నొకడు?
ఎలుగ దొక్కా అతని? అతను కూలివాడె?
వాని తోడ వెనుక — తాళములను గలిపి
యిరువురెత్తినారె — పల్లవి చరణంబు
వారిరువు రెవరె? — వారు కూలి వాంద్రె?'

పొలములో కూలీలు కష్టించి పని చేయునపుడు ఆ కష్టము తెలియ కుండ, ఉత్సాహముగ పదములు పాడుకొనుచుందురు అట్టి దృశ్యమును పైన కవి కనులకు కట్టినట్లు వర్ణించును

అట్టిదే మరియొక గేయము:

"కిలారి పదమన
జనపదములకు
కిలారి పదమన
జన పదములకు

పొలాన బాటలో
కులాస కద — చిన
అరంటి తోటకు
తలంటు కొనిరా
బలాకి పాలికా
ప్రలోతు నూతిని
ఒయారి యేతపు
లుయాల గూనను

బుడుంగు ముంచుచు
వరాల నీరము
కరాల నెత్తుచు
బులుకు వంచుచు
తడిన్ బదను విడు
సడిన్ బయిన్ నడ
గడన్ గడన్ పడి
తడంబడిక చను
గడింబడిన్ మన
సుడిన్ గొలపదగు
కిలారి పదమన
జన పదములకు"

అని కవి మహోత్సాహముతో మన చేయి పట్టుకుని పల్లె పట్టులకు నడిపించుకొని పోవును. పల్లెపట్టు, అచ్చటి పొలములు, అరటి తోటలు, ఏతముతో నీరు తోడుట మున్నగు దృశ్యములు మన మనో వీధిలో చక్కగ ప్రత్యక్షము కాగలవు

వారి జీవితము ప్రకృతివలె స్వచ్ఛందమైనదిగ చిత్రింపబడి చదువరుల నాహ్వానించు చుండును.

"నల్లని మట్టికీ - తెల్లన్ని నురువుకూ - సయ్యాటా
నది పిల్లపాయకూ - ఉదధి కెరటానకూ - తియపాట
మట్టితో అరుగేస్తె - మగడః కూకోరాంచె
అరుగుకే - ముగ్గెడత - తెలి నురుగునంటాడు
ఒంద్రుమట్టి - చెల్ల - గుంద్రక్షిబంతులులాగ
వట్టి నురువూ - మల్లి-చెట్టు పువ్వులుగాగ"

— లయబద్ధముగ, వీనులవిందుగ సాగిపోవు పై గేయమున జనపదుల మధ్య పరస్పరము పెంపొందు శృంగార భావములు సున్నితముగ వ్యక్తమయినవి.

ఇట్టిదే మరి యొక గేయము

"ఈవలొడ్డుకు పట్టు
అవలి బల్లకట్టు
గున్న మామిడి క్రింద
నన్నెంచు కొనుచుండు
పొలములో నా బావ
తలపోయుచుంటాడు
మద్దానమైనాది
పొద్దు మీదన్నాది
వెచ్చనన్నము కూర
పచ్చడి తలమోత
కుప్ప నూర్పుడు కాడ
కోప్పడుతూ వుంటాడు"

మామకు భోజనము ఆలస్యమయినదను బాధ ఒక్కటియేగాక 'పొలములో నా బావ తలపోయుచుంటాడు' అని ఎంచును. ఆకలి కన్న మమత ఎంత ఎక్కువో ఇందు చక్కగ చూపబడినది.

'కోడేరు రేవులో ఈడేరి యున్నది
మహామంచి చిన్నది మహరాజా!

బాపనమ్మలాగు బట్టకట్టుంది
రాచపడుచులాగు రైక తొడిగింది
కోమటక్కలాగు కొంగు జార్చింది
కాప కుట్టది లాగు కంఠమెత్తింది
రేవు పడవుంటేను రేవొస్తనంది
మావి పండ్లిస్తేను మావొస్తనంది'
ఈడేరిన కన్య కట్టు, బొట్టును గూర్చి చెప్పునది పై గేయము.

వీరి జానపదగేయములను గూర్చి కొందరు ప్రముఖులీ క్రింది అభిప్రాయములను వెలిబుచ్చిరి

'గీతికా రచనలో కవికొండలకు ఒక ప్రత్యేకత ఉంది. చాలా జానపద గీతాలను కవి రూపం కట్టి నిరూపించాడు పల్లెకారులకు రాగంతో భావం వస్తుంది, భావంతో రాగం వస్తుంది. కవి కొండల గీతాలు భావరాగాలతో, రాగభావాలతో ఉన్నవి 'జుము జుము తుమ్మెద' గీతం కమ్మగా పాడగలిగిన కొమ్మ కోమల కంఠంలో నుంచి వినాలి కొన్ని గీతాలలో ఊపు ఉంది శ్రీరంగం శ్రీనివాసరావు చూపిన గీతికా గమనాలు అక్కడక్కడా ఉన్నవి. ఈ గీతాలు పుట్టిన నాటికి శ్రీశ్రీ కలం పట్టినాడో లేదో —— జమ్మల మడక మాధవరాయశర్మ-[1]

'ఇతని రచనలలో జనపదములన్నీ మనకు ఆత్మీయములైన వనిపిస్తుంది జానపదులకీ మనకీ వేష భాషలలోను, ఇతర విషయాలలోను ఉన్న అంతరము నశిస్తుంది అనుదినము మన కళ్ళపడే దృశ్యాలన్నీ అందము ఒలికేలా మనసుకి పట్టేలా, చిత్రించి చెప్పి శతాబ్దాల తరబడి మూగవారి ఉన్న జానపదుల గొంతుల లోంచి కవితా రసమొలికించిన ప్రజాకవి కవికొండల. ఆయనకి నేడు జరుగుతున్న షష్ఠి గౌరవము జానపద గేయ కవిత్వానికి స్వర్ణోత్సవం '[2]—హరి ఆదిశేషువు

కవి కొండల పాటలు, పద్యములు స్వచ్ఛమగు దేశ్య ప్రకృతిని ప్రాణ ప్రదముగ స్వీకరించి, రుచి చెడకుండ, రంగు వాడకుండ చదువరుల కిచ్చు చున్నవి ఇది కేవలము కామ ప్రకృతికి ప్రతి బింబములే గాక మానవస్వభావము

1- శ్రీ కవికొండల కవి కవితాశ్రీ - జమ్మల మడక మాధవరాయశర్మ ఆనందవాణి

2- శ్రీ కవికొండలవారి రచనలలోని విశిష్టత-హరి ఆదిశేషువు, త్రిలిఙ్గ

యొక్క శాశ్వతానందమును [illegible] నంతర్లీనముగా స్ఫురించు చుండును.' అని 'ఆత్మవ్యక్తి' అను వీరి పుస్తకములో ముందు మాటగా వ్రాయబడినది

వీరి గేయములను పరిశీలించిన అవి జనపదుల మాటల 'మమతలపేటికలుగ గోచరించును కూలినాలి జనము అనుదినము వ్యవహరించు భాషలోనే వారి భావములను, కష్టనిష్ఠురములను కూర్చినాడు కవి. చక్కని జాను తెనుగుతో, అచ్చమయిన తెనుగు వాతావరణమును, తెలుగువారి ఆలోచనా సరళిని పుణికి పుచ్చుకొని చేసిన గేయరచనలివి వీరి గీతికలలో జానపదజీవితమునందు ప్రత్యేక పక్షపాతము గోచరించుచుండును

జానపద కవితను పునరుద్ధరింపజేయుటకు వీరిట్టి గేయములను రచించినట్లు అనేక ఉపన్యాసములలో, వ్యాసములలో వీరు చెప్పిరి అనేక ఉపన్యాసములను జానపద గేయపఠనముతో ముగించుట ద్వారా వాటిపై తమకు గల గాఢాభిమానమును వ్యక్తము చేయుచుండిరి

ప్రచారములోలేని అనేక జానపద గీతములకు వీరు రూపము కట్టి నిరూపించిరి 'జానపద గీతములు పాడవలసినవే కాని చదివితే అర్థం కాదు'[1] అని వీరు చెప్పియున్నారు వీరు జానపదుల కష్టసుఖములను, వారి స్వచ్ఛమైన మనస్సులను, నిష్కపటమగు ప్రవర్తనను కూలంకషముగ పరిశీలించి, వానిని తమ గేయములందు సూటిగా, గాఢముగ పాఠకుల మనస్సులందు ముద్రవేయునట్లు చిత్రించుటలో సఫలీకృతులైరి ఇట్లు వీరి గేయములు జానపద వాఙ్మయమున విశిష్ట స్థానము నాక్రమించినవి

## 6-గ్రామీణ కవిత్వము

నవ్య కవిత్వములో గ్రామీణ కవిత్వమొక శాఖయై ఒప్పినది ఇందులో కృషిక కవిత్వము, కార్మిక కవిత్వము, గోపకావ్యములు మున్నగు ఉపశాఖలు గలవు

గ్రామములలోని ప్రజల జీవిత చిత్రణమును గ్రామీణ కవిత్వమన

---

1. జానపద వాఙ్మయం-కవికొండల, 28-1-57 నహూంషార్ క్లబ్ రాజమండ్రి సమావేశమున జరిగిన ప్రసంగము

వచ్చును వీరిలో కర్షకులు ప్రధానులు. పొలములో పనులు చేయువారు, పసులకాప రులు, పడవనడుపువారు మున్నగువారిట్టి కోవకు చెందినవారే. నవ్య కవులలో పలువురు వీరిపై కవితల నల్లిరి ఈ శాఖపై కాల్పనిక కవిత్వప్రభావమే కాక స్వదేశీయ ప్రభావము కూడ కలదు

రాయప్రోలు, పింగళి-కాటూరి, ఏటుకూరి మొదలగు ఆధునిక కవులు రైతులను, పల్లీయులను, ఇతర వృత్తుల వారిని కావ్య వస్తువులుగ చేసికొని రచనలు చేసిరి అట్టి వారిలో కవికొండల ముఖ్యులు పల్లీయులేగాక పట్టణములో పనిచేయు శ్రామికుల జీవితమును చిత్రించిన వీరి కవిత్వమును ప్రజా కవిత్వమన వచ్చును.

**కర్షక కవిత :-**

గ్రామములలోని ప్రశాంత జీవనము కవి కెంతయో ప్రాణప్రదము. బాల భానుని ఉదయమునకు పూర్వమే పల్లెలు మేల్కాంచుటను కవి ఇట్లు వర్ణించును.

'సోదరులార! తెండు! పరిశుభ్రరుచిన్ దెలవాఱు చుండె,
శుక్రోదయ శోభనెంచి తొలికోడిరుతమ్ము గణించి బామ్మ పం
చాదిని గవ్యమున్ జిలికి చల్లను వెన్నను జేయుచుండెన
త్యాదరలీల గీతికల నల్లఁటి వెన్నుని మేల్కొల్పుచున్'

వీరు గ్రామీణ జీవనమును నిసర్గ సుందరముగ చిత్రించి తెలుగుదేశము లోని ప్రకృతి సుభగత్వమును ప్రత్యక్షము చేసిరి. తెలతెలవారు కాలమున స్త్రీలు మంచి నీటికై చెరువుకు పోవుదురు 'ప్రతి యుషఃకాంతి తెలిరేఖ సతి వెలువడు జెఱువునీళ్ళకు', ఆమె ఏమి ఆసించి అట్లు చేయుచున్నదో కవి ఇట్లు వివరించును 'ఎవ్వరును చూడకుండంగనెంతో యమలశీతలాంబువు నింటికిఁజేర్చుటంతె'. ఆమె పేరు పరులు పిలువరట ఆమె సొగసొక్కఁడును ఆసింపడట. కాని ఎవరైన ఎదురై 'అపుడె నీళ్ళుముంచుక యింటికా?' అని ప్రశ్నించిన సంభ్రమముతో 'అవును తల్లీ' అనియొ. 'అవును అన్న' అనియొ సమాధానమిచ్చి వెడలపోవునట పై పద్యమున పల్లీయుల మనస్తత్వము సహజముగ తీర్చ బడినది వారి అమాయకత, నిరాడంబరత, కలుషగోలుతనమును చక్కఁగ చూపబడినది

'క్రొంగొత్త యేడాది కొనరించువొద్దు
తెల-తెలవాఱులో దేటగన్పట్టు
తల యెత్తుకొని రార! తొలి కోడీ కూత
పేరు మ్రోగింతాము పెదరైతు ప్రోడ!'

పండుగ పేదలకైనను, ధనికులకైనను నూతనత్వమును గొని తెచ్చు చుండును.అందులకే ఒకపాలేరు మరియొకనితో పెద్దరైతువద్ద పేరు నిలుపునట్లు పని చేయుదుమని పిలుచును.

కష్టించి పనిచేయు రైతుకు సాటివచ్చువారీ ప్రపంచమున లేరనును.

'మవు చేను చల్లావు — చెఱకు తోటవేశావు
బయట మంచామేసి — నులకమంచామేసి
నన్నుకూర్చోమంటూ—పిలిచేవు ప్రేమతో
రయితా! పలకరించేవు'

—రైతుతాను శ్రమపడుటయేగాక తోటివారిపై ఆప్యాయతను చూపించును. తనకున్న దానిలో తృప్తిపడును అట్టి రైతు ఎంతటి ధన్యజీవియో ఇందు చూప బడినది అందులకే 'నేటి కలపు నేటినాగలి గోటున బోసీయరా- ఈ యుగాది నీయదిరా—ఈయుదయము నీ యదిరా' అని రైతున కుత్తేజము కలిగిం చును

"తన వృక్షంబు లొసంగు వాయువుల నత్యంతంబునన్ బీల్చుచున్
తన యావిచ్చెడు పాలనేతులను నత్యంతంబునన్ ద్రావుచున్
తన చేనందున బండు సస్యముల నత్యంతంబుభోగించుచున్
మను చుండున్ గద హాళికుండు తన గ్రామంబందు సంతృప్తితోన్'-

రైతు తాను నాటి పెంచిన చెట్లొసగు చల్ల గాలులతో, తన ఆవు ఒసగు నట్టి క్షీరము లతో, తాను కష్టించి పండించిన తన చేనులోని ధాన్యముతో సకల భోగములననుభవించుచు, సంతృప్తినొందునట

'కటి సూత్రంబునఁబట్టగోచి నిడి-ముల్కోల్ కట్ట చేయెత్తునన్
నిటలాక్షుండు త్రిశూలమూనెడి క్రియన్ కన్పట్టెరె తొక్కరుండు'

అను కవి భావన అద్భుతము రైతు చేతిలోని ములుగట్ట కవికి నిటలాక్షుని చేతిలోని త్రిశూలము వలెభాసిల్లినది

'ఆవనుండి జీవనదిగ జాలువాఱు ఊటనీట
తాటిమట్టి వంతెనకడ—రేవులోని బచ్చగడ్డి
తడుపు వేళ పక పక పక—పట్టరాని నవ్వునగిరిగా
కొట్టపగులు నవ్వు నగిరిగా'

శ్రమనే ఆనందముగ భావించగల కష్టజీవులు వారు 'ఎండబడిన శ్రమల

మఱువ చల్లనీట నీడలు కడిగిరట' వారి జీవితములు 'మూడు పూలు ఆరు కాయలా పడుచులకింక కాక ఏలచింత' అని కవి ప్రశ్నించును.

"ఉన్నట్టుండియు వారలు
సన్నగఁదమ గొంతులెత్తి సాగించిరిగా
పున్నెపుఁబురాణపదముమ
వన్నెలవిట కాని పాట వచ్చిన వెల్లన్"

కర్షకులు శ్రమ బాపుకొనుటకు సంగీత జ్ఞానము లేకున్నను ప్రకృతి పరవశించు నట్లుగ పాడగలరు.

'పాటకు కూలీయరు, తమ
పాటున కిచ్చెదరు కాని పాడెదరేమీ౹
గాటపుఁబ్రబోధ మిడుమా
బోటుల కిది యొక్క సహజభూషణమేమో'

వారు చేసిన శ్రమకు యజమాని కూలి ఇచ్చును కాని వారి పాటకు కాదు అయినను వారు తమ ఆనందము కొఱకే పాడుకొందురు

మనుజులకే వర్ణభేదము గానిపాటకు కాదను సత్యమును "పడతులు మాల వారయినఁబాటకు వర్ణము వృత్తమున్నదే" అని చక్కగ చాటును. కవి అభ్యుదయ భావమిందు గోచరించును

'వెన్నెల్లోనిప్పటికీ పదం ఆడుతున్నారంటే పల్లెటూళ్ళో ప్రాణం వుంది. ఆడే పదం ఆలకిస్తూన్నారంటే పల్లెటి ప్రజలకు కళాభిమానం వల్లమాలి నంతింకా యుంది' అని కవి నమ్మును.

సంతనుండి ఇంటికి మరలు పల్లెపిల్లను గూర్చి-

'సంతలోఁ గొన్నయొక క్రొత్త మంతలోడ
మల్లి కోళ్ళతో మిర్చితో నుప్పుతోడ
నెల్ల వస్తువులొక గంపనెత్తుకొనుచు
వెళ్ళుచుండె నింటికి మళ్ళి పిల్ల యోర్తు' అని చెప్పి వారి జీవిత మెంత నిరాడంబరమో ఎంత సామాన్యమో సహజముగ చూపిరి

ప్రొద్దున్నె పట్టినట్టి యా పెద్దముసురు పట్టినది పట్టినట్లుండె వదలకుండ

అట్టి వాతావరణములో పలువురాంధ్రు పచ్చగడ్డి మోపులను విలుచుకొనుచుండిరి. వారిలో మిక్కిలి వృద్ధురాలొకర్తియున్నది 'అంతలో పెద్ద యాబోతు మంతనమున వచ్చి మోపును గొరికి కొమ్మచ్చుపడగ మేసిపోయెను' 'అంత నా వృద్ధురాలు చిమ్మి పారవేసిన చినిచిన్ని కల్లు చేతబట్టుక చీకటి రాత్రి, వాన నేడ్చుచింటికి పోయెను' 'చీకటిరాత్రి, వాన కన్నీరు' ఈ వరుస అద్భుతము ఆమెను సాటివాడు 'ఓ సింహాదిరప్పన్నె, ఊరుకోవె: యంచు వెన్గూలివాడనె: నాదున క్షుధ' అని ఓదార్చును. కవి యొక్క ప్రతిభ అంతయు ఈ వాక్యములోనే యున్నది కష్టము లను చూచి నవ్వుట నేర్చుకొనిన శ్రామికులు ఏ విధముగ వచ్చిన నష్టమును పరి పెట్టుకొన చూచెదరో చక్కగ చూపును ఆ విధముగ సరిపెట్టుకొనినను ఆకలి తప్పదను నగ్నసత్యమును అత్యద్భుతముగ చిత్రించును.

శుభ్రముగ ఊడ్చివేసిన కళ్ళములో రాలియున్న గింజలనేరుకొను వృద్ధురాలి స్థితిని అత్యంత దయనీయముగ చిత్రించును

'ఏటికోయవ్వ: యింక నీవిందు మసలు
చున్న దానవదేమిటో యుండి యుండి
చెరగుకొనుచుంటి వూర్చి వేసిన పొలాన
కళ్ళమై (పోయె నేమియు గాన బడెదె'

అని ప్రశ్నింప వాని కామె ఇచ్చు సమాధానము జీవితసత్యమును బోధించును.

పెద్దకాపు బండ్ల మీద ధాన్యరాశి తోలించుకొనిపోగా, కూలీలకు జీతము పోగా, మిగిలినది మాలెత ఏరుకుని పోయినది. అయినను

'చేట నూడెడు ముదుసలి స్త్రీ నొకర్తు
గాంచి పలికిన నాపె వికాసమూని
మాపటికి నివ్వి నా పొట్ట మాత్రమునకు — జాలవా' అనును.

అత్యాశలేక తోడి మానవులగురించి మాత్రమే గాక పశుపక్ష్యాదులను గూర్చి కూడ వారంత దయార్ద్ర హృదయముతోనే ఆలోచింపగలరు

'బాబు: నేమను నింకిందు వదలివేయు
ప్రాలు మాలిన తుక్కు నా పక్షులెల్ల
పదయగల వాత్మభుక్తిని వలయునంత'

అను ఆమె పలుకులలో సృష్టి రహస్య మిమిడి యున్నది అందులకే కవి 'అమల సంతుష్టి కల్పకం బలరునట్టి నాదు జనపద ఫలిత మనంతమంచు' భావించును.

'నడుము వంగిన ముసలిమానిసి నేలచూపుల జాలి గొలుపుచు పొడుగు బాటను నడయుచుండె'నట 'ఎచటకేగితివి తాత!' అని ప్రశ్నింపగ 'ఉప్పు కల్లు మిరపకాయ కొంటిని అనును' "ఎంతకాలంబిట్లు బ్రదుకుదు — ఏమిలాభంబనుచు" అడుగగ 'ఎంతకాలము సంతలుండునొ — అంతకాలము బ్రదుకుదుము' అనును. ఇట జీవిత సత్యమును చదువు సంధ్యలు లేని ముదుసలి పల్లెవాడు ఎంతగ విడమర్చి చెప్పునో చూడనగును

"వెన్నెముకకు పొట్టంటకుపోన్ — కళ్ళలోతులకు ఇట్టింకులుగాన్
వంటవలంతి నెండినదేది! నీవా! కూలి కూతురా!'

అని ఎంత కష్టించినను పొట్ట వెన్నంటుకు పోయిన కూలి కూతురు కడ గండ్ల మన కనులముందుంచును

పెద్దలతో సమముగ పిల్లలను కష్టింతురు

'వారి కెదురొకండు వచ్చెడు — బొట్టెండు
కూలి నాలి కెందొ కుదిరి
యపుడె పుట్ట గోఁచిపెట్టి
పొట్టపోసి కొనెడు నట్టుల
గను పట్టె (బొట్టనెత్తు'

పుట్టగోచి తప్ప ఆ 'బొట్టె'ని వంటిమీద ఏమియులేదు. కూలినాలి చేసికొని పొట్ట పోసికొనెనేమో అన్నటులగ పొట్ట ఎత్తుగ గలదను కవి చిత్రణలో యదార్థము చక్కగ చూపబడినది.

వెలుగుసీమలో కోతకుపోవు పల్లెపడుచుల సహజ సౌందర్యమును కళ్ళకు కట్టినట్లు చూపును. వీరి 'కోతపాట' మిక్కిలి, ప్రసిద్ధి కెక్కినది. ఇట కోతకోయు జానపద స్త్రీల జీవితము నిసర్గ సుందరముగ చిత్రింపబడినది. ఇట్టి యాసలో రచింప బడిన గేయములు ఆనాటికి అరుదు. పల్లీయుల భాషలో వ్రాసినను ఎబ్బెట్టు లేకుండుటయే వీరి ఘనత.

"ముప్పావులా కూలొస్తది — నాయప్పరాయె
కోతలోకి కూలికెడదాము
కూకుడుంటె కూడొస్తదా
నాయప్పరాయె — కోతలోకి కూలికెడదాము'

కూలినాలిలేని పల్లీయులు ఆశతో జీవితమును గడుపుచుండుట కవి గమనించును. పల్లీయులలో ఆయా వృత్తులవారి ప్రత్యేక ఆశయములను సహజముగ చిత్రించును.

'బందర ద్దకంపు చీర అందముగను కట్టుకొని
కుందనపు కుత్తికంటు కుదురుగ మెడ సదురుకొని
దారి తంగేడుపువ్వు తలను ఒద్దె పెట్టుకోని,
కులుకు మోమునందు కలికి కుంకుమ బొట్టందుకోని
కోతలోకి కూలికెడదాము నాయప్పరాయె'

అని సాగిపోవు గేయమున మాలెత మనమందు నిలచును. బందరద్దకపు చీరతో మెడలోని కుందనపుకత్తి కంఠెతో తంగేడు పూలు తలను ధరించిన పడుచు ఆంధ్ర స్త్రీకి అద్దము పట్టును కూలివారు ఏపూట పనిలేకున్న అపూట పస్తుండవలయునను నగ్న సత్యమును 'కూకుడుంటే కూడొస్తదా- కోతలోకి కూలికెడదాము నాయప్పరాయె' అను మాటలలో చక్కగా చాటును ఇందు భావము, భాష పరస్పరము పొందికతో చకచక సాగిపోయినవి

సామాన్య కుటుంబములలోని ప్రేమలు, స్వల్పానందములు, విలాసములను చక్కగ వర్ణించును.

రెండెండ్ల బండివాడు 'మంగళారపు పేట సాంబడు'‚'నల్ల చొక్కా తొమ్మి పైని- నాణెపు కాసు బొత్తాల్ మెఱయగను తన రెండు చేతుల తోకలను మెలిపెట్టి చల్ చల్ అనుచు' బండి తోలుచన్నాడట బండిలోపల పిన్నపెద్దలు పదికిపైగా నున్నవారట. అట్టితరి ఆతడు 'వెనుక కొాక మాటిటై చూచుచు- పిన్ననవ్వు నవ్వినాడ'ట. 'కులుకు కుట్టది - కూరలంగడి వెలగపండ్లమ్మేటి శ్యామల - వెండి యొడ్డాంబు పై పై - కుత్తికంటు పసిండిలోలో మెఱయఁ బువ్వుల కొత్తకోకను ముఱియుచును గట్టినది - నవ్వునకు మఱు నవ్వెన'ట సాంబడను, శ్యామలయు భార్యాభర్తలని ప్రజలంత వఱకు ఎఱుగరట. కాని అప్పుడు వారి ఘంధఘోష

మధురదృష్టి అందరికి ఎరుక అయినదట వారి ముగ్ధ శృంగారము ఇందు చక్కగ చిత్రింపవడినది

పల్లీయ శ్రామికుడైన పడవలాగు ముసలివాడు పడు శ్రమ ఈ క్రింది గీతములో జీవచైతన్యముతో మిరుమిట్లు గొలుపును.

'పడవ నడకతీరు
పడవ లాగెడు తీరు
ఎడద గొల్పి వృద్ధు నపహాసించి బిగ్గరగ నేనంటి
ఇట్లు వోవ జేరు ఎప్పటికిన్ అని
కుఱ్ఱవాడు
పలికె గొనరెడు నగవుతో
చిటికెలోన రేవు నగవుతో
వృద్ధుడూని రేవు జేరకుయని
మన్నని
ఎప్పుడై తేనేమి? ఏమిటి కనియె'

దృశ్యసాక్షాత్కారమునకు వీరి కవిత పెట్టినది పేరు ఆ వయస్సులో వృద్ధుడు కష్టమును గమనించలేడు. 'అయ్యో' అనుమాట అతని నోటివెంబడి రాదు. కవి ఇట్లు కుప్తముగ ముచ్చటగు పలుకులతో పడవవాని జీవితపు తీరును పరికించి జీవిత రహస్యమును వినిపించుటకు ప్రయత్నించును

జాలరులుకూడ కవి దృష్టిని ఆకర్షించిరి చేపలు పట్టుకొని వచ్చిన తరువాత వారు ఒకరినొకరు హాస్యము లాడుట క్రింద చూడనగును.

'ఓబయ్యా! ఓబయితా! సొరకాయ కోతలు కోయకురా!
రాతిరిః జిలి వలవేశావా
రొయ్యకు మీసము జూసావా
జీలుగు బెండులు తేల్చావా?
వాలుగు పొడవులు కొల్చావా?
ఊతలనడ్డుగ పాతావా?
పీతల గంపెడు నెత్తావా?
గాలము వాడిగ గ్రుచ్చావా?
అలికిః జేపల దెచ్చావా?'

'రక్తకుల్య గాధ' అను గీతికలో అంతర్వేది ప్రాంతముల నున్న జాలరులకు కూర్మమూర్తి, నరసింహమూర్తి లభ్యమగుట చక్కగా గానము చేయబడినది.

'రారవెంకటరెడ్డి! రారపోతన్న!
రావడంలేదు వలలాగు లాగంద్రా
రక్తకుల్యకు కొత్త శక్తొచ్చె నేడు
రావడంలేదు వల లాగు లాగంద్రా!'

జాలరులు వలలాగు చుండ ఏదియో అడ్డు పడగ, అందరును కలసి కష్టముతో పాడుచు లాగుచుండిరి. అది వినిన కిట్టమ్మ భార్య 'లెగు లెగూ కిట్టమ్మ! లెగు లెగూ మగడ! గోలెంటొ పుట్టింది కొలముసాముల్లో!' అని మగని లేపినది కానీ ఆతడు సదురించుచునే యుండెను.

అంత కిట్టమ్మ పెండ్లాము రక్తకుల్యకువచ్చి 'వలవేత కేమొచ్చె వల్లభుడు లెగలేదంటూను కంటఁదడియోడ' ఏడ్చినది జాలరులు జాలిపడి వలజార్చగా వలజాఱదు, నీటపైకిరాదు 'ఎట్లున్న వలయిట్లె వింత నిలుచుంది' 'అంత కిట్టమ్మ పెండ్లాము చిట్టిముత్తైదువట్టెవల జాడించి పట్టి లాగింది' వలలో తాబేటి ప్రతిమచెక్కినరాయి బయట పడినది అంత అందరును మైమరచి పోయిరట

'కూర్మావతారమిదికొలువ వలె నంటూ
కోవెలను గట్టించి కొలువవలెనంటూ
కొవనాతి వారింట కోడలేలాగె" అని పరవశించి పాడిరి.

అంతకిట్టమ్మవచ్చి
'వేయాల మఱి వలవేయాలయింకా
కూర్మావతారమిది కూంతరాయి యిది
గొప్పగా నరసింహుడుప్పె నటు దోచె
నా కలలో! నేడంత నాకదేవింత' —— అని వారితో పలుకును అంత 'వల వేయకుండానెవయ్యారిలక్ష్మి వామాంక మందొప్పఁ స్వామినరసింహుడు' ప్రత్యక్షమయ్యెనట. అది చూచి పల్లె కులమంతయు ఉల్లమలరునట్లు మురిసిపోయిరి.

'మత్స్యావతారాలు మననిత్తెపంట,
మానవరూపాలు మనయంద తొంట,
మనకు లేనివి కూర్మ నరసిమ్మములుగ
అవి దొఱికినా యంచు నానందపడిరి.'

అప్పుడు స్వామి "కొపనాతి కిట్టమ్మ కోపెలకట్టు' నంచు నఅసింహుండందఱూ వినగ రాయితానైనాడు " అంత "ర క్తకుల్యకు లేని రాగ మొలికింది." జానపదుల జీవితము, వారినమ్మకములిందు ప్రతిఫలించినవి ఇది వీరి గేయములలో మిగుల ప్రసిద్ధిగాంచినది.

"పడవనీట దేలినడువ పడవలోన బందు కొంటి కూర్కొ-లోన గోర్కి-వింటి"

'ఒక్కొ-క-నుకు పాటులోన-వింతవింటిజ క్రరవము
లోకయాత్రిలోన సతము-- ఆకసంబు నరసి కొనుచు
శాంతతన్మ యుండనుగా-- చెవులజవందు గనువింటి
ప్రాణికోటి బ్రదుకు సందడి'-- తెలుగు దేశములో జీవించు

ప్రాణికోటిబ్రదుకు సందడిని ఇంత సన్నిహితమ.గ్వినగలిగిన వ్యక్తి వీరే.

పల్లీయులలో రకరకముల వృత్తులవలంబించు వారినందరినీ వీరు పరామర్శింతురు.

'మంగలి కుర్రవాడొకడు
మక్కు-వ ప్రాత సన్నాయి జోడుపై
బొంగు రుతంబు, సన్నసుతి
పుట్టుచుగిట్టుచునట్టు కొట్టు'

'గుజ్జు తురాయి క్రింద నిలుపొంతపొంచి బంతి కలమ్ము వృద్ధురాలు' దీనముగ ' ఒక యీతకుంచె పెడనిట్టటు నీగల దోలుకొంచు' మనకు కనిపించును. ఆమెకు ఆ నరసబిల్లని పాట దినాంతరాగమై వినబడినది'.

పల్లెలలో పూర్వము దొమ్మరి ఆటలు ఆహ్లాదమును గూర్చుచుండెడివి. 'దొమ్మరి వాడు డోలును కొట్టె -- మొగ్గను వైచి తప్పెట తట్టి -- దండను చఱచి తొడా కొట్టె'ఆ ఆట చూచుటకు మునసబుగారు ముస్తాబయిరట కరణముగారు కందువ వైచిరట. పెత్తందార్లు పెదపాగాల నరుగువనిండ నలంకరించిరట. కడమ జనులందరు కడగా నుండిరట. ఆనాటి గ్రామ సీమలలోని పరిస్థితులను ఇందు మనకు చూపును.

'బుడ బుక్కలవాడు భూతాలవాడు
జంగమదేవర గంగి రెడ్లబ్బి
పాముల వాడొక పడుచు చెంచెతయు
నక్కల వాడును నంగి యెఱుకతయు
ఊరి కుత్తరమున నున్నట్టి పెద్ద
మఱ్ఱి వృక్షము క్రింద విడిసిరి గుమిగ'

గ్రామీణులలో తరతరములనుండి తమకు సంక్రమించిన సంప్రదాయ విధానములను, కులవృత్తులను జాగరూకతతో కాపాడుకొను వివిధ వృత్తుల వారుందురు. కాని వారికా కులవృత్తులు తలదాచుకొనుటకు గూడు కూడ కల్పింప లేక పోవుటను చూచి కవి చింతించును.

కాయకష్టమే నిత్యకృత్యమైన వారి పనులను కవి చక్కని పోలికతో చెప్పును ఈ ఊహ మనోజ్ఞము

'కుమ్మరాడు కుండమట్టి-తొమ్ములోతు నీళ్ళు దీయ
తాడిచెట్టు సోగనీడ-తాడిలోతు నీళ్ళు నిలిచె
చాకిలోడు సన్నవలువ-పిక్కలోతు నీళ్ళ పిడవ
కడిమి చెట్టు కొసల నీడ-కడిమిలోతు కానిపించె'

కోయవాని కష్టములకు కవి హృదయము ద్రవీభూతమగును. 'ఒక్క మానిసి కోయవాడక్కటకట మట్ట మధ్యాహ్నమెండలో మంటి బొరలు' చున్నాడట. వాని ఆస్థి చేట, జల్లెడ, చీపురు, చిట్టి ముంత, పెద్దముంత, మంచము, అంతియే. అతడు అనారోగ్యముచే 'వెలికిలంబడు యింకను వలిని వణకు'చుండును ఇక తట్టుకొనలేక 'సచ్చిపోతుంటి మాత్రొండు తెచ్చిపెట్టి-పున్నెమును గట్టుకొమ'దని మూల్గుచుండును. కానీ వాని గతి పట్టించుకొను వారెవరు గలరు? 'ఎట్టి బ్రదికించు వారలన్నాయటంచు గట్టికేకిడి మోము చూడము మరింక'-అని సమాజమునకు దూరముగ బ్రతుకు కోయవాని జీవితపు అట్టడుగు లోతులను కూడ కవి నిశితముగ పరిశీలించును.

పాముల నాడించు బిచ్చగాని గూర్చి ఇట్లనును

'నీ బిచ్చమైతే నాగసారము యిచ్చు నూదుచున్నాది
పుచ్చపూల వెన్నెల లచ్చి చూపుచున్నది
నీ యిల్లు వాకి లేదరః
ఈ యిక్క గాన్గు సెట్టు నీడ తీసివేసె గుడిసెరః
ఓ పాములాడః పాములాడః
పట్టు పట్టు నాగసారముః పట్టర యింకొక్క పాలి'–
స్థిరనివాసములేని చెంచులను గూర్చి ఇట్లనును.

'ఏఎరినో వండుకొనుచు నింత తినుట'యే వారికి తృప్తి 'గోదావరి కడ జెంచుల్ స్థిర నివాసములేక ఏదినమున కాదినమునకే తృప్తిపడు చెంచులదే మోదావహ జీవిత'మనును. వారు 'చిన్న కుటీరము లిచ్చు చొప్పు దీయంగను పీలుగను వయిచి ముంగిడ నున్నగా దుడిచి ముచ్చటగాఁ గాపురముందు'రట. సంతృప్తియే వారికి భగవంతుడిచ్చిన వరము.

యజమానికి నమ్మినబంటైన మాలవాడగు 'నక్కా సామిగాని' నిగూర్చి చక్కని గేయమును రచించిరి.

'నక్కా సామిగాడు–వాడొక మాలవాడు
రాజుగారి కఁవతంలో పాలేరువాడు
వాడుపోయాడు–ఎంతకాలమైందో'
–వానిని గురించి యజమాని దుఃఖించును.
"కాడిమీదో దెబ్బ–కమిచీతో వేస్తే
ఆ యెడ్లు తమంతటవి–మోకరించి మోకరించి
యొకమాఱుగా మెడలు పైకి–ఎత్తుకోవాలి
మహా మంచివాడు వాడు–గుత్తాలకు వకుడెలాంటివాడో
ఎడ్లకి వాడల్లాంటివాడు' అని హెచ్చరిగ్గా అన్నారు"

కాడిమీద దెబ్బవేసిన చాలు–ఎడ్లు వాని హృదయమెరిగి మసలుకొనెడివట. అట్టివారీనాడు లేరని యజమాని వాపోవును. దీనిని వచనగేయముగ కవి కొండలవారే పేర్కొనిరి,

నిరుపేదలైన పల్లీయులు గుంపులుగ జేరి తీర్థములకు పోవుదురు. అట్టి చోట్ల వారువేసిన మంటను గూర్చి కవి ఊహ అద్భుతముగ నున్నది.

'ఆ కాంతి యేమిటని యనుకోంది మీరు
ఆ కాంతినే వంట నవ్వారు సాగింత్రు,
ఆ కాంతినే యన్న మ్మారగింతురువారు
ఆ కాంతినే చలికాచుకొందురు వారు
ఆ కాంతియేమిటని యనుక్కోండిమీరు
అది–దారినేరినమట్ట–దారినేరినకంప–దారినేరినయాకు
లన్నింటి గలిపి యొక గొయ్యి త్రవ్విన పొయ్యి
నిడికొంచునంటింప దేదీప్యమానమై
భగ్గు భగ్గున మండు మాణిక్యపు కాంతి
తీర్థానికని చెప్పదగిన నిరుపేదలది"

గోపకవిత :-

గోపకులపై వ్రాసిన గేయములు గోప కవిత్వముగ ప్రసిద్ధిగాంచినవి. అట్టివే క్రింది గేయములు

"ఈ కొండ–ఈ యెండ, ఈ పెద్ద ఖాడవలో
చూపట్టు చెట్టు నీడెవ్వనికి? ఎవ్వనికి?
గోచి పెట్టుకున్న గోపడికి గోపడికి
గూటి బిళ్ళాడే పాపడికి పాపడికి
ఈ చెఱువు ఈ దోనె ఈగట్టు పైకెక్క–
వీచునట్టి గాలి యెవ్వనికి? యెవ్వనికి?
ఈతలాడు నట్టి యెల్లడికి పుల్లడికి
ఈలకొట్టే చూచు ఈరడికి పేరడికి
ఈ చిట్టి వెన్నెలల నీదారి పోతూంటే
విపరు పూవాసనలు ఎవ్వరికి?
గొడ్లు మళ్ళే ధూళి గుడ్డి పాలేరునకు
కూటి గుడ్డమఱచు కవి కుమారునికి"

ప్రకృతి ప్రసాదించు గాలి, నీరు, నీడ సమస్తము ప్రకృతి బిడ్డలగు గోప

కులకే ఎట్టి భోగ భాగ్యములకు నోచుకొనని కటిక పేదలకు ప్రకృతియే సకల సౌకర్యములను ప్రసాదించును "చిట్టి వెన్నెలలు, పూలవాసనలు" అందించును. అట్టి ప్రకృతి యొసగు ఫలములను పొందుటకు కవి తన్ను కూడ అట్టి జానపదులలో నొకనిగనే తలంచును

గోపకులు పశువులను మేపుచు తమకు వచ్చిన పాటలను స్వేచ్ఛగా పాడుచుందురు

"ఓ పసుల కాపరీ! ఓ చిన్ని పావడ
ఏ పాట పాడుచుంటి?
ధూళి బాటను-నాల మందలను దోలుచును
ఏ తాళ మేయుచుంటి
కూనిరాగము పైకి-గొనరింతువే కాని
పలుకు స్పష్టంబుగాదు"-

అయినను 'తొందఱించుకయు లేక, తొట్రుపాటును లేక సంజవెన్నెలలో ఆనంద మగ్నతతో అతిశయించి' పసులకాపరి ఆనందించ నట.

గొడ్లను తోలిన గొల్లని ఒడలెల్ల ధూళినిండినది అది చూచి కాపు వానిని ఇట్లు ప్రశ్నించును.

"గొల్లవాడ! పిల్లవాడ! గొడ్ల కడల కుఱ్ఱవాడ!
గోదావరి లోన గడుగ నీ యొడలి ధూళియేడ?
గోళి కాయలాడినావ ? గొడ్ల నెల్ల విడచి యిచ్ఛ
చీమ చింతచెట్లు క్రింద చెలగియాడి చెలరేగి
గోదావరిలోన ఈతలాడు కొనుచుంటివటర".

అందులకాపిల్లడు తనకు ధూళియంటు కొనలేదని,"గొడ్ల నేను తోలునపుడు గొడ్ల వెనుక నడచు నపుడు అయినదని కోతి కొమ్మచి దుముకలేదు - గొడ్లనెందు విడువలేదని" సమర్థించుకొనును.

గోపకుడు గొడ్లను మేపుచున్నపుడు తానెక్కడ కూర్చున్నదికూడ గుర్తించడు. అతడు కూర్చున్నది రుద్ర భూమి అయినను చింతించడు.

'ఎవ్వరొ చనిపోవంగట్టిన సమాధి భూమ్యున్నతమే! నీ ముందుగల ప్రదేశ

మ్మేమృతకాయ మొ-మును దహించినదగుఁ జూపిమాత్రంబె నగలచదె-నీమో దము నీదెయవగ నెగడుదు వౌరా!

అని రాగమెత్తి రంజిలుచుండు గోపకుని ఆనందమును వాని నిశ్చింతతో గూడిన మనస్సును చూచి కవి సంతసించును

ఇట్లు కవికొండల గ్రామీణుల జీవితమును సహజసుందరముగ చిత్రించి వారి ప్రేమలు, స్వల్పానందములు, కృషి సమాస్తమును వర్ణించిరి ఏ కష్ట జీవిని కూడ విడువలేదు

అంతటి తో ఆగక కార్మిక జీవితమును కూడ కావ్య విషయముగ స్వీకరించిరి

**కార్మిక కవిత :—**

> ఊడిగముచేసి పొట్టపోసికొను ఒక దాసి జీవితమును హృద్యముగ చూపిరి.
> "అరికిరి అంట్లు తోమి
> అప్పలమ్మ అసురసంజ
> ఇంటి కేగ కంటి ఎరను
> గుప్పు కంపు కొట్టుకొంచు"
> —మగడు ఇంటికి వచ్చును.

ఆ త్రాగుబోతు మగడు వ్యసనములలోపడి అప్పులపాలయ్యెను అరదుకని 'నేమ ఖైదుకేగితేను - నీకు మగని సోకువద్దె - కంకణాల కనకమేదె? తీగయేదె? వేగతేవె' అని అప్పలమ్మ నడుగును ఆమె ఒక్కక్షణమైనను సందేహించక 'చప్పు చప్పున సన్నసన్న తీగెతీసి' అప్పు తీర్చినదట. అప్పికి తన మగడన ఎంత ప్రేమయో 'తీగెపోతె పోయెగాని మగడు దక్కెనంచు పొంగెను' శ్రామిక జన దైన్యావస్థను,వారి అనురాగములు,అల్పసంతోషములను సహజముగ చూపెను

ఉత్తరాల సంచిని మోయుచు పరుగులు వేయు బంట్రోతు ఉత్తరముల నందించి ఎందరెందరికో ఆనందమును కలుగ జేయును అతడు పడుశ్రమ కవి మనస్సును కలచివేయును

> 'ఉత్తరాలా సంచి నెత్తి పెట్టు కవచ్చు
> కూలివాని చేతి సూది బల్లెపుటు లివు

మాటు ప్రేమోయా నేల నాదునెదలో
దారి గలసిన వాని పరుగులో నానడక
తారుమారై త్వరన్ దలపనేల ?
చిత్రమీజీవనము! చిన్నియుత్తరమేదో
యెవరికేన్ గొనిపోవు నేమో! యేమొ!'

అకాలమునకే ఉత్తరముల బంట్రోతును కావ్యవస్తువుగ స్వీకరించినవారు కవి కొండలరావే ఇందులో జీవన సత్యమును చాటి చెప్పెను

గనిలో అట్టడుగున పనిచేయుచు ప్రాణములకు తెగించిన కూలి వానికి కడుపు నిండదు శ్రమకు తగిన ఫలితము పొందని

"గనిలో అట్టడుగునగల-కఠిన పాషాణముపై
గునపమేసి కూలబడెను, కూలివాడు కూలబడెను
ఉలిసెను లోగుండె! కురిసెను కన్నీరు
మెటిసిన దెయ్యదియో!"

గునపముతో పాషాణమును కొట్టుచు కూలివాడు కూలెను 'అబ్బా' అను వాని ఘూత్కృ పెనుమబ్బుగ ఖనిఅంతయు ఆవర్షించినదట ఇక బ్రతుకు భారమై ప్రాణము వదలుటలోనే సుఖము కనినాడట. అతనిని 'కూలివాడు, లేనివాడు, రానివాడు' అని కవి వర్ణించెను. ఇట్లు ప్రాణములు కోలుపోయిన అతడు 'నిజమైన కూలివాడని' కవినమ్మకము. ఇందు గని కార్మికుని యొక్క నికృష్ట జీవితము మనస్సు ద్రవీభూతమగునటుల చూపబడినది.

పెద్ద పెద్ద బరువులాగు కూలీలు ఆ కష్టము తెలియకుండుటకు పదములు పాడుదరు.

'పందమంది వారలున్నారు
వందమంది మోకులాగేరు
ఒకడు మాత్రమె పదము సెప్పేడు
బరువుమీద వెన్నెలడుతుంది— లాగే
బరువు మీద సీదలడుతున్నాయి
ఎడద బరువున పాట పాడేడు'

ఎడద బరువుతో 'పేగులన్నీ ఉగ్గబట్టేడు— తన పేగులన్నీ బిగబట్టేడు' అనుటలో వారాబరువు నెంత కష్టముతో లాగుదురో చూడనగును. "అదిగో పట్టైలాస అంటూ— ఇదిగో పట్టైలాస అంటూ— నేలరాల్తో నెత్తురొంచాడు" అనుటలో వారి దయనీయమైన స్థితి మన మనస్సులను కలచివేయును.

రోడ్డును చదును చేయుటకు కూలీలు గుండును లాగుదురు మహరాజుల కొఱకు బాటను చదునుచేయు వీరి జీవితబాటలు మాత్రము ఎగుడు దిగుడుగనే ఉండును ఇట్టి దుర్భర నిర్భాగ్య జీవితములను కవి సహజముగ వర్ణించును.

"రహదారి ఎగుడుదిగుడులు
మహరాజుల మరల బండ్లకు
నునుపుగను జేసేము మేము
ఇనుప తిరుగుడు గుండ్లను
ధూళి దుమ్మును నెత్తిమోసిన
తోడబుట్టుల మన్నలారా
రాళ్ళ నీళ్ళను కలిపిమొత్తిన
కూలి పడుచుల మక్కలారా
పెద్ద మోకును లాగుకొనుమను
సుద్దులాడుచు బాడు కొందుము"

ఇందు ధూళిదుమ్మునే స్వీకరించి వానినే తోబుట్టువులుగ భావించిన, వారి బ్రతుకులను బాగుపరచు వారెవరని కవి ప్రశ్నించెను ఆ కష్టజీవులు "గున్న మాన్నలు తీయ మావులు కూళ్ళు తినుమా చలువ తావులు" అనియు,"దారిప్రక్కనె చనెడు కాలువ దప్పితీర్చెడు కామధేనువ" అనియు ప్రకృతియే తమ కష్టములను తీర్చు తల్లి అని నిశ్చింతగ నుందురు

'కూలి యన్నలకుతుకము'ను గూర్చి కవి గుర్తించును ఇది ప్రసిద్ధిగాంచిన గేయము.

"మొగములను ముచ్చెమట లూడ్చుచు
మూపులను పెనుమోకు నీడ్చుచు
మదము లెత్తున మన్ను రేచుచు

గుండ్ల పేరూకులుకు పాటేమోపమో
పాలిండ్ల బగడపు గుండ్లు పేరేమో
ఎదుట కుట్టిది యేదిలేదు
మోహా పడుటకు ప్రొద్దుకాదు
మఱుగు పెట్టగ మఱుపురాదు
కూలియన్నల కుతుక మదియేమో! ఏమో
బాళి తలపని పెరిమ యదియేమో?'

—— బరువైన వస్తువులనులాగు కూలికష్టము కవిని స్పందింపచేయుమ ముఖ మున చెమటపట్టి దుమ్ము మడమలెత్తున రేగుచున్నను వారు ఉత్సాహంగానే ఉందురని చెప్పును.

కవికొండల పై విధముగ పల్లెలలోను, పట్టణములలోను, వివిధ వృత్తులలో గల కర్షకుల శ్రామికుల కడగండ్లను, కష్టములను కనులకు కట్టినట్లు వర్ణించి చూపును. గడ్డికోయు మాలెత, పశువులను కాయు గోపకుడు, కళ్ళములో గింజులేరుకొను అవ్వ, కుమ్మరివాడు, పడవనడుపువాడు, మంగలి కుఱ్ఱవాడు, బుడబుక్కలవాడు, భూతాలవాడు, సుకారిపిల్ల మున్నగు పల్లీయులేకాక గనికార్మికుడు, గుందు లాగువాడు, తపాలాబంట్రోతు, అంట్లుతోముదాసి మొదలగు శ్రామికులందరిపైనను ఆనాడే తమ కవితాదృష్టిని పరుపకలిగిన వారు కవికొండలయే. వారి నిర్భాగ్య, నికృష్ట జీవితములను చిత్రించుటలో కృతకృత్యులయినారు వీరి జీవితములందలి యదార్థ సత్యములను సహజముగా చిత్రించిన వారిలో ఆనాటికి వీరిని ప్రముఖులుగ చెప్పవచ్చు తెలుగువారి హావభావములకు, ఆశ నిరాశలకు, కష్టసుఖములకు వీరు వాఙ్రూపమును ప్రసాదించిరి

అభ్యుదయ కవిత్వము వెలయుటకు ముందుగనే కర్షక, కార్మికుల దయనీయ జీవితమును ఇంతగ తరచి చూచి లోకమునకు వెల్లడిచేసిన విశాల హృదయము కవి కొండలదే. అంతేగాక కర్షక కార్మికులను గురించి వ్యక్తము చేయు వేదనయే, వారి దీనస్థితిని గ్రహించి వెల్లడిచేయు సానుభూతియే కవిత్వమని భావించిన కవికూడ ఆయనయే.

అందులకే వీరిని గూర్చి కె వి రమణారెడ్డిగారెట్లు తెలిపిరి [1] "అభ్యుదయ కవిత్వమో, అంతకుముందు ఆచార్యరంగా రైతాంగ విద్యాలయమో రాకముందే సాదాజనాన్ని చూసి సాదాగా చిత్రించిన కవి వెంకట్రావే. సాహిత్యాన్ని నిజంగానే ప్రజాస్వామికం చేసిన రచయితల్లో కవికొండల ఒకరు."

"శ్రామికుల కష్టసుఖాలతో తాదాత్మ్యాన్ని పొందేగుణం మాత్రం విశేషంగా కనబడుతుంది శ్రమజీవుల కష్టాలు, వారి సుఖాలు, వారి అనుభూతులు, వారి వాంఛలు ఈయన అంతగా అర్థం చేసుకుని వ్రాయడానికి ప్రయత్నించిన భావ కవి కనబడడు" అని ఈ సందర్భమున కొత్తపల్లి వీరభద్రరావు[2] అభిప్రాయపడిరి

అభ్యుదయ కవితకు అద్యుడగు శ్రీశ్రీ తన మహాప్రస్థానం గేయమునకు ప్రబోధమును కలిగించిన వానిలో కవికొండల వారి శివరాత్రి ప్రభగేయమును పేర్కొనిరి [3]

నేటికాలమున మార్క్సిస్టు దృక్పథముతో శ్రామికుల పరిస్థితులను గూర్చి వ్రాయు కవిత్వమునకు ప్రజాకవిత్వమని పేరు ఇట్టి కవిత్వము శ్రామికులలో వర్గ చైతన్యము కలిగించి తద్వారా వర్గరహిత సమాజమును స్థాపించుట అనుధ్యేయ మును కలిగియుండను కవికొండల వ్రాసిన కవితలలో ఇట్టి మార్క్సిస్టు దృక్ప థము లేకుండినను, సహజము, సరళము అయిన శ్రామికుల దైనందిన జీవనదృక్ప థము ఎల్లెడల ప్రతిఫలించుచుండును.

ఇట్లు కవికొండల భావకవిత్వమునకు అభ్యుదయ కవిత్వమునకు వారధి అయినారని చెప్పనగును.

---

1_కవికొండల కారు చీకటి -కె.వి రమణారెడ్డి ఆంధ్రప్రభ, ఫిబ్రవరి 22, 1981

2_ కవికొండల కవి కవిత్వం— కొత్తపల్లి వీరభద్రరావు.

3_ ఆరంభం పెద్ద అవస్థ— శ్రీశ్రీ సాహిత్యం, రెండవభాగం— శ్రీశ్రీ.
(పు_528)

## 7. బాల వాఙ్మయము

నవ్య కవిత్వములో బాలగేయములు ఒక ప్రత్యేక శాఖగ వెలసియున్నది. బాలల కొఱకు ప్రత్యేకించి వ్రాయబడిన గేయములు బాలగేయములు ఇట్టి గేయములు ఆధునిక యుగమున బహుళ ప్రచారములోనికి వచ్చినవి వీనిపై ఆంగ్ల సాహిత్య ప్రభావము కొంతవరకు కలదు. ఆంగ్ల సాహిత్యమున ఈ వాఙ్మయము అపారము తెలుగు భాషలో మాత్రము ఈ సాహిత్యము అల్పముగ నున్నది.

మన సాహిత్యములో ఈ శాఖపై పునకు ఇటీవలి వరకు కవుల దృష్టి అంతగ ప్రసరింపలేదు బాలల కొరకు ప్రథమముగ గేయములు రచించిన వారు గురజాడ అప్పారావుగారని చెప్పవచ్చును. అనంతరము ఈ శాఖలో వేంకట పార్వతీశ కవులు, బసవరాజు అప్పారావు, కవికొండల వేంకటరావు మున్నగువారు గణనీయమగు కృషి సల్పిరి

కవికొండల రచించిన బాలగేయములు "కుమార కింరము, నెలబాలుడు, చిట్టికైత, చదువులదుత్త" మున్నగు సంపుటములుగ వెలువడినవి ఈ గీతము లన్నియు బాలబాలికలు సులభముగ పాడుకొనుట కనువైనవి

వీరు తమ 'చదువులదుత్త' గ్రంథమును 'పిల్లల లాలించు పెద్దలకు, పెద్దల దేలించు పిల్లలకు' అని అంకితమిచ్చిరి. దీనివిబట్టి వీరు బాలబాలికల అభిరుచి కనుగుణముగ, లలిత లలితముగ, మృదుమధురముగ కవితల నల్లినట్లు చెప్పనగును. ఇవి కొన్ని పురాణ గాథలను గూర్చి తెలుపునవి. కొన్ని దేశభక్తి ప్రబోధాత్మకములు, నీతిదాయకములు, విజ్ఞానదాయకములు, వినోదాత్మకములైనవి.

వీరి బాలగేయ సంపుటములు కొన్ని పాఠశాలలో పాఠ్య గ్రంథములుగ నిర్ణయింపబడినవి 'వీరి బాలగీతములను కొన్నింటిని పాఠశాలలోని చిన్న బిడ్డలకు అభినయ్యసహితముగ నేర్పుచుండిరి' అని ఆదుర్తి భాస్కరమ్మ తెలిపిరి.[1]

---

1. కవికొండల వెంకటరావుగారి బాల గీతావళి- ఆదుర్తి భాస్కరమ్మ, కవికొండల షష్టిపూర్తి సంచిక.

## నీతి బోధకములు :-

బాలలకు మనస్సుకు హత్తుకొనునట్లు నీతిని బోధించిన అవి వారాచరించ గలరు.

"నిదురబోవు నన్ను నుదయంబుగనే
లేపి బద్ధకంబు బాపునట్టి
పుణ్యమూర్తి! నీకు మ్రొక్కెద భువినుండి
మోకరించుచుఁ గరముల మొగిడ్చి"

వెలుగు రాకమునుపే మేల్కాంచి, శుచి శుభ్రముతో బద్ధకములేక దిన కృత్యములు నిర్వహింప వలయునను నీతి కలదు సర్వ ప్రకృతియు ప్రభాకరుని కారణముగనే చైతన్యము గాంచునను విషయము 'నినుఁ జూచి కాదె ముణుచుకొని యున్న తామరపువ్వు విడుచు, నీ వొందునంది కాదె చెట్లు చేమలు బలమును జెంది యెదుగు' నని చక్కగ నుడివిరి

'ప్రొద్దు పొడవకుండ నిద్దుర లేచుచు, ప్రొద్దు తోడ బనులు పొదుపుచేసి, గూండ్లలోని పక్షి కూనలట్లు రాత్రివేళ హాయిగా నిదురించుము' 'తెల్లారిపోయినది తెలివిగొను బిడ్డా' అని తల్లి బిడ్డను మేల్కొల్పును పసివాడు ఆ సమయమున చేయుపని ఆటలాడుటయే, కనుక 'అల్లారుముద్దుగా నాడుకొను బిడ్డా' అని ఆశ చూపుమ 'లేచిన చిటిపాప పూచిన పువ్వని' 'మొద్దు నిద్దురనున్న ముణిగిన మొగ్గ' అని తల్లి బిడ్డను పొగడి తన మాటను వినునట్లు చేయును

తల్లి, తండ్రి, గురువులను దైవముగ భావింపవలయునను సూక్తిని సుబోధకముగ చెప్పిరి.

'అన్నంబు దినిపించి నన్ను ముద్దాడి
యల్లరి మాన్పించు, నమ్మ దైవమ్ము
బుజ్జగించి నాకు బుద్ధులు సెప్పి
తగు పెద్దగను జేయు, తండ్రి దైవమ్ము
విద్దెల గఱపుచు విశ్వంబు సూపి,
యుత్సాహమెదఁ గొల్పు, నొజ్జ దైవమ్ము.'

మనలోని మంచి గుణములే దైవ సమములని, ఒప్పు తప్పులు దిద్ది, ముప్పొద్దులందు మంచికిఁ దీసెడు, మనసు దైవమ'ని, 'రెండు దారుల కూడలికి రాగ, నన్నుఁ దిన్నగ నడిపించు తెలివి దైవమ'ని చక్కఁగ చెప్పును

'తోడివారలతో గూడియాడి- ప్రేమతో జూడు వారల నెపుడు బిడ్డ' అని సహకార భావమును ప్రబోధించును. 'నీవు వారల నేరీతి నెంచుకొందో వారు నిన్నట్టె యెంతురు వావివరుస' అని ధర్మసారమును బోధించును

పిల్లలు ఆటపాటలు, చదువు రెండింటికిని ప్రాధాన్యము ఈయవలయును. 'ఆడుకొనువేళఁ జక్కఁగా నాడుకొనుమని, చదువుకొనువేళ శ్రద్ధగాఁ జదువుకొనుమ'ని ప్రబోధించును

ఇతరుల వస్తువు లెట్టివేళల ఆశింపకూడదను నీతిని బాలల మనస్సునకు హత్తుకొనునట్లు చెప్పిరి.

'నాన్న పంచె నాకు వచ్చదే బరువు
నారికేళపుఁ గొనల నాటుచునున్న
యీరెండ దోవతిని నింద్ర ధనువంచు
అద్దించి యమ్మరో! యది మొలనుగట్టి
బడికి నన్నంపవే! పారాలు చదువ'

ఈ భావమెంతయో మనోహరముగ వ్యక్తము చేయబడినది. అందులకు తల్లి 'బరువు మాటట్లుంచు- ఎరువురా తండ్రి- వలదు, వలదూ నాన్న పంచె వలదన్నా' అని ఎరువు సొమ్ము బరువు చేటని చాటును

ప్రయాణమయి బయటకు పోవువారిని ఎక్కడికని అడుగరాదని పెద్దలు చెప్పుదురు. ఆ నీతిని తల్లి నయముగ 'ఏ యూరుకని చెప్పి యెవరి నడుగకుమీ- వెళ్ళిపోనీవలె వెళ్ళు వారలను- వారు వెళ్ళు నూరు ప్రశ్నింపరాద'ని బోధింపగ, కొంటె బాలుడు 'ఉడుత నడుగుట తప్పె' అని ప్రశ్నించును

### విజ్ఞానదాయకములు :-

బాలలకు విజ్ఞానదాయకమగు పలు గేయములు సరళసుందరముగ రచించిరి. క్రొత్త క్రొత్త విషయములను పాటల రూపమున చెప్పిన వారికి సూటిగ మనస్సున

కెక్కుమ బల్లపరుపుగ చేయబడిన వస్తువు నీట తేలునని, గుండ్రని వస్తువు మునిగిపోవునను విషయమును—

'ఊరంత యోడయు నీరాలదేలు
గులక రాయింతైన బుళుకుమని మునుగు' అని చెప్పును

భూమ్యాకర్షణ శక్తిని గూర్చి 'చెట్టునగల పండు క్షితిపయిని బడు'ననియు, భూమిపై నుండి కొంతదూరము దాటిన ఆ ఆకర్షణ శక్తి వుండదను విషయమును 'పట్టులేనీ చుక్కపై నట్టిగోలు' నని సుబోధకముగ చెప్పును

'తామరాకు పయిని తడియంట బోదు
తామరాకూ క్రింద తగనంత నాచు
సూదంటు రాయికి సూదిమొన దిరుగు,
ప్రొద్దు తిరుగుడు పువ్వు ప్రొద్దుతో దిరుగు'

అనుచోట లోక ధర్మములను, శాస్త్రీయ దృక్పథముతో సులభ సూక్ష్మముగ చెప్పిరి

తంతి తపాలా సౌకర్యములను గూర్చి పిల్లలను ఆకర్షించునట్లు చెప్పిరి.

'రెండు డబ్బుల కార్డు డిబ్బిలో వెయ్య
తోక పిట్టాలాగు తోచెంచు జాబు
ముప్పావులా నిచ్చి ముక్తసరి చెప్పు,
చెవిలోని మాటల్లె చేర్చెడు తంతి'–

వర్ణ ధర్మములను, ఆయా వర్ణములవారి వృత్తులను సులభ సుందరముగ చెప్పిరి.

'సంధ్య వార్చెడు బ్రహ్మ స్నానంబు సేయు
వేనమేసెడి రాజు మీసంబు దువ్వ
లాభసాటన సెట్టి రాళ్ళు సవరించు
కిట్టు చెప్పుల రైతు కట్టు చేత చూచు'

బాలుడు కాకి కూతవిని "చుట్టాలు వత్తురని కాకి గంతేసి, చుట్టాలు వచ్చిరని చిలుక పీటేసి – అమ్మా ! నేఁ జేయునవదియేమొ చెప్పు" మని అడుగును అందులకు ఆమె అతిథి అభ్యాగతులకు చేయవలసిన మర్యాదలను బోధించును. "చుట్టాల

కర్ఘ్యమియ్యాలి వారికి పాద్యమియ్యాలి. కుశలమడిగి, వారి, గూర్చుండబెట్టి, అతి రసాల్ వండించి, యమరవడ్డించి వారిని గూడి సీవారగించాలి" అని మన సంప్రదాయసారమును అందించును

పాలనుండి పెరుగు, మజ్జిగ, వెన్న, నెయ్యి క్రమముగ ఎట్లు వచ్చువో చెప్పును

గొల్ల కూర్చుండి జుంయి జుఁయిని బిదుకగ అవుతీయని పాలిచ్చును. "అమ్మ కాచెడు నాపాలు కమ్మగాను, అక్కతోడ్పెట్టు వానిని మెల్ల మెల్ల" అని పాలు కాయగ పెరుగగుననును "గడ్డపెరుగును కవ్వముననుజిలికి దానిని మాయవ్వ చేయుఁజల్ల" అని అవ్వ చల్ల చేయుటను వర్ణించును

అట్లే ప్రత్తిపంటను గూర్చి సుబోధకముగ వివరించును "నల్లరేగడిజిగి బల్లటిల్లు వచ్చునైన చెట్టు పైకి లేచునువేగ" అని చెప్పును

వానికి ఎట్టిపూలు పూయునని, దానినుండి ప్రత్తి వచ్చుటను —

"పూచినట్టి పూవు కాచుఁ జిన్నటికాయ
కాయ యెండి పగులఁగానుపించు
తెల్లనైన ప్రతియెల్లల్ల గాలిలో
లీలనెగిరి కొనుచు దేలికగుచు"

'మెఱుపులు తళ తళ మెఱయుచునుండ
ఉఱుములు పెళ పెళ నుఱుముచునుండ
చినుకులు చిటపట జిందులుఁ ద్రొక్క
తొలకరి వానలు పొలముల గురిసె'

—మెఱుపులు, వాని వెంట ఉఱుములు రాగా తొలకరి చినుకులు పడునని చక్కగా చెప్పెను.

అయాదిక్కులను గూర్చిః ప్రకృతిలో వానికి గల ప్రాశస్త్యమును గూర్చి సుబోధాత్మకముగ చెప్పును.

"ఊరుకు తూర్పున సూర్యోదయంబు
ఊరుకు దక్షిణం మలయమారుతము
ఊరుకు పడమట సూర్యాస్తమయము
ఊరుకు ఉత్తరం ధ్రువుని నక్షత్రం"

అంకెలు పిల్లలకు సులభముగ గుర్తుండునట్లు
"ఒక్కడె దేవుడు - ఎక్కడ జూచిన
రెండు చేతులను - ప్రేమను మోడ్చి
మూడు వేళలను - ముదమారంగ
నాల్గువేదముల - నట్టకపొగడుడు
అయిదింద్రియాలకు - నందని వాడయి
ఆరు రుచులకును - సారముదానయి
ఏడ్గురు ఋషులకు - నెక్కుడు వాడయి
ఎనిమిది దిక్కుల-నెందును దానయి
తొమ్మిది గ్రహముల - నిమ్ముగ నడపెడు
పది యవతారాల్ - పరమేశ్వరుఁడతఁ
డొక్కడె దేవుడు - ఎక్కడ చూచిన "—

అని అంకెల ద్వారా భగవంతుని స్వరూపమును చక్కగ జూపెను ఇది బాలి బాలికలలో భగద్భక్తిని, విజ్ఞానమును రేకెత్తించు గేయము.

పిల్లలకు ఆటలనిన ఆసక్తి ఆటల పేర్లను సూచించుచు అంకెలను గుర్తించుకొనునట్లు చిత్రముగ రచన చేసి, వారి మనస్సులను ఆటల పైకి మరలించును

"I హై జంప్ - ఒకగీత
II పారెలార్ బార్ - రెండుగీతలు
III క్రికెట్ - మూడుగీతలు
1III నాలుగు స్తంభాలాట - నాలుగు గీతలు
IIIII హర్డిల్సు - అయిదు గీతలు
Ⅲ.Ⅲ పుట్‌బాల్ - ఆరుగీతలు
ఆడుకో అబ్బాయి ఆడుకో"

భూమి స్వరూపమును "కాలినడకను బోవనేల వలుపుగనుండు- కంటికావల చుండు మింటికొన గుండ్రంగా" అని బోధించును.

రంగులను వారికి బోధపరచుటకు పువ్వులనెన్నుకొనును

"మల్లె పువ్వు తెల్ల పువ్వు మంచివాసన
పచ్చన్ని చేమంతి పువ్వు బంగరువన్నె
ఎఱ్ఱని మంకెన్న పువ్వు కుంకుమ చాయ
తెలుపు, పసుపు, ఎఱుపు, మీకు దెలిసెవలేదా!"

రాజుకు రైతుకుగల భేదము మన వ్యవస్థలో ఎంతగ సాతుకొనిపోయినదో చక్కగ చూపును 'తలపాగ జుట్టుకొని తలంపు లేమియులేక పొలమునకు వెళ్ళెడివిరయితు' అని, తలగడలలోఁ బండి తఱుగని తలపోత పొలిమేర దాటదే రాజు' అనియు వారిరువురును వేషములోననేకాక వారి పనులలోను తేడా చూపును

సబ్బు నీటితో బుడగలూదుట బాలల కిష్టమగు క్రీడ జీవనము బుద్బుద ప్రాయమను ఆర్యోక్తిని బుడగల క్రీడ ద్వారా ప్రబోధించును.

'నే బుడగ లూదుతున్నాను — బుడగలూదుతున్నాను
నేపాళప్పాలలోన — పట్టి గడ్డి పరక ముంచి
అందాక పోనేల? — నా జీవనంబు బుడగె
అద్భుతంబు! బుద్బుదమటు
అగపడదు మహాశయాల
ఏ జీవనంబు బుడగె!'

బాల బాలికలకు ఏ విషయమునైనను చక్కటి సామ్యములతో చెప్పిన వారి హృదయమునకు హత్తుకొనును

"ఒక చిన్న వింత మొలక
ప్రకటితంబుగను పైకి
భూమి లోపల నుండి లేవ
సుకముగను జూతునేను"

'భూమి లోపల పాతి సుంత-నేరములు చిలుకునంత - రెండు మూన్నాళ్ళ లోన నిండు శోభనపు సిరుల పండువిడు - కనులముందు' అనుచు అనుకూల పరిస్థితులలో విత్తనము మొలకెత్తినట్లు బాలుడుకూడ విత్తనంబేవని, 'బావి పౌరుడవు గాంగ - భరత మాతకు గీర్తిరాగ' వర్తించవలయునని ఉద్బోధించును.

నీటి యావిరికి గల శక్తిని ఈ క్రింది గేయము సరళముగ బోధించును.

'అమ్మ యెసరు బెట్టి పో
నల్ల నల్లఁ బ్రొయ్యి కడఁజేరి చలికాగు పుత్రుడొకడు
చూడఁ దొడగెను మిక్కిలి చోద్యముగను
పండుచున్నట్టి మంటనే మసలి గిన్నెలో నీరు
గుప్ గుప్ మటన్న ధ్వనిని
ఆవిరిని వెలిబుచ్చుచు నంతకంత కధికమై
సిబ్బె రేకును నట్టె పైకి నెత్తి పైచుచు
సత్తు వెంతేని జూపె'

ఇట్టి శక్తిని ఆధారముగ చేసికొని శాస్త్రజ్ఞుడు 'దానినింబట్టి చిన్ని యంత్రంబు నొంటి వేగఁ గనిపెట్టె' అనియు, ఆ యంత్రములో 'వేడి నీరములు గూర్చి యావిరి దారికడ్డు చక్రములు బెట్టి చక్రాల సాగిపోవు ధూమ శకటంబు కనిపెట్టెఁ దొలుతనతడు' అనియు ఆవిరియంత్రమును గూర్చి సులభ గ్రాహ్యముగ విడమర్చును అట్లే పసివారు విజ్ఞాన తృష్ణను పెంపొందించుకొన గోరును.

మన దేశము యొక్క భౌగోళిక స్వరూపమును, ఎల్లలను బాలబాలికలకు చక్కగ చూపిరి.

'ఏ దేశమే యూరు? చిన్ని బిడ్డా! ఈ దేశమీ యూరె కన్నతల్లీ!
ఉత్తరాన్నేముంది? చిన్ని బిడ్డా! ఎత్తైన కొండలు! కన్నతల్లీ
తక్కిన దిక్కులు? చిన్ని బిడ్డా! చక్కని సంద్రంబు కన్న తల్లీ!'

## దేశభక్తి ప్రబోధకములు :

బొబ్బిలి రాకుమారుడు వెంకటరాయుడు బాలుడైనను శౌర్యమును ప్రకటించును 'చక్కని బొమ్మలు నగలు, సన్నని బట్టలు, బొంగరములు' మున్నగు పనేక వస్తువుల నుంచగ ఆ బాలుడు 'ఉక్కు ఖడ్గమును దొట్రిలు పాటొకింతలేక తావలపలిచేతఁ జిక్కుగొని బాహువులెత్తుచు మేటి బలంబుల బొమ్మలన్నిటిన్ తుక్కు తుక్కుగా మెలికలు పీడిపో నతడెకె'నట 'పువ్వు పుట్టగనే పరిమళించున'ను లోకోక్తి వానిపట్ల సార్ధక మయినది ఆ బాలుని శౌర్యమును విన్నంతనే బాలుర మనస్సులలో శౌర్య మొక్కపరి ఉప్పొంగును.

బాల్యమునందే సింహములను లొంగదీసిన శౌర్యధనుడు భరతుని పేరుననే మనదేశము భారత దేశమైనది ఆ విషయములను కవి బాలలకు మనస్సులలో నాటునట్లు వారిలో వీరత్వము పెల్లుబుకునట్లు తెలుపును.

'అడవియందు నొంటి నాడుచుఁ బాడుచు
నైదునేండ్ల యీడు నచ్చెటువుగ
సింగమెక్కి స్వారి చేసిన బుడు తండు
భయము లేనివాడు భరతసుతుఁడు
అమ్మకయ్య కెప్పుడానంద మొసఁగుచు
దపసి కణ్వు నొద్ద ధర్మువెఱిగి
భరత వర్షమెల్ల పాలించె నతండు
భరతమాత పేరు బఱగునతని'

భక్తి బోధకములు :

స్నేహభావముతో భగవంతుని ధ్యానించి ముక్తినొందుట భక్తి మార్గము లలో ఒకటి కృష్ణుని స్నేహితునిగ ప్రేమించి మోక్షమునొందినవాడు కుచేలుడు. వారిరువురు 'ఐదేండ్లనాటి నుండియును చెలికాండ్రయి యొక్క గురుని కడ విద్యల నేరిచి, కలసి మెలసి యెంతయో యైకమత్యత నెసగు వార'ట.

'తానడుగకయ వేమిత్రుదయ కతమున
బీద తన మెల్ల పోయి సంభృత ధనాఢ్యుఁ
డగుటఁ గృష్ణుని నిర్వ్యాజమైన ప్రేమ
స్మృతిని నేనాడు దలఁచుఁగుచేలుఁడింక' —

పై గేయమును చదివిన బాలలకు తోడి వారితో స్నేహము చేయవలెనను కోరిక మొలకెత్తును వారికి పురాణ గాథలతో పరిచయము కలుగుట

చిన్నికృష్ణుడు మన్ను తినిన సంఘటనమును కడు మనోజ్ఞముగ వర్ణించును.

'చెప్పకు చెప్పకు బలరామా
చెప్పకు చెప్పకు నాయన్నా
చెప్పిన నీ కళ్ళోతాయి
ఎప్పుడు మన్నిక నే తిననూ'

కృష్ణుడు తల్లికి విశ్వరూపము చూపుటను "అట్లనుచు శ్రీకృష్ణుండు — ఆవులించి నోరగవటవ చంద్రుని సూర్యుని జుక్కలను - జగముల సర్వమును" అని మనోజ్ఞముగ చూపును.

శ్రీరాముని బాల్య చేష్టలను, కౌసల్యాదేవి మాతృప్రేమను చక్కగ చిత్రించును

"చిన్ని శ్రీరాముడొక రాత్రి
కన్నతల్లి యల్ల కౌసల్య - తనకు
నల్లదిగో చూడు చందమామని
వెన్నెల నందమగుచు నాకసముపై వెలుంగు పున్నంపుటంద్రు
జూపునంతట రాముడు సూచి చూచి,
అమ్మ! యా చందమామతో నాడుకొందుఁ
దెచ్చి యీయవె యని యేడ్చినాడు
అద్దమొకదాని రాముని యొద్ద నుంచి
యందులోఁ జందమామను నందముగను జూపి
చేతికి నందిచ్చి చూడుమనియె
చిన్ని శ్రీరాముఁడప్పుడా చేత నున్న
చందమామను జూచి ఆనందపడియె
అట్టి శ్రీరామునో యమ్మ
యనవతరమునే భజింతును రామ! భతే యటంచు!"

చందమామ కావలయునని అడగుట శిశు సహజము. భగవత్స్వరూపుడగు రాముడును శైశవమున తమవలెనె ప్రవర్తించుటను విని బాలుడు మిగుల సంతసించి అట్టి రామునే భజింతుననును.

'రాముడెంతటి మహారాజు తానయ్యు
ఆ మాల పాపతో నర్మిలి గలిసి
నచ్చని యాకులోఁ బండ్లారగించె
సరశార్ద్రి హృదయ యోసాధుకన్య
కుల భేదమేమి సద్గుణము నీకుండ'

ఇందు రాముడు ఎంగిలి పండ్లను తిని పంచమ కన్యను ఆదరించుట వర్ణించి సర్వమానవ సమానత్వమును, అస్పృశ్యత తగదనుటను బోధించును.

అంజనేయుడు బాలుడుగ నున్నపుడు సూర్యుని చూచి పండని భ్రమసిన కథ సులభమగు మాటలతో చెప్పును

'అంజనీదేవికి నాంజనేయులు పుట్టె
తొగరు ప్రొద్దు పొడిచెఁ దూర్పు దిశను
పొడిచెడు కెంబొద్దు బిడ్డను చూచి
పండని తలపోసి పైకినెగిరి
తోకనెత్తిపట్టి దొడ్డగా గుప్పించె
నంతరిక్షమునకు నయ్యో, అయ్యో
అంజనేయులు మూతి యట్టె తెగ్గాలింది
హనుమంతుఁడైనాడు అంత నుండి'

దేవుడు ఎక్కడో లేడని ప్రకృతి సౌందర్యమున దాగియున్నాడను సత్యమును ప్రబోధించును.

'దేవుండెచ్చట కలడని
భావన మనవారు చేసి ప్రకృతిసౌంద
ర్యా వాసి యాతఁడని కా
దే వెలయించిరి సుతీర్ధ దేవాలయముల్'

భగవద్గీతా సారాంశమగు కర్మ సిద్ధాంతమును సులభ సూక్ష్మముగ వివరించును.

'ధర్మ ప్రసిద్ధమగునీ
కర్మంబును వీడరాదు కర్మఫలంబున్
నిర్మల మతి వీడవలయు
మర్మంబిది సుమ్ము ముక్తి మార్గమ్మునకున్' —

వినోదాత్మకములు :-

"ఏయూరు వెడతావు-ఉడుత
మాయూరు వెడతాను-బుడుత
మీ యూరు ఎక్కడ-ఉడుత
మింట గొబ్బరి చెట్టు-బుడుత"

జంతువులు, పక్షులనిన బాలలు మిక్కిలి ఆసక్తి చూపుదురు. పై గేయమున బాలునికి ఉడుతకు మధ్య సంభాషణను చక్కగ నడిపిరి. ఉడుత మాయూరికి వెళ్ళెద ననగనే బాలుడు 'ఉండిపో మాయూర నుడుత' అని ప్రాధేయపడును. అందులకు ఉడుత ' హూత్ అనకు మరి నన్ను బుడుత' అని కోరును.

పిల్లలు తమను తల్లిదండ్రులెత్తుకొని లాలింపవలెనని కోరుకొందురు. దానిని గూర్చి

'ఏనుగెత్తుకోవాలంటె-అంబారి రావాలి
గుఱ్ఱమెత్తుకోవాలంటె-జీను-రావాలి
నాకు
అమ్మ ఎత్తుకోవాలంటె-అయ్య కావాలి
అయ్య ఎత్తుకోవాలంటె-అమ్మ కావాలి
నేను

ఒకరి నుండి యొకరి కడకు-వాలిపోవాలి'-అను బాలుని కోరికను చక్కగ చూపును.

శిశువులు ప్రథమముగ మాటలు నేర్చుకొనునపుడు కొన్ని పదములను పలుక లేక మారుపేర్ల నుచ్చరించుటను కవి మనోజ్ఞముగ చెప్పును

"దీనిని నీవు చిన్నప్పుడు చో చో చో అన్నావు
ఈ కోడిపుంజునా? అమ్మా!
దీనిని నీవు చిన్నప్పుడు పుస్ పుస్ అన్నావు
ఈ గండు పిల్లినా? అమ్మా?
"ఊఁ"
అమ్మా! మరి నిన్నో-నేనేమన్నాన్ చిన్నప్పుడు
మ్మే! అని అన్నావుర"

— ఇందు 'అమ్మ' అను పదమును అట్లే పలికినాడని చెప్పుచు తల్లికి గల ప్రాధాన్యమును చూపును.

తల్లిదండ్రుల నీడన పెరుగు బాల్యమునకు సాటి ఏదియు లేదని అది స్వర్గ తుల్యమని చాటును.

'జీవిత సుస్వర్గంబు—భావింపగ బాల్యంబు
తినగఁ దల్లివండును—మనఁగ దండ్రి దెచ్చును
హాయి! హాయి! హాయి! హాయి!
ఆట పాట గడిచిపో—అగపడదొక నిముసము—
హాయి! హాయి! హాయి! హాయి!'

తల్లి శిశువులకు బువ్వతినిపించునపుడు పాటలు పాడి లాలించి మరిపించును.

'చిన్ని బొజ్జనిది—కనుక చిన్ని వెండి గిన్నెలో
అన్న! గుజ్జు బువ్వ కలిపి—యరయు చుంటి నిన్ను; ఎం
దున్నారవోయి! ఎవ్వరొక్క— పలుగులోనర
మ్మన్న వచ్చువారొ చూతమదిగొ కనులు మూసికోన్
ఈవు రాకపోదువేని—ఇంటిమీద జూచెదే
కావు కావు మనుచు నలచు 'కాకికిఁ బడవైచెదవ్'—

బిడ్డడి పేరును తల్లి అపురూపమైనదిగ భావించి బహువిధములుగ పిల్చుచు మురిసిపోవుచుండును.

'కాసులపేరు—వరాలపేరు
మోరీల పేరు—రూకలపేరు
అబ్బాయి పేరు—అందంపుబేరు
బంగరు టుంగరం—మంచినపేరు
తాతలనాటి—తఱుగనిపేరు
ముజ్జగములకు—ముద్దులపేరు
ఒజ్జలు పిలువ—నౌహోయనుపేరు'

— అట్టి తల్లి సంబరమును ఇందు చక్కగ వ్యక్తము చేయును.

బాలికలు కొయ్య బొమ్మలు, చందనపు బొమ్మలు మున్నగు వానితో నాడి బొమ్మల పెండ్లిండ్లు చేయుట చక్కగ వర్ణింపబడినది

'బొమ్మల నగలమ్మ బొమ్మల నగలు-చందనపుం బొమ్మ కందమౌ నగలు' అను అమ్మి కేకలు విని చిన్నపిల్ల కమల కాలిగజ్జెలు ఘల్లు మనగ గడపదాటి వీధిలోనికరుగు దెంచును.

'తనదు చంక కమరిన బొమరాయి నెత్తిచూపి దీనికీడు జోడు నగలనీయు మని, నగలుపెట్టి పెండ్లినయముగఁ జేతునని' ముద్దుగ నడుగును.

అందుల కామె 'చెవులులేనిదేమి చెవిపోగులమ్మాయి! ముక్కు లేనిదే నత్తు నెక్కడిడుదు, చందనపు బొమ్మ కందంపు నగలివి' అనినను బొమ్మల నగలిత కమలకిచ్చి చనినదట. కమల ముగ్ధత్వమును ఇందు మనోహరముగ చూపును.

కవి తెలుగునాట బాలికలు ఆడు అట్లతద్ది మొదలగు ఆటలను గూర్చి తెలుపును. ఆయా ప్రాంతములలోని సంప్రదాయములు, ఆచారములు, ఆటపాటలు కవుల రచనల మూలమున తెలియును కవి కొండల అనేక గేయములలో ఆంధ్రుల పండుగలను గూర్చి ప్రస్తావించుచుందురు.

'అమ్మరో! నేడు తద్దినుమి, యాటలనాడు కొనంగబోదు
వేగమ్మగ లేపగావలెను
గారవ మొప్పగఁ గన్నెలెల్ల ఋన్ రమ్మని పిల్చినారెనను
రాతిరి నిద్దురె పోను-పోవుచో-నెమ్మయి నీవు లేపవాకా'
— బాలిక మనస్సులోని ఆరాటమును, ఉత్సాహమును సహజముగ చూపిరి.

తెలుగు నాట ఆనాడు బాలికలు ఆడు ఆట లన్నియు క్రింది గేయమున పేర్కొనబడినవి ఆనాటి సాంఘిక జీవనమునకు ప్రతిబింబముగా నున్నది.

'ఇంద్ర జాలిని మననేరికి నగవడ
కల్లడాగురు మూత లాడవలయు
గగనమున జరించు గంధర్విణి యనంగ
నుయ్యాల నుఙ్జూత లూగవలయు
జగమెల్ల త్రిప్పంగ జాలుదునోయనఁ
గరము వానాలప్ప తిరుగవలయు

కంకణంబులు మ్రోయఁగారె యచ్చుఱ
జెమ్మ చెక్కొటలఁ జెలగ వలయు
ఇంక జెప్పంగ నేటికీ నింపుగులుక
గచ్చ కాయలు గవ్వలు కాళ్ళగజ్జి
చిన్ని చిన్ని త్రొక్కుడు బిళ్ళమున్నగాఁగ
నాట లెన్నియొ మేమింక నాడవలయు'-

ఇట్లు కవి కొండల సరళశైలిలో, సహజ సుందరముగ పలు బాలగేయములను రచించిరి. మన భాషలో బాల సాహిత్య మల్పముగ ఉన్న కాలమున బాలబాలికలకు అనుకూలములగు గీతికలు రచించి వీరు బాలవాఙ్మయమునకు ఎనలేని సేవ చేసిరి.

## 8-స్మృతి కవిత్వము

నవ్యకవితా ప్రక్రియలలో స్మృతి గీతము ప్రత్యేక స్థానము నాక్రమించి నది. "పరలోగ గతులైన ఆప్తులు, సన్నిహితులైన వారిని స్మృతి పధమున తల పోసి వెలయించునవి స్మృతిగీతములు" అని చెప్పిరి. పైన పేర్కొనినవారేగాక దేశ నాయకులను గురించిన స్మరణగేయములు కూడ పేర్కొన దగినవి.

ఆంగ్ల కాల్పనిక కవిత్వ ప్రభావముతో ఇట్టి గీతములు మనసాహిత్యములో చోటు చేసికొనినవి ఆంగ్లమున ఇట్టి రచనలను "ఎలిజీ" అందురు. తెలుగులో ఆధునిక కవులు కొందరు ఇట్టి స్మృతిగీతములను రచించిరి. కవికొండల దేశ నాయకస్మృతి, అప్తస్మృతి గీతములను రచించిరి.

### దేశనాయక స్మృతి:-

మహానాయకులు దాదాబాయ్ నౌరోజి, తిలక్, గాంధీ మహాత్ముని మరణ వార్తలు కవిని శోక సముద్రములో ముంచినవి. వారిపై స్మృతి గీతములను రచించిరి.

దాదాబాయ్ నౌరోజీ:గాంధీ మహాత్మునికి ముందుగనేస్వాతంత్ర్యోద్యమమును ప్రజ్వరిల్ల చేసిన వారిలో ప్రముఖుడు నౌరోజీ.

"అపాశ్చాత్య పయోధి వాయుజిత భంగాలోల ఫేరార్జున నా
శ్రీపాశీ పరిపోషితాంచలపు నిశ్చింతన్ విలోకించెదున్
నీ పూజ్య భ్రుకుటీ యుగంబదె యికన్ నేడిందు యోజింపదో
ఓ పశ్చాత్మకః భారతీయ ప్రముఖాః ఓ మాతృదేశ సఖాః"

దేశనాయకులలో సాటిలేని స్థానము నాక్రమించిన 'స్వరాజ్యమే నాజన్మ హక్కు' అని చాటిన మహావ్యక్తి బాలగంగాధర తిలక్. ఆయన మరణించిన తరుణములో వీరు 'తిలక్ స్మృతి' అను స్మృతిగీతమును రచించిరి.

'ఆతడు మరాట సింహుండు. మ
హాజన వంద్యుడు, దేశభక్తి పూ
రితుడు, నిరంకుశత్వ విప
రీత విమర్శకు, డార్య వేదస
త్కృతిదు, డెంతయున్ ధృతుడు
గీతకుఁగర్మపరాన వర్ధ సం
భృతి నొడ గూర్చినట్టి మతి
వీరుడు, తత్తిలకాన్వయుండిలన్
చనెనో, నూతనమౌ మహత్తర
పునర్జన్మంబు తానందగాః
తనదౌ జీర్ణ శరీరమున్ విడి
చెనో తద్దీప్తి రెట్టింపుగా
.... ........ .. .. ....

గాంధీజీ హఠాన్మరణ వార్తవిని కలత చెందని భారతీయుడు లేడు. కవి కొండల గాంధీజీ మరణమునకు విలపించి అతని ఆత్మశాంతికై 'ఆవేదన' అను గీతికలో ప్రార్థన మొనరించును. తనకే గనుక శక్తియున్న మహాత్ముని పునర్జీవితుని గావింపకుందునా అని తలపోయును.

'శాంతిదూతః కర్మవీర' సత్యాగ్రహ ధీరాః
నీ-ఈ-మరణవార్త
ఘోర మతి కఠోర, మరరెః చోర
ధాంః ధాంః ధాంః క్రూర

మరయ-భిన్నమనీషివే! ఓడె నెంత రక్తమూ.
ఓ మహాత్మ గాంధీజీ—ఏ మహిమే నెవరిలో
నేన్ మహిపై నున్నచో—పునః జేతుమోయ్
ఓ మహాత్మ గాంధీజీ—నిన్ పునఃప్రాణు జేతుమోయ్
ఆదాకా చేతులెత్తి మ్రొక్క-నీయ్!
నీ ఆత్మ శాంతి కొఱకు .. ....ఓం శ్శాంతిశ్శాంతిశ్శాంతిః'

## 2. ఆప్తస్మృతి:-

దామెర్ల రామారావు కవికొండలకు మిత్రుడు, ఆప్తుడు, బంధువు. రాజమండ్రి కళాశాలలో చదువు సాగించు దినములలో కవికొండలవారు, అడివి బాపిరాజు, దామెర్ల రామారావు అత్యంత సన్నిహితులై మెలగెడివారు. వీరిలో దామెర్ల పిన్నవయసులోనే మరణించిన ప్రముఖ చిత్రకారుడు.

అతని మరణవార్త కవికి నమ్మశక్యముగా తోపలేదు. మిత్రుని రూపు రేఖలను, చేష్టలను, తామిరువురి మధ్యగల నెయ్యమును తలచి తలచి విలపించును.

'అకళారత్న మిస్సీ!—కన్దైయగుటెట్లు?
నవనీతపుం గుండె—నాడి సోకమియెట్లు?
చిత్రకారుని సొగసు—క్షితికి బరువౌటెట్లు
నమ్మజాలను నేను — నమ్మనేరను హరీ!
అతడు నా 'కొడు' కంచు— అమ్మ తలంచుటా?
అతడు 'తమ్ము'డం'చు—అన్న స్మరించుటా?
అఖిలాంధ్ర లోకంబు—అనుకొనియున్నదే
లలిత కళకుంగ్రొత్త — లాలిత్యమొదవునం
చతని కీర్తి — అతులితంబగునంచు ...
శాంత పథమేవైపు స్వర్గ సుఖమెందెందు
ఆధ్యాత్మికపుముక్తి ఆత్మకెచ్చటు? ఎటు
అచ్చోటు నీ యాత్మ అమల నిశ్చలకాంతి
నైక్యమయ్యెడుగాత! అనుబరామరాయ.'

తన బాల్యస్నేహితుని భార్య మృతిపొందగ తన చెలికాని స్థితిని తలచి కవి దుఃఖించును.

'మానిని యొర్తు
నా మతొక మామ్యనకున్ దృఢమైత్రి శాలికిన్
ప్రాణ పదంపు భార్యయయి ప్రాయము నందునె పోయె
తత్సఖుండో విరహాధీనామెకయి యోజనసేయుచు
జీవమెల్ల-అ చానకు ధారవోసి
కమ జాలువ బాష్పలోద్బుసారెకున్'

అని మిత్రుని భార్య మృతికి పరితాపమొందును. కవికి ఆమె మృతికంటెను దుఃఖమును కలుగచేసినది తన మిత్రుని స్థితి.

ఇట్టి వింతను ఎన్నియో కలవని కవి వ్యక్త పరచును.

'ఇవి యొక కొన్ని హృద్గతము
లిట్టివె యింకను నెన్నియెన్ని మో యవిరళ సంస్మృతిన్ గనుచు
నందు క్షణంబు గదుష్ణ బాష్పపున్నెవ జనితంపుటూర్పున
ఘనంబగు దుర్భర భావ సంగతిన్ దవిలితి
మొన్న మొన్న టివి తల్పగనెట్టిది-ఇనవోయనన్'
కాని ఆసంఘటన లెట్టివో వివరించలేదు

ఇట్లు కవికొండలవారు దేశనాయకస్మృతి, ఆప్తస్మృతి గీతములను రచించి దేశనాయకులపట్ల గలభక్తిని, అప్తుల పట్లగల అభిమానమును వ్యక్తము చేసిరి

## 9— ఆధ్యాత్మిక కవిత్వము

నవ్య కవిత్వ శాఖలలో భక్తి కవిత్వము విశిష్ట స్థానము నాక్రమించు చున్నది ఆధునికముగ తెలుగు సాహిత్యములోని భక్తికవిత్వము ఆంగ్ల ప్రభావముతో. వెలసినదికాదు. దీనిపై భారతీయ సంప్రదాయ ప్రభావ మధికము. అస్తికత దీనికి ప్రధాన లక్షణము. పలువురు ఆధునిక కవులు భక్తి కవితలు రచించిరి భగవంతుని చేరుటకు కొందరు ప్రకృతిని ఆశ్రయించగ, కొందరు మధుర భక్తిమార్గము నవలంబించిరి.

వేంకట పార్వతీశకవులు, దువ్వూరి రామిరెడ్డి బసవరాజు అప్పారావు మున్నగువారు భక్తికవిత్వమును పరిపుష్టము గావించిన వారిలో ప్రముఖులు, ఈ శాఖలో కవి కొండల కొన్ని రచనలు చేసిరి.

భగవద్గీత అనిన తనకు మిక్కిలి గౌరవమని వీరు చెప్పుకొనిరి

"అదె గొంతు- అదె తంతు
వినవచ్చు నేటికిని
రండు వినుండు మేల్కొండు మీరందఱూ
నాడు కురుక్షేత్ర
మేడనున్నది-ఇట భారతావనిమీద"___
"నీవు నిమిత్తముగా నీ
జీవంబులు దీయ బోయ జిక్కెనె నీకున్?
దైవము గలఁడట్టని నీ
చేవ సడల రాదు యుద్ధ సిద్ధుడవగుమీ."

వేదముల సారమగు భగవద్గీతను సరళముగ, సుబోధకముగ విడమర్చును. దైవమును నమ్ముటయే మన ధర్మమని తెలుపును

"సృష్టికాదిని ముందు క్షీరసముద్రాన
వటపత్రమున బడు బాలుండు
కుడికాలు బొటనవ్రేలు కుడుచుకొనుచునతడు
చిరునవ్వులను లోన మురిసికొనుచు
సృష్టికర్తను తన చిన్ని బొడ్డున నిల్పి
జగముల సృజియించు సొగసుగాను"

విష్ణువు సృష్టి కర్తయగు బ్రహ్మను కూడ తన బొడ్డునందు నిలిపి ప్రళయ కాలానంతరము మరల సృష్టికి కారణ భూతు డగుచున్నాడు. "మిన్ను మన్ను తనకు దాను-పాలవాన గురియగాను పాలమీద బవ్వళింప బాలుడైతివా?" అని పరవశుడగును.

"శ్రీధరః మాధవః
చిన్మయాకార ః

సేవ చేసెద నీకు
చేకొనుమీ జోహారు-
నీ యధికారము కంటె
న్యాయము వేరె లేదు
వాయువు నీచే వీచును-
ఆయువు నీచే గాచును"

అని సకల చరా చర సృష్టి ఆయన అధీనములో నుండునని శిరస్సు మోడ్చును కృష్ణుని లీలలను తలచి తలచి పరవశించును

"నీదు నీల దేహ
మంధకారమైన,
రాధరంగు చీర
నిమజుట్టి మురిపించు
వేణు వూదునపుడు
విశ్వమునకు విదురైన
జ్ఞానమూని యమున
జరిగినన్ గర్వించు-
ప్రాణాధారకృష్ణ!
గోవర్ధ నోద్ధార!
మేనుమించు రూపు."
"మీనమై కూర్మమై మేటి వరాహమై
నరసింహమై వామనయ్య యగుచు
పరశురామ సురామ బలరామకృష్ణులై
బౌద్ధమై కల్కిమై యుద్ధరించు
విష్ణు వాతండెందు వినిపించు గనిపించు
నారాయణాఖ్యుండు నరుని సఖుండు"

అని భగవంతుని దశావతారములను వరుస క్రమమున తెలుపును

దేవునికి అత్యంత ప్రియులగు భక్తులను స్తుతించుట కూడ భక్తిలోని మార్గమే అని చాటి చెప్పును.

"రామనామము నీవు- సామగానమిడినావు
ప్రేమంది గొలిపి- పరంధాముని నిలిపినావు
శోకము నీరాగరసాలంబనమున మానముగా
తంబురతో నంబరమును-తాకినావు త్యాగసుధీ" అని త్యాగయ్యను కొని యాడును

"ఎవని పాదధూళి కళ్ళ — బవనము లేకుండగప్పు
కప్పిన నెజీ చూడ్కి- యొప్పు: అట్టి దేవునకు నమో; నమో; నమో:"

అని సూర్యకాంతికి ముందె విశ్వమెల్ల వ్యాపించి వెలుగు దేవునకు నమో వాకములు పలుకును.

చక్కని మార్గమును చూపి శక్తినీయుమని తన్ను చేరదీయుమని భగవంతుని ప్రార్థించును.

"నాతోంటి ధైర్యమ్ము నాకిమ్ము దేవ
నాతోంటి భావమ్ము నాకిమ్ము దేవ:
నాతాల్మి సెడనీక నను దీయవయ్య
చక్కని దారికి శక్తి నాకియ్య."

భగవంతుని ప్రార్థనము చేయుచున్నానని, ఎట్టి సద్దు చేయవద్దని లోకమునకు విన్నవించును

"లోకేశు మూకి భావమున నేను
నాకంత మెత్తేను ఉండండీ
ఈరేడు లోకాలం బ్రార్థించు చున్నాను
ఎట్టి సద్దును చేయబోకండీ"

భక్తితో ఎంత ప్రార్థించినను పలుకని దేవుడు తనచేతనే పాడించుచు పలికించుచున్నాడనను తన కవితా శక్తికి మూలమూ భగవంతుడే అని నమ్మును.

"నిన్నుఁబూజ సేతునోయి
నిన్నుఁ బూజ వ్రాతునోయి
పలుకనేమి? పాడవేమి?

పలుకమందు నన్ను నీవు
పాడుమందు నన్ను నీవు"

"సూర్య భగవాను భంగినన్ జూడనిచ్చి
కృషిని జేయించు నాచేత ధృతిమెయి ప్రభు!
అల్ల ధ్రువ నక్షత్రంపుట ధ్వమట్లు
నాదు దారి తప్పని తిన్ననిది గూర్చు
అస్తమించు చందురు భంగి నతిరహస్య
మతి నిరాడంబర మగు విశ్రాంతిఁదేల్చు
దేవ! నీదు దయారస మా విశాఖ
మాస మధ్యాహ్న వర్షంబు మాడ్కి నన్ను
నిరతమును జల్లఁ దడుపంగ వరమొసంగు"

—సూర్యునివలె చూడగలుగు శక్తినిమ్మని, ధ్రువునివలె దారి తప్పనీయకు మని, అస్తమయ చందురునివలె నిరాడంబరముగ నుంచుమని—భగవంతుని ప్రార్థించును. పరమాత్మ ప్రకృతిలో వివిధ రూపములుగ జీవులకు దారి చూపుటను కవి చక్కగా వర్ణించెను

భగవంతుని చిన్నారి బాలుని వలె లాలించి తరించుటయే వాత్సల్యభక్తి ధ్యేయము. చిట్టి కృష్ణుని లీలలు అబాల గోపాలమును పరవశులను గావించుచుండును.

"మువ్వ మెళ్ళో కట్టి విడిచిన—తువ్వ వెనకాలున్న కృష్ణా!
నవ్వవోయి నాకేసి చూచీ—పువ్వులిస్తున్నా!
జుంయి జుంయని పాలుపిదికే—అ యశోదను నేను కృష్ణా
ఆడవోయి నాకంటి పాపలో నీడమోస్తున్నా!"

జీవాత్మ తనకు మోక్షమును ప్రసాదింపుమని పరమాత్మతో మొరపెట్టుకొనును. ఇది తత్త్వ జిజ్ఞాసను రేపుచున్నది

"చిట్టిపాపాయి, యప్పుడు పుట్టినట్టి
చిట్టి పాపాయి, శేరుమంచెట్టు పురిటి

గదిని మాఱు మ్రోగించునో యదెవిధమున
ఆకలన లేను, దాహమనంగనేర,
నంగలార్తును దేవ! నీ ప్రాంగణమున!
నాదరికి రమ్మని యనఁబోదువాయి
కొని వత్తుగా! దయఁజూతుగా! మహాత్మ!"

మృత్యువుని గూర్చి ఎంత జ్ఞానమున్నను భయపడని ప్రాణి యుండదు. మృత్యువు సహజమైనదని ధ్రువమైనదని చాటి చెప్పును.

"జన్మమనెడి జనకుడనను
కేరుమనగ బారుమనగ
మృత్యువనెడి యొజ్జకడకు
పంప జూచెడిన్ — కాని
మంచి పిల్లవాఁడనో — చెడ్డపిల్లవాడనో?
జీవనమను దారిలోనఁజెలఁగి యాడుదున్
జన్మమునకు దూరమగుచు
మృత్యువునకు దొలగించనుచు
జీవనమను దారిలోనఁజెలఁగి యాడుదున్" —

జనకుడు బిడ్డను ఉపాధ్యాయుని కడకు పంపునట్లు జన్మమనెడి జనకుడు మృత్యువనెడి ఒజ్జవద్దకు పంపుట అంత సహజమని పోల్చి చెప్పును

సత్యమును గ్రహించి వైరాగ్య తత్త్వము నలవరచు కొనుట మిగుల కష్టసాధ్యమయినదని పరమాత్మునితో మొరపెట్టుకొనును

"ఒక్క చిట్టి కాగితపు ముక్క, నక్కియున్న
చిత్తు కాగితపుఁ దునుకఁజేకఁ జింపి
యింటిలోనుండి యవలికి నిట్టె విసరు
వంతలోఁజూడఁ బోదును నరరె! పనికి
వచ్చునోయని; యాలాగు రెచ్చుమమత
పోదు పోదు, చూచిన కొద్ది పోదుదేవ

కాగితమువంటి అల్ప వస్తువును పారవేయుటకే మనసు ఒప్పకున్న, జీవితముపై మమకారమెట్లు పోగొట్టుకొనగలనని ఆవేదన పడును.

ఆత్మకొరకు అన్వేషించుచు చక్కటి పోలికలతో దాని రూపమును శాశ్వతత్వమును మన కనుల ముందుకు తెచ్చును

"మిహిరు డాచ్ఛాదితుండయి మేఘమునకు
రజిత కాంతులు వెలిబుచ్చి ప్రభలఁ గొలుపు
అట్లె భౌతిక దేహంబునందుఁ జొచ్చి
దానికాడఁగూర్చునది—యాత్మ దైవగుణము
మధుపమలరుపై వ్రాలెదు మాడ్కి నాత్మ
దేహమందున విశ్రాంతి తీసికొనెడు
కాని శాశ్వత సౌఖ్య మద్దాన నెద్ది
కనమి గాఁబోలు— ఎగసి యెక్కడికి పోవు— "

మేఘముతో కప్పబడిన సూర్యునివలె మాయచే కప్పబడిన ఆత్మను జ్ఞానసాయమునసే సాక్షాత్కారము చేసికొనగలము. జీర్ణవస్త్రమును విడిచినట్లు శరీరమును వీడి ఆత్మ మరియొక శరీరము నాశ్రయించునని తత్త్వసారమును సంక్షిప్తముగ జెప్పును.

మానవుని దేహములో ప్రాణమున్నంతవరకు మాత్రమే దాని విలువ. ప్రాణము పోయిన పిదప అది పంచభూతములలో లీనమై ఇక కానరాదను సత్యమును కవి చాటి చెప్పును

"మానిని దేహమాత్రుడయి, మాటలు, బూదయి,
నీళ్ళ పాలునై కాగఁగరాని సూక్ష్మమవుగా
యని యెంచితి జాతి యూహలన్ — "

మాయను ఛేదించి జ్ఞానమును సముపార్జించుటయే మానవ లక్ష్యమని ఉద్బోధించును. గేయమాగిపోయినను హృదయము మూగవడదు గనుక భయపడ పని లేదనును.

"మాయ గప్పిన జగము వెనుకను
మహత్వతత్వం బొక్కడుంటే

తెప్ప మాయగ మాయ నీకను
చూడ్కిలో నిజమేల యుండదు
గేయమాగిన నంతరాళము
మేయ ముఖరిత నాదమునమను
హృదయ తంత్రికి నిర్వరిట్టటు
ఏల భయపడమూగ పడువని॥

"వదలగూడంచువడిఁ బాయు జలధరంబు
లట్ల ధరణిపై దారసుతాదులెల్ల
కలసి విడిపోవు చుందురు గాదెదీని
కింత వగవనేటికి"

మెరుపుతో కూడిన మేఘమువలె భార్య, బిడ్డలు మున్నగువారు కలసి మరల విడిపోవుదురని ఆ బంధముల అశాశ్వతత్వమును చాటును.

సుఖములను అనుభవించుచు ఏమరరాదని, వాని వెన్నంటి కష్టములుండుటను చక్కని సామ్యముతో చాటి చెప్పును.

"వర్షధారతోఁ బిడుగులు పడెడు భంగి
నలగులాబికిఁ గంటక మలిమినట్లు
రత్నములలోనఁ గలసిన రాళ్ళభాతి
సుఖములందును గష్టముతో పొచ్చియుండు"
జీవనమును సన్నజాజిమొగ్గతో పోల్చును.

"జీవనమొక సన్నజాజిమొగ్గ" అని అది 'దిన దినము జ్ఞానమనెడి తెలి రేకుల విడచును' అనును. "స్వచ్ఛందము జీవనము—సౌఖ్యదంబు జీవనము" అని దానిని జ్ఞానమయము చేయవలెనని చాటును మండువేసవి చిగురించు మావి మొక్క" వలె "జీవితమ్ము సంబంధపుం భావమయము" ని చాటును.

ఇట్లు కవికొండలవారు పలురకముల ఆధ్యాత్మిక గీతములను రచించిరి. బాలలకు సుబోధకములుగ, సరళ సుందరముగ కొన్ని, తత్త్వ జ్ఞానమును కలిగించు వేదాంతపరమైన గీతములను కొన్నిటిని రచించిరి. ఈ విధముగ వీరు ఈ శాఖ యందును వైవిధ్యమును చూపిరనవచ్చును.

# 10-ప్రకీర్ణకములు

కవికొండల రచించిన కొన్ని గేయములు విలక్షణములు. అట్టివానిలో 'శివరాత్రిప్రభ' ప్రథమస్థానము నాక్రమించును 'విలాసినీ వైనతేయము' అనునొక సుదీర్ఘమగు గీతికను కవికొండల 'మహాగీతిక'గ పేర్కొనిరి[1]. వీరు తన కవిత్వమును గూర్చియు తాను రచనచేయుటకుగల కారణములను తెలుపునట్టియు పలు గేయములు రచించిరి. ఇవిగాక సంఘ సంస్కరణాత్మకములు, ప్రపంచయుద్ధ కాలమున రచించిన గేయములు మున్నగునవి కలవు.

శివరాత్రి ప్రభ :—

'శివరాత్రిప్రభ' గేయము వీరి రచనలలో అగ్రస్థానము నాక్రమించుచు, తెలుగు కవితాలోకములోనే మణిపూసయై, శాశ్వతముగ నిలిచిపోయినది.

ఈ గేయమునకు స్ఫురణ పశ్చిమగోదావరి జిల్లాలోని ఆచంటదగ్గర కమగోరు మిల్లి. "నటరాజు నృత్యము చిత్రములందు గని ముగ్ధులుగాని వారుండరు. ఆ నృత్యమే యీ గీతికకు మూలకందము శివుని తాండవ ప్రబోధము శివరాత్రి ప్రభ"[2].

రచనాకాలము 28-2-1929 'భారతి' పత్రికలో అచ్చుపడినది. ముద్దుకృష్ణ "వైతాళికులు"లో ఈ గేయమును చేర్చిరి

"విశాల విశ్వం" అను కవికొండల పద్య సంపుటిలో మొదటిగేయముగ ప్రచురితమైనది. ఆధ్యాత్మిక అభ్యుదయ భావములతో ఒప్పిన ఈ గేయము నవ్య కవితాధోరణులలోనే విశిష్టముగ నున్నది

"కాలకంఠుని నాగసర్పము
కుబుసమూడ్చి పడగ బుస్సంది;
రెండు నాల్కలు

---

1-నేను వ్రాసిన వేమిటంటే మహాగీతిపలు—కవికొండల వెంకటరావు, దేశసేవ
2-స్వీయకవిత (రక్తకుల్యగాధ: శివరాత్రిప్రభ, ఉయ్యాలా-దంబాలా)
-కవికొండల

గండు మీసాలట్లు దూపింది;
చెవులు మోసింది;
నాగసార మూదేది యెవరోయి?
రాగ మొలికించేది యెవరోయి?
కాఱునల్లని కాళరాత్రి!

౨

నొసటఁగొసరిన మూడోకన్ను
నివురు లూదిన కొలిమిదెగడి
నెగడి ద్రిప్పింది;
పొగలు గప్పింది:
కమ్మరయితే యినుము కరగ,
సోమరయితే చలినికాగ,
నెవరు వచ్చేరోయి?
యెవరు మెచ్చేరోయి?
కాఱునల్లని కాళరాత్రి!

౩

అర్థభాగపు మహంకాళి
కర్థమది కాలేదో?
ఏమో? ... ....
పుమకులా గలగలలు వింటూ
కుమకు గన్నాదో?
నాథునీ వద్దనదు నాట్యము,
నాథునీ కద్దనదు;
అరరే!... ఆడిపోతున్నాయి!
వాడి ముమ్మొనవాలు, హుతభుక్,
అజ కపాలం, డొక్కుడుబుడక్,
నాల్గుచేతుల నాడులౌతున్నాయి!
శరభ! శరభ! శ్శరభ! శరభ!
పందెమూ వేసేది యెవరోయి?

కుందనము గాసేది యెవరోయి?
కాఱునల్లని కాళరాత్రి!

౪

చంద్రమకుటము, జటాజూటము,
సాంద్రనీలపుఁ జదలపాపట
సురిగి పోతున్నాయి,
చక్కనీ మువ్వన్నె చర్మము
అక్కళించిన పొట్టపైని
అంటియుండీ అంటకున్నాదోయి!
"ఆకలా!" యని యనే దెవరు?
"సోకులా!" యని కనేదెవరు?
కాఱునల్లని కాళరాత్రి!

౫

మోకరింపులు గావు:
అది మఱి.... ...
బూకరింపులు విలువుగాదు;
ఆకడకుఁ బడునొక్కయంజి,
ఏకముగఁ జేయుచును
నడుమొక ... ....
రేఖగాఁదావంచి గొంచు;
సందియము లేకెంచు వారెవరు?
"చిందు" అని తోచెంచు వారెవరు?
కాఱు నల్లని కాళరాత్రి.

౬

అహంకారము లేదులోలో,
మహర్ఘటనము మొగము చాటదు,
"మహాదేవా! యభయమిడు" మన
అభినయానకు హస్తమే లేదు!
రభసమునఁ దనముందు వెనకల

ప్రభలఁ గలిపించు
ప్రభలలో ప్రభ నిలుప నెవరోయి?
ప్రభలలో ప్రభఁగలుప నెవరోయి?
కాఱునల్లని కాళరాత్రి!"

ఇది శివతాండవ వర్ణన ఆ తాండవ సమయమున కాలకంఠుని నాగసర్పము వర్ణించుటతో గేయము ప్రారంభమగును అది బుసబుస మూడ్చి పడగవిప్పి బుస్సు మనుచున్నదనుటలో దాని రెండు నాల్కలు గండుమీసాలవలె దూయబడినవి. అది కారునల్లని కాళరాత్రి లయకారుడగు శివుడాదినమున ప్రళయతాండవము చేయును దానికి ప్రతీకగ ఆరాత్రిని కవి కారునల్లని కాళరాత్రియని ఆ భీకరత్వమును స్ఫురింపజేసెను. ఇది శివునిలోని ప్రళయరూపమును, రౌద్ర స్వరూపమును ప్రకటించుచున్నది ఇచట "కాలకంఠుని నాగసర్పము బుసబుసమూడ్చి పడగ బుస్సంది" అని చదివిన వెంటనే భావుకుడైన పాఠకునకు ఆ బుస వినబడియే తీరును. "నాగసార మూదేది ఎవరోయి? రాగ మొలికించేది ఎవరోయి?" అని ప్రశ్నించుటలో ఆ ఉగ్రప్రళయ తాండవమునకు ఎవడు తాళము వేయగలడు? దాని లయ నెవడు నిర్ణయింపగలఁడు అను భావము స్ఫురించును.

శివుని త్రినేత్రమును కవి "నొసట గొనరిన మూడోకన్ను" అనుటలో ఔచిత్యము కలదు ఆ ఫాలాక్షము కోపమునకు, ప్రళయమునకు చిహ్నము. "నివురు లూదిన కొలిమిదెగడి నెగడి ద్రిప్పింది" అనుటలో ప్రజ్వరిల్లిన రౌద్రమును, ఉగ్రరూపమును కనుల ముందు నిలుపును కొలిమి, కమ్మరి ప్రసక్తులు వచ్చుటచే ఇందు కవి అభ్యుదయ ధోరణి గోచరించును. ఆ ప్రళయాగ్నిలో కష్టించు కమ్మరి, ఇనుము కరగించుననుటలో శ్రామికుని కాయకష్టమును గాంచ నగును "సోమరయితే చలినికాగ" అనుటలోని భిన్న దృక్పథమును గాంచ వచ్చును. ప్రతి "స్టేంజా" చివర 'కారు నల్లని కాళరాత్రి' పునరుక్తియగుటచే మహారుద్రమూర్తి శివుని ఉన్మత్తతాండవమునందీ విలయతాళము మానవబుద్ధికి అతీతమైయున్నది "కారునల్లని కాళరాత్రి" అనగానే ఒకమనిషి అర్ధరాత్రి కటిక చీకటిలో నిలబడిన అనుభూతి లభించును కాళరాత్రి అనుచోట కాలము స్తంభించి నట్లుగా ఆగిపోవును ఇది ఒక విలక్షణమైన అపూర్వమైన అనుభూతి

తరువాత శివుని అర్ధనారీశ్వర స్వరూపము సాక్షాత్కరించును. శివుడంత

బీభత్స తాండవము చేయుచున్నను అర్ధభాగపు మహాంకాళీ నాధుని నాట్యము వద్ద నడట దానికి కారణము ఈ విలయమంతయు ఆమెకు అర్థము కాకపోవుటయా లేక "పునుకులా గలగలలు వింటూ కుమకు గన్నాదో" అని కవి సంశయమునకు లోనగును.

అ పిదప శివస్వరూపము వర్ణితము తొడవు నెలవంక, ఉడుపు ముప్పన్నె చర్మము, ఒక చేత డమరుక, ఒక చేత బ్రహ్మ కపాలము, ఒక చేత అగ్నిజ్వాల, ఒక చేత లేడి "నాల్గు సేతులు నాడులాతున్నాయి" అని వర్ణించును దీనిని గూర్చి కవికొండల ఇట్లు చెప్పిరి[1] "సగం శరీరం ఆడ, సగం శరీరం మగ ఈలా నేటి నిక్కారి రూపించి పరియావసానం ఏమో తెలుపకుండా వుంది అయితే మనం బాధ పడనవసరము లేదు అది యొక ఆహ్వానం. ప్రళయరుద్రుని విలయ తాండవం కాన మనం అప్రమత్తులమైయుంటే— జాగురూకులమై యుంటే అదే సత్కాళా విశ్వాసం కావచ్చు. ప్రతి వ్యక్తి తనయొక్క విధ్యుక్త ధర్మాన్ననుసరించి నెరవేర్చాడా మనం పారం అందుకోగలమని నా విశ్వాసం ఇందుగల ధర్మ ప్రబోధం గ్రహించ గలగాలి."

శివునిపొట్ట లోనికి పోవుటచే "చక్కనీ ముప్పన్నెచర్మము అక్కళించి పొట్ట పైని అంటియుండి అంటుకున్నాదోయి" అని వర్ణించును అయినను "ఆకలా అని యనేదెవరు ? సోకులా అని కనేదెవరు ?" అని ప్రశ్నించును అన్ని ప్రశ్నలకు సమాధానము ఒక్కటే — "కారు నల్లని కాళరాత్రి"

మహాదేవుని తాండవ వర్ణనము. "అక్కడకు బడు నొక్కయుంజ ఏకముగ చేయుచును నడుమొక రేఖగా దావంచిగొంచు" అనుటలో ఆ దేవుని నాట్యభంగిమ మన కనుల ముందు మూర్తీభవించును దీనికి తోడు {పునుకుల} గలగలలు, వాడి ముమ్మొనవాలు హతభుక్, అజకపాలం డొక్కడు బుడుక్, చివరగ అశ్నరభ : అశ్నరభలతో విలయ తాండవపు ధ్వనులు మన చెవులకు వినుపించునట్లు చేసిరి

అధునిక కవి స్వాంతదృష్టితో తనకనుభవమైన ఆనందమును వర్ణించును. ఊహించుటలో ఎవరి దృష్టివారిదే కనుకనే కవి తాను ఊహించిన శివతాండవమును తాను పొందిన బ్రహ్మానందమును వర్ణించును అందులో కృతకృత్యుడయి అ

---

1. ప్రియకవిత - కవికొండల - రేడియో ప్రసారము, మద్రాసు, 19-10-1945

సన్నివేశమును మన కనులముందు ప్రత్యక్షము చేయుటయేగాక ఆ మహానుభూతిని మనదిగ చేయును.

ఉప సంహారము, ఆ దేవదేవుని శరణు కోరుట. ఉపక్రమము, ఉప సంహారము పరస్పరము పాశములా పేనుకొని చీకటి చిందు త్రొక్కించును "అహంకారము లేదు నాలో "అనుటయే గాక "మహాదేవా యభయ మిడుమన అభినయానకు హస్తమే లేదూ?" అని అభయము కోరును

ఈ గేయము చదివి ముగించిన పిదప శివతాండవము యొక్క విచిత్ర మైన అనుభూతి లభించును "రాగమొలికించేది ఎవరోయి" అనిన పిదప, 'ప్రభలలో ప్రభ నిలుపరెవరోయి' అని కలిగిన మృదువైన అనుభూతి. 'కారు నల్లని కాళరాత్రి' అనగానే భయంకరమైన అనుభూతిగ మిగులును. ఇదంతయు కవి ప్రతిభవలననే సాధ్యమయినది.

భావగమనమునకు అనువైన భాషావేగము ఈగేయమునకు జీవము భాషలో అవేపదములు, అవేమాటలు అయినను కవి పదముల కూర్పు నేర్పువలన,వాక్యముల నిర్మాణమును బట్టి కవి విశిష్టత బయల్పడును. ఈ గేయమందంతట ఇది గోచరించు చున్నది. దీనివలననే కవి యొక్క మనసులోని అనుభూతి పాఠకునకందును ఇట్టి అనుభూతి, కవిత్వము ద్వారా చెప్పుట ప్రాచీనుల కన్నను ఆధునికులలోనే ఎక్కువ.

"ఇది సాహిత్యములో నూతన ప్రయోగము. కవి మనస్సులోని సమగ్ర భావమును చెప్పుటకు, సరియైన పదముల యొక్కగాని, వాక్యముల యొక్కగాని, సామగ్రి లేక పోయినను, విలక్షణమైన అనుభూతిని కలిగించుటయే ఈ గేయము లోని విశిష్టత ఉగ్రమై బీభత్సమైన సంరంభమును చూపుటలో దీనికిదియే సాటిగ మన్నది. పదముల కూర్పు భావస్ఫూర్తి నిచ్చుటకు ఇది ఉత్తమ నిదర్శనము. ఇందు ప్రతిపదార్థ తాత్పర్యములు గోచరించవు 'ఇంప్రెషనిజమ్'కు ఇది ఒక గొప్ప ఉదాహరణ. ఇంత వరకూ ఇటువంటి గేయమును ఎవరూ రాయలేదు" అని ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు తెలిపిరి

ఇదంతయు ఈ గేయములో వాడిన ఛందస్సు, లయల మూలమున అధిక

ముగ సాధింపబడినది. ఇది ముత్యాలసరము. ఈ గేయమున 'స్టేంజా' ఏర్పాటు కలదు.[1] ఇది నాలుగు కంటె హెచ్చుపాదములతో అక్కడక్కడ హ్రస్వపాదములతో నడుచును. హ్రస్వదీర్ఘపాదము లొక క్రమము ననుసరించక యథేచ్ఛగా వాడబడినవి.[1] ఈ గేయమును గూర్చి పలువురు ప్రముఖులు ఈక్రింది అభిప్రాయములను వెలిబుచ్చిరి.

"ఈ కావ్యమునందు లయ సమాంతరముగా పడక అనిశ్చితమై, కావ్యమునందెల్ల వెదజల్లబడియున్నది. భావనానేత్రము ముందు మహాశివుని ప్రళయ తాండవమును సాక్షాత్కరించుకొనగల పఠిత ఈ కావ్యమునందలి పొట్టి పొడుగుల సాంకర్యమును గ్రహింపగలదు అవాఙ్మనస గోచరమైన ఆమహాలయను సూచించుటకే ఈ కావ్యమునందు పాద వైషమ్యము, పద వైషమ్యము నేర్పుగా కూర్చబడినది. శివుని ప్రళయనాట్యమును నియతచ్ఛందములో బిగించి సరళపదములలో నిముడ్చుట అప్రౌఢ శిల్పము కాగలదు వేంకటరావు ఈ కావ్యమునందు చూపిన శిల్పము, ప్రతిభ అద్భుతములు. ఛందస్సందరణమునకు మన భాషలో నింతకు మించిన కావ్యములేదు. ఈ కావ్యము పఠించినప్పుడెల్ల నా హృదయము జలదరించును మేన పులకలు పొడముసు ఈ కావ్యము నాకు మహాప్రేమ పాత్రము."[2]
పాటిబండ మాధవశర్మగారు

"హ్రస్వపాద విన్యాసముల వలన గొప్ప గొప్ప విసురులు చూపిరి. వెంకటరావుగారు శివరాత్రిప్రభలో భావనలోనూ, గమనంలోనూ ఆవరించిన వైశాల్యం ఇంతట్లో ఎవరూ అందుకోలేరు. విశ్వనాథవారి కిన్నెరసాని, కవికొండల వారు శివరాత్రిప్రభ, కృష్ణశాస్త్రిగారి గేయాలన్ని వారిని మహాకవులుగా చేశాయి"[1]
—శ్రీశ్రీ

"శ్రీ కవికొండల వెంకటరావుగారు ఎన్నోకావ్యాలు మంచివి వ్రాసినారు, వాటిలో "శివరాత్రి ప్రభ" తప్పక నిలుస్తుంది"[3] —నోరి నరసింహశాస్త్రి.

"అలు చిప్పలు మొదలు శివరాత్రివరకూ సృష్టిలో సమస్తమూ ఈయనకు ఏదో ఒక కొత్త ఊహను స్ఫురింప జేస్తుంది"[4] —ముద్దుకృష్ణ.

1_ముత్యాలసరం_ఒక కృషి_ శ్రీశ్రీ, ఉదయిని, ఫిబ్రవరి 1985.
2_ఆధునికాంధ్ర భావ కవిత్వతత్త్వము-పాటిబండ మాధవశర్మ, పు_22
3_అరవైయేండ్ల ఆంధ్రసాహిత్యంలో నిలిచేది_నోరి నరసింహశాస్త్రి, భారతి, ఫిబ్రవరి 1974_పు_14
4_వైతాళికులు — ముద్దుకృష్ణ

"ఈయన కవిత్వాన్ని స్మరించినప్పుడు శివరాత్రిప్రభ జ్ఞాపకం రాని వారుండరు. వారి ప్రతిభకు నిదర్శనం ఈ ఒక్క రచనయేచాలు-వారి పేరు చిరస్థాయిని చేరుటకు అధునిక పద్య సంపుటం ఏదీకూడా అది లేకుండా పూర్ణంకాదు. ఇది గేయంలా చదువుకుని ఆనందించ వలసిందేగాక నటించి ఆనందించ వచ్చును [1]

—కొత్తపల్లి వీరభద్రరావు.

"ఈ పాట ప్రళయశివుడి తాండవ నృత్యాన్ని అభినయాన్నే మించి పోయింది రౌద్ర బీభత్సాలను చిత్రించడంలో దీనికిదే సాటి జగన్నాధుని రథ చక్రాలు శ్రీశ్రీ సొంతాస్తే అనుకున్నా కవి కొండలవారి శివరాత్రిప్రభకు ఎంత రుణపడివుందో శ్రీశ్రీయే చెప్పాలి. చెప్పాడు కూడా"[2] — కె వి రమణారెడ్డి.

ఈ గేయము కవికొండల జీవించియున్నపుడు స్వయము పాడగా శివరాత్రి సందర్భములో విజయవాడ ఆకాశవాణి కేంద్రము నుండి ప్రసారమయిందట. తరువాత కాలమున ఇది పలుమార్లు ప్రసారమయినది. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి బి వి నరసింహారావు, సోమసుందర్ మొదలైనవారు ఈ గేయమును గానము చేసెడివారట. ఈ గేయమునకు ఆంగ్లానువాదమును అమెరికాలో ప్రకటించు ఆంథాలజీలో వేయుటకు కోరినట్లు కవికొండల 18-6-65న వ్రాసుకొన్నారు కానీ అది ప్రకటించినదీ, లేనిదీ తెలియలేదు

ఇట్లు 'శివరాత్రిప్రభ'గేయము కవికొండల కవిత్వమునకు మకుటాయమానమై యున్నది.

## విలాసినీ వైనతేయము :

ఇది సుదీర్ఘమగు గీతిక. ఆంధ్రపత్రికలో ప్రకటితము. రచనాకాలము 4-6-1929 స్ఫురణ-కొమరగిరిపట్నము, బెండమూర్లంక

ఈ గేయమును చదివి ఆనందింపవలయుననిన గోదావరి. కృష్ణానదులను

---

[1]-కవికొండల కవి కవిత్వం — కొత్తపల్లి వీరభద్రరావు.

[2]-కవి కొండల కారు చీకటి — కె వి రమణారెడ్డి, ఆంధ్రప్రభ, ఫిబ్రవరి -

చూడక తప్పదనిరి. చూచిన పిదప ఈ గీతిక చదివినచో ఆ మహానదులు పాఠకుల మనోనేత్రములందు సాక్షాత్కరించునని కవికొండల సూచించిరి [1]

"ఏడుపాయలు తియ్య
నోడిక హోరెత్త
గోదారి యీపాట
పాడాగ నా కూడ
అవధారు: అవధారు:"

అదియే 'విలాసినీ వైనతేయము' అనుపాట. ఇది 'వైతాళికులు' అను గ్రంథములో సూచింపబడినది. ఇది వ్రాయుటకు గల కారణమును కవికొండల ఇట్లు తెలిపిరి [1]

"వైనతేయం అన్న పేరుతో గోదావరి పాయ ఒకటి పోయిపోయి కొమర గిరి పట్టణప్రాంతాన్ని సముద్రంలో కలిసి చూేవారి కానందం గొలిపేదిగద్దు. ముద్దు ముద్దుగా, సంవాదపు సుద్దులతో ముందు మేల్కొల్పి దానిచేత నౌక భావనా రూపమైన పదం ఆలాపింపజేశాను.'ఓడలరేవు' అనేటటువంటి ఒకానొక వాణిజ్యపు గాణాచి యొక్క రాణకంతకు రాణియై ఏలిందా వైనతేయమే! అదే నేడు నిలిచి యున్న చిహ్నము భావనారూపకమైన పదం అని ఎందుకు అంటూ వున్నామా అంటే నీరు తప్ప అక్కడిప్పుడేమీలేదు, ఆనాటి వైభోగం బాపతు. ఆ వైభోగం అంతా ఏమైందీ, ఎట్లా నశించిందీ చెప్పేనాథుడుకూడా లేడు మనం ఊహించ వలసిందే."

ఓడలరేవులో గోదావరినదీ పాయ వైనతేయమునకు సముద్రునికి మధ్యగల ప్రకృతి శ్రుతులను మేళవించి గీతిక వ్రాసిరి. ఇది 'సంవాదము, కథ, ఉప సంహారము' అను మూడుభాగములుగ నున్నది,

"ఓడల రేవులో ఓయారి ఎవరంటె
ఓయని పలికింది వైనతేయము"

అని గీతిక మొదలగును. 'ఓ' అను నాదముచే అపూర్వ పూర్వసాగరము పునరుద్ధరింపబడినంత ప్రతిధ్వని మనయెడల అయితీరును

1_ నేను వ్రాసిన వేమిటంటే మహాగీతికలు-కవికొండల-దేశసేవ

"ఓడల రేవులో ఆడున్నదెవరంటె
ఆటాడిపోయింది వైనతేయము"

-అది చూచి "కల్పించి సాగరుడు నవ్వించి సాగరుడు ఇవ్వాదకేలొస్తి వెవ్వర్తె వన్నాడు" అందులకు వైనతేయము-

'నా యిసుకమేటంది, నా యీల తోటంది,
నా యిసురు నీటంది, నాదొక్క మాటంది.
ఓడల రేవులో ఒయారి ఎవరంటె
ఉవ్విళ్ళు ఊరింది వైనతేయము"

సాగరుడు వైనతేయమును చూచి మనసుబడి "మగరాల పోతల్లె ఎగబోసె నువ్విళ్ళ" దానితో జంకిన వైనతేయము "విఱుచూకు పైబడకు, కఱువాకు మఱి అంది. డీకొనకు కలబడకు నాకోర్కె వేఱంది." "ముద్దెట్టకోకు నన్ను, హద్దిదిగో నీకు నాకు, నా నీరు తియ్యనీన్నిరు, నీనీరు ఉప్పనీన్నిరు" అని సాగరుని అడ్డు పెట్టి నది. కాని సాగరుడందుల కంగీకరించడు.

"చాటింకి లేదూమనకు, మాటింక లేదూమనకు
సంద్రంబు నైనానంది, అందుకే వచ్చానంది" మొండికెత్తిన సాగరుని చూచి పల్టీలు కొట్టినది వైనతేయము. ఇది అంతయు ఉపక్రమము.

తరువాత మొదలగునది "కథ". ఇది వైనతేయము సాగరునితో చెప్పును. దీనిని గూర్చి కవి ఇట్లు చెప్పెను. [1] "అనాటి వైభోగం అంశ ఎట్లా నశించిందీ మనం ఊహించవలసిందే. అయూహ నాలో ఇట్లా నడిచింది ఒక పల్లెయిల్లాలు, అష్టయిశ్వర్యాలతోనూ తులతూగే చిన్నది ఒక పగడాల పేరు గ్రుచ్చుకుంటూ వుంటుంది, ఓపొద్దు. పగడాల పేరనడంలో సముద్రపు వర్తకము, సంపద, అను రాగము కూడా ద్యోతకం అవుతాయి మఱి పేరు గ్రుచ్చుకుంటూ కూర్చోవడంలో ఆ అమ్మకు గల తీరిక, కళోపాసన తేటతెల్లం కాగలవు. మగడు సముద్రం మీద ఓడ వర్తకం సాగించేవాడు కావడం చేత ఇంటి దగ్గర వుండడు ఇంతే మనకథలో కానవచ్చే లౌకికం. మిగలినదంతా అలౌకికాద్భుతం, అభూత కల్పనాను అయితే వైనతేయ శ్రుతియొక్క మేళవింపు నా కూడా వుండడంచేత, కేవలం కల్ల గాకుండా, ఉల్లాన్నిపట్టి కళ్ళకుకట్టినట్టుండి పోయింది దృశ్యమంతాను,"

---

[1]- నేను వ్రాసినవేమిటంటే-మహాగీతికలు-కవికొండల, దేశసేవ

వైనతేయము సాగరునితో ఈ కథను చెప్పును. పూర్వకాలము ఓడల రేవను పట్టణము అత్యంత వైభవముతో ఒప్పినది. ఆ పట్టణములో ఒక పెద్ద భవంతి ఆ మండువలో ఒక గద్ద, భవంతిలో ఒక యౌవనవతిఅగు స్త్రీ నివసించు చుండురు ఓడపై దూరతీరమున కేగిన భర్త రాకకై ఆ యువతి యెదురు చూచుచుండును. ఇంతలో నొక గండుమీను,కేళాకూళి నీట మెఱయగ ఆమె దానిని గోళ్ళతో చీల్చును దాని పొట్టలో తన భర్త బంగారు ఉంగరమును చూచి మూర్ఛిల్లును ఆమె అంత మూర్ఛదేరి విలపించి గ్రద్దను తన మగని కుశల మడుగును అందులకు గ్రద్ద తానాపట్టణమును పాడుబెట్టు చుంటినని, ఆమె తన ప్రేమనేఏట గలుపునో అని బదులు చెప్పును అప్పుడాగ్రద్ద ఆమెను ఆకాశమున కెత్తుకుని తాడిపై గూర్చుండ ఆ పడతి నేలబడి మరణించును. ఊరు పాడుబడును. అంతటితో కథ ముగియును

చివరకు సాగరుడు మంచివాడై వైనతేయమును సర్వజనులను రక్షించుటకు సాయము కమ్మని కోరును. 'ఓడలరేవులో ఓయారి ఎవరంటె ఓయని పలికింది వైనతేయము' అని గీతిక ముగియును.

'అపుడు ఓడలరాక
అపుడు ఓడల పోక
ఓడరేవులో — ఓయారి ఎవరంటె
అచ్చలుల యొజ్జానంది — వైనతేయము
ఓడలరేవులో — ఓయారి ఎవరంటె
అక్షర శయ్యేనంది — వైనతేయము

ఇది వైనతేయము యొక్క యొయారములను, ఓడలరేవుయొక్క ప్రాచీన వైభవమును కనులకు గట్టినట్లు చూపిన విశిష్టకావ్యము.

కవిత్వ సంబంధ గేయములు:

కవికొండల తన కవిత్వమును గూర్చిన విశేషములను, తనలోని కవితా శక్తికి కారణములు చెప్పుచు పలు గేయములను రచించిరి.

"నేననుభవించి వేస్తున్నా!
లోకంలో సౌందర్యం — లోకంలో ఆనందం
లోకంలో గానరసం
నన్నెవరు చూడకుండాలి — నన్నెవరు నవ్వకుండాలి.
నన్నెవరు అడుగకుండాలి — అంతే.'

—అని లోకములోని అనుభవములను కవి తనది గావించుకునిన పిమ్మట కవితా రూపమున ప్రకటనము చేయును. అదియే ఇట కవి వెల్లడించును.

అట్టి రసానుభూతిని కవి యధేచ్ఛ వెలయింప జేయుచుండను దానికి లోకులు అభ్యంతరము పెట్టెదరేమోనని ఆతనికి అనుమానము కలిగినను, తన వ్రాత నాపలేనని విన్నవించును.

'కూర్చున్న పాటొస్తే — నించున్న పాటొస్తే
నడుస్తున్న పాటొస్తే — నేనేమి చేసేది?
నిశ్శబ్దంగా — నిశ్శబ్దంగా
పాటమ్మా రాకమ్మా — పాటమ్మా వద్దమ్మా
పాటమ్మా మానమ్మా! అంటాను వింటాను
పాడేది ఎవరంటే నీవేను నీహృదయం
నీవేను నీమనసు — నీవేను నీవాక్కు
అంటూంటే — వింటూంటా'
"పాడలేకుండుటే పరమ సంతోషంబు
నానీడలో నేను మానుగా కూర్చుండి
పాడలేకుండుటే పరమ సంతోషంబు
నాయూహలో నేను చాయగా నిలుచుండి
పాడలేకుండుటే పరమ సంతోషంబు
నాప్రేమతో నేను ఊపిరాడక మిగిలి
పాడలేకుండుంటే పరమ సంతోషంబు"

ఒకొక్కొక్కపరి కవిత్వము చెప్పక మౌనముగ నుండుటలోనే, తన ఊహాలో తానే నీడగా నిలిచిపోవుటలోనే కవికి సంతోషము కలుగును

ప్రపంచములో లలిత కళా స్వరూపములైన కవిత్వము, సంగీతము, చిత్రలేఖనము తన స్వంతము చేసికొనవలయునని కవి తహ తహ లాడిపోవును.

"కవి నొక్కనినే గనుగొన్నప్పుడు
కవినై పోవాలని లోనూహ,
పాడేవానిని గనుగొన్నప్పుడు
పాడే వాణ్ణై పోవాలని లోనూహ"

తన భావము ఎప్పుడును అద్భుతమే యని కవి విశ్వాసము "జీవనది యొకనాడు చిన్నదై — యొకనాడు పెద్దదై, యొకనాడు చిన్నదైనా భావమది యేనాడు — ప్రస్ఫుటము ప్రోద్బలము, అద్భుతము, తన్మయ ప్రాభవంబు" — అని తలచును.

తన కవితల నాదరించు వారికి కవితలను వినిపింపగలననును. "ఆకాశం అవని, గాలి, అంబు, వగ్ని ఆత్మ మెఱయు ఈ విశ్వమంత నా హృదిలో తాండవించుచున్నదొహో నను వినుకొను వారి చెవిన్ నివదించెడు నానుడి" అని విశ్వమంతయు తనమాటలో నినదించుననును.

కవికి మనసంతయు ఊహలపుట్ట. ఆ ఊహలన్నియు కవితారూపము దాల్చకయే మాయమగుననును "కొన్ని గేయమయీ పూర్తిగానివి — ఎన్ని యున్నాయో — నాకలం వెంబడి ఎన్ని యున్నాయో" అని ఆ ఊహల రకముఁను కవి వింగడించి చూపును.

'మెరసిపోతయి, మెదలుతుంటయి
వదలిపోతయి, వస్తువుంటయి
అన్ని యిన్నని చెప్పలేను? ఎన్ని యున్నాయో?
ఒకటి కిరణం లాగు మోగు — ఒకటి కిరణంలాగు తగులు
ఒకటి నాలో నాకె తెలియకె ప్రకటితంబయి ప్రకంపించు
నెన్ని యున్నాయో
పట్టలేనూ వానినేను — పద్దెముల నరికట్టలేను
పాటలన్ బంధింపలేను — జ్ఞాపకము రాగానే మాత్రం-
నావిగా భావించుకుందును — ఆ విధిని జీవించునవి యెవి'

'నా మంచి పాట నాలో నేనే పాడుకొంటాను
నే పైకి పాడే పాట యెల్లా రెండోరకమేను' అనును.
తన పాట అమృత సమమని, ఉత్తమమని భావించుచు

"నా పాట మల్లె పువ్వు-నా పాట మంచి గంధం
పల్లవి తియ్యంటె పల్లవంతె యందు
నా పాట మించుబోణి-నా పాట నీలవేణి
అను పల్లవేది యంటే-అది పల్లె వేయమందు
నా పాట సుధలజిమ్ము-నా పాట
నా పాట ఎవరికోయి-నా పాట ఎవరికోయి"-అని కవి పొంగిపోవును..

'ఘనీభవించెడి నీళ్ళకులేని- మనోహర స్ఫటికాచ్ఛత గలది. నాదగు నూహ నాదగు నూహ' అని తలచి మురియును.

ప్రకృతిని తన ధర్మమును నెరవేర్చినట్లే కవియు తన విద్యుక్తధర్మము నెరవేర్చిన చక్కని గేయము తయారగునని సూచించును.

"సూర్యుడు తన విద్యుక్త ధర్మం
నెరవేరుస్తున్నాడంటే
మనకు ఉషారేఖ!
చంద్రుడు తన విద్యుక్తధర్మం
నెరవేరుస్తున్నాడంటే
మనకు అమృతవెల్లి
కవి తన విద్యుక్త ధర్మం
నెరవేరుస్తున్నాడంటే
మనకు చక్కని గేయం"

కవి ధర్మమును ప్రబోధించుటకు మరియొక చక్కని పోలికను చూపిరి. "ఈ ప్రపంచమునంతను నెర్రని జిగిపూసి పూరించి తనలేత పొద్దు పొడుపు సొగసు చూపించవలెనన్న సూర్యుడు మును తనను సర్వస్వము జిగిర్చి వెలయగావలె"నట. లేకున్న జిగి కలుగదట అట్లే కవియును..

"సాధు సర్వంసహా చక్ర చైత్రశోభ
రాగమొలికింప సమకట్టి, రాగమెత్తు
కవియు నంతేను, అతగాని ప్రవిమలహృది
సర్వమనురాగ భరిత నిగర్వసూక్తి
నిండిపోవలెమును ముందు నెగడు చిదప
జగము తనయంత నల సూక్తి చక్కని నెరి"

నవనవోన్మేష దృష్టితో జీవితమును పరిశీలించుటవలననే ఉత్తమ కవిత్వము ఆవిర్భవించునని పై గీతికలో సూచించును

సంఘ సంస్కరణాత్మకములు :

పందొమ్మిదవ శతాబ్దపు చివరి పాదములో కందుకూరి, గురజాడ మొదలైన వారు సంఘ సంస్కరణాత్మక రచనలు కావించిరి కవికొండల కూడ ఈ దృష్టితో కొన్ని గీతికలను వెలయించిరి

అస్పృశ్యతను నిరసించుట అది ఎంతటిదోషమో ఎత్తి చూపుటయేగాక మానవులందరు ఒక్కటేనని చాటి చెప్పును.

"నేను భారతీయుడను సనాతనుండను
అయినా అస్పృశ్య దోషము నాదరింపను,
మానవులందఱు ఒక్కటే, మాలలు బ్రాహ్మలు ఒకటే
తాకిన మాత్రాన తఱుగునె భాగ్యము:
సోకిన మాత్రన పెరుగునె యోగ్యత:"

ఇది స్వాతంత్ర్యోద్యమకాలమున గాంధీప్రబోధముల ప్రభావమనవచ్చును.

"నేలనడచుటకు, నీరు త్రావుటకు
కూడు కుడుచుటకు, క్షోణి తలంబున
ఎల్లజనంబులు ఏకోదరులే"–ఇందుసర్వమానవసమానత్వమునుచాటిచెప్పిరి.

అజ్ఞానాంధకారమున మునిగిన హరిజనుల నుద్ధరింప వలయునని వారికి మంచి మార్గమును చూపి వారిని అక్షరాస్యులుగ చేయవలెనసును

"హరిజన సోదర: అరయర శుభ్రత
కలియర మాలో: నిలువర మాకడ
మాంసము తినకుర: మద్యముగొనకుర" అని వారికి బోధించును.

స్త్రీ జనాభ్యుదయము, స్త్రీ విద్య ఆనాటి సంఘసంస్కరణములో ప్రధానాంశములు.

"అబలలము హక్కులిచ్చి ఆదరింపుమా
ప్రభూ! మాయెడ ప్రజను గొలిపి ప్రజ్ఞ నిలుపుమా!
విద్య నిచ్చి విభవమిచ్చి బుద్ధినిచ్చి-మ
మ్ముద్ధరింపుమో యీశా!"

జంతుహింస చేయరాదని, భూతదయగలిగి వుండవలెనని తోటి ప్రాణులను ప్రేమింపవలయునని ప్రబోధించును.

"జంతుహింస చేయరాదు
పంతగించి తోలరాదు
ముసలిపైన వెసవిరా
ఇడగ వలయు నింటిపంచ
అన్ని జంతువులును మనకు
కన్న బిడ్డలను కొనుడీ!"

జీవితాంతము మనకు సేవచేసిన జంతువులు ముసలిది కాగానే కటిక వాని ఇంటికి త్రోలు కసాయితనము మానుమని బోధించును.

సప్తవ్యసనములలో ఒకటియైన మద్యపానము నిషేధింపుట అవశ్యకమనును ఇది గాంధీగారి బోధలలో ప్రధానమైనది.

"కల్లు తాగితే వొళ్ళుగుల్ల యిల్లుగుల్ల
తాగకు సోదర ॥కల్లు॥
కలికే చాలక పెళ్ళాం ఆకలి
మల మల మాడ మర్యాదంత్రా
ఎఱ్ఱని కళ్ళతో యింటికి రాగ ॥కల్లు॥

యుద్ధసంబంధ గేయములు:

ఆయాకాలమునాటి సాంఘిక రాజకీయ పరిస్థితులను కవులు తమ కావ్యము లలో ప్రతిబింబింప జేయుదురు. కవికొండల రెండవ ప్రపంచ యుద్ధస్థితిని పుర స్కరించుకొన్న గేయములను రచించిరి.

యుద్ధరంగమున పాల్గొను మని యోధులను ప్రోత్సహించును

"శరపరంపర శత్రుసైన్యముల చెండాడు
విశ్వస్వతంత్రమునకు
శాశ్వతైశ్వర్యమునకు - యోధుడా
దేవుడిలపై మనకు ప్రాణమోశాడంటే
చిట్టి దేహము పెంచి ఘట్టిగొలి పాడంటె
దాచుకొనుటకు గాదు
దారామలకుగాదు"

అని వీరులలో త్యాగనిరతిని కలిగించును.

"అమెరికనులు ఆంగ్లేయులు
భారతీయులును కలిసి
కదన కేళిక కదంత్రొక్క-
మదోన్మత్తుడు హిట్లరెంత"

ఇందు జర్మను నియంత హిట్లర్ యుద్ధ కాంక్షను అణగ త్రొక్క- మిత్ర మండలికి చేయూత నీయవలెనను.

పారిస్ విడుదలపై, యూరోపు యుద్ధ విజయముపై గేయములు రచించిరి కానీ శాంతి ఆవశ్యకతను చాటిచెప్పిరి.

"యుద్ధమున్నది గొప్పదైనా
దాని కంటెను మెప్పుగన్నది
శాంతి - వీరశాంతి
విబుధశాంతి - విశ్వశాంతి"

వివిధములు : - రాజమండ్రిలో తాను చదివిన కళాశాలఅనిన కవి కెంతయో ప్రీతి. తనతలపులకు మూలమా కళాశాలయే అనును.

"నీ వెప్పుడు నా తలపు మూలకందంబవు
అంబవు, నా కలవు, నా యమూల్యంబవు
మందిల గౌతమీ తోయమే నా హృదిస్పందమై
యందమై యలరారుచున్నది."

ఉల్కాపాతము గూడ కవి నాకర్షించినది. "ఒక గోళంబెదో జ్యోతిగావెలిగి.

ఉత్సాహముగ ఆకసమునుండి జారినది. అది 'నికటంబై నటియైతి రోహితముగా నీతై మహాంబోధినో, ఇక దిక్మండలి కావలన్ మిగులు నెందెందు ప్రదేశాలనో' పడును కదాయని కవి అక్కఱ పడును.

తోకచుక్కను గూర్చి దానియునికిని, దాని ప్రాశస్త్యమును ప్రస్తావించును.

"ఎవరు రమ్మన్నారు ? ఎవరు పొమ్మన్నారు?" అని దానిని ప్రశ్నించుచు "నీ త్రోవలో దేవుడున్నాడటె? నీ త్రోవలో దేవుఁజూచావటె?" అని అడుగును

"ఎవని శుభలము చెప్పనే తెంచి నావో
అతని మాటే చెప్పు, ఆలకిస్తాను:
అధితి నీవంటాను అదరిస్తాను;
ఈతి బాధలెచాటు, ఘాతలేసూచించు
ఇంక ఘోరంబు లౌయుద్ధాలె ఘోషించు."

అనిదాని రాక శుభమునకా అశుభమునకా అని కవి భయపడును.

అప్పుడే కనులు తెరచిన శిశువు మనోభావములను కవి ఇట్లూహించును

"స్వస్థలామృత సౌఖ్య సంపతితుఁడగుచుఁ
దలపు నిదియెల్ల వింతగఁ గలచుచుండ,
నేరు లేనట్టు కేరున నేడ్చువాడు
భూతలానకు శిశు వొక లాతివాడు"

భూతలమును లాతిగనెంచి శిశువు వింతగ ఎవ్వరును తనకు లేరని యెంచి కేరుమని ఏడ్చునట.

"ఒక్క మోమిందు నారసియుండమి నతడందఱిని గ్రొత్తఁజూచుచు సందియ పడు"నట గుప్పిలిని నిగూఢముగ బట్టి యుంచుటకు కారణము "ఎవరి కెటు చేయి వెలిఁబుచ్చనేమొ" అని కవి ఊహించును.

"పొడమెడునొ నీకు నిద్ది యపూర్వముగను, కాదురాయన్న
ప్రాఁతద్గా మేదిని యిది
ఇచ్చటే నీకు దెలియఁగ వచ్చువారు
తల్లిదండ్రులు వలయు బాంధవులు చెలులు"

ఇట కవి ఊహ తాత్త్విక చింతతో కూడియున్నది.

వీరి అముద్రిత గేయములు కొన్ని అనుబంధముగ నీయబడినవి [1]

వీరు 'శకుంతల' అను శీర్షికతో కొన్ని పద్యములు ఆంగ్లమున రచించిరి ఇవి వీరి సంగ్రహ శాకుంతలమున కనువాదముగ తోచుచున్నవి అనంతర కాలమున కూల్డ్రిగారు కవికొండల గేయములను నాల్గింటిని ఆంగ్లములోనికి అనువాదము గావించిరి. అవి 'ది బేసన్' అను ఆంగ్ల పత్రికలో ప్రకటింపబడినవి. అప్లే వెస్టు లేక్‌గారు కూడ వీరి గేయములను కొన్నింటిని ఆంగ్లములోనికి అనువదించిరి

కవికొండల తమ గేయములలో నూరింటిని ఆంగ్లములోని కనువదించి "Sathapatram" or "A Century of petals" అను పేర ముద్రించిరి. ఇవి మూడు భాగములుగ 1961లో ముద్రితములైనవి.

ఇట్లు కవికొండల నవ్యకవిత్వములో స్పృశింపని శాఖయే లేదనిన అతిశయోక్తి లేదు.

# 11. పూర్వాపర కవి ప్రభావము

## పూర్వకవుల ప్రభావము.

కవికొండల నవ్య కవిత్వమును పరిశీలించిన వీరిపై అటనట ఇతరకవుల ప్రభావము గోచరించును. వారిలో పేర్కొనదగినవారు రాయప్రోలు సుబ్బారావు, బసవరాజు అప్పారావు, వల్లూరి జగన్నాథరావు, నండూరి సుబ్బారావు.

నవ్య కవిత్వ శాఖలగు దేశభక్తి ప్రణయ కవిత్వముల పైననే పైవారి ప్రభావము కలదు కవికొండల రచించిన దేశభక్తి గేయములు ప్రసిద్ధిగాంచినవి. వీరి 'ఆత్మగానము' అను గేయముపై రాయప్రోలువారి 'జన్మభూమి' గేయము ప్రభావమున్నట్లు తోచును వీరి గేయము భారతదేశమున పుట్టుటయే పూర్వజన్మ పుణ్యఫలమని, పూజల ఫలితమని చాటును కవికొండల గేయము కూడ అట్టి భావమునే కలిగియున్నది

"ఏ పూర్వపుణ్యమో ఏయోగబలమో
జనియించినాడనీ స్వర్గఖండమున" (రాయప్రోలు)

---

1. అనుబంధము-5

"నా పూర్వజన్మ సువాసన కొలది
నా పున్నెముల పంట నాజెంబు కొలది
భారతదేశాన ప్రభవించినాడ" (కవికొండల)

"సూర్యుని వెలుతురుల్ సోకునందాక
ఓడల జండాలు ఆడునందాక
అందాక గల ఈయనంత భూతలిని
మన భూమివంటి చల్లని తల్లిలేదు" (రాయప్రోలు)

"ధరను నెచ్చోటనైన దారసిలునె
యిట్టి వరధరరాజి యెన్నడేని" (కవికొండల)

బసవరాజు గేయం "గుత్తివంకాయ కూరోయి బావ" కవికొండల జానపద గీతికకు ప్రేరణ కలిగించినదన వచ్చును.

"చక్కిలా లొండానురా చక్కన్ని నాబావ
యెక్కచే యుంచానురా!
వక్కాకు నీవుతెస్తే — సుక్కకూరే నేనేస్తె
అక్కఅకు వస్తుందిరా— చక్కన్ని నాబావ
అటకపై పెట్టానురా" (కవికొండల)

వల్లూరి జగన్నాథరావుగారి "చల్ మోహనరంగా" అను గేయము యొక్క ప్రభావము కవికొండలవారి గేయమునందు ఉన్నట్లు తోచును.

"నాకూ నావారు లేరు
నీకూ నీవారు లేరు
ఏటి యొడ్డున ఇల్లు కడదాం పదరా
చల్ మోహనరంగ" (వల్లూరి జగన్నాథరావు)

"నాకూ నెవ్వారు లేరు
నీకూ నెవ్వారు లేరు
ఏటి యొడ్డున ఇల్లు కడదము పదరా
ఆ కోడెకాడు ఎవడో" (కవికొండల)

ఫిరి ప్రణయ గీతములపై నండూరి ప్రభావము అటనట గోచరించును.

జానపదుల స్వచ్ఛంద ప్రణయమును చిత్రించిన కవికొండల గీతికలలో కొన్నిచోట్ల ఎంకిపాటల చాయలు తొంగి చూచు చుండును

1. "పచ్చని సేలోకి పండుయెన్నెల్లోన
నీలి సీరాగట్టి నీటుగొస్తావుంటె
వొయ్యారమొలికించు నాయెంకి
వొనలచ్చి మనిపించు నాయెంకి" (నండూరి)

"నీలికోకాకట్టి నీటొంక సూస్తూను
నీజాలి గుండెలో చీకట్లో మెఱుస్తి" (కవికొండల)

2 "కంటి దరి నాకాడ కంట నీరెడతాది
కనిపాపలో నీడ మన సదరగొడతాది" (నండూరి)

"కళ్ళల్లో ముద్దెట్టుతూ తెల్లారనీనంటది
తెల్లారి పోతుంటె తానెల్లాగో అయిపోతాదీ" (కవికొండల)

3. "యెంకి వొంటి పిల్ల లేదోయి లేదోయి
యెంకి నావొంకింక రాదోయి రాదోయి" (నండూరి సుబ్బారావు)

"మామంత మంచోడు మఱి దొరకబోడు
మామంత సెడ్డోడు మహ బుట్టబోడు" (కవికొండల)

కవికొండల గురువు ఆస్వాల్డ్ కూల్డ్రె వీరిని 'ఆంధ్రా వర్డ్స్ వర్త్' అని పిలుచుచుండిరి కూల్డ్రె కవికొండలపై 'వర్డ్స్వర్త్ ఇన్ ఆంధ్రా' అను వ్యాసమును వ్రాసిరి "గోదావరి వడినొక్క-పేదో పక్షి ఈక — ఈ నరికి కొట్టుకొంచేగుదేల— అను గేయములలో క్లుప్తతా చిన్న ధ్వనీ, సామాన్య సుందర సత్యమూగల ఖండ కావ్యాలు పెక్కులు గలవు, వాటి ఉత్సాహము వర్డ్స్ వర్తీయమే" అని ఈ వ్యాసమున తెలిపిరి[1] వర్డ్స్వర్త్ వలెనె కవికొండల కూడ ప్రకృతి ప్రియుడు కవికొండల 'ప్రకృతి కవి'గ పేరు గాంచిరి వర్డ్స్వర్త్ కవితా సిద్ధాంతములు వీరిలో ఉత్తేజము కలిగించి వుండవచ్చును పలు విషయములలో వీరిరువురికి సామ్యములు గోచరించును

[1] —words worth in Andhra — Oswald J Couldrey

### 3. ప్రకృతి ప్రియత్వము :

ప్రకృతిని సంప్రదాయ సిద్ధమైన దృష్టితోనే కాక భావనా రమ్యముగ పరిశీలించుటలో వర్డ్స్వర్త్ అందె వేసిన చేయి. చిన్ననాటి నుండి తాను తిరిగిన పల్లె ప్రాంతములను,పర్వతములను, నదులను, పూవులను, ఆకాశమును, మారుచున్న ఋతువులను స్వభావరమ్యముగ వర్ణించెను వర్డ్స్వర్త్లోగల ఆధ్యాత్మిక దృష్టి, సహజ శోభకల ప్రకృతి యందు భక్తి తత్పరత మున్నగునవి అతనికిని విశిష్టతను సంతరించినవి 'డాపడైల్' పుష్పమాతని దృష్టికి ఎంత సౌందర్య విలసితమో 'సిలాండైన్' పూవుమ అంతియే వీరు వ్రాసిన 'థార్న్' చాల ప్రఖ్యాతి గాంచినది

కవికొండల మొదటగ అచ్చమైన ప్రకృతి కవిత్వము చెప్పినవారుగ పేరు గాంచిరి ఉదయభాను కాంతిలో చెరువులో నిలువుగ కనిపించు ఎర్రకలువ పూవు చాలు వీరి హృదయమును గిలిగింతపెట్టి గేయరచన చేయించుటకు అరుద్రక్రిమి పున్నాగపూవు,గవ్వ, సముద్రము, గోదావరి వరద అన్నియు వీరికి కవితాస్ఫోరకములైనవి అందరి దృష్టి నాకర్షింప లేని 'సిలాండైన్' పూవు తన కెంతయో ప్రియమైనదిగ వర్డ్స్వర్త్,వర్ణించెను కవికొండల కూడ పేరులేని చిన్నిపూవు రైతు దృష్టిని నాకర్షింపలేని కొలనులోని కలువ, దారిప్రక్కనగల గడ్డిపూవులు తనకు ప్రియతమములవి చాటి చెప్పెను.

**' Pansies, Lilies, King cups, Daisies,**
**Let, them live upon their progress;**
**Long as there's a sun that sets**
**Primroses will have their glory;**
**Long as there are violets,**
**They will have a place in story ;**
**There's a flower that shall be mine,**
**'T is the little Celandine."[1]**

***(To the small Celandine)***

---

1. — **Poems in two volume — W. Words Worth**

"దాక్కొని వుంటాయి - దారంట గడ్డి-
నిరుక్కొని వుంటాయి
తలపంగ రాని పూలు
పిలువంగ బోని పూలు
నిలుపంగ లేని పూలు

లెక్కకు రావో లక్ష :
చిక్కవు మాలను గ్రుచ్చ,
ఇక్కన నక్కడం బచ్చం
జక్కన బూస్తాయి
దాక్కొని చూస్తాయి-దారంట-గడ్డి-ని
రుక్కొని కూస్తాయి -

మంచు బిందువు పడిన,
ఎంచి బాష్పము విడిన,
అంచులం గాస్తాయి;
వంచక మోస్తాయి:
దాక్కొని వుంటాయి - దారంట - గడ్డి - ని
రుక్కొని వుంటాయి —"

మానవతా వాదము :-

వర్డ్స్‌వర్త్ రచనలగు 'బెగ్గర్స్, జిప్సీస్, ది ఇడియట్ బాయ్, ది సైలర్స్ మదర్' మున్నగునవన్నియు మానవతా వాదమునకు ప్రతీకలై ఒప్పుచున్నవి వీరందరు అతని హృదయమును కదలించి కవితారూపమున చిత్రింపబడిన వారే. భగవంతుని మొదలు అల్పమైన కీటకము వరకు ఈతని దృష్టిలో రసమయములే.

కవికొండల కవిత్వమునను, కథలలోను, సమాజమున అణచివేయబడిన సామాన్య జనులు చోటు చేసుకొనిరి. గనిలోని పాషాణమును బ్రద్దలు కొట్టుచు గుండెలు పగిలిన కూలివాడు, చెమటలు గ్రక్కుచు మోకులాగు జనులు, కళములో మిగిలిపోయిన గింజల నేరుకొను ముసలిది, రోడ్డు చదను చేయువారు, కోతలోనికి పోయిన గాని కూడులేని పాటకజనము వీరి కవిత్వమునందెల్లెడల ప్రత్యక్ష

మగుదురు. గడ్డికోయి మాలెతల పాటకు పరవశుడై కవి 'పడతులు మాలవారయిన పాటకు వర్ణము వృత్తమున్నదే" అని చాటినాడు బంధించిన గడ్డిమోపులో నలుగు చున్న గడ్డిపూవును చూచి, విలవిలలాడి ఆ గడ్డిమోపు నంతయు తానేకొని ఆ పూవును బంధము నుండి విడిపించిన కరుణాంతరంగ మీతనిది.

ఇట్లు కవికొండలకు వర్డ్స్‌వర్త్ కవితా సిద్ధాంతములకు అనేక సామ్యము లున్నను ఈతడు తనదైన స్వతంత్ర మార్గమున రచనలు గావించి "ఆంధ్రా వర్డ్స్‌వర్త్" అను బిరుదును సార్థకము గావించెను

కవికొండల ప్రభావం :

కవికొండల తరువాతి కవులలో, శ్రీశ్రీ తనపై కవికొండల ప్రభావము కలదని చెప్పుకొనెను. 1930 వరకు ఆంధ్ర కవిత్వమున భావ కవిత్వము అప్రతి హతమైన ప్రభావము కలిగియుండినది 1930_40 ల మధ్య భావకవిత్వమునకు నిరసన ధ్వజమెత్తిన అతి నవ్య కవులలో శ్రీశ్రీ ముఖ్యుడు. ఈతడు ఇంచు మించుగ రెండు మూడు దశాబ్దముల పాటు యువజనులను, నవకవులను ఉత్తేజ పరచి యుగకర్తయైనాడు. శ్రీశ్రీని యుగకర్తగ నిలిపినది ముఖ్యముగా మహా ప్రస్థాన గేయము. దానిపై కవికొండల ప్రభావము కలదని శ్రీశ్రీ యే ఇట్లు చెప్పెను [1]

"ఈపాటలోని ఆవేశానికి ప్రధాన ప్రోద్బలాలు లాఎమర్సెయ్యేలా ఇంటర్ నేషనల్, బరున్సు కవి రచించిన బెన్నాక్ బరన్, అలెగ్జాండర్ బ్లాక్ వ్రాసిన ది ట్వెల్వ్. దరిమిలాని యీట్వెల్వుని నేను

"నల్లని రాత్రి
తెల్లని మంచు
ప్రభంజనం, ప్రభంజనం"

అని ప్రారంభించి కొంతవరకు తెనిగించాను హరీంద్రకవి షురూహువా హైజింగ్ అనేపాట నజ్రుల్ ఇస్లామ్ గీతాలు నా మనస్సులో ఏ మారు మూల్లో మోగుతూ వుండాలి అలాగే కవికొండల కంఠంకూడా "[1]

1 _ ఆరంభము పెద్ద అవస్థ, శ్రీశ్రీ సాహిత్యం (రెండు_వచనవిభాగం) _ శ్రీశ్రీ, పు_528

పై అనువాదమున 'నల్లని రాత్రి' అను చోట కవికొండల శివరాత్రి ప్రభ గేయములోని 'కారు నల్లని కాళరాత్రి' అనుదాని ప్రభువముండవచ్చును.

ముత్యాలసరమును గూర్చి చెప్పుచు శ్రీశ్రీ ఒక చోట 'శివరాత్రి ప్రభలో ట్రాంజాల ఏర్పాటు వున్నది" ఇందు ఒక విలక్షణ ఛందస్సు చేసి గొప్ప గొప్ప విసురులు చూపించారు అందులో హ్రస్వ పాద విన్యాసం గమనించ తగ్గది"[1] అని తెలిపి శివరాత్రిప్రభ గేయము మొత్తమును పేర్కొనిరి.

ఆ వ్యాసమునందే మరియొక చోట శివరాత్రి ప్రభను గూర్చి "కర్షక కవి దువ్వూరి రామిరెడ్డి గారు, కార్మిక కవి కవికొండల వెంకటరావు చక్కని ముత్యాల సరాలు వ్రాశారు వెంకటరావుగారు శివరాత్రిప్రభలో భావనలోను, గమనంలోను, అవరించిన వైశాల్యం ఇంతట్లో మరెవ్వరూ అందుకోలేరు."[1]

శ్రీశ్రీ పై కవికొండల ప్రభావమును గూర్చి కొందరు ప్రముఖులు తమ అభిప్రాయమును నిట్లు తెలిపిరి

"శివరాత్రి ప్రభ గేయములోని శివుని తాండవ నృత్యములో రౌద్ర బీభత్సములు తాండవించినవి. మహాప్రస్థాన గేయములోని రౌద్రమునకిది ప్రభావము కావచ్చును."[2] ఈ గేయములో చాల భాగము వీరరౌద్రరసభరితములు. ఇందు శ్రీశ్రీ ఆవేశమునే ప్రధానముగ గణించి ఉద్ధతమైన వ్యక్తీకరణమునకు యత్నించును కనుకనే శ్రీశ్రీ ఆ రసముల కనుగుణమైన ఓజస్సుగల శబ్దముల నేరుకొనెను.

"తీవ్రభావాన్ని తీవ్రంగా చెప్పేరీతిలో శ్రీశ్రీని కవికొండల ఉత్తేజ పరచి ఉండొచ్చు" అని ఇంద్రగంటి వారు చెప్పిరి.

"కవి కొండలవారి జానపదగీతాలు జుము జుము తుమ్మెద మొదలగు గేయాలలో ఊపు వుంది శ్రీశ్రీ చూపిన గీతికా గమనాలు అక్కడక్కడా ఉన్నవి ఈ గీతాలు పుట్టిన నాటికి శ్రీశ్రీ కలం పట్టినాడో లేదో"[3] అని జమ్మల మడక

---

1, ముత్యాల సరం- ఒక కృషి - శ్రీశ్రీ - ఉదయిని

2. కవికొండల కారుచీకటి - కె వి రమణారెడ్డి ఆంధ్రప్రభ, 22 ఫిబ్రవరి 1981

3, శ్రీ కవికొండల కవి కవితా శ్రీ - జమ్మలమడక మాధవరాయ శర్మ ఆనందవాణి

మాధవ రాయశర్మ తెలిపిరి వీరి అభిప్రాయము ప్రకారము కవికొండల కొన్ని జానపద గేయములలోని నడకలు శ్రీశ్రీ గీతికలలో అటనట కనిపించును. కవి కొండలచక్కటి ముత్యాలసరాలు వ్రాసినట్లు శ్రీశ్రీయే చెప్పిరి.

కవి కొండల అభ్యుదయ కవితావిర్భావమునకు ముందే అభ్యుదయ కవితా ధోరణిలో రచనలు చేసెను కానీ బడుగు ప్రజల జీవితములను యధాతధముగ మాత్రమే చిత్రించెను ఈ విషయమును గూర్చి రమణారెడ్డి గారిట్లు తెలిపిరి [2]

"శ్రీశ్రీకి ఒకరకంగా, కొంత వరకూ కవికొండల గురువు. అభ్యుదయ కవిత్వం రాకముందే ఆచార్య రంగా రైతాంగ విద్యాలయ కవిత్వం రాకముందే సాదాజనాన్ని సాదాగా చిత్రించిన కవి వెంకట్రావే. సాహిత్యాన్ని నిజంగానే ప్రజాస్వామికం చేసిన రచయితల్లో కవికొండల ఒకరు."

"ఈ లోకం మీదేనండి–ఈరాజ్యం మీరేలండి" అని రాజ్యాధికారాన్నే కర్షక కార్మిక సమైక్యశక్తికి అప్పగించబూనాడు అంటే విప్లవాన్ని కోరాడన్న మాట. దాన్ని మరీ నిర్దుష్టం చేసింది ఒక్క శ్రీశ్రీయే చారిత్రక వాస్తవానికి సన్నిహితరూపంలో అలంకార సామగ్రిలో కవికొండలగాని శిష్ట్లాగాని చేబదులిచ్చి వుండవచ్చు కాని వారెవరికీ ఈదృక్పథమేలేదు."[2]

"శ్రీశ్రీ మహా ప్రస్థానంలో కుళ్ళిన ఎముకలు, ఉష్ణరక్త కాసారము చూపి, శివరాత్రి ప్రభలో పునుకుల గలగలలూ, అజకపాలం డొక్కుడుబుడక్ అక్షరభలతో వినిపించాడు"[3] అని నోరి నరసింహశాస్త్రి తెలిపిరి.

శివరాత్రి ప్రభలోని సంప్రదాయ వాదము శివుని తాండవ నృత్యము. ఇందు 'శరభః శరభః శ్శరభః శరభః' అని మొదలగును.

'మహా ప్రస్థానము' లో
"హరోం హరోం హర
హర హర హర హర"గ సాగినది.

---

1 కవికొండల కారుచీకటి —కె వి రమణారెడ్డి, ఆంధ్రప్రభ

2 శ్రీశ్రీవినిపించిన భువన ఘోష—కె.వి.రమణారెడ్డి, ఆంధ్రప్రభ, 3–5–81

3. తెలుగు కవిత్వంలో ఘోషములు —నోరి నరసింహశాస్త్రి, ప్రతిభ, జనవరి 1938 పు–277

"పసుపులా గలగలలు వింటూ
కుమకు గన్నాదో
అరరే వాడిపోతున్నాయి
వాడి ముమ్మొనవాలు" (శివరాత్రిప్రభ)

"ఎముకలు కుళ్ళిన
వయస్సు మళ్ళిన
సోమరులారా చావండి" (మహాప్రస్థానం)

పై రెండింటికి సామ్యముండవచ్చును.

శివరాత్రిప్రభలో కాలకంఠుని 'నొసట కొసరిన మూడో కన్ను నివురు లూదీ నెగడి త్రిప్పింది'. అది మహా ప్రస్థానంలోని "మరో ప్రపంచపు కణకణ మండే త్రేతాగ్ని" గ రూపుదాల్చిఉండవచ్చును

శివరాత్రి ప్రభగేయములో 'రాగ మొలికించేది ఎవరోయి' అను ప్రశ్న మృదువుగ వచ్చి 'కాఱు నల్లని కాళరాత్రి' అని ముగియుటచే భయంకరమైన అను భూతి కలుగును. సాహిత్యములోనే ఇట్టిది క్రొత్త ప్రయోగముగ చెప్పబడినది. ఇది బీభత్సమును కలిగించుచున్నది మహా ప్రస్థానములోని బీభత్సమున కిది ప్రేరణ కావచ్చును

'కాఱునల్లని కాళరాత్రి'లోని బీభత్సానుభూతి మహా ప్రస్థానములోని బీభత్సమునకు ప్రభావము కావచ్చును.

శివరాత్రి ప్రభలోని "కాలకంఠుని నాగసర్పము రెండునాల్కలు గండమీసాలట్లు దూసినది." మహాప్రస్థానంలో శ్రీశ్రీ ప్రజలను "త్రాచుల వలెనూ, రేచుల వలెనూ" ముందుకు సాగుమనును

శ్రీశ్రీ మరొక గేయము 'జగన్నాథునిరథచక్రాలు'. ఈ గేయముపైనకూడ 'శివరాత్రి ప్రభ' ప్రభావమటనట ఉన్నట్లు గోచరించును

"నొసట కొసరిన మూడోకన్ను
నివురు లూదిన కొలిమిదెగడి
నెగడి త్రిప్పింది
పొగలు గప్పింది." (శివరాత్రి ప్రభ)

"నటధూర్జటి
నిటలాక్షి" పగిలిందట
నిటాలాగ్ని రగిలిందట
"నిటాలాగ్ని
నిటాలార్చి
నిటాలాక్షి పటాలుమని
ప్రపంచాన్ని భయపెట్టింది" (జగన్నాధుని రథచక్రాలు)

ఈ ప్రభావమును గూర్చి రమణారెడ్డిగారిట్లు తెలిపిరి [1]

"ఈ చరణాలు, మతవర్ణపరమైన యీ కవితా సంకేతాలు శ్రీశ్రీ సొంతాస్తే అనుకున్నా జగన్నాధరథచక్రాలు కవికొండలవారి శివరాత్రి ప్రభకు ఎంతఋణపడి వుందో శ్రీశ్రీయే చెప్పాలి చెప్పాడు కూడా"

'కాలకంఠుని నొసట కొసరిన మూడోకన్ను' జగన్నాధుని రథ చక్రాలులో 'నటధూర్జటి నిటాలాక్షికి' ప్రేరణ కావచ్చును

శివుని మూడోకన్ను 'నిపురులూదిన కొలిమి దెగడి నెగడి ద్రిప్పి, పొగలు గప్పినది' 'జగన్నాధుని రథచక్రాలు'లో నిటాలాక్షి పగిలి, నిటాలాగ్ని రగిలినది. నిటాలాక్షి పగిలి, అందలి నిటాలార్చి ప్రపంచమునే భయపెట్టినది, శివరాత్రి ప్రభలోని బీభత్సతాండవమే దీనికి ప్రేరకమయి ఉండవచ్చును

"అరరే అడి పోతున్నాయి
వాడి ముమ్మొనవాలు, హుతభుక్
అజ కపాలం డొక్కుడుబుడక్
నాల్గు పేతులు నాడు లొతున్నాయి
శరభః శరభః శ్శరభః శరభః" (శివరాత్రి ప్రభ)

"అరె ఝూం: ఝూం,
ఝటక్, ఫటక్
హింస నచణ
ధ్వంస రచన

---

1. కవికొండల కారుచీకటి—కె.వి. రమణారెడ్డి, ఆంధ్రప్రభ

ధ్వంస నచణ
హింస రచన"                                        (జగన్నాధుని రథ చక్రాలు)

ఇందలి అసమానమైన ఊహ, దూకు పై శివరాత్రిప్రభ వాక్యముల ప్రభావము వుండవచ్చును కవికొండల అనన్యమైన ఈ గేయ క్రమములో శివమెత్తి శ్మశానములో బీభత్సముగ చిందు త్రొక్కించెను.

'అకడకుఁబడు నొక్క యంజ
ఈ కడకు బడు నొక్కయంజ,
ఏకముగఁజేయుచును
నడుమొక....
రేఖగాఁ దావంచిగొంచు"

"శృంగారమునుండి తీసిన అంజను అంగారం ఆ అంజగా సాచిలోకాన్ని జడిపించిరి."[1]

ఉపక్రమము, ఉపసంహారము పరస్పరము పాశమువలె పేనుకుని చీకటి చిందు త్రొక్కించును.

"మహా దేవా!యభయ మిడుమన
అభినయానకు హస్తమేలేదూ!"
అని చివరగ ఒక చరణములో శివుని శరణుకోరును.

"శ్రీశ్రీ భ్రష్టులూ, బాధాసర్పదష్టులూ, దగాపడిన తమ్ములూ అందరూకలిసి ప్రళయంకరుడికేమీ తీసిపోని జగన్నాథరథ చక్రాలై చరిత్రనే విప్లవీకరించమని కోరుతున్నాడు" అని చెప్పబడినది.[1]

"కవికొండలకు తానుంచుకున్న ఆశయం సాహిత్యంలో ఎక్కడో తప్ప సిద్ధించలేదు. కారుచీకటి కవికొండలని చుట్టేసింది. దానిలోంచి అగ్నిపుంజంలా దూసుకు వచ్చినవాడు శ్రీశ్రీ"[1] అని రమణారెడ్డిగారు తెలిపిరి.

ఇట్లు కవికొండల 'ప్రకృతికవి'గా 'జానపదకవి'గా 'కార్మిక కవి' గా సుప్రసిద్ధి గాంచినారు ఈ విశాల విశ్వంలో వీరి కవితా దృష్టికి అల్పమైనదేదీ లేదు కర్షకులు, జానపదులు, శ్రామికులు వీరికత్యంత సన్నిహితులే, కనుకనే అభ్యుదయ కవిత వెలుగులోనికి రాని దినములలోనే ఆ ధోరణిలో రచనలు చేసి ఆగామిస్తే కాలికమైన అభ్యుదయ కవిత్వమునకు మార్గదర్శిగ నిలిచినారు.

---

1. కవికొండల కారుచీకటి — కె వి. రమణారెడ్డి, ఆంధ్రప్రభ

# నవలలు - కథలు

## 1. నవలలు

ఆధునిక యుగమున బహు జనాదరణమును గాంచిన వాఙ్మయ ప్రక్రియలలో నవల ఒకటి. ఇది ఆంగ్ల భాషా ప్రభావమున ఆంధ్ర సాహిత్యము లోనికి వచ్చి చేరినది. తెలుగు భాషలో పందొమ్మిదవ శతాబ్ది చివరి దశలో ప్రారంభమైన నేటి వరకు నవలా ప్రక్రియ జనాకర్షణమును పొందుచునే యున్నది.

కవి కొండల రెండునవలలు రచించి ఈ శాఖలో తగినంత కృషి ఒనర్చిరి. ఇవి 'విజన సదనము', ఇనుపకోట'' రెండును సాంఘికములే

'విజన సదనము రచనాకాలము 1916. ఇది ఆంధ్రసేవ పత్రికలో 23 ప్రకరణములవరకు అసంపూర్తిగ ప్రచురింపబడినది.24 నుండి 30 ప్రకరణముల అముద్రిత భాగము వ్రాతప్రతి లభించినది.

ఇనుపకోట రచనాకాలము 1933. ఇది ది ఎడ్వర్టయిజరు అను పత్రికలో ప్రచురింపబడినది 1927లో వారికి B A టెక్స్టుబుక్ గ నిర్ణయింప పడినది.

**విజన సదనము :**

ఈ నవలను గూర్చి కవికొండల ఇట్లు తెలిపిరి[1]. ''నేను వ్రాసిన ఏడు నాటకాల్లో ఒకటి పురుషసింహుడు 1913 జూన్‌లో పుస్తక రూపం దాల్చినా దాని ఇతి వృత్తం ఏ కారణం చేతనో 1916-17లో నవలారూపం ధరించి నాటకాన్ని వెనక్కు నెట్టింది,

ఆ ఇతివృత్తం సర్వసామాన్యమైన యొక కుటుంబ గాథను గురించినదై యున్న కారణం చేత నాటకంలో కంటెనవలలో హెచ్చుగ పరామర్శింప వచ్చునని కానోపు నామనస్సు దాని పునః సృష్టించడం జరిగింది ''

1-నేను వ్రాసిన వేమిటంటే నాటకములు, నవలలు, ప్రబంధం-కవికొండల, దేశసేవ

కథాంశము :

పురుషసింహుడు తండ్రి మరణముతో చదువుమాని స్వగ్రామములో కరిణీకము స్వీకరించి గ్రామాభ్యుదయమునకు పాటుపడుచుండును తల్లి వేత్రవతి పట్టుదల స్వభావము కలది. తన సోదరుని కుమార్తె చంద్రహాసను కుమారున కిచ్చి వివాహము చేసినది మొండితనముతో సోదరుని కుటుంబములో వైరము తెచ్చుకొనినది

పరస్పర అనురాగ బద్ధులగు చెల్లెలు రమణ, మిత్రుడు వసంతసేనులకు వివాహము కావింప వలెనని పురుషసింహుడు ఆశపడును కాని అతడు గ్రామమున లేని సమయమున వేత్రవతి కుమార్తెకు వేరొకనితో వివాహము జరిపించును ఇది తెలిసి వసంత సేనుడు బ్రహ్మచారియై రమణనే ధ్యానించుచు, జీవితము గడప నిశ్చయించుకొనును. ఇష్టములేని వివాహము చేసికొనిన రమణ వసంతసేనునే తన మనస్సు నందు నిలిపికొని అస్వస్థురాలగును

ఇంటికి వచ్చిన పురుష సింహుడు తల్లి తొందర పాటుకు నిందించును. వేత్రవతి దుఃఖముతో బావిలో దూకగా కుమారుడు రక్షింపబోయి తానును మరణించును. ఆ హృదయ విదారకమైన ఆ సంఘటనను చూచి జ్వరపీడితయైన రమణ గుండె బ్రద్దలై చనిపోవును. ఇట్లు ఈ కథ విషాదాంతముగ ముగిసినది

పాత్ర చిత్రణ :-

నాయకుడు పురుష సింహుడు దయాంతరంగ హృదయుడు యువకుడు, విద్యావంతుడు. సంస్కారపరుడు. తండ్రి మరణించగ 'తన జీవిత సౌఖ్య పత్రంబు త్రిప్పివేయబడినట్లు ఊహించుచుండును.

తల్లి అనిన గౌరవము అతనికి ఆమెను ఎదిరింపలేడు. భార్య అనిన ప్రేమ, చెల్లెలనిన చనువును చూపును. చెల్లెలికిని భార్యకును కలిపి పురాణ గాధలను నవలా కల్పములను నీతి పద్యములను జెప్పుచు వారి కాహ్లాదము కలగించెడివాడు. స్నేహమనిన ప్రాణము పెట్టును. వసంతసేనుని ప్రాణప్రదముగ భావించును. ఇతడు అభ్యుదయ వాది కరిణీకమును సమర్థముగ నిర్వహించుచు తన గ్రామాభివృద్ధి కొరకు శాయిశక్తుల ప్రయత్నించును. విద్య విజ్ఞానము కొరకని బోధించుచు బాల్యవివాహములను ఖండించును

వసంతసేనుడు తల్లిదండ్రుల పట్ల వినయ విధేయతలు కలిగినవాడు కనుకనే రమణ అనిన ఇష్టమున్నను తండ్రిని సంప్రదించ వలెనను "పల్లెటూరి వాండ్ర మంచిగుణములు, పట్టణవాస్తవ్యుల మంచిగుణములు అతనిలో పొందుపఱుప బడి యున్నవి." అని చెప్పబడినది సాహిత్యము పట్ల అభిమానము మెండు అమలిన శృంగార తత్త్వము నామోదించి అమలు పరుప యత్నించును. రమణకు వివాహ మైనదని ఎరిగి ఆజన్మాంతము బ్రహ్మచారిగ నుండుటకు దీక్ష వహించిన దీక్షాపరుడు

వేత్రవతి పట్టుదల కలది "పరులు తన ఇచ్ఛ మెలగ వలయు నను. అట్లున్నవారిని నెత్తిపైఁబెట్టు కొనును అది తప్పిన వారిని జిల్లిగవ్వకైనఁగొఱగాని వారిగా దృఢీకరించును" కూతురు, కొడుకుపట్ల మితి మించిన అదుపాజ్ఞలను చూపెడిది రమణ, చంద్రస్మిత పాత్రలకంత ప్రాధాన్యము లేదు వెంకటస్వామి ఆనాటి రయితు కుటుంబమునకు చెందినవాడు. కల్ల కపటములేక పురుష సింహుని కుటుంబము పట్ల అభిమానముతో ప్రవర్తించును

## ప్రకృతి వర్ణనలు:—

నవల యెల్లెడల ప్రకృతి వర్ణనలతో నిండి యున్నది. పురుష సింహుని తండ్రి మరణించుటతో అతనికి లోకమంతయు చీకటి మయముగ దోచును సృష్టిలోని సొబగులు మానవునిలో వినూత్నమగు కోరికల నావిర్భవింపజేయునని రచయిత వర్ణించును. "చీకటి వెనుక వెలుగు వచ్చినట్లు కష్టములవెనుక సుఖములు వచ్చును క్రిందటి సాయంతనమస్తమయ పతితుడైనట్టి భాస్కరుడు మఱుచటి వేగున నుదయగిరి శిఖరాగ్ర భాగము నధిష్ఠించియుండెను అతని బాలబింబ మత్యంత దర్శనీయమయ్యె"

పురుష సింహుడు వసంతసేనునికి తనయూరి విశేషముల జూపువేళ జానపద శోభను రచయిత ఈ సందర్భమున చక్కగ వర్ణించును. "ఆ ప్రక్కఁబెద్దపెదురు డొంకలు బలిసిన పెద్ద పుంత కలదు ఆ పుంతను వానకాఱున గొండ యేళ్ళు వరదలయి వచ్చి యిసుక పెట్టి పట్టివయి పోవుచుండును కాని యాపుంత కడనొక్క పెద్దపంట చెఱువు కలదు దానిలో నెప్పుడును నేస గీతనీరు నిలువ యుండును వేసవిలుగ నెఱ్ఱ తామర పువ్వులు వికసించి కొలను సౌహార్దభావముల నెలకొన్న విశాల హృదయంబువోలె నొప్పు".

## సాంఘిక పరిస్థితులు

రమణకు పంద్రెండేండ్లకే వివాహము జరిగినట్లు చెప్పుటలో బాల్య వివాహములు సాధారణములని చూపిరి. వివాహానంతరము ఒక్క నెలకే ఆమె రజస్వల కాగా, వేత్రవతి ఈ వివాహ విషయము ఆలస్యము చేసియుండిన వర్ణ భ్రష్టత్వము కలిగియుండునని గ్రామస్థులను కొందరు.

పురుష సింహుని ఇంటికెదురు గల రావిచెట్టుపై దయ్యము గలదను నమ్మకముతో జనసంచారము తక్కువగ నుండును పల్లెలలోని మూఢనమ్మకములు చూపిరి. భూతవైద్యముతో రోగములు నయమగునని నమ్మెదివారు. అట్లే పల్లెలలో సంఘీ భావమెక్కువ. పురుష సింహుని తండ్రి కర్మలకు గ్రామస్థులు తమ ఇండ్ల నుండి గుమ్మడి కాయలు, అరటి ఆకులు, అరటి కాయలు, పెరుగు తెచ్చి ఇత్తురు. ఒక ఇంటి కార్యమును అందరును తమదిగ భావింతురు.

చదువు అగ్రజాతివారికే అబ్బునను నమ్మకము ఆదినములలో ప్రగాఢముగ నుండెడిది. వెంకటస్వామిని ఇన్స్పెక్టరు "నీ కొడుకును ఎందులకు చదివింప లేదు" అని అడుగును అందుల కాతడు "శూద్రులము మాకుఁ జదువు వచ్చునా?" అని బదులిచ్చును.

నిరుద్యోగసమస్య అనాడు కూడ కలదు కనుకనే రెవిన్యూ ఇన్స్పెక్టరు పురుష సింహునితో కరణీకము తీసుకొనుమని చెప్పుచు "ఇంతమటుకు వచ్చినది కాబట్టి యీ పేడు కూడ చదువుటయే ఉత్తమము. అయిన నిప్పుడు చదువుల కంటెను నుద్యోగములకంటెను, వ్యవసాయమే మెరుగని పించుచున్న"దనును.

### భాష :-

భాష పూర్తిగ గ్రాంధికము 'పూతిన్గ, పూణ్యమూతిన్, రోగాతున్లై, ఛతన్' అను ప్రాచీన ప్రయోగములు పలు కలవు. "టీ" అను పదమునకు మారుగా తేయాకు నీళ్ళు, "సిగరెట్లు"కు "చిలు చుట్టలు" అను మాటలు ప్రయోగింప బడినవి

శైలిని గూర్చి రచయిత యిట్లు చెప్పికొనిరి. "నాటకములోని వచనము ననుసరించే నవలలోని శైలి కూడా నడిచింది అని నా తాత్పర్యము కానీ వర్ణన లప్పుడు కొంచెము గ్రాంధికముగా వెళ్ళింది. కష్టాదుటఁజీకటి యధోమధ్యము

ఒకింత వెలుతురు మాత్రము గూటిలోని యాముదపు దీపమున వాకిటఁద్రోవ గన బడుచు చున్నది వాని కవలఁగన్ను కనబడదు ”

## సన్నివేశ కల్పన :-

నవల విషాదాంతము ఆ కాలమున విషాదాంతములు బహు స్వల్పములు కథవిషాదాంతమని సూచించుటకు కొన్ని సన్నివేశములు కల్పింపబడినవి పెరటిలోని బావికడ రమణ, చంద్రస్మితలు ఆడుచుండగ చూచి పురుష సింహుని బంధువు ‘నాకు నూయియన్న నొడలు జల్లుమనును గోడకూత వంతయెత్తులేదు అమ్మాయి లారా! కొంచెము దూరముగ నాడు కొండు’ అనెను. ఈ సన్నివేశము ఆ నూయి వలన ప్రమాదము జరుగునను సూచనను చేయుచున్నది ఒక సారి వేత్రవతియు రమణ, చంద్రస్మితలనుద్దేశించి ‘అక్కడాడవద్దని యెన్నిమారులు చెప్పను? నూయి గంగాళము వలెనున్నది. రండింటిలోనికి రండు’ అనును.

చివరి అధ్యాయమున వెంకటస్వామి ‘ఉత్తరపు దిక్కునమబ్బువేయుచున్నది వానముంచుకు వస్తుంది’ అనును పురుషసింహుడు బ్రహ్మాండముగ కురియుచున్న వానను జూచి ‘త్వరలో కాకినాడ వెళ్ళవలెనను కొంటిని ఈ వర్షము ముసురు పట్టి యిక దుర్దినము చేకూర్చునట్లున్నదే’ యని తలపోయును పై సంఘటనలన్నియు చివరిలో జరుగు దుర్ఘటనమును సూచించును

## అమలిన శృంగార తత్వము :-

ఈ సిద్ధాంతమును మొదట ప్రతిపాదించినవారు రాయప్రోలు వీరు తమ కావ్యము లన్నింటిలోను ఈ తత్త్వమును ప్రతిపాదించిరి శృంగారమునకు పర మార్థము సంయోగమను భావము వీరంగీకరింపలేదు వియోగ శృంగారమునకే వీరు ప్రాధాన్యము నిచ్చిరి అట్టి ప్రభావముతో రచయిత వసంతసేనుని పాత్రను చిత్రించెను వసంతసేనుడు రమణపైగల ప్రేమ భావమును అమలిన శృంగారముగ మార్చుకొనును ఇతడు స్వతంత్ర భావములు కలిగి తనపై ప్రణయ భావము కల స్త్రీని వివాహమాడవలయునని తలచును. తన అభిప్రాయముల నెరిగిన పురుష సింహుని సోదరిని అతని కోరికపై వివాహమాడ నిశ్చయించుకొనును.

చంద్రస్మితావసంత సేనుల ప్రేమను గూర్చి రచయిత ఇట్లు చెప్పును.

"వారి యప్పటి ప్రేమాంకురమున మనోజు వికార మిసుమంతయును లేదు. నిర్వ్యాజమనవచ్చును వసంతసేనునకట్టి సాత్త్విక ప్రణయమందు మిక్కిలి నమ్మకము కలదు. కావున రమణయే తనకు భగవదిష్టమైన యిష్టసతియని దృఢ నిశ్చితుండయ్యె తన ఇష్టమునకు వ్యతిరేకముగ వివాహము వేరొకవ్యక్తితో జరిగిపోయినను రమణ మనస్సునందు వసంతసేనుని ధ్యానించుచు కాలము గడుపుచుండును. అతడీ విషయము నెఱింగి దుఃఖితుడై ఆమెను సుఖపడమని దీవించి వెడలును

తనతో రమ్మనిన పురుషసింహునితో ఇట్లు పలుకును "నా జీవితమంతయును ప్రణయసన్యాసినై గడుపుదును. ఆ శపథస్వీకార మహోత్సవ సందర్భమున నిప్పుడే తర్పణము వదలితిని" రమణకు జ్వరముగనున్నది. చూచుటకు రమ్మనిన "ఆమె శరీరమునకు జ్వరము తగులవచ్చును కాని యామె ప్రేమకు దగులదు. ఎంతవఱకు మనః ప్రేమకు విపత్తు తటస్థింపదో యంతవరకు విచారింప నవసరము లేదు" అని వసంతసేనుడనును.

రమణ తన అన్నతో వసంతసేనుని గూర్చి "అతనింక నిత్య బ్రహ్మచారియై సన్యాసము వహించునట్లు పొడగట్టెను" అని చెప్పును ఆమెగూడ వసంతసేనునివలెనే "బ్రతికియే నేను వసంతసేనుని ప్రేమించు దానను" అని భావించును. కాని విధివశాత్తు తల్లి, అన్న మరణింపగ రమణ గుండెపగిలి చనిపోవును ఈ విధముగ ప్రణయమునకు పరమావధి వివాహమే కాదని, వివాహము కాకున్నను పవిత్రముగ ప్రణయ భావమును మనము దాల్చవచ్చునని చూపబడినది

ఇట్లు ఈ నవల బాల్య వివాహ ఖండన, దురాచారముల నిరసన మున్నగు సంఘసంస్కరణాంశములను ప్రబోధించుచు ఆ కాలపు సాంఘిక ప్రయోజనమును నెరవేర్చినది స్త్రీ పురుషుల పవిత్ర ప్రణయప్రాశస్త్యమును అమలిన శృంగార తత్త్వమును చాటినది

ఇట్లు నవలలు వెలువడు తొలికాలములోని రచనగ దీనిని చూచిన ఇది ప్రబోధ పూరితముగ నుండుటయేగాక, ఆ నాటి సాంఘిక జీవితమునకు అద్దము పట్టినదని ఎంచవచ్చును

ఇనుపకోట :-

పీఠిక యందు ఈ నవల వ్రాయుటకు గల స్ఫురణాదులను గూర్చి కవి

కొండల తెలిపిరి[1] "కొంచెమెచ్చు తక్కువగా 1929 మే అంతా భీమవరం, ఉండి, పెదపుల్లేరు, పాలకొల్లు, తాడేపల్లిగూడెం, ఏలూరు, దొంగల గన్నవరం, బెజవాడ, తెనాలి, గుంటూరు, పొన్నూరు, పూడి, బెండ మూర్లంక, అమలాపురం, దేవగుత్తి, చల్లపల్లి, రాజోలు, అంతర్వేదికర మున్నగువాని గుండానే గావించిన పర్యటన మున్ను ఈ నవలకు ఊతములై ఇందలి కథా కల్పనకు జేతనము నొసంగినవి. ఇందలి మంచి చెడ్డలు ఎవరి కొఱకు చెప్పను? వ్రాసిన వాడను తెలుగు వాడను. చదువు పాఠకులు తెనుగు తెలిసినవారు "

ఈ నవలను గూర్చి వీరు తమ వ్యాసమున ఇట్లు తెలిపిరి. "ఈ నవల రచించిన ఆశయము సంఘసేవ వాతావరణము మూడు వంతులుభయ గోదావరీ మండలపు డెల్టా ప్రదేశము ఈపురవరము మధ్యే మధ్యే గంజాం మండలం నుంచి దత్త మండలం దాకా ఆంధ్రదేశం అంతా సాక్షాత్కరిస్తూ వుంటుంది ఏ రచన నేనా ఆ కాలంతో ఆకాలం రచనలతో సరిపోల్చి చూడాలి ఆనాటి తెలుగు నవలల పరిస్థితిని గూర్చి తెలుసుకోవాలి. ఇనుపకోట అన్నివిధాలా 1930 ప్రాంతాలకు చెందినదే కథా వస్తువు అయితేనేం, శీలచిత్రణ అయితేనేం, భాష అయితేనేం అన్నీ నేటి పాఠకుడికి కొంచెం పాతవిగా కనబడతాయి "

గాంధేయ దృక్పథము, దేశభక్తి ఈ నవలను రచించుటకు వీరికి ప్రేరణ కలిగించినవని చెప్పిరి. సంఘ సంస్కరణము, గ్రామ పునర్నిర్మాణము ప్రధానాశయములుగ వీరు దీనిని రచించిరి.

## కథా కథనము :

వస్తువు సాంఘికము నాయికా నాయకులకు ప్రేమకన్న సంఘసేవయే ప్రధానము నవలలో అటవట డిటెక్టివు నవలా ధోరణి కనిపించును. కేశవుని రామ్ హత్య గావించుట, కృపావతమ్మ పిస్తోలును దొంగిలించుట, అది తిరిగి కేశవున కిమ్మని ఓబలేశున కిచ్చుట, అతడే హత్య గావించనట్లు అనుమానించుట మున్నగు సంఘటనలు ఇట్టివే ఆ కాలమున వంగభాషలో వెలువడు డిటెక్టివు నవలల ప్రభావము రచయితపై ఉండి ఉండవచ్చును.

---

[1] పీఠిక, ఇనుపకోట — కపికొండల.

పాత్ర చిత్రణ :

నాయకుడుగ ఓబలేశునికి ప్రాముఖ్యము తక్కువ. కృపావతమ్మ పాత్ర ప్రధానమైనది. తదితర పాత్రలన్నియును నామమాత్రములుగ నున్నవి. వారు చేయదలచిన కార్యములు చేయకయే నిష్క్రమింతురు జమీందారు, సునంద పాత్రలు కొంత మెరుగు వీరుగాక ఇందులోని పాత్రలు రంగడు, ముత్తి, రామ్, శ్యామ్, కేశవుడు, జగన్మోహిని, భూదేవమ్మ మున్నగువారు

ఓబలేశుడు వేసవి సెలవులకింటికి వచ్చి ఏమియు దోచక దేశద్రిమ్మరి అగును సముద్రతీరము వెంబడి వాహ్యాళికి పోవునపుడు కృపావతమ్మతో అతని పరిచయమునకు నాంది పలికెను ఇతడు తండ్రి మాటను జవదాటని వాడు కనుకనే తండ్రి వైద్య కళాశాలలో చేరుమనగనే అందు జేరుటకు నిశ్చయించుకొనును. బిడ్డను వదలిపోవు రంగడిని అడ్డుకొనుటలోను, జమీందారు బిడ్డను కృపావతమ్మకు చేర్చుటలోను ఇతని పరోపకార గుణము కనిపించును. చివరగ వెడలిపోవునప్పుడు కృపావతమ్మ "నేను ఇనుపకోట కట్టెద" ననగ, ఇతడు "నేనా కోటపై ఆంధ్ర రాష్ట్ర పతాకము నిలుపు వాడ"ననును ఇట అతని దేశభక్తి ప్రకటితము

నవలకు కృపావతమ్మ పాత్ర అయువుపట్టు ప్రతి పాత్రయు ఆమె చుట్టును పరిభ్రమించుచుండును ఆమె అనేక ఆటపాటలందు ప్రావీణ్యము కలిగినట్లు వర్ణింపబడినది. ఒక వ్యక్తి అన్ని ఆటలయందు ప్రావీణ్యము కలిగి, అన్ని జంత్ర వాద్యములందు నైపుణ్యము కలిగి యుండుట అరుదు ఈమె కడు స్వతంత్రురాలు. ఈమె సద్గుణవతి, పరోపకార పారీణగ చిత్రింపబడినది ఆమెకు సంఘ సంస్కారముపై మక్కువ ఎక్కువ, కనుకనే గ్రామ పునర్నిర్మాణము చేయనెంచిన సెలవులకు మేనమామ ఇంటికి వచ్చినది. సంఘ పరిస్థితుల నర్థము చేసికొని వానికనుగుణముగ తన జీవితమును చక్కదిద్దుకొని ఒక ధర్మమునకు, న్యాయమునకు కట్టుబడినది అట్టి తిరుగుబాటు, చొరవ, స్వేచ్ఛ స్త్రీలకో నుండవలెనని రచయిత యుద్దేశ్యముగ దోచును మమత నిండిన హృదయములకు సమతావాదమును ప్రబోధించును మానవసేవయే మాధవసేవయని నమ్మినది

మేనమామ ఓబలేశునిపై ఆమెకు ప్రేమ కలదనునట్లు మాట్లాడగ "నేను పెండ్లి చేసికొననే చేసికొనన"ని తన దృఢ నిశ్చయమును వెల్లడిచేయును కనుకనే ఓబలేశుని సహోదరునిగ భావింగును.

అందరును వదలివేసిన ముత్తి శిశువును చేరదీసిన దయార్ద్ర హృదయ. అర్ధరాత్రి సైకిలుపై ఆ బిడ్డను తీసికొని కామరగిరి పట్నమును ఒంటిగ చేరిన సాహసికురాలు అభ్యుదయ భావములుగల స్త్రీ. కనుకనే అస్పృశ్యతా భావముగల మునసబు, కరణములను ఒప్పించి ఆ బిడ్డను అనాథ శరణాలయమునకు పంపునట్లు చేయును కళాశాలలో స్త్రీల హక్కుల కొరకు పోరాటము సాగించెడిది.

చివరగ ఇనుపకోట నిర్మించుటకు స్థలముకొఱకు వెదకుచుండును సంఘము లోని అనాధులకు, దీనులకు, పీడితులకు ఇనుపకోట వంటి రక్షణతో సేవా కార్య క్రమములు నిర్వహింప నెంచుటయే ఆమె ఆశయమని ఎంచ వచ్చును.

ప్రకృతి, జన పద వర్ణన : -

రచయిత ప్రకృతిపై,జనపదములపై గలమక్కువ సందర్భానుసారముగ చేసిన వర్ణనలలో కనిపించును. "వీరి నవలలోకూడ పల్లెటూరి జీవితము చక్కగ ప్రతిబింబించుచుండును"[1] అని నండూరి బంగారయ్య తన వ్యాసమున పేర్కొనిరి.

"అటు పాశ్చాత్య మహాకవులు నిట మన వేదకాలపు ఋషి పుంగవులు, ప్రకృత్యారాధనము నభిమానించినారు ఆధునికాంధ్ర కవులలో దువ్వూరి రామిరెడ్డి కవికొండల వెంకటరావు వంటి మహాశయులీ శాఖీయులు ప్రకృతి యందభిమానము పఠితలకు కలిగించుట కవుల బాధ్యత యనక తీరదు"[2] అని కుటుంబరావుగారు చెప్పిరి

నవలలో ప్రకృతి వర్ణన ప్రారంభములోనే యున్నది "ప్రకృతి శోభను మానవుడు లీనమగునపుడు మానవుడును ప్రకృతిశోభనే మూర్తీభవించును జుడీ, సూర్యోదయం అయినను నాడు మబ్బుగా నుండుటచే నాకాశ "మంతర్వేదికర" ప్రాంతమందు సముద్రము పై జల్లన సూచించు వినీల విశాలవంతమై యొప్పారు చుండెను "

మువ్వది ప్రకరణములలోను ఎక్కడ వీలయిన అక్కడ ప్రకృతిని పదే పదే పలుకరించి వర్ణనలు చేయును అవి ఎక్కడను మితిమించక సాగి పోవును.

1 - శ్రీ కవికొండల వెంకటరావు గారు-నండూరి బంగారయ్య,భారతి ఆగస్టు 1952 పు. - 103

2 - ఆంధ్ర నవలా పరిణామము- బొడ్డపాటి వేంకట కుటుంబరావు పు-356

"ఈ నవల కార్యరంగం కోనసీమ కోనసీమ వర్ణనలు అతి మనోజ్ఞంగా ఉంటాయి ఈ నవల నడిచిన ఉభయ గోదావరి తీరపు దేశ పట మొకటి శ్రీ దామెర్ల వెంకటరావు గీసి దీనికి ఉటంకించి ఉన్నారు."[1] అని ఆంధ్రశేషగిరి రావు గారు తెలిపిరి.

పట్టణములకన్న పల్లెలే ఆరోగ్యప్రదములుగ రచయిత భావించును. పల్లీయుల సంభాషణలో ఈ విషయము స్పష్టమగును. "మనలను హేళన చేయువారెవ్వరా? పట్టణపుటయ్యలు తేనీళ్ళు త్రాగిన మనమెడ నీరు పుచ్చుకుందుము. వారు మనకు రంగు నీళ్ళు సంబాళించినచో మనము వారికి బ్రతి సత్కారముగఁ జింత పిక్కముసగని చిక్కటి మజ్జిగ దాహమిత్తుము."

## సాంఘిక రాజకీయ జీవనము :

1930 ప్రాంతము స్వాతంత్రోద్యమము ముమ్మరముగ జరుగుచున్న కాలము శాంతి యుత సత్యాగ్రహముతో బాటుగ అనాడు బ్రిటీష్‌వారిపై విప్ల వాత్మకతిరుగు బాటులుకూడ జరుగుచుండెడివి కనుకనే ఓబలేశుని దగ్గర కల రబ్బరు బంతుల సంచిని బాంబుల సంచియని భ్రమపడి పోలీసులు అతని నరెస్టుచేయు సన్నివేశమును రచయిత సృష్టించెను. ఇది అనాటి రాజకీయ రంగమును సూచించును.

గత వైభవ స్మరణముతో రచయితలు దేశభక్తిని ప్రజలలో రేకెత్తించుచుండిరి ఈ నవలయందు సందర్భోచితముగ, ఇట్టి స్మరణ కలదు. కృపావతమ్మ మేనమామను వదలి సైకిలుపైన బందరురేవు వైపు నుండి వైన తేయపు దిక్కుపోవునపుడు ఆరేవు పట్టణములను గూర్చి రచయిత ఇట్లు వ్రాసెను.

"ఓడలరేవు, బందరురేవుఁ ప్రసిద్ధములు బందరు, కోరంగి, యుప్పాడ యీప్రదేశములు జావా, చీనా, జపాను,పర్షియా, యూరపు మున్నగు దూరదూర ద్వీపాంతరములకు నాటు ఓడలను పంపినవట కాలవైపరీత్యమున అవి అన్నియు మేటలు వేసినవి ఆ నదీ ముఖమ్ముల తిరుగ త్రవ్వివవారు, అసముద్రవ్యాపారమును మరల వెలయించిన వారలేరు. ఆంధ్రుల నౌకా నిర్మాణ చాతుర్యమంతరిం

3 - శ్రీ కవికొండల వెంకటరావు - ఆంధ్రశేషగిరిరావు పు- 356

చినది. తెనుగు తీర తేజః పుంజము మరుగు పడినది మరుగు పడిన వైభవమును పునరుద్ధరించు తరుణ మాసన్నమయినదను ప్రబోధము కలదు

**సంఘ సంస్కరణ, అభ్యుదయ వాదము :**

వీరి నవలసంఘసేవను ప్రేరేపుచు పాఠకులకు,యువతీయువకులకుఉత్సాహ కరమగు చున్నది కృపావతమ్మ పాత్ర ద్వారా స్త్రీవిద్యను ప్రోత్సహించి స్త్రీ అన్నిరంగములలోను ముందంజ వేయవలెనని చూపిరి దేశసౌభాగ్యమును పల్లెలపై ఆధారపడి యున్నదను సత్యమును పదే పదే వివరించుటలో గాంధీ ప్రభావము స్పష్టమగును. గ్రామపునర్నిర్మాణమునకు ప్రాధాన్యమిచ్చును

"దేశ పునరుజ్జీవనమునకు ప్రతి పౌరుడును పల్లెటి గ్రామమున నివసించుట నేర్చి యుండవలెను అందుకు ప్రతి యుద్యోగియు సెలవు దినంబులనో, విశ్రాంతి వేళలనో తనకుఁ గల విజ్ఞానమును వెలయింపనెంచుట యత్యవసరము" ఇందు ప్రతి విద్యావంతుడు ఒక నిరక్షరాస్యుని అక్షరాస్యునిగ జేయవలెనని ఈనాటి నినాదమును ఆనాడే రచయిత చాటియున్నారు.

"మంచినీటి కోనేటిగట్టు విశాలముగఁజేసి యా గట్టు మీదఁ బూల మొక్కలను పాతించుడు. ఆ చెంతనే దేవాలయమును గట్టించి యందొక్క ప్రక్క పుస్తక భాండాగారమును నెలకొల్పుడు. ఒకదెస బరనాలయమును బ్రతిష్ఠింపుడు. వీధులెత్తుసేసి రస్తాలుగ మార్చి యెప్పటి కప్పుడు తడిపించుడు తుడిపించుడు. ఒక చిన్న వైద్యాలయముండఁ జూచుకొనుఁడు. గరిడీ స్థలమును గేటాయించుకొనుడు. జనసామాన్యమునకు నందు ముఖ్యముగ స్త్రీలకు, మఱుగుగ గోడలను గట్టిలచి విశాలముగ బయళ్ళమించుడు. గ్రామమునకు దగ్గఱగ నూడుపులు, నూర్పుడులు గావింపకుడు. కనుక మనము గొంతకాలము పల్లెటూళ్ళ నివసించి, అందరి జనుల యార్థిక పరిస్థితులను, వారిమానసిక పరిస్థితులను వారి సాంఘిక పరిస్థితులను బాగుగా యర్థము గావించుకొనవలెను" ఇట్టి ఊహయే మనోహరముగ నున్నది. ఇందు అన్ని విధముల ఆదర్శగ్రామమెట్లుండవలయునో రచయిత చూపిరి. వృక్ష సంతతి వభివృద్ధి చేయవలెనను అంశమును ఆనాడే వారు గుర్తించి ఆ విషయమును చాటి చెప్పిరి.

మునసబు మూర్తి శిశువును పశువుల పాకలో నుంచు మనగ "ఒక కుక్క నాతో వచ్చినచో దాని నావరించి, నీయరుగు పైకెక్కిన నొప్పుకొనెదవా? ఒక

పసిపాప మాల కులపు వాడసునంత దూడల పాకలోనికి గొంపోమను చున్నావా? ఇది మేలైన పనికాదు," అని కృపావతమ్మ వాదింపుటలో అస్పృశ్యతాభావము నిరసింపబడినది.

భాష.-

సంభాషణలు గ్రాంథికములో సాగినవి వ్యాకరణ నియమములను చాల వరకు పాటించిరి సందర్భోచితమగు భాష కనిపించును. కానీ అక్కడక్కడ సరళతలోపించినట్లు తోచును. చక్కని పలోక్తులు యథోచితముగ ప్రయోగింప బడినవి. క్లుప్తత, సహజత స్పుటముగ కనిపించును. వర్ణనలలోకూడ అట్టి సహజ సిద్ధమగు భాషనే ఉపయోగించియున్నారు.

"గాలి వీచుటను బట్టి పడవవాడు పడవను "వేరువా" మీదనే త్రిప్పు చుండెను. అతఁ"డనరము" పైపు "మెద్దు తెడ్డు"ను పట్టుకొని కూరుచుండెను."

ఈ వర్ణనలో పడవవానికి సన్నిహితమగు పదములన్నియు గుప్పింప బడి నవి రచయిత లోకజ్ఞత, నిశిత పరిశీలన, జానపదులతోడి సన్నిహితత్వము గోచ రించును.

"అజంతాడ, నేలాంజంతాడు, మంత్రితాడు, దమాంతాడు, సొరసు, తోగడు, మురాము" "పరమానామాలు, మమ్మ పరంజా" మున్నగు పల్లెకారుల పదములను వాడుటలో మాండలిక ప్రయోగము కనిపించును.

ప్రజాసామాన్యములో స్థిరపడిన ఆంగ్ల పదములకు కూడా వీరు తెలుగు పదములనే వాడిరి బేటరీ లైటునకు "విద్యుద్దివిటీ" అని కూల్ డ్రింకు షాపునకు "జలవిక్రయశాల" అని, పెన్నుకు "ఊట కలమ"ని, సైకిలునకు "రెండు చక్రాల త్రొక్కుడు బండి" అని కారియరునకు "గిన్నెల దొంతి" అని, ముఖమునకు రాసి కొను "స్నో"నకు "మంచు" అని, షటిల్ కాక్ అను ఆటకు "బంతిగిన్నె యాట" అని తెలుగు చేసిరి కొన్ని పదములు మాత్రము విచిత్రముగ తోచును.

ఆత్మీయత:

"ఇనుపకోట" మూడవపుటయందు రాజమహేంద్రవర ప్రభుత్వపు కళాశాల పటము చిత్రింపబడినది. ఆ కళాశాలయందు కృపావతమ్మ అంతకు క్రింద

రెండేండ్లు విద్యనభ్యసించినదని దాని క్రింద వ్రాయబడినది రచయిత కేవలము ఆ కళాశాలపై తనకు గల యభిమానమును ప్రకటించుకొనుటకే ఆ చిత్రపటమును నవలలో ఉతపరచెనని చెప్పవచ్చును.

"వీరి ప్రకృత్యుపాసనమే వారి మనసులోని మాటను మాటలోని మనసును గూడ మన యెదుట రూపు కట్టించి నిలిపి ప్రాణముపోసి చిన్న చిన్న యనుభూతుల సమాయకముగఁ గావ్యరూపమున నిర్మింపఁ జేయగలవు "[1]అని చెప్పబడినది.

ఇట్లు వీరి నవల ద్వారా గ్రామ పునర్నిర్మాణోద్యమమును హరిజనోద్ధరణ మును స్త్రీ పురోభివృద్ధిని ప్రచారము చేసిరి ఇది ఆ కాలమున సంఘ సంస్కరణో ద్యమమునకు ప్రతీకయై కోనసీమ మనోజ్ఞ ప్రకృతిని మన కనులముందు ప్రత్యక్షము చేసినది స్వాతంత్ర్యోద్యమ కాలమునాటి రాజకీయ స్థితిగతులమ ప్రత్యక్షము చేయుచు యువతీ యువకులలో దేశభక్తిని సేవాభావమును రేకెత్తించినదీ నవల. కవికొండల రెండు నవలలను కాలానుగుణముగ సంఘప్రయోజనదృష్ట్యా రచించి సఫలతను గాంచిరి.

## 2-కథలు

అధునిక యుగమునందు వెలసిన సాహితీ ప్రక్రియలలో ప్రధానమైనది కథానిక. ఇది అతి స్వల్పకాలములోనే అనల్ప వ్యాప్తి గాంచి అబాలగోపాలమును ఆకర్షించినది ఈ ప్రక్రియ కూడ ఆంగ్ల సాహిత్య ప్రభావముతోనే తెలుగు సాహిత్యములోనికి వచ్చి చేరినది

కవికొండల 1931వ సంవత్సరము నుంచి కథారచనను చేపట్టినట్లు తెలిపిరి[2] కథానిక రచన బాగుగ విస్తృతి పొందక పూర్వము దాని రూపు తీర్చిదిద్దిన వారిలో అగ్రగణ్యులుగ వేలూరి, శ్రీపాద, కవికొండల పేర్కొనబడిరి[3]

---

1. ఆంధ్ర నవలా పరిణామము — బొడ్డపాటి కుటుంబరావు, పు - 356
2. నేను వ్రాసినదేమిటంటే — కథలు — కవికొండల — దేశసేవ
3. కథ — ఇతివృత్తం — సమకాలీన జీవన సమస్యలు — కథానిక — కప్పగంతుల మల్లికార్జునరావు పు — 30

కవికొండలవారు పదేండ్లలో వందకు పైగా కథలు వ్రాసిరని తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి తమ వ్యాసమున పేర్కొనిరి.[1] "ఏలా లెక్కించి చూచినా అన్నీ సుమారు 300 కథలుండ గలవని నా నమ్మకం" అని కవికొండల చెప్పికొనిరి

వీరి కథలు "భారతి" వినోదిని, ఆంధ్రభూమి, సుధ, ఢంకా, ఆంధ్ర శిల్పి, ఆంధ్రపత్రిక, ఆనందవాణి, మున్నగు పత్రికలలో చాలావరకు ప్రచురితమైనవి.

కొన్ని కథలు పుస్తక సంపుటములుగ ముద్రింప బడినవి 1929లో 'పొట్టి కథ', 1941లో 'సుమనోహ్లాదిని (మొదటిభాగము), 1949లో 'పెనుమంచిలిజైన దేవుడు' 'పొట్టి రవికలు — వాలుజడలు' అను సంపుటములు వెలువడినవి

తరువాత కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్, రాజమండ్రివారు వీర కథలను కొన్ని గుంపులగ జేర్చి యీ క్రింది సంపుటములుగ ప్రచురించిరి.

1 తోలు బొమ్మలు 2. మట్టెల రవళి 3. బ్యూటీ అండ్ డ్యూటీ 4. కథకుడిలో కథ 5. కల - కళ్ళు 6 బొమ్మ చిలుకలు 7 ప్రపంచ పౌరుడు 8, దేవుని యెదుట. ఇటీవల అ కంపెనీవారే పై సంపుటముల నన్నింటిని కలిపి 1 హాస్య కథలు 2 కథలు - వ్యాసాలు అను రెండు సంపుటములుగ పునర్ముద్రించిరి.

"నేను వ్రాసినవేమిటంటే - కథలు" అను వ్యాసమున కవి కొండల తమ కథలను గూర్చి వ్యాసములో ఇట్లు వివరించిరి

"కథలు అన్న శబ్ద బాహుళ్యం మీద స్ఫురింపజేసుకుంటే వచన గాథలు కావచ్చు, పద్య గాథలు కావచ్చు పొట్టివి కావచ్చు" పొడుగువి కావచ్చు 'కథలు' అన్నదానికి నేడు వ్యవహరింపబడే సంకుచితార్థం, అనగా 'చిన్న కథలు' అని నేడు పరివేషించి యీ ప్రసంగం గావిస్తూ వున్నాను

ఈ కథల్లో వుండే ముఖ్య విశేషం 'నిర్మాణ పథకం' అది నేర్వాలి పల్వూరూను మునుముందు. అది జీవకణం ఏలా పెరిగి క్రమక్రమముగా అభివృద్ధి అవుతూ పరిపూర్ణ స్వరూపం, దాని యొక్క ఆశయం ద్వారా వెల్లడిస్తూ వుంటుందో -

1. కథానిక — దాని పరిణామము — తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి, భారతి సెప్టెంబరు 1939

అలాగే కథ అన్నది కూడ మాట తరువాత మాట, పంక్తి తరువాత పంక్తి కని పిస్తూ దానంతటది అంతర్వాహినీ ప్రవాహాన్ని పరిపుష్టికంటూ, తుదకో వివేకమో, వినోదమో నిరూపిస్తుంది.

నా కథలన్నింటిలోను శైలిలోగాని, శబ్ద జాలంలోగాని' సన్నివేశ ప్రాప్తిలో గాని ఏమైనా సర్వసామాన్య సిద్ధాంతం దొరుకుతుందా అని విమర్శించి చూచాను. నాకు నేటి వఱకు దొఱకలేదు ఒక్క పరిమాణం తప్పిస్తే. అన్నింటినీ 'చిన్న కథలు' అని పిలువవచ్చును మఱీన్నీ అన్నీ వచనంలోనే వెలువడ్డాయి, అక్కడక్కడ మధ్యను బొడసూపే గీతికలు తప్పిస్తే. కాబట్టి ఒక విధంగా వానిని 'వచన ఖండికలు' అని పేర్కొనవచ్చును. 'చిన్న కథ' అన్న దిప్పుడు ఒక విశిష్టమైన సారస్వతశాఖగా ఏర్పడిపోయింది కాబట్టి చదవ తగ్గదే అని తాత్పర్యము. కాని పుస్తకరూపం దాల్చడంలో ఏ ఒక్క కథ పుస్తకం కానేరదు.

'కథకుడిలో కథ' అను సంపుటములో మొదట 'కథకుడు,' 'కథ' అను పదములను గూర్చి కవికొండల ఇట్లు తెలిపిరి [1] "కథకుడు శబ్దము అనాది ప్రసిద్ధము ప్రతి పురాణ గాథకు మునుముందు 'అక్కథకుం డిట్లనియె' అనే సూచన మనకగుపిస్తుంది స్థానం, జనం, సంఘటన ఈ మూడింటి మీదా సర్వ సాధారణంగా కథ అన్నది ఆధారపడి ఉంటుంది. కథయొక్క పరిణామం చిన్నదిగా ఉండి మన చుట్టూ వున్న పరిస్థితుల్ని గూర్చి మన సాంఘిక సమస్యల్ని గూర్చి ముచ్చటిస్తుంది కథద్వారా ఆనందమో దుఃఖమో చూరగొంటాం."

వీరి కథలందు వస్తువైవిధ్యము అధికము. సమాజమున అణగారిపోయిన దీనుల కథలెక్కువ గలవు. వారి కొరకు రచయిత పడు ఆవేదన అడుగడుగున ప్రకటితమగును వీనిలో కొన్ని చిరస్మరణీయ కథలను పరిశీలింతము

'గామగెద్దు' కథలో సత్తెయ్య పాత్రను దయనీయముగ చిత్రించిరి గాను గెద్దుపై జీవించు సత్తెయ్య సంపాదన చాలక అప్పులలో మునిగిపోగా గానుగెద్దును జప్తుచేయుదురు. జప్తు చేసిన పనసయ్య ఆ ఎద్దును తన దొడ్డిలో కట్టివేయగ, అది తప్పించుకొని సత్తెయ్య ఇంటికి పోవును. దానిని వెదకుచు వచ్చిన పనసయ్య కొడుకు, సత్తెయ్య ఇంటిలో నుండి గానుగ చప్పుడు విని, లోనికి తొంగి చూచి

[1]- కథకుడిలో కథలు- కవికొండల, పుట-6

'సత్తెయ్య వొక్కడే గానుగు లాగుతున్నాడు' అనును.ఇట్లు కాయకష్టదేవత ప్రత్యక్ష మైనట్లు రచయిత నిరూపించును. ఒకజీవనము గడవక ఎద్దు బదులుగ తానే గానుగ లాగిన సత్తెయ్య మన మనస్సులను ద్రవింపచేయును. ఇది కరుణరసాత్మకమైనది.

'పైడయ్య -దరిద్ర దేవత' అను కథ త్రాగుడుకు బానిసలై నాశనమగు కష్ట జీవుల కడగండ్లను చిత్రించును. పైడయ్య అమాయకుడైన బంటావాడు కష్ట జీవి అతడు గవళ్ళోరి పాశాలమ్మను చూచి మనసు పడి

"ఎండసెగలు చెరుగు తున్నా-ఈడి ముంతకు వేడిలేదు
కల్లు ముంతకు కాకాలేదు-గవళ్ళోరి పాశాలమ్మ

కళ్ళ చలవకు తిరుగులేదు" అని పాడును. ఈ విధముగ సర్వసామాన్య సంభాషణములో మధ్యను ఊహను రేకెత్తించు గీతికలుండుటయే యీ పద్ధతిలోని విశిష్టత. చివరికి పైడయ్యను దరిద్ర దేవత వరించి వారు విడిపోవుదురు.

'సామభూతి' లో రిక్షాలాగువాని జీవితము కరుణరస స్ఫోరకముగ చిత్రింప బడినది రిక్షాకుర్రవాడు నీలయ్య ఒక పెద్దమనిషిని తన లాగెడు రిక్షాలో కొండమీదికి విరామ మహల్‌కు లాగుకొని పోవుచుండును క్రొత్తగా పరచిన కంకర రోడ్డుమీద ఒక మొనదేలిన రాయి అతని కాలిలో గ్రుచ్చుకొని అతడు కూలిపోవును ఆ స్థితిలో వానిని చూచి జాలితో కరిగిపోయిన రాళ్ళు కొట్టు ముసలిది ఇంటికిపోయి అన్నము మూట కట్టుకుని కొండ మీదికి వచ్చును 'బాబూ' అని పిలిచి వానికి అన్నము పెట్టును. ఆ పిలుపులో నీలయ్యకు తన మాతృదేవత పిలుపులా వినిపించి తను పడిన కష్టమంతయు తృటిలో మాయమగును ఒకరు కష్టములోనుండ సామభూతితో వారినాదుకొనుటయే మానవ ధర్మమని హృదయమునకు హత్తుకొనునట్లు చూపిరి. ముసలిదాని ఔదార్యమును చూచి నాగరికునకు సిగ్గు కలుగునట్లు చేసినదీ కథ.

'మట్టెల రవళి' లో రెక్కాడితేగాని డొక్కాడని కష్టజీవుల గాథను చూపిరి. గోదావరి ఒడ్డున చేపలుఅమ్ముకొను స్త్రీ, వరద వచ్చుట గట్టుపై నుండి చూచును. ఆ వరదలో ఆమె నివాసస్థలమగు లంక, లంకమీద కుటీరములతోబాటు తన గుడిసె కొట్టుకొని పోవుటను చూచి ఆమెకు గుండె జారిపోవును. ఆమె వరద నీటిలో అడవికొమ్మలను, కోడెత్రాచు తోకను పట్టుకుని భర్త ఈదుకుని వచ్చుట గమనించును. తెలవారు చుండగ ఆమె భర్త నాగడు గట్టెక్కి 'నేను ఈత్తున్నంతసేపూ నేను విన్నాది మట్టెల శబ్దం' అనును. అందులకామె 'పొద్దల్లా నీ కోసమై, ఈగట్టు

మీద నడిచిందెవరనుకున్నావు. నేనే -ఈ మట్టెల్తో నేనే' అనును. ఆ మట్టెల రవళిలో వారెంత దూరము నడిచిరో వారికే తెలియదు. ఆ అమాయక జీవుల అనురాగముతో బాటు వరద బీభత్సమును కనులకు గట్టించును. పాఠకుడు కూడా కథా వాహినిలో ఉత్కంఠతో ఉక్కిరి బిక్కిరగునట్లు చేయును చివరికి మిగిలిన ఆ మట్టెలుకుదువబెట్టి వారు తమ నష్టమును పూడ్చుకొనెదరు బీదవారి ఆస్తిపాస్తులెంత నీటి బుడగలో చూపిరి.

'మేలు మఱువని కన్నీరు' ఏరుపిడకలతో జీవనము సాగించు ఒక వృద్ధ మాలెత కథ. శ్మశానము కడనున్న పెద్దచెట్టు ఆమె నివాసము 'పిడకలతో సంపాదించిన అణా డబ్బుల్తోనూ గంజీ నంజుడు వుప్పు, వర్రా సంబాళించుకుంటుంది. ఎప్పుడన్నా కోమటి కొట్టు కెళ్ళి, ఏగాణి కందిపప్పు తెచ్చుకుని మెత్తగా కాటుకలా వండుకు తింటుంది అదే పబ్బం దానికి' అదీ ఆమె జీవనం ఆమె ఒకనాడు గోదావరిలో నీటి కుండ ముంచి ఎత్తుకోలేక అవస్థ పడుచుండ ఒక బ్రాహ్మణ యువకుడామెకు చేయి అందించును ఈ సంఘటన, జరిగిన చాల సంవత్సరముల అనంతరమా యువకుడు మరణించును. చితివర్షముచే సరిగ మండని విషయము తెలిసి ఆ ముసలిది బోరున విలపించును. వచ్చి తన దగ్గరగల ఎండు పిడకలను ఊరికే ఇచ్చివేయును. తన గొడుగును చితి తలవైపు పెట్టించి "నాతండ్రి! నేనడగనేలేదు. నేనెత్తమనేలేదు. అలాజపం చేసుకుంటూ వున్నా, ఆయన నాకష్టం కనిపెట్టి అలా తన చెయ్యి నా కడవమీద అంచి ఏండుకుండ నెత్తికెత్తాడు ఇప్పుడెవరెత్తుతారు' అని వాన చినుకులో కన్నీళ్ళు ఏర్పడరుపరాకుండా పూరింపుగన్న తన ప్రేదకుండను అక్కడే విడిచి పెట్టి సెలవు పుచ్చుకుంది!' ఇందు ఏనాడో తనకు చిన్నసాయము చేసిన ఆ బ్రాహ్మణుని కొరకు విలపించి తన కష్టార్జితము నూరకే ఇచ్చివేసిన మాలెత చిర స్మరణీయము. ఇట వర్ణభేదములేని బ్రాహ్మణయువకుని పాత్ర ఆదర్శనీయమైనది

'అంతులేని రాజమార్గం' అను కథ 'ఉప్పరివారి' అస్తిమితపు బ్రతుకులను చిత్రించును. వారిని గూర్చి"రచయిత గండిని పూడ్చి రోడ్లు బాగుచేసి ఉప్పరివాళ్ళకు అసలు ఇళ్ళేలేని వారిస్థితి ఎవరాలోచిస్తారు? కష్టపడేవానికి ఇల్లుకట్టి ముందు ఇవ్వాలా? నష్టపోయిన వానికి సృష్టి గొలపాలా? నష్టపోయిన వాడొకప్పుడు కాకపోతే ఒకప్పుడన్నా నవనాగరికత ఎరిగున్నవాడు పీడన్నలే ఎరుగడు. వీణ్ణి చూచేదెవరు? అని అడ్డుగును పొలము దున్నువానికి పొలము స్వంతము కానట్లుగ ఇల్లు కట్టువారికి ఇళ్ళెన్నటికిని ఉండవా?" అని రచయిత సమాజమును ప్రశ్నించును.

'మోజామ్ తుడుపు' వీధులుతుడుచు కడజాతివాడు భీముని కడగండ్లకు దర్ప ణము పట్టును. వాని ఇల్లు, వాడ అంతయు తగలబడి నాశనమై పూచికపుల్లకూడ లేక మిగిలిపోవును రచయిత ఆ సంఘటనను గూర్చి "ఆ విషాద దృశ్యాన్ని నేను వర్ణించే కంటె కర్ణాకర్ణిగా వింటే ఎక్కువ కరుణ ఉదయిస్తుందనుకుంటాను కలిమి గల వాళ్ళ గుండెల్లో అడిగి చూపండి వాళ్ళుపడ్డ అనాటిబాధ. వారిని సమాజము చిన్న చూపు చూస్తే రచయిత భరించలేడు. వీధులు తుడిచేవాడని మనము వాణ్ని నిరసన భావంతో చూడవలసిన పనిలేదు. గాలి తుడవదూ వీధుల్ని? గాలిని పవి త్రంగా భావించడం లేదూ? అటువంటి వాడే భీముడున్నూ' అని బాధపడును కాయ కష్టము చేయువారిని పవిత్రులుగ భావించి వారిని వాయుదేవునితో పోల్చుట కడు శ్లాఘ్యము.

'సుకారీ, లంబాడీ, మరాటీ' అను కథలో అయా జాతులవాండ్రు నిలువ నీడ లేక ఊరూరు తిరుగుట, వారు కష్టపడి సంపాదించుకొనిన డబ్బును రక్షకభటులాశిం చుట మున్నగుఅంశములు మనస్సుకరుగునట్లు చిత్రించిరి.'వాళ్ళకు తండ్రి ఆకాశం, తల్లి భూలోకం' అని చివరలో రచయిత వారికి దైవమే దిక్కని భావించును.

'ముష్టిముండా' అను కథలో ముష్టి దానిజీవితమును దయనీయముగ చూపిరి. ఒక ముష్టిది చంటిబిడ్డతో దేవాలయపు వెనుక అరుగును స్థావరముగ ఏర్పరచుకొనగ పూజారి ఆలయ ధర్మకర్తను తీసికొని వచ్చును. అతడు ఆమెనట్టి దీనస్థితిలోగాంచి కరుణాంత రంగుడై దేవాలయపు వెనుక ద్వారము మూసివేయుమని, ఎట్టి పరిస్థితుల లోను ఆమెను కదలింపవద్దని చెప్పును. మానవులలో జాలి, దయ, కరుణ పూర్తిగ నశించి పోలేదని చాటి చెప్పిన కథ.

'కులానికి, గోత్రానికి కొలబుర్రలు తలిదండ్రులే' అను కథలో చాకలివాడు తన బిడ్డను ముద్దాడుచు భార్యతో'ఒసేవు యీడు చక్కని బామ్మడౌతాడేవ్' అనును. ఆతని దృష్టిలో బామ్మడనిన చదువు నేర్చినవాడు 'అందుకామె. ఈడు పెద్దాడయ్యే వరికి చాకల్లే బామ్మర్లకంటె ఎక్కువ సతికిన వాళ్ళవుతారు' అనును. ఏనాటికయి నను సాంఘిక అసమానతలు, కులభేదములు పోయి, విద్య విజ్ఞానము లందరిసొత్తు కావలయునని ప్రబోధించినదీ కథ.

'నల్లని తారురోడ్డు' కథ, రోడ్డు వేయు కూలివారి నికృష్టపు బ్రతుకుల నెత్తి

చూపును సున్నగా రోడ్డువేసి దానిని శుభ్రము చేయు కూలి క్షయరోగపు వాతబడును ప్రజలందరికీ ఆరోగ్యము నందించు ఈ అభాగ్యులెట్లు మృత్యువు కోరలలో ఇరికి పోవుదురో హృదయ విదారముకముగ చూపిరి అట్లే 'అసంతృప్తి-ఆనందం' అను కథలో గూడ రోడ్లు వేయు ఏనాదివారి బడుగు జీవితము ప్రత్యక్షమగును.

'ఎవరిభార్య దొడ్డది' 'జాలారిపీరుడు' కథలు చేపలుబట్టి జీవించు బెస్తవారి జీవిత చిత్రణములు.

'లిగాడు' కథ కూలివాని పరోపకార బుద్ధిని చూపునట్టిది. 'లిగాడు'ను గూర్చి రచయిత ఇట్లు వర్ణించును "వన్నెకాడు, అందగాడు, ఆటకాడు, పాటగాడు—అట్టివాడే 'లి'గాడు 'లిగాడు' అనగా– కొడవలి, గొడ్డలి, గుద్దలి, రోకలి, నాగలి వీనిని పని ముట్లుగా గైకొని శ్రమపడే మగవ్యక్తి. ఎంత శ్రమపడ్డా వాడు సంపాదించే సంపాదన కలి, అంబలి వానికున్న కష్టాలన్నీ విభజిస్తే రెండింటి కిందకు వస్తాయి. ఒకటి ఆకలి, రెండోది చలి" ఇట్లు పాటక జనపు కష్టములను కవి చమత్కారముగ చెప్పును.

'మధురపరళు'లో చెట్లుకొట్టి కట్టెలమ్ముకుని బ్రతికే ఎర్రయ్య 'మేదర స్వర్గం'లో మేదరపోతన్న 'సస్యేందిర'లో దొమ్మరసాని, 'విధాతృనిమోసము'లో గారడీవాడు, 'మిణుగురుమణి' కథలలో కాయిల శంభన్న మున్నగువారు వారి వారి కష్టములతో మనముందు ప్రత్యక్ష మగుదురు.

వీరు స్త్రీ పాత్రలు ప్రధానముగ కొన్ని కథలను రచించిరి. వీనిలో కొన్ని విలక్షణమైనవి. ఈ పాత్రలు అధికముగ పేదకుటుంబములకు, నిమ్న జాతులకు చెందినవే.

'పల్లమ్మ మొగుడు' కథలో భర్తను దైవముగ భావించు పల్లమ్మ కట్టెలుకొట్టుకొని బ్రతుకును.ఒకనాడు అడవిలో ఆమె కట్టెలు కొట్టుకొనుచుండగ పాము కరవగ, కట్లు మోసికొనుపోవు లారీలో ఆమెను పట్టణము తీసికొని పోవుదురు అక్కడ ఆమె భర్త కల్లుకొరకు ఎదురు చూచుచు ఆమెను చూచి'నాపల్లాలు! ఇక్కడికికెలా వచ్చింది' అని కంగారు పడును ఆ గొంతు విని పల్లమ్మ ఆఖరు చూపు సగం తెరచి 'నా బావా! ఇక్కడ చస్తున్నాను కాబట్టి నిన్ను చూడ కలుగుతున్నాను పుణ్యాత్మురాల్ని' అని పలికి ప్రాణములు వదలును. ఈ సంఘటన పాఠకుని కంట నీరుపెట్టించును.

ఆనాడు సరియైన వైద్య సహాయము లేక, అభాగ్యులెందరో మరణించు చుండుట చూడవచ్చును

"రాములూ! ఇంకా ఇంజిరం బండి రాలేదు!" అను కథలో 'సూరి' ప్రేమ మూర్తిగ ప్రత్యక్షమగును. రోజంతా రైల్వేలైను మీద పనిచేసిన సూరి తాను ఎక్క వలసిన ప్యాసెంజరు రాకపోవుటచే, త్వరితముగ భర్తను చేరుకొనవలయునను తహ తహతో పరుగెత్తి మెయిలు బండి ఎక్కబోవును ఎక్కలేక జారి రైలు క్రిందపడి ముక్కలగు సూరి, తలంపునకు వచ్చినంతనే మనస్సు కరిగి నీరగును ఆమె అజ్ఞానము భర్తపై గల గాఢానురాగమును మనస్సుకు హత్తుకొనునట్లు చిత్రించిరి.

'ఎన్ని అమావాస్యలు' లో పఠాన్‌కు కట్టవలసిన వడ్డీని గురించిఆలోచించుచు, కారు క్రిందపడి మరణించిన పాకీ స్త్రీ పాత్ర అన్యాయమునకు గురి అగు వారికి ప్రతీక. తమ సంపాదన తిండికి చాలక అప్పులలో పడి మునిగిపోవు వారి దీన స్థితిని చక్కగ చూపిరి.

'కాంపూలో షాంపూయింగ్' కథలో బ్రిటీష్ వాడగు కలెక్టరు భార్య' డఫే దారు పట్ల చూపిన ఔదార్యము అపురూపముగ తోచును.

'చెల్లమ్మ సినిమా చూపు' లో పనిపాటలు చేయు చెల్లమ్మ వంటిస్త్రీలు పడు పాట్లను గురించి చక్కగచెప్పి, రచయిత "సాంఘిక అసమానతలు రూపుమాపా లను చైతన్యమును" కలిగింతురు

"తెల్లారిలేస్తే జాలిగొలిపే దృశ్యాలు కోటాను కోట్లు. ఇంకా తెల్లారదు కడజాతి తుడుపుడు గాండ్రు, తుడుపు కత్తెలు 'అమ్మ గారూ! తలుపండో !" అని కేకేస్తారు పెద్దిళ్ళ దంపతులు మంచాల మీదనుంచి లేవనన్నా లేవరప్పటికి వీళ్ళ భోగమిలా దండి కావడమేం ? వాళ్ళ భోగమలా మండి పోవడమేం?" అని రచయిత సంఘమును ప్రశ్నించును. ఈ అసమానతలు ఏ నాటికైనను తొలగించ బడవా అని ఆవేదన పడును.

ఆనాటి సాంఘిక సమస్యలను, దురాచారములను ఎత్తిచూపి, విమర్శించిన కథలనేకములు గలవు. కొన్నింటిలో ఆయా సమస్యలకు పరిష్కారములను కూడ చూపిరి.

'ఉద్యోగపు టుద్దీ' అను కథలో భార్యాభర్తలిద్దరు కలసి సంపాదించు

విషయమును గురించి చెప్పునది. "ఈ సమస్యను 40 ఏళ్ళ క్రితమే వీరు చూపారు. అనాడే ఈ సమస్యనాధారముగ చేసికొని అల్లిన కథ మరొకటి కన్పించదు."[1] అని ఈ కథను గూర్చి చెప్పిరి.

ఎక్సయిజు ఇన్‌స్పెక్టరు భార్య భర్తతో కలసి ఒక పల్లెలో ఆమె వివిధ వృత్తుల వారిని గమనించును మాలవాడు, మాలెత పొలములో పనిచేయుట, దేవాంగుల పడుచు, ఆమె భర్త ఒకరు బట్టలు నేయగ, మరియొకరు దారము తీయుట తెలకలవాడు, అతని భార్య కలసి ఒకరు గాను గెద్దును త్రిప్పుచుండగ, మరియొకరు మానె, తెలకపిండి అమ్ముట, పోలిగాడు తాటికల్లు తీయుచుండ, వాని భార్య కావిడేసుకుని కల్లు మోసుకొని పోవుట చూచును, అందుల కామె భర్తతో "ఈ జాతుల వారిలో మాత్రమే స్త్రీ పురుషులు కలిసి పనిచేయుచున్నారు. నాగరికు లెందుకు చేయరని" ప్రశ్నించును. ఈ కథ అన్ని జాతులలోను అడ, మగ అను వ్యత్యాసము లేక కలిసి కష్టించ వలెనని, స్త్రీకి సంఘములో పురుషునితో సమాన ముగు స్థాయినీయ వలెనని అప్పుడే ఆమెకు విముక్తి అను బోధకలదు

అనాటి సంఘములోని వేశ్యా సమస్యలను గూర్చి రచయిత కొన్ని కథలలో ప్రస్తావించును 'శృంగార శ్రేష్ఠి' కథలో శెట్టికి వేశ్య మీద మోజు వున్నను ఫిసినిగొట్టు ఆమె మోసముతో శెట్టి గొలుసు కాజేయగ అతడు గుండె పగిలి మరణించును వేశ్యలకు వేరువృత్తి లేకుండుట, వారు అవివాహితులగుట మున్నగు సమస్యలనుగురించి ఆలోచన రేకెత్తించునదీ కథ

అట్లే 'తొత్తుముండా చావు' అను కథ ఒకవేశ్య యొక్క నికృష్ట జీవనమును చిత్రించును. వేశ్య ప్రియుడు తన్ను మోసము చేయగ 'అవృత్తిని వదలి సన్యాసిగా నూరి పోతున్నాను' అని శపథము చేయును మరి యొక వేశ్య అంత్యస్థితిలో కడు దయనీయముగ మరణించగ ఆమెను వేశ్యలందరు పూనుకొని ఆమె అంత్యక్రియ లను చేయుదురు. ఈ సంఘటన హృదయ విదారకముగ చిత్రించిరి వేశ్యా వృత్తిని వదలివేయుమని వేశ్యలకు ప్రబోధ, వారిని ఆదరించి సముచిత స్థానమును కలిగింపు మని ప్రజలలో చైతన్యమును కలిగించును.

---

[1]- నాటి సచ్ఛిత్ర కథ - ఉద్యోగపుటుద్ధి - టి. కృష్ణాబాయి స్వాతి, 1978

'నేను వేశ్యనుగాను సినిమా నటిని' అను కథ వేశ్య మనః ప్రవృత్తిని చిత్రించునది. ఇది వేశ్యకూడ స్వేచ్ఛా స్వాతంత్ర్యములు కోరు స్త్రీయే అని, ఆమెను నాలుగుగోడలమధ్య బంధించి అమానుషముగా ప్రవర్తించిన ఎంతటివానైనను తెగించగలదని చూపును.

"వర్ణ-అవర్ణ-సహపంక్తి" కథలో రిటైర్డు డిప్యూటీ కలెక్టరు శ్రీ సిరియాకర రావు అవర్ణులకు-సవర్ణులకు సహపంక్తి ఏర్పాటు చేయగ భార్య వద్దన కంగీకరింపదు. వితంతువైన పిన్ని మాత్ర మంగీకరించును ఇందు కులతత్త్వము వితంతువుల పాట్లు వ్యంగ్యముగ విమర్శింపబడినవి

"కర్కాటకం-సింహం" కథ జాతకములపై గల మూఢ నమ్మకములను విమర్శించును 'ఋజువు భారము' కథ సమాజమున మగబిడ్డకుగల ప్రాధాన్యమును తెలుపును ఆనాడే అభ్యుదయ దృక్పథముతో కవికొండల ఆడ, మగ శిశువులపట్ల వ్యత్యాసము చూపరాదని చాటిరి

'ఇద్ పండుగ' మత మౌఢ్యమును నిరసించునట్టిది. 'ప్రపంచ పౌరుడు' అను కథ మతసామరస్యమును బోధించును కువలయార్ద్రి అను హిందువు, రెబెకా అను క్రిస్టియనుస్త్రీలు ఇరుగు పొరుగువారు మత వైషమ్యములతో కొట్టుకొను వారిరువురు ఒకనాడు తమ ఇండ్లమధ్య ఒక శిశువు దొరుకుటతో అన్నియు మరచి ఆ శిశువును ప్రపంచపౌరునిగ పెంచుటకు నిశ్చయించుకుందురు

'అమృతహారతి' కథలో మన గుడులలోని అసౌకర్యము, ఇరుకు, అలజడి స్త్రీలకు రక్షణ లేకపోవుట యథా తథముగ వర్ణితములు. దేవుని ప్రశాంతముగ, మనసార ధ్యానింప వీలులేని మన దేవాలయపు పరిస్థితులు మారవలయునని ప్రబోధించును

'బస్సుకుషన్' అను కథ సాటి మనుష్యుల పట్ల సానుభూతితో వర్తించవలయునని చాటును నవనాగరికుల కఠినత్వమును, వారి ప్రవర్తనను నిరసించును బస్సులో ఇరువురు నాగరిక స్త్రీలు ప్రక్కన ముసలిదాని దుర్గంధమును భరింపలేనట్లుగ సీటు వదలి లేచిపోవుదురు అందులకు రచయిత 'కలుపు తీతలా కొందరిని ఈ ప్రపంచంలోంచి తీసివేస్తే లోకం కిన్నెరలోకమో కింపురుషలోకమో కాగలదనేమో,

ఆనాటి సాంఘిక స్థితిగతులను యథాతథముగ చూపు కథలు కొన్ని కలవు. వానియందటనట నీతిబోధకూడ ఇమిడియుండును. "ఫినైల్ వాష్" అను కథలో అప్పుడప్పుడే మొదలగుచున్న సినిమాలపై విమర్శ కలదు. ఇంటిల్లిపాది జనము సినిమాకు ఎగబడిపోవుట, దాని వలన కలుగు నష్టములు చూపి కాలమును వృథా చేయక మన ఇంటి పరిశుభ్రతకును, పిల్లల ఆరోగ్యము కొరకును వినియోగింప వలయునని బోధించును.

'జమీందారు' కథ ఆనాటి జమీందారీ వ్యవస్థను ప్రజల మన స్స్వతమును ప్రతిబింబించినది దీనిని గూర్చి దాశరధి "కవి కొండల వెంకట్రావుగారి కథ 'జమీందారు' బ్రహ్మాండంగా వ్రాశారు" అని పేర్కొనిరి [1] ప్రభుత్వము జమీలను స్వాధీనము చేసికొనగ జమీందారు నష్టపరిహారముతో దర్పము, భోగభాగ్యములను మరచి సామాన్య మానవునివలె కాలినడకను సాగిపోవును. రాణి మాత్రము నగలతో మేనా ఎక్కి బయలుదేరగ, జమీందారు ఆమెకు నచ్చచెప్పి తనతో తీసికొని పోవును. ప్రజలు జమీలు పోగా మేనాలు యెందులకని మేనాను తగలబెట్టగ అది చూచి వారిరువురు విరక్తులై నగలన్నిటిని నదిలో పారవైచి సాగిపోవుదురు జమీందారుల నిస్సహాయస్థితి, ప్రజల తిరుగుబాటును,చక్కగ చూపినదీ కథ.

"తెలుగు నాటగల పల్లెపట్టుల రామణీయకతను, పాటక జనుల జీవితాన్ని కళ్ళకు గట్టినట్లుగా చిత్రించి చెరిగిపోని దేశీయతా ముద్ర వేసుకోగలిగిన కథల కోవకు చెందినది 'జమీందారు'. అని చెప్పబడినది [2]

"ఒక దశాబ్ది తెలుగు కథలు" సంకలనములో 'జమీందారు' ను మొదటి కథగ వేసిరి

'ఉడుత-ఉసురు' కథ ఆ కాలము నాటికే వనముల ప్రాధాన్యమును చాటి చెప్పినది చెట్లను ఇష్టము వచ్చినట్లు కొట్టివేయుచుండిన వానినాధారముగ చేసి కొనిన పక్షులు జంతుజాలమెట్లు నిరాశ్రయులగునో మనసునకు హత్తు కొనునట్లు చూపిరి

---

1. సమాజపు ఆరోగ్యం కోసం మంచికథ-అందాల తెలుగుకథ- దాశరధి, పు — 2

2. ప్రస్తావన-ఒక దశాబ్ది తెలుగు కథలు-సంకలన కర్త "మధురాంతకం రాజారాం

'ఎర్ర కలవ చేతులు- నల్లకలవ ముఖము' అనునది 'టెస్ట్ ట్యూబ్' శిశువు జననమును గూర్చి తెలుపు కథ శాస్త్రీయమున'అంత అభివృద్ధి గాంచని దినముల లోనే రచయిత ఇట్టి కథ వ్రాయుట ఆశ్చర్యము.

'పొట్టి రవికలు-వాలుజడలు' అనుకథ అనాటి స్త్రీల వేషధారణమును చూపుచు. వర్ణాంతర వివాహములను ప్రోత్సహించుచున్నది 'అనాడు రాజమహేంద్రవర ములో అగ్రకులజునకు అధమ కులజుడు ఎదురు పడితే సహించలేని సమాజము వర్ణాంతర వివాహమునకు అంగీకరిస్తుందా?' అను రచయిత ప్రశ్న యువకులలో చైతన్యము కలిగించునట్లున్నది.

కొన్ని దేశభక్తిని ప్రబోధించు కథలు కలవు.

"సింగిల్‌డస్కులా? డ్యూయల్ డస్కులా''అనుకథ స్వాతంత్ర్యోద్యమము నకు ప్రతిస్పందించిన ఉపాధ్యాయుల,విద్యార్థుల స్థితిని కనులముందుంచును. ఇందు అనాటి ఉద్రిక్త వాతావరణమును సహజముగ చూపిరి. 'అసలు సిసలైన స్వేచ్ఛను అందుకోండి' అను కథ ఇంటింట జాతీయ పతాకను ఎగురవేయవలెననియు, భరత మాతనుఆరాధించుట ప్రతి భారతపౌరుని కర్తవ్యమ'ని చాటి చెప్పును. 'అంధ్రశుద్ధి' రచయితకు గల అంధ్రాభిమానమును వ్యక్తము చేయును. 'ఓంకారి మాయా స్వరూపము' కథలో ఓంకారి నాయిక "స్త్రీజనాభ్యుదయము, హరిజనాభ్యుదయము, జానపదాభ్యుదయము కలిగినప్పుడే స్వాతంత్ర్యము పరిపూర్ణముగ సిద్ధింపగల"దని ఓంకారి ఎలుగెత్తి చాటును 'వైస్రాయిస్పెషల్' అనుకథ తెల్లవారి అధికత్యను, దర్పమును వెల్లడించును 'టర్కీలు-గినీలు' జాతివర్ణవైషమ్యమమును పాటించు తెల్లదొర కసాయితనమును చిత్రించును.

హాస్య ప్రపూరితమగు కథలు సంఘములోని అన్యాయములను, మూఢా చారములను వ్యంగముగ, ఎత్తిచూపును

'కాకికి కంపార్ట్‌మెంటల్ వైద్యము' ఇట్టిదే. ఇందు ఆసుపత్రులలో చెవి డిపార్టుమెంటు, కన్ను డిపార్టుమెంటు అను విడివిడి శాఖలను వీరు విమర్శించిరి. కాకి. పండ్లు కట్టించుకొనుటకు దంతవైద్యుని వద్దకు పోగా వచ్చినదెవరో, జబ్బేమిటో చూడకయే అతడు "కదిలే పండ్లు లాగించుకోమని ఈ వ్యక్తికి నేను సలహా యిస్తున్నాను" అని చీటీ వ్రాయును కాకి నవ్వగ కోపముతో కంటి డిపార్టుమెంటుకు బొమ్మనును సరిగ పరీక్షచేయకయే నిర్లక్ష్యముగ పనిచేయుట,

రోగము నిర్ధారణ చేయలేక తికమక పడుట మున్నగు విషయములు హాస్యపూరిత ముగా విమర్శింపబడినవి.

"బ్యూటీ అండ్ డ్యూటీ" కథ అందమైన ఆడపిల్లల నేడ్పించు మగవారిని వ్యంగముగ విమర్శించునది "అమ్మాయి బ్యూటీగా కాన్పించడం వలన ఆ బ్యూటీని పురుషులు చూడడం డ్యూటీ" అను విసురు కలదు "రామాన్న పెళ్ళి"లో పెండ్లి కాకుండగనే జంటలుగ తిరుగు కాలేజీ విద్యార్థినీ, విద్యార్థుల ఊహలు, ఇబ్బందులు చదువుచున్నపుడు నవ్వును పుట్టించును.

'బొట్టికత' అను కథల సంపుటము వీరు బాలల కొరకు రచించిరి. ఇవి చిన్నవిగను, ఒకే సంఘటనమీద ఆధారపడి నట్టివి నీతివంతముగ, విజ్ఞానదాయక ముగ, సరళముగ, క్లుప్తముగ నున్నవి పెక్కు కథలు జంతువులకు సంబంధించి నవి.

"అవిఘ్నమస్తు" వినాయకచవితి పండుగ ప్రాముఖ్యమును తెలుపును "వసంతుని భాగవతము" లోవసంతుడు, కోకిల మామిడిచెట్టు, రామచిలుక మల్లెతీగ ప్రధానపాత్రలుగ గేయములతో ఆహ్లాదము గొలుపుచుండును. "శ్రీకృష్ణమూర్తి-గోపిక" కథ కృష్ణుడు గోపికకు జ్ఞానోదయము కలిగించుటను, 'దేవుడు'కథ అరచేతి లోని చారలను గూర్చి బాలుడు పడు జిజ్ఞాసను వివరించును. "జంబూ ద్వీపము" మాతృదేశ భక్తిని ప్రబోధించు కథ "జయసింగు-జాతికుక్క"లో జంతువులలో కుక్కకుగల విశ్వాసము సాటిలేనిదని చూపును

స్వేచ్ఛగ తిరుగు పక్షులను పంజరములలో బంధించుట క్రూరమని బాలలకు చాటి చెప్పిన కథ'చిలుక చెఱ.'

కొందరి స్మృతికి చిహ్నములుగ వీరు కొన్ని కథలను రచించినట్లు తోచును.

'సిల్హూటీ నృత్యాలు' కథ కుమారుడు తండ్రిస్మృతికి విలపించునది. 'పొగ కర్రలు'లో తండ్రి తన ముప్పూరు శిశువుల స్మృతికి పరితపించుటను హృదయ విదారకముగ చిత్రించిరి. 'మాతృ చిహ్నము' తల్లి స్మృతి చిహ్నముగ రచింపబడిన కథ. ఆమె నివసించిన ప్రదేశములు, ఆమె తనను ప్రసవించిన పురిటిగది అన్నియుచూచి కుమారుడామె తలంపులలో దుఃఖితుడై మునిగిపోవును. 'వాసాంసి జీర్ణాని' కథ ప్రియురాలి స్మృతిని గూర్చి, 'మంచుగది' కథ తమ్ముని స్మృతినిగూర్చి

కరుణరస పూరితముగ వర్ణించును 'కంఠ ధ్వని' కథ వరదబీభత్సమును, మృత్యు దేవత తాండవమును ప్రత్యక్షము గావించును

'కథకుడిలో కథ' సంపుటమునందు అన్నియు కథకుని అనుభవములను గూర్చినట్లు చెప్పవచ్చును. ఇట కథకుడనగ కవికొండల అని మనము ఊహింప వచ్చు చిన్ననాటి నుండి జీవితమున వారు పొందిన వివిధమగు అనుభూతులు, పరిచయస్తులగు పలువ్యక్తులను గూర్చిన పరామర్శ వీనిలో చూడనగును. ఇది ఒక విధముగ ముఖ్యమగు సంఘటనతో గూడిన వారి ఆత్మకథగ నెంచవచ్చును

'చెడుగుడి-చెండాట' కథలో కథకుని చిన్ననాటి ఆటపాటలను చదివి ప్రతి పాఠకుడును తన బాల్యస్మృతులు నెమరవేయక మానడు 'గంటలబళ్ళు' కథ బస్సులు లేని దినములలో జరిగిన ఎడ్లబండి ప్రయాణమును చక్కగ వర్ణించిన కథ ఆనాటి తెలుగు పల్లెసీమ తన సకల సోయగములతో మన కనుల ముందొక్క సారి నర్తించునట్లు చేయును

'మాసందు' కథలో కథకుని స్వంతగ్రామము, అందు వారు నివసించు చుండిన సందును వర్ణింతురు ఆ దారిన హరిజనుడు పోవలసిన వారి అనుమతి తీసికొని పోవలెను అనుటలో కులతత్త్వము చూపబడినది ఇది ఎంత కృత్రిమమో, మానవ కల్పితమో రచయిత పరోక్షముగ ఇట్లు తెలియజెప్పును. "మార్గ గామి హరిజనుడైనా, అగ్రజాతివాడైనా సరే ఒకే రీతిని చల్లగా, దక్షిణపు తెలపినే పైరుగాలి వీస్తూ, చెమ్మటలూడుస్తూ, ఆ వాడకు బ్రహ్మానందం చేకూర్చకమానదు అనిపిస్తుంది" ప్రకృతికి కుల వివక్షత లేదని రమ్యముగ చాటును

'శూన్యాకాశ విచింతనం'లో వీరి చిన్ననాటి అక్షరాభ్యాసమును గూర్చి, రాజమండ్రికో హిందూ లోవర్ సెకండరీ స్కూలును గూర్చి అనేక స్మృతులు కూర్పబడినవి

"అయితే మెట్రిక్యులేటు లేకుంటే ఫేలు" కథయందు విద్యార్థులపై గురువులు చూపిన ఆదరణ చూపబడినది

"షికారులో" వీరు చిన్ననాటినుండి తమస్వగ్రామములోను తరువాత రాజ మండ్రిలోను చేసిన షికార్లను గూర్చి చెప్పిరి ఈ అలవాటే వీరి ప్రకృతి పరిశీల మునకు దోహదము గావించి వీరి జీవితములో ఒకభాగమైనది.

"పెనుమంచిలి జైనదేవుడు" అను కథల సంపుటిలో 10 కథలు కూర్చబడి నవి ఇవి పూర్తిగ కథలుగ చెప్పుటకు వీలులేదు అంగ్ల భాషలో "స్కెచ్" అని చెప్పబడు రచనల లక్షణములు వీనిలో ఎక్కువగ కనిపించుచున్నవి ఆంధ్రదేశ ములో కొన్ని దేవస్థానములకు సంబంధించి, పూర్వపు పట్టణముల అందముల గూర్చి కథారూపములుగ వివరింప బడినవి రచనా కాలము 1931 నుండి 37. ఇవి ఆత్మాశ్రయమైన అనుభవములు, జ్ఞాపకములుగతోచుచున్నవి ఈ సంపుటమును గూర్చి రచయిత ఇట్లు చెప్పిరి "పెనుమంచిలి జైనదేవుని కథలోని కీలకమంతా సంభాషణలో వుందని నా అభిప్రాయం." అచంటేశ్వరుడు కథ మోహమును గుర్తించి విషాదము తొలగి వివేకము పొందిన సన్యాసిని గూర్చితెలుపును

"అచంటేశ్వరుని లింగమును అతి చీకటిలో చూడబోయినప్పుడు దాన్ని చూడ్డానికో కాగడా కావాలని, ఒక వేగుచుక్క పొడవాలనీ, ఒక చందమామ ఉదయిం చాలనీ అనిపించలేదు మనస్సాక్షి యొక్క అంతర్జ్యోతి తనంత కొడి దులుపుకొని కొమరు మీద కొండంత దివ్వెగా ప్రజ్వలిస్తుంటే పైవన్నీ ఎందుకూ?" అని ప్రస్తా వించిన మాటలు ఆత్మ జ్యోతి శక్తిని బహు సున్నితముగ ప్రబోదించినవి

"కాపవరపు చెరువులో కోరుకొండ నరసింహస్వామి నీటిపీడలు" పామ రుల భక్తి పారవశ్యమును నిరూపించు ఉదంతము. కోరుకొండ మీద రచయితకు గల అభిమానము వ్యక్తమగును చేపల వాడు కూడ "ఈచెర్లో నేనెప్పుడూ చేపలు పట్టను. ఈ చెర్లో చేపలట్టాలని ఒంగున్నప్పుడల్లా కోరుకొండ నరసింహ స్వామివారి ప్రతిబింబం చేపల్తో ఆటలాడుకుంటూ కనిపిస్తూ పాపమని పిస్తుంది" అను టలో ఆ పామరుని భక్తికి సాటి మరేదియు కానరాదని చూపును

శ్రీ కాళహస్తి దివ్యక్షేత్ర యాత్రను స్ఫురణముగ గైకొని వ్రాయబడిన దివ్యగాధ "కన్నప్పకల" ఇది దేవునకు, మానవునకు మధ్యగల తారతమ్యమును, సామ్యమును దీప్తిమంతముగ జూపును "శ్రీ వేదవల్లి తాయారమ్మాళ్" భగవద్భ క్తుడగు చెన్నప్పపేరను ఒక మహాపట్నము ఎట్లు పెరిగెనో తెలుపు మహిమాన్విత మైన కథ "గంధం వొలుపు"సింహాచల స్వామి ఆది వరాహమూర్తి అయినను నాలుక చివరకు వచ్చునరికి "సింహాదిరప్పన్న" అని భక్తులెందుకందురో, ఏ తద్వృత్తాంత మెట్లు సింహాచల క్షేత్రములో ఏటేటా జరుగు గంధపు వొలుపు మహోత్సవ కారకమై నదో ఆవిశేషములను గూర్చివర్ణించును "మంగళగిరి పానకాల స్వామివారిమహిమను గూర్చి మృదువైన శృంగార శైలిలో మనోజ్ఞముగ వ్రాసిన కథ అధర సుధారసము"

ఇట్లు ఈ కథలు మనకు ఆయా స్థానిక విశేషములను ఆయా పుణ్యక్షేత్రము లకు సంబంధించిన పామర పౌరాణిక గాథలను తెలుపుచున్నవి వీనిని చదివిన మనదేశపు జానపదపు ప్రాంతములలో సంచరించుచున్న భావనయే కలుగును

**శిల్పము :–**

కథను రచించుటలో శిల్పమొక ప్రధాన విషయముగ భాసించుచున్నది, దీనిని బట్టియే కథల యొక్క విలువయుండును. కథకు శీర్షిక నుంచుట, కథయొక్క ఎత్తుగడ ముగింపులు, కథాకథనము, "సన్నివేశ కల్పనము. పాత్రపోషణ, భాష మున్నగునవన్నియు శిల్పము క్రిందికే వచ్చును,

కవికొండల కథలలోని శిల్పము వీరి ప్రతిభను చాటును.

**శీర్షికలు : -**

కవికొండల వారు కథలకేగాక కవితలకు కూడ విచిత్రమగు శీర్షికలనుంచును. "ఉస్థి, ఉప్పొలం, జాతీయత, సానుభూతి, జమీందారు", వంటి చిన్నపేర్లుగల కథ లున్నను సుదీర్ఘమగు శీర్షికలుగల కథలే ఎక్కువ "గాడిదపిల్ల కోమలం, ఈయనకి స్మశానం దాకా డాక్టరుండాలి, ఎర్రకలువ చేతులూ– నల్లకలువముఖము, ఒరు బుకింగ్ క్లర్కు పామిస్ట్రీ, మున్నగునవి ఇట్టివే' "ఫినైల్ వాష్, ఒకె డెన్ హెయిర్ లెన్గ్తు ఎస్కేప్, యువర్ వైఫ్" వంటి ఆంగ్ల శీర్షికలు ఆటనటనో చరించును,

పాత్రల పేర్లుకూడ నూతనముగ, వింతగనుండును."కుంజ విహారిణి, కువల యార్ద్రి, కీర, ఓంకారి, పువ్వాయమ్మ, మధుపాత్ర, అనుతాపి, దుమ్ముంలమ్మ, కొర్రమ్మ, శుభాలమ్మ"వంటి స్త్రీ నామములు "గభీరన్న ప్రభాతన్న,కృత్తికయ్య, బొర్రదొర.ఏకాంతశర్మ,రివటయ్య"మున్నగుపురుషులునామములు క్రొత్తగ దోచును

**కథా కథనము :**

కథాకథనము పలురీతులుగ ప్రత్యక్షమగును కొన్ని కథలను వీరు స్వయ ముగ చెప్పినట్లు ఉత్తమపురుషలో ఉండును "మేరీవో గ్రేవో ఆ పిల్లపేరు నాకి ప్పుడు బాగా జ్ఞాపకం రావడం లేదు.

(నాయనమ్మ బైబిలు.)

గీతికలతో ప్రారంభము చేయుట వీరి విశిష్టత ఈ పద్ధతి మరెక్కడను కాన రాదు.

"చొక్కా చిరిగితే దర్జీ కుట్టు
జోడూ చిరిగితే గోడారి కుట్టు
డొక్కకు చిరిగితే కుట్టేదెవడు" (ఆస్తికత. జీవనోపాధి)

"పెదయ్య-దరిద్ర దేవత కథ" లో అంతటను గీతికలుండును. ప్రధానముగ వీని వలననే ఇందు శిల్పము పోషింపబడినది.

"ఎన్నాళ్ళు పాటడ్డ యీ గునపమే మిగులు
ఎందుకుర యీ జన్మ మోరన్నా!
కంటరాక్టరు మేడ కలక చేరుతుడ
కట్టుకొని ఎంచక్క సౌఖ్యపడుతూ వుంటే
ముందూరు ఏదంటు మోసపోయే మనకు
ఎందుకుర ఈ జన్మ మోరన్నా!"

కొన్ని కథలు గీతికలతో ముగియును.

' సంధ్యా వీధుల శార్దూలాలు
వెన్నెల బయళ్ళ వెల్లాంబోతులు
ఇరు తోరట్లను యెలుగుంగొడ్డు, (పరువుసెడి కరువున పడింది)

'మరువాడ కథ'ను ఆంగ్లగేయముతో ముగించును

'Hindu Society
Never to return
To nice country side
I've to unlearn
Her eyes too wide.'

**వర్ణనలు .**

వర్ణనలు లేని కథలు వెలవెలబోవుచుండును. ఇవి కథ కంతగ ప్రధానములు కాకున్నను దానికి మెఱుగులు దిద్దును. ఇవి వీరి కథలకు కావ్యత్వము నాపాదించినవి.

రచయిత ప్రాణాధికముగ ప్రేమించు గడ్డిపూలపై 'ఇటికల' అను కథ రచించిరి వీరు మనోజ్ఞముగ ఒప్పు కొన్ని గడ్డిపూలను చూచి మాలెతనడిగి వాని పేరు 'ఇటికల' అని తెలిసికొని వానినిట్లు వర్ణింతురు "పువ్వులెలా పూసివున్నాయి. అంటే వరుపుకు టాకాలు వేసే సమయంలో పైకి లాగేటప్పుడు దారాల పొడుగుల్లా కాడలు లేచి ప్రతికాడ చివర్నా మటీ పసుపు పచ్చకానట్టి మటీ తెలుపు లేనట్టి లేలేత వన్నెతో, మరీ చిన్నకాని, మరీ పెద్దకాని పరిమాణాన్ని, అకారాన్ని పొద గడుతూన్నాయి పువ్వుల కాడలి దిగుదల్ని నక్షత్ర చామంతి ఆకులా వుంది." ఇది వీరి నిశితపరిశీలనా దృష్టికి నిదర్శనము

వర్షమును మనోజ్ఞముగ వర్ణించును. "పెద్ద వుసిరి కాయంత చినుకు రాచ వుసిరి కాయంతలోకి తరిగి మరి అక్కడ నంచి ముత్యాలుగా మారి హోరున కురుస్తున్నది" (మేలు మఱువని కిన్నెరు).

వరద మందు గోదావరిని సహజ సుందరముగ వర్ణించును "మేఘాలు నాటకరంగమ్మీద తెరలో పై నుంచి కింద కెంత గబగబా దిగజారతాయో అంత గబగబ అవి క్రింద నుంచి పైకి వన్నె వన్నెల్లో లేచి పోయినాయి. లేచిపోయి క్రిమేణా ధూమ్రవర్ణంలోంచి నల్లనల్లగా మాటి కాటు నల్లనై చల్లనిగాలితో ప్రాకిపోయినాయి గోదావరి నీరంతా ఓ వైపు ఆకుపచ్చని చాయగా మారిపోయింది. రెండో తట్టు కొంతసేపు ఉత్తరపు దెసన సూర్య కాంతిని ప్రతిఫలించి అట్టే అది కూడా మాయం జేసి వేసింది."— (పైడయ్య దరిద్ర దేవత)

సూర్యాస్తమయ వర్ణన ప్రబంధపోకడలలో నుండును "అల్లిబిల్లిగా అల్లుకు పోయిన తీగల ఎఱ్ఱటిపూతలా వీళ్ళెల్లా కప్పవడేటట్టు వోమ త్తకాశిని కుసుంభావన్నె చీర కట్టుకుని చిక్కపట్టుకున్నా గాలికి అల్లల్లాడే చెంగుల్లా, రింగుల్లా, అదో తెరలా ఏదో పొరలా ఆ విపరీతపు వెఱ్ఱి ఎఱ్ఱటి రంగు తొణికించే వసంతంలా తోచింది. ఇంతెందుకు ఎంతమంచి గోరింటాకు రుబ్బిన బిబ్బోకవతి హస్తాలకైనా అలాంటి రంగు వస్తుందని నేననుకోను" — (మిణుగురు మణి)

రసము :

రసప్రధానమైనదే ఉత్తమ సాహిత్యం కవి కొండల కథాంశమునను గురించి ఔచిత్యముతో భిన్న రసపోషణ గావించిరి.

'మేలు మఱువని కన్నీరు' 'సానుభూతి గానుగెద్దు'మున్నగు కథలు కరుణ రసాత్మకములు, 'పిల్లాటి నృత్యాలు, మంచుగది, వాసాంసి జీర్ణాని, పొగకత్రలు' మున్నగు కథలు, శాంతరసపోషకములు ఇందు ఆప్తుల మృతిని గూర్చి తాత్త్విక పరముగ చిత్రించుట చూడనగును 'కంఠధ్వని గండిసే మొండి జీవనము' మున్నగునవి బీభత్స పూరితమగు కథలు. వీనిలో గోదావరి వరద వర్ణనము. దానికి గురియైన మనజుల, పశువుల మృతి బీభత్స జనకముగ చిత్రింపబడును 'అధరసుధారసం'కథలో శృంగారమును, 'మానిసీచిత్తచోరుడు'లో భక్తి రసమును పరిపోషించిరి 'కాకికి కంపార్ట్‌మెంటల్ వైద్యము' 'రయితు సమస్య' 'వర్ణ-అ వర్ణ సహపంక్తి' కథలు హాస్యరస పూరితము ఇట్లు వీరి కథలలో వివిధ రసములు సందర్భానుసారముగ పోషింపబడినవి

## పాత్ర పోషణ :

ఈ కథలన్నింటిలోను పాత్రపోషణ కడు మెలకువతో సాగినది వీనిలో చక్కటి సన్నివేశ కల్పనము ఒక ప్రత్యేకత అడుగడుగున వీరి ముద్ర ఎల్లెడల గోచరించుచుండును చూడగనే ఇది 'కవికొండల కథ' అని సులభముగ గుర్తుపట్టునట్లుండును సంఘములోని వివిధస్థాయిలకు చెందిన వ్యక్తులు, భిన్న మనస్తత్వములుగల ప్రజలు వీరి కథలలో సాక్షాత్కరింతురు. ఆయా వ్యక్తుల జీవన విధానములు, అభిరుచులు, అనుభూతులు, అనుభవములు కష్టసుఖములు మన కనుల ఎదుట నడయాడును కనుకనే వీరి పాత్రలు సజీవములై, మనముందు నటించును ఇందులకు కారణము వీరి కథలలోని పాత్రలన్నియు మధ్యతరగతి, అట్టడుగు తరగతికి చెందిన ప్రజలగుటయే ఇదియే వీరి పాత్ర సృష్టిలోని ప్రత్యేకత. జానపదుల జీవితములలో గల ఆనందము, సంతృప్తి, నిరాడంబరత, అభిమానము, నిష్కల్మషత, పట్టణవాసపు జీవితములలో లేదని విశ్వసింతురు. అందులకే వీరి మంచి కథలలో అధిక భాగము పల్లీయుల జీవనమునకు సంబంధించినవిగనే యున్నవి.

## భాష ;

వీరు కథలలో ఉపయోగించిన భాష సరళ సుందరముగ నుండును. వాక్యములు చిన్నవై మన ఎదుట ఒక మిత్రుడు కూర్చుని కథ చెప్పినట్లు నిరాటంకముగ సాగిపోవును

అచ్చ తెనుగు జాతీయములు, లోకోక్తులు సమయానుకూలముగ నుపయోగించిరి

"నిమ్మకు నీరోసినట్లు" — (మేలు మఱువని కన్నీరు)
"చదివిన వాని కంటె చాకలి మేలు"
— (కులానికి గోత్రానికి కొలబద్రలుతలిదండ్రులే)
"తిన్నింటి వాసాలు లెక్కెట్టడం" — (చంచన్న పరధ్యానం)
"ఆలి మర్కాటంగాను, ఇల్లు యిర్కాటంగాను ఉండాలి"
— (కర్కాటకం-సింహం)
"ఆలులేదు-చూలులేదు, కొడుకు పేరు సోమలింగం"
— (సర్వమంగళభద్రేశ్వరుని నిరాటంక ఇష్టావ్యాప్తి)

ఆంగ్లలోకోక్తులను గూడ అటనట ప్రయోగించిరి

In the bowl of this world you were flung'
'Why feel about them it today be sweet
unborn tomorrow and dead yesterday" (మాతృ చిహ్నము)

కొన్ని కథల కనుగుణముగ భాష పల్లీయుల ఏసలో నడచును. 'విజే నగరం' (విజయనగరం), 'అన్నియ' (అన్నయ్య), 'నివ్వు' (నీవు), 'కుసింత' (కానంత) 'కూకొను' (కూర్చును) మున్నగు పదములు, 'ఇచ్చి నోరుకాదు' (ఇచ్చినారుకాదు), 'సందెలడ్డాది' (సంధ్య పడినది), 'మాంరాలేదు' (మేమురాలేదు) మొదలగు వాక్యములు వీరి కథలలో కనిపించును సుమారు ఏబది సంవత్సరముల క్రితము వ్యావహారికమే పలువుర కామోద యోగ్యముకాని దినములలో ఇట్టి భాష నుపయోగించుట విప్లవాత్మకమనియే చెప్పవచ్చును

సాధారణముగ వాడుకలో నున్న కొన్ని ఆంగ్ల పదములకు కూడ అనువాదములు సృష్టించిరి

'మంచినిశ' Good night, 'బల్లతగవరి' Bench Magistrate, 'ఉష్ణం కొలకాచ'-thermo metre, 'గుండెరొవ కొలగొట్టం'-Stethe scope 'పాదమ్మోపు'-Foot board, 'గుర్తుబల్ల'-Name board" మున్నగున విట్టి పదములు. ఇవి పాఠకుని కొంత ఇబ్బందికి గురి చేయును

ఇట్లు వీరికథలను పరిశీలించిన కొన్ని అంశములు గుర్తించవగును ముఖ్య

మైన విషయము వీరి కథల రచనా కాలము మన భాషలో చిన్న కథల రచనా విధానము పరిణతి చెందుటకు మొదలైన కాలములో అనగా ఇప్పటికి సుమారు ఏబది ఏండ్ల క్రిందట వీరు 300 కథలను రచించి ఒక విలక్షణ విధానమును నెల కొల్పిరి అట్టి పరిస్థితులలో కథాగమనమును ముందుకు నెట్టిన ప్రముఖులలో వీరొకరు. చిరస్థాయిగ నిలువ దగిన కథకులలో వీరికి ప్రత్యేక స్థానమున్నది

వీనిలోని వస్తువైవిధ్యమే వీరి కథలకింత ప్రత్యేకతను సంపాదించి పెట్టి నది. ఇది వీరి లోకజ్ఞతను, ప్రపంచ పరిశీలనానుభవమును చాటును. వీరివలె తమ కాలము నాటి భిన్న పరిస్థితుల నింత సహజముగ, స్పష్టముగ తమ రచనముల మూలమున చాటినవారు చాల అరుదుగ నుందురు ఆ కాలమునాటి సమస్యలు, సంప్రదాయములు, సంస్కారములు, ఆచారములు మున్నగువాని ననుసరించియే మనము వీరి కథలను పరిశీలింపవలసి యున్నది.

గ్రామీణుల జీవితమును, కర్మకారుల కష్టసుఖములను ఇట్లు తమ కథలలో ఆనాడు ప్రతిఫలింప జేసినవారు కానరారు ఇచటనే వీరి అభ్యుదయధోరణిని మనము చూడవచ్చును నవనాగరికతకు దూరమై ఆర్థికముగ సాంఘికముగ, అన్ని రంగములలోను అట్టడుగున దిగజారిపోయినవారి కడగండ్లను, వారి అమాయ కపు టనురాగములను చిన్న సంఘటనను ఆధారముగ జేసికొని సంక్షిప్త సుందర ముగ మలతురు. వీరి నిర్మాణ దక్షత, భావ శబలత, అభ్యాసము అడుగడుగున ప్రత్యక్షమగును మానవుని మనస్తత్వమును ప్రతి కోణము నుండి పరిశీలించిన వీరి చాతుర్యము అబ్బురమును గొలుపుచుండును

"వీరి కథలు చిన్న చిన్న మెరుపులు మామూలు సంఘటనలను ప్రత్యేక దృష్టితో పరిశీలించి పైచిత్ర ప్రధానమైన కథలు వ్రాశారు హాస్యధోరణితో వ్యంగ్యంగా జీవిత సత్యాలను సమస్యలను ప్రదర్శించడం వీరి కభీష్టం శైలి విలక్షణమైనది అల్లిబిల్లిగా అల్లుకొన్న అందాలు లతా నిసర్గ సౌందర్య శోభితం" అని వీరి "కంఠ ధ్వని" కథను గూర్చిన సందర్భమున తాళ్ళూరు నాగేశ్వరరావు వ్రాసిరి "[1]

---

1. కంఠధ్వని-ఉపోద్ఘాతము-తాళ్ళూరు నాగేశ్వరరావు-మూటపదహార్లు (ప్రథమ భాగము) పు-52

వీరికథ 'దేవుడొక్కడే దిక్కు'ను గూర్చి పోలాప్రగడ సత్యనారాయణ మూర్తి ఇట్లు వ్రాసిరి. "శ్రీరావు ఈ కథలో 'సంక్షోభం లేనిదే సమాజ అభ్యుదయానికి అంకురార్పణ జరగదు' అనే మహాసత్యాన్ని వాదాలూ లేకుండా మాట పొందికల సానమీద, మంచి గంధంలా అందించారు"[1]

"నేటి కాలపు కథావ్యాప్తికి శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వారి సమవయస్కులైన మరికొందరు ప్రసిద్ధ కథకులు ప్రధానకారణమని చెప్పాలి. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి, చింతాదీక్షితులు; వేలూరి శివరామశాస్త్రి, వెంకటచలం, మునిమాణిక్యం నరసింహారావు, మొక్కపాటి నరసింహశాస్త్రి, అడివి బాపిరాజు, కవికొండల వెంకటరావు మొదలైన వారినందరినీ ఈ తరంలో చేర్చవచ్చు" అని గణపతిశాస్త్రిగారు తెలిపిరి[2]

ఇట్లు పైవిధ్యము. సహజత్వము, సంక్షిప్తత కలిగిన వీరి కథలు తెలుగు కథా ప్రపంచములో చిరకాలము తారకల వలె మెరయుచుండును



1. నాకు నచ్చిన కథ-దేవుడే దిక్కు-పోలాప్రగడ సత్యనారాయణమూర్తి, స్వాతి

2 శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రిగారి చిన్న కథ-పి. గణపతిశాస్త్రి: కిన్నెర, ఏప్రెల్ 1951, పు-299.

# నాటకములు-ఏకాంకికలు

## 1. నాటకములు

కవికొండల ఇరువదవ శతాబ్ది ప్రారంభములోనే నాటక రంగమున కూడ కృషి యొనర్చిరి వీరు నాటకములు పెక్కింటిని రచించినట్లు తెలిపియున్నారు. 'విప్రసందేశమ'ను నాటకము ఒక్కటియే లభించినది. రచనాకాలము 1911. ప్రచురణ 1930

వీరు తాము నాటకములను గూర్చిన వివరములు ఇట్లు తెలిపిరి.[1] మొత్తము ఏడునాటకములు రచించినట్లు పేర్కొనిరి. అవి '1. పురుష సింహుడు 2 విప్ర సందేశము 3. విప్లవరసపుత్రము 4 త్రేతాయుగాంతము 5. యయాతి 6. ప్రేమ చిత్తు 7. వియోగ విజయుడు' అనునవి. వీనిలో విప్రసందేశము కాక మిగిలిన వానిని గూర్చి కవి చెప్పిన వివరములు తప్ప మరేమియు తెలియరాలేదు. అవన్ని యును అలభ్యములే.

తాను నాటకములు వ్రాయుటకు కలిగిన స్ఫూర్తిని గూర్చి వారిట్లు తెలిపిరి.[1] "ఆరోజుల్లో బహుళంగా చిలకమర్తివారి గయోపాఖ్యానం, బ్రహ్మాండంగా వడ్డాది వారి వేణీ సంహారం, చక్కగా కందుకూరి వారి శాకుంతలము, నిక్కపు జూపుగా శ్రీపాదవారి బొబ్బిలి నాటకము రంగస్థలముమీద నటకావతంసులాడి చూపిస్తూవుంటే, నాటకాల మీద నాటకాలు ఎవరికి వ్రాయ బుద్ధిపుట్టదు? ప్రక్క ప్రక్కల్ని దత్త మండలపు జిల్లాలనుండి చిత్రనళీయం, తూర్పుజిల్లాలనుండి కన్యా శుల్కం నూతన రుచులూరిస్తుంటే తెల్లవారని రాత్రులు కూడా బళ్ళున ఇట్టే తెల్లవారి పోతాయి. అలాంటి ఎగువుల్లో వ్రాసిన నాటకాలనుకోండి నావి చాలా భాగము "

అలభ్యములగు నాటకములను గూర్చిన వీరు ఇచ్చిన వివరములు.—"పురుష

---

[1]—నేను వ్రాసినవేమిటంటే నాటకాలు-కవి కొండల, దేశసేవ

సింహుడు అనునది 1913లో పూర్తి రూపం దాల్చినా దాని ఇతి వృత్తం ఏ కారణం చేతనో 1916-17 లో నవలా రూపం ధరించి నాటకాన్ని వెనక్కు నెట్టింది. ఈ నవల 1918 లో "విజనసదనం" అను పేరుతో "ఆంధ్ర సేవ" అను పీరికాపుర పత్రికలో అచ్చుపడి సశేషంగా వుండిపోయింది. రెండవది "విప్లవ రసపుత్రము". నలుగురికీ తెలిసేపేరు సంయుక్త. చరిత్రలో కొంత మార్చి "లియర్" మానసిక పరివర్తనము జయచంద్రునికి కలిపించాము. సంయుక్త నొక విధముగా "కార్డీలియా" లా తయారుచేశాను. రసపుత్ర శౌర్యము మన భారతీయ జాతియొక్క జన్మహక్కు తరువాతిది 'త్రేతాయుగాంతము' ఇది భవ భూతి సంస్కృతమున రచించిన 'ఉత్తర రామ చరిత్రము' నాధారముగా రచింప బడినది. ఇది విషాదాంతము గాక కల్యాణాంతము గాక దివ్యస్మృతిగా తేలింది.

'వియోగ విజయుడు' అను నాటకము ఊర్వశీ వృత్తాంతమును దెల్పునది. ఆరోజుల్లో ఒక అంకము మాత్రము 'ఆంధ్రభూమి' అను పత్రికలో ప్రచురింప బడినది 'యయాతి' అను నాటకము భారతము నందలి ఇతివృత్తము నాధారముగా గొని రచింప బడినది. చివరిది 'ప్రేమచిత్తు' అను సాంఘిక నాటకము. 'ఢంకా' అను పత్రికలో కొన్ని రంగములు మాత్రము అచ్చు గావింపబడినవి. ఇది కొద్ది పద్యములతో, హెచ్చువచనముతో సాగిన నాటకము." పైవిషయములు పరిశీలించిన వీరి నాటకములు చారిత్రకములు. పౌరాణికములు, సాంఘికములు అని తెలియును.

ఇవి గాక 'తారాశశాంకము' అను నాటకమును వ్రాయుటకు వీరు ముప్పది మూడు రంగములతో ఒక ప్రణాళికను సిద్ధము చేసికొనిరి. ఆ వ్రాత ప్రతి శిథిలమై లభించినది. అది 1937న తయారు చేసికొనినట్లు, ఆ వ్రాతప్రతిలో తెలిపిరి. కాని ఈ నాటక రచన గావించినట్లు తెలియరాలేదు.

వీరి ఉపలబ్ధ నాటకము విప్ర సందేశము, ఈ నాటకమును భార్యకు అంకిత మిచ్చిరి.

నాటకమున కూడ

"పెండ్లికివి ముందు నగరము వెలువడియట
గౌరినిం బూజసేయంగ ( గన్నెయేగు
వాడుక కలదుగాదె గోపాలుఃయంత
వచ్చి కొని పొమ్మటంచును బలికెననుడు" (విప్రసందేశము)

— అని కలదు.

నాటకమునకు ఈ నామ ముంచుటకు కారణమునిట్లు తెలిపిరి, 'విప్రసందేశపు గాథ రుక్మిణీ కల్యాణ గాథే। రుక్మిణీ కల్యాణము పాత పేరువుంటే నలుగురూ చూడ రేమో అని విప్రసందేశము అన్నాను. 'పోతనామాత్య మాత్యుని భాగవతము' కథాసరళికి మలమని తెలిపిరి.

విప్రసందేశమును అయిదు అంకములుగ విభజించిరి. పురాణమైన పోతన భాగవతములోని రుక్మిణీ కల్యాణ ఘట్టమును రసవంతమగు దృశ్య కావ్యముగ మలచుటచే కొన్ని మార్పులు ఆవశ్యకమయ్యెను. ఇట్టి మార్పుల వలన కథకు నూత్నతను ఆపాదించి సామాజికులకు కుతూహలమును కలిగించును అయినను భాగవతాను సరణమే అధికము.

**స్వతంత్ర కల్పనలు:-**

రుక్మిణి కృష్ణుని కంపిన సన్నివేశమున కొన్ని కల్పనలు చేసిరి.

భాగవతమున రుక్మిణి అతిధిజనుల వలన కృష్ణుని రూపబలగుణాదులు విని అతడే తనకు తగిన విభుడని తలంచును.

కానీ నాటకమున కృష్ణుని రుక్మిణి చిన్న నాటినుండి ఎరిగివున్నట్లు కల్పింప బడినది.

"వెనుకి విచ్చటి కేగుదెంచునెడ నిన్వీక్షిం చికాంక్షించితిన్" అను రుక్మిణిపలుకులచేతను, "ఆ సౌహృద వక్తృముందు అనేక మ్మాఱులు మన గృహమున కేతెంచిన వాడు" అను విప్రుని మాటల వలనను, "మొన్న మొన్నటివరకు మీ గృహంబున కేతెంచినప్పుడెల్ల నాల్గు చివర నాడియు మదభీష్టంబెఱిగింపనైతి నీకు" అను కృష్ణుని వచనముల వలన కృష్ణుడు కుండిన పురమునకు పోవు చుండెడి వాడని, అట్టి కతముననే వారిరువురి మధ్య అనురాగము పెంపొందినట్లుగ కల్పింపబడినది.

భాగవతమున రుక్మిణి కృష్ణునకు సందేశమును పంపనెంచి "అన్న తలంపుఁ దానెఱింగి యన్నవ నీరజ గంధిలోచన నాపన్నత నొంది యాప్తుఁడగు బ్రాహ్మణు నొక్కని జీరి" అని కలదు. కాని నాటకమున చెలికత్తె వచ్చి రుక్మిణితో "నీకై యుపాధ్యాయులు వెదకుచుండ నీవిచ్చటొంటిగ నుంటివే" అనును. ఇట్లు బ్రాహ్మణుడే ఆమె కొరకు వెదకి కొని వచ్చినట్లు మార్పు చేసి రుక్మిణి పాత్రను ముగ్ధగ, ఉదాత్తముగ చిత్రించిరి.

---

1. నేను వ్రాసిన వేమిటంటే నాటకాలు-కవికొండల, దేశసేవ

భాగవతమున రుక్మిణి విప్రునితో మొదటనే సందేశమును విన్నవించును. నాటకమున రుక్మిణి "మీ వలన నాకొక మహోపకారము కావలసి యున్నదని" మాత్రమే పలుకును. అంత విప్రుడు ఆమె మనోగతము నెరిగి "వాసుదేవున కేమైన సందేశము గొంపోవలయునా" అని తనంత తానే ఆ ప్రస్తావన తెచ్చుట ఎంతయో ఔచిత్యముతో ఒప్పినది.

రెండవ అంకమున మొదటి దృశ్యము నందలి పూర్వ భాగము పూర్తిగ కల్పితము. కృష్ణుడు రుక్మిణీదేవి సౌకుమార్యమును, సౌందర్యమును తలచి విరహముతో తపించినట్లు వర్ణించు దృశ్య కావ్యమున శృంగార రసపోషణము చేసిరి.

సుమతి పాత్ర కల్పితము కృష్ణునకు అనంగు చెలికానిగ, విదూషకునిగ ఈ పాత్ర హాస్యరసపోషణమునకు దోహదమొనర్చినది.

విరహముతో తపించుచున్న కృష్ణునితో సుమతి "జరాసంధాదు లుండగ రుక్మిణినెట్లు గ్రహింతు"వని అడుగ "వారి నెదిరించి రాక్షసవిధిని రుక్మిణిని గైకొందు"నని కృష్ణుడు సమాధానమిచ్చును. భాగవతమున రుక్మిణి తన్ను రాక్షస విధిని గొంపోవు మని వార్త పంపును కానిఇట కృష్ణుడే ముందుగా అట్టి నిర్ణయమునకు వచ్చినట్లు మార్చి రుక్మిణి పాత్రకు మెరుగు దిద్దిరి.

మూడవ అంకమున బ్రాహ్మణుడు వచ్చి కృష్ణుని రాక తెలుపగా జరాసంధుడు యుద్ధమునకు సంసిద్ధులు కావలయునని తలంచును ఈ కల్పన వలన తరువాతి అంకమున జరుగబోవు యుద్ధము సూచితము.

నాలుగవ అంకము మొదటి దృశ్యమున కాళికాలయములో జరాసంధ కృష్ణులకు మధ్య దేవీపూజను గూర్చి చర్చ జరిగినట్లు కల్పన చేసిరి దీనివలన బలులను, హింసాత్మక క్రియలను సమర్థించు జరాసంధుని విధానములు, కృష్ణుని సాత్త్విక పూజా విధానమును స్పష్టపరుపబడినది దృశ్యకావ్యమున యుద్ధముపరిహరింప దగినది. కావున ఐదవ అంకమున ఇరువురి యోధుల మధ్య సంభాషణ మూలమున యుద్ధ విషయము తెలియును.

కృష్ణుడు రుక్మిణిని పరిగ్రహించు సందర్భమున "ఆర్య సమ్మతముగ మత్ప్రియాంగనా మణిన్ గ్రహించు చుంటి కయ్యమందు బోరగా సహింతురేని రండు" అనుటలోను నాయకుని ధీరత్వము సుప్రకటితమైనది.

నాటకమున శ్రీకృష్ణునిచే పరాభవింపబడిన రుక్మి తన పురమునకు వెడలి పోయినట్లు కలదు. నాటకము మంగళాంతమగుటకు రుక్మిలో పరివర్తనము వచ్చినట్లు చూపిరి. రుక్మిణీ కళ్యాణముతో సుఖాంతముగ నాటకము ముగియును.

ఇట్లు ఈ నాటకమున చేయబడిన కల్పనలు మూలమునకు భంగము కలుగకుండ, దృశ్యకావ్యమునకు అనుగుణముగ, రసోచితముగ నున్నవి.

సన్నివేశ నిర్మాణము:-

దృశ్యకావ్యములు సాధారణముగ ప్రఖ్యాతమగు కధనాధారముగ చేసికొని రచింపపడును. మూలకథలోని కొన్ని ముఖ్య ఘట్టములను రచయిత నాటకానుగుణముగ నుండు సన్నివేశములుగ నిర్మించును, రచయిత ప్రతిభ సన్నివేశ నిర్మాణమున కనిపించును.

మొదటి అంకమున మొదటి సన్నివేశము మూలమున బంధువులందురు బాలికను కృష్ణునికీయ దలచినను రుక్మి వ్యతిరేకించెనను విషయము నాధారముగ నిర్మింప బడినది రెండవ దృశ్యము రుక్మిణి విప్రుని ద్వారమున కృష్ణునికి సందేశమును విశదమొనర్చుటకు ఉద్యానవన సన్నివేశము కల్పితము. కృష్ణునకు రుక్మిణిపైగల గాఢానురాగమును వెల్లడిచేయుటకు రెండవ అంకమున ఉద్యానవన ఘట్టము, సుమతి, కృష్ణుల మధ్య సమావేశము తోడ్పడినది రెండవ దృశ్యము నందలి బలరాముని కొలువుకూట సన్నివేశము మూలము నందలి "హరియొకదేగినాడు మగధాదులు చైద్య హితానుసారులై" అనునొక పద్యము నాధారముగ నిర్మింపబడినది. మూడవ అంకమున రుక్మి శిశుపాల జరాసంధుల సమావేశ సన్నివేశము వలన ఆ దుష్టత్రయపు కుటిల తంత్రములు స్పష్టమగును. రామకృష్ణుల రాక ఎరిగి యుద్ధ సన్నాహములు చేయుదురు.

రుక్మిని ఓడించి, పరాభవించి, పశ్చాత్తప్తుని చేయుటకు నాలుగవ అంకమున రెండవ దృశ్యమునందలి సన్నివేశము నిర్మింపబడినది

చివరి అంకము రుక్మిణీ కళ్యాణ శుభ ఘట్టముతో. కృష్ణుని భరతవాక్యముతో కావ్యము మంగళాత్మకమైనది.

పాత్ర చిత్రణము:-

పాత్ర చిత్రణము నాటకమున కాత్మ వంటిది. పాత్రల స్వభావ నిరూపణ మందే నాటక గౌరవ మాధారపడి యుండును. ఇది నాటకోచితముగాను, రసాను గుణముగను నుండవలెను. కథాసంవిధానమునకు, పాత్ర పోషణమునకును అవినా భావ సంబంధ ముండవలెను.

ఈ నాటకమున నాయకుడు కృష్ణుడు నాయిక రుక్మిణి. భీష్మకుడు, రుక్మి, జరాసంధుడు, శిశుపాలుడు, బ్రాహ్మణుడు' బలరాముడు, సాత్యకి, అక్రూరుడు తదితరులు ముఖ్య పాత్రలు

నాంది పద్యములో "జతలొనరించి దంపతుల సౌఖ్యము దేల్చెడు మాధ వుండు" అని నాయకుని ప్రస్తావన గలదు తరువాత ప్రస్తావనలో "శరణుసొచ్చిన భక్తులం గరుణతోడ, నెపుడు రక్షించు ధీశాలి" అనుటచే కృష్ణుడు ధీరుడని, కరుణా మయుడని, శరణాగత రక్షకుడని సూచింప బడినది.

రుక్మిణి యొద్దనుండి సందేశమును గొనివచ్చిన విప్రునకు నమస్కరించి "మీ దర్శనమున నేధన్యాత్ముండనైతి" ననుటలో కృష్ణుని వినయము ద్యోతక మగును. ఆ సందేశమును విని ఏకాకిగ బయలుదేరిన అతని చర్యలో అసహాయ శూరత వ్యక్తమను ఆ పన్నయగు రుక్మిణినాదుకొనుటలో అతని అనురాగమే గాక ఆర్తత్రాణ పరాయణత వెల్లడియగును. కృష్ణుడు ధీరోదాత్త నాయకునిగా చిత్రింప బడెను

రుక్మిణి నాయిక ముగ్ధ రూపవయోలావణ్యముల ప్రసిద్ధి గాంచినది. "విమలగుణయై యొప్పు విద్యచేత" అని కృష్ణుడు కొని యాడిన మాటలలోను "గుణగణంబులకోవ రుక్మిణి, శుభాంగి" అను సూత్రధారుని పలుకుల చేతను ఆమె విద్యావతి,వినయవతి, సద్గుణవతి, శుభలక్షణ సంపన్న అని తెలియును.

"పదునాలు వన్నియ పసిడి పుత్తడి బొమ్మ, సొంపెదనింపు ప్రాయంపు గొమ్మ మెత్తనమాటల మెప్పించు శుకవాణి, కలుములు వెదజమ్ము కమలపాణి" —— అను కృష్ణుని స్మరణములో ఆమె వయో లావణ్యములు, ఆమె మృదు భాషణము తెలియును. విప్రుని సందేశము వినిన కృష్ణుడు "ఏమి ఆ సుగుణవతి బుద్ధి కుశలత' విద్యాచతురిమ, నాపై ననురాగము" అని కృష్ణుడు తలపోయును.

ఆమె భక్తిపరురాలుగ చిత్రింపబడినది. దుర్గాలయమునకు వెడలి దుర్గా స్తోత్రము చేయును, "వికలితనై వేడితినన్ సుఖపెట్టెదో దుఃఖ పెట్టెఁ జూచెదో యంబా" అని సకల భారమును దేవికే వదలి వేయును.

ఈ విధముగ తదితర పాత్రలు గూడ కథానుగుణముగ, రసోచితముగ తీర్చి దిద్ద బడినవి.

రసము :-

కావ్యము రస ప్రధానమై యుండవలెను. కథాసంధానమునకు, పాత్ర పోషణముతో ఎట్టి సంబంధము కలదో, రస పోషణముతో గూడ అట్టి సంబంధము కలదు. భాగవత కథకు చేసిన పరివర్తనములు రసోచితముగ నున్నవి ఇందు వీర, శృంగారములు ప్రధానముగ పోషింప బడినది. భక్తి, హాస్యములు అటనట కలవు.

నాంది పద్యము "నిసర్గపు సత్ప్రణయాంకుర స్పృహన్ సతులు బూరుషుల్ వలపెసంగఁ బరస్పరమున్ వరించుకో" అనుటలోను, "దంపతుల సౌఖ్యము దేర్చెడు మాధవుండు" అనుటను బట్టి శృంగారము యొక్క ప్రాధాన్యము చూప బడినది ప్రస్తావనలోని వసంతఋతువర్ణనము కూడ శృంగారరస సూచన కావించు చున్నది. నాయికా నాయకులు వియోగ వ్యధతో కుందునపుడు విరహ వర్ణనము గావించును.

"కన్నులార యలసన్నుతాంగుడు సూడ మీ చంచలత్వంబుడాచరాదు

చరణంబులారః యా మందస్మితుఁడు డాయ మందయానంబును మానరాదు"

అని రుక్మిణి కృష్ణుని వీక్షించినచో తన శరీరము సాత్త్విక భావముల ప్రకటించి లోకమునకు తన స్థితి వెల్లడి యగునని భయపడును.

వీరము :-

"ఖలుడు చైద్యుడు గొంపోవదలచెననుడ; శీఘ్రమే వచ్చి నన్ను రక్షింపు మనుడు" అను రుక్మిణీ సందేశమును విని కృష్ణుడు రోషముతో "నిను జేఁబట్టఁగ నెవ్వఁడా కుటిలుడా నీచుండు చైద్యుడు దా ననుమానింపకెట్లు తర్లి కదలున్ హర్య క్షముం బోలినేఁ గొనిపోవంగను వేచియుండ . యిదే శీఘ్రంబుగా వచ్చెనన్" అనుటలో అతని పరాక్రమము, వీరత్వము వెల్లడియగును.

భక్తి-:

అక్రూరుడు 'సాత్యకితో కృష్ణుడు మనతో ఆలోచింపక ఏగెనని యేంత మాత్రము చింతిల్లంబనిలేదు' అనుచు.

"కరిరాజు మకరిచేఁ గడగండ్లబడి కూయ వెలదికిఁ దెల్పకే వెన్నుడరిగె

ప్రహ్లాదుఁ దనతండ్రి బాధింపగాఁ జూచి స్తంభమందుదయించె దనుజవైరి" అని, అట్లే రుక్మిణిని ఆదుకొనుటకై ఆర్తత్రాణ పరాయణుడు అరిగి ఉండునని భక్తితో తన్మయుడగును

రుక్మిణి గౌరీదేవిని ధ్యానించి

"సకలజ్ఞవు పరిపూర్ణవు, అకలంకివి

వికలితనై వేడితినన్, సుఖపెట్టెదో దుఃఖపెట్ట జూచెదో యంబా" అని మనస్ఫూర్తిగ జగదంబను నమ్మి నిశ్చల చిత్తయైయుండును

సుమతి పాత్ర ద్వారా హాస్యరసము పోషింపబడినది కథానుగుణముగా కావ్యము నందు రసపోషణ గావింపబడినది ఇట్లీ నాటకము ఆద్యంతము రసవంతమై ఒప్పినది.

## 2. ఏకాంకికలు

ఏకాంకిక అధునికాంధ్ర సాహిత్యమున ఆంగ్ల ప్రభావముతో వెలసిన ప్రక్రియ ఇది నాటికగ ప్రాచుర్యము నొందినది. ఏకాంకిక అనగా ఒకే అంకము కలది అని అర్థము. ఒకే అంకమున రెండు మూడు రంగములు కూడ ఉండును

కవికొండల భాణములు, ప్రహసనము, ఏకాంకికలను రచించి అన్నిటిని ఏకాకింకలుగనే వ్యవహరించిరి. అత్యధిక సంఖ్యలో రచింప బడిన వీరి ఏకాంకికలు చాలవరకు ఆకాశవాణి విజయవాడ, మద్రాసు కేంద్రములనుంచి ప్రసారితములై మిగుల ప్రాచుర్యమునొందినవి. వీనిని శ్రవ్యనాటికలన వచ్చును

### 1. భాణములు :

భారతీయ సందేశము, అనాధాభ్యుదయము, అభినవ విద్యార్థి అను మూడు భాణములను వీరు వ్రాసిరి. అందు అభినవ విద్యార్థి అనునది అలభ్యము

భారతీయ సందేశము; దీనిని గూర్చి కవికొండల ఇట్లు తెలిపిరి "పెద్ద నాటక మొకటి నేను వ్రాయుటకుముందు భాణం ఒకటి 'భారతీయ సందేశం' అనే చిన్న దాన్ని 1911లో రచించినట్లు గోచరిస్తుంది అయితే స్వరూపంలో సంస్కృతంలో వెలువడ్డ భాణానికి తేడా కనిపిస్తుంది. ఒకే అంకం గాకుండా పెక్కు రంగాలుగల ఒక అంకం గావడం, రెండు శృంగారం వర్ణించకుండా దేశభక్తిని ప్రబోధించడం, పోలిక ఉత్తమపురుషలోనే నిర్వచనము గావించడం,గద్య పద్యాత్మకంగా ఉండడం.

ఇది 'మానవసేవ' పత్రికలో ప్రచురితమై తరువాత పుస్తకరూపము దాల్చి నది. ఇందు నాలుగు రంగములతో కూడిన ఒక అంకము గలదు విషయము దేశ భక్తి ప్రబోధము. నాయకుడు దేశభక్తుడైన భారతీయుడు

వివిధ దేశములు తిరిగి భారతదేశమునకు వచ్చు భారతీయుడొకడు తన దేశమును తలచి గర్వించును తన జన్మభూమిఅగు భారతదేశము అతని దృష్టిలో సర్వశ్రేష్ఠముగ దోచును

"—— — — ——————
యెల్ల సంపదలకుఁ బుట్టినిల్లు వీవ
యిమ్మహీస్థలికినిఁ బట్టు గొమ్మవీవ
మాతరో! నిన్ను మఱువంగ మాతరంబె"

ఇట్టి దేశభక్తి, విదేశముల ద్వేషించునట్టిదిగ నుండరాదని బోధించుచు విదేశయానము అవశ్యకమని చాటును "వారి వివిధ కళా విద్యాప్రావీణ్యము, వారి యుదార స్వభావంబులు, వారి సంపదలు మన దేశీయుల కెప్పుడు పట్టు వడునా" అని చింతించును మాతృదేశసేవ ఒనర్చుట చేతనే మనజన్మము సఫలమగునని బోధించును

"శరణన్న వారిని కరుణతోఁ బ్రోచిన
యతులరాముఁడీ దేశమందు బుట్టె
జనకునికై బ్రహ్మచర్యముఁ బూనిన
యా భీష్ముఁడీ దేశమందుఁ బుట్టె"

అని మహామహులు పుట్టిన దేశమున, అట్టి వీరులుద్భవింపవలెనని ఆశించును అతడు పురమందిరములో వేదికనెక్కి ఉపన్యసించుచు నిరక్షరాస్యతా నిర్మూలనము గావించి స్త్రీ జనోద్ధరణ గావింపవలయునని సూచించును. మత

సామరస్యముతో గృహ, సాంఘిక జీవితములు సుస్థిరముగ నుండుటకు ప్రతి భారతీయుడు కృషి ఒనర్పవలయునని చాటును.

ఇది దేశభక్తిని ప్రబోధించుచు సంఘ సంస్కరణమునకు దారి చూపినది.

రెండవ భాణము 'అనాథాభ్యుదయం' రచనాకాలము 1911 ఇందు మూడు రంగములు కలవు యౌవనవతియగు వితంతువు ఏకపాత్రాత్మకముగ నున్నది వితంతు సమస్యలకు దర్పణము చూపినదీ భాణము

'సుమ శయ్యల జేరి సుఖియింప దగుమేను
బండనేలల నిట్లు పండవలసె
సరస సల్లాపంబుల్ సలుప దగిన జిహ్వ
యార్తనాదంబుల నార్వవలసె" — అనియు

"ఆటపాటల నాడి యార్తి వీడెదనన్న. తోడివారలు నన్ను గూడరారు" అనియు శుభకార్యములకేగి శోకమార్పెదనన్న, నందులకు నాకు నర్హతలేదు' అని తన దుస్థితికి దురపిల్లును. "తెల్లవారకుండేమి మునిగిపోయినటులీ వెదురైతి నేడు నాకుఁ గీడేమి ఘటస్థించునొకద' అని తనసీనడించు తండ్రిని తలచి కుమిలి కుమిలి ఏడ్చును

వితంతువు ఈ పాట్లు పడలేక జీవితముపై రోసి ఆత్మహత్యకు కడంగి చివరకు ధైర్యము చాలక విరమించును దీని మూలమున ఆత్మహత్య మహాపాతక మని బోధింపబడినది. జాగృతిని పొందిన ఆమె విద్య నేర్చి బాలబాలికలకు విద్య బోధింపవలయునని, వైద్య శాస్త్రమున ప్రావీణ్యత గాంచి వ్యాధి పీడితులకు సేవ జేయవలయునని సకల కళా ప్రపూర్ణయై నెలతలకు నేర్పవలయునని, సర్వ మతసారమును గ్రహియించి పామరులకు బోధపరతునని యెంచును. అట్టి దీక్షతో తనవంటి స్త్రీలను కలుపుకొని దేశాటనము గావించుచు ఆమె సఫలయై పలువురు స్త్రీలను ఆయా రంగములలో ప్రవీణులను గావించును.

ఇట్లీ భాణము వితంతువులకు కర్తవ్యబోధ గావించుచు, వారి దయనీయస్థితి నెత్తిచూపి సంఘములో చైతన్యము కలిగించునట్లున్నది.

2. ప్రహసనము:

కల్లికొండల "కోనేరు" అను ప్రహసనమునొకదానిని రచించిరి, ఇదిసంస్కృతిక

ప్రహసనమునకు భిన్నముగ నున్నది రచనా కాలము 1923న స్ఫురణ నరసాపురము.

దీనినిగూర్చి కవికొండల ఇట్లు చెప్పిరి "కోనేరు అనే చిన్న పాత్రములోని పాటనొకదాన్ని అష్టదళ పద్మంగా ఇప్పటికీవిద్యార్థినులు కోలాటం వేయగలరు! మరీన్నీ ఆ రూపకంలోని సంభాషణ సహజమైన హాస్యరసాన్ని వెలువరిస్తూ నీతిని బోధించేది. బాలికల కెంతేని పరనార్హమని సద్విమర్శకుల యభిప్రాయము ఇది హాస్య మిశ్రితమైన నీతిబోధ"

ప్రధాన పాత్రదారులు సత్యవతి, వరహా వీరుగాక పలువురు స్త్రీ పాత్రలు కలవు.

ఇందు సాధారణ సంసారుల చిక్కులు, అత్తాకోడళ్ళ తగవులు, పల్లెటూళ్ళలో పని పాటలు లేక తిరుగు స్త్రీలు, అక్షరజ్ఞానములేని పల్లె పడుచులు విద్యాధికులను చేయు ఆక్షేపణలు, అక్కడగల మంచినీటి కొఱత, చెఱువుల వద్ద నుండు అనారోగ్య పరిస్థితులు మున్నగున వెన్నియో ప్రదర్శింపబడినవి.

తెలుగుదేశములోని పల్లెటూరివాతావరణమును ఇందు సహజ సుందరముగ చిత్రించును పుల్లమ్మ అనుస్త్రీ "కళ్ళపోట్లు! ఎర్రగా ఎరుపులు" అనగా సావిత్రి "జోడెట్టుకుంటే కుదురుతుంది" అని సలహా నీయగా నామె "అఁ చెప్పుల జోడే" అని విస్తుపోవును దీనినిబట్టి ఆమెకు లోకజ్ఞానమెంత శూన్యమో తెలియును. ఇక సావిత్రికి కళ్ళజోడును గూర్చిన పరిజ్ఞానమున్నను ఆమె దృష్టిలో అది యొక ఆభరణము క్రిందనే లెక్క. కనుకనే "కళ్ళజోడు! ముక్కుమీద మెఱుస్తుంది రెండు కళ్ళను ధగధగలాడి పోతూ ఉంటుంది. చెవులకంటా సింగారిస్తుంది" అనును.

సత్యవతిని ఆదర్శస్త్రీగ రచయిత మలచెను వెంకమ్మ అనునామె సత్యవతి ఆదర్శ దినచర్యను మెచ్చుకొనును

స్త్రీలందరు ఆమెవలె నడచుకొన వలయునను ప్రబోధము కలదు.

స్త్రీలకు శుచి శుభ్రతయొక్క ఆవశ్యకమును తెలుపును కోనేటిలో బట్టలుతుకుటకు ప్రయత్నించు స్త్రీలను కోనేరు కాపలావాడు నిరోధించును వారు వినక పోవుటచే సత్యవతి వారికి నచ్చ చెప్పును

ఖాసాధ శోభను గాంచి సత్యవతి పరవశించి

'ఆహా! ఈ కాసారము-మోహన జలపూరము
అందమైన తామర పూలిందు విచ్చుమాయగా
మందముగను బైరుగాలి-యందుకొనడం హాయిగా' - అని పాడుకొనుటలో రచయితకుగల ప్రకృతి ప్రియత్వము గోచరించును

భగవంతుని నమ్మి కొలుచుట వలన జరుగు మేళ్ళను చెప్పి అందరు ఆస్తికులు గావలెనని ప్రబోధించును. శివుని పూజకొఱకు సత్యవతి తమ్మిపూవులు కోయుచుండ వరహాయనునామె వానిని గూర్చి ప్రశ్నించును. అందులకామె, "ఇవి పార్వతీ పరమేశ్వరులకు ప్రీతికరములై, ధవళ, నిర్మలినములై, వినయ విధేయతల కుదాహరణములా అన్నటుల ఆకు చాటున అణగి మణగి యుండు తమ్మి పువ్వులు" అని చెప్పును. ఈ పలుకులు తమ్మి పూవులవలె మనస్సును భగవంతున కర్పితలము కావలయునను సూచన కలదు సత్యవతి జడలోని పూవులేమిటని వరహా అడుగగ ఆమె "అవి యిచ్చకొలది పేద యిల్లాండ్రు సయితము గోసికొని కొప్పులందున ముణుచుకొను పచ్చగన్నేరు పువ్వులు కొన్ని, వేకువనే లోక బాంధవుని విలోకించుచు నతి సుందరంబుగ వికసించి సువాసనరహించు నెర్రతామర పూరేకులు కొన్ని" అని చెప్పును

భగవంతుడు సర్వాంతర్యామి యనుటనిట్లు చాటును. "ఇంటిపద్దగల చిన్న పూలతోటలో మల్లి, నిత్తెమల్లి, బంతి, చామంతి, మందారము, మంకెన్న, జాజి, విరజాజి, నీలగోరింట, నీలాంబరము విరియ బూచి పరమాత్మయొక్క అపారమైన ప్రేమను ప్రకటించుచుండగ ఆ పూలపై పడుమంచు నీటిబిందువుల ముందు పన్నీరెందు కనిపించును. రేకులపైని రంగుల ముందు కల్లబొల్లి సింగారాలు సిగ్గుగొనును" అని భగవంతుని సృష్టితో సరిపోలునది ఏదియు లేదని చాటును.

చైతన్యవంతమగు ప్రకృతిలో తొణికిసలాడు భగవత్స్వరూపమును మానవుడు గుర్తింపవలయుననిన మొదట శిలయందు భగవంతుడున్నాడను నమ్మకముండిన చాలునను భావమును చాటును నాగరికతా వ్యామోహమున నలిగిపోవుచున్న మానవునికి ఆస్తికత కలిగించుట వీరి ఉద్దేశము. చివరకు సత్యవతి బోధలతో స్త్రీలందరు తామును ఆదర్శస్త్రీలవలె చరించుదుమని నిశ్చయించుకొని పాట పాడుచుండగ ప్రహసనము ముగియును

ఇది స్త్రీలకు మార్గదర్శకమై యున్నదని స్త్రీ విద్య యొక్క ఆవశ్యకమును,

విరామకాలమును సద్వినియోగ పరచుటను, ప్రాచీన ఆచారముల సంప్రదాయముల యొక్క ప్రాశస్త్యమును ఇందు చక్కగ చాటిరి. సావిత్రి, సీత, చంద్రమతి, దమయంతి మున్నగు పతివ్రతామ తల్లుల ఆదర్శ జీవితము ఆధునిక స్త్రీలకును సరణయోగ్యమని బోధించిరి. ఇట్లు ఈ ప్రహసనము సంఘ సంస్కరణ స్త్రీ జనాభ్యుదయ దృష్టితో గావింపబడిన రచన.

## 3. ఏకాంకికలు (శ్రవ్యనాటికలు) :

కవికొండల ఏకాంకిక లక్షణములను, వానిని ప్రదర్శింప వలసిన తీరును గూర్చి ఇట్లు తెలిపిరి "వీనిని ప్రదర్శించినప్పుడు గాని వాని పూరాపస కన్పట్టదు అందాకా 'భావమున గాని జీర్ణమయ్యె సుభాషితంబు' అని మనమనుకోవలసిందే ఎంచేతా అంటే సంభాషణ ఏకాంకిక కానివ్వండి. అయిదంకాలది కానివ్వండి. ఏడంకాలది కానివ్వండి ఇద్దరి ముగ్గురి మధ్య నడుస్తుంది కథలా చదువుకు పొయ్యేదే కాదు ఖండ కావ్యంలా అర్థంగావించు కున్నంత మాత్రాన ఉండిపోయేది కాదు. ఒక మాటఅదదన్నట్టు, ఒకమాటు కోపంతో అన్నట్టు, ఒకమాటు నవ్వుతో అన్నట్టు ఎవడికి వాడు తన్మయుడై చదివితే ఏమోగాని. లేకుంటే ఇతరులు ఆడి చూపాలి వీటి నన్నిటిని, తెరమాట, లేజంమాటఏలావున్నా ఉచ్చారణయొక్క పొదుపు కావాలి అభినయం యొక్క అదుపు కావాలి ఈ ప్రవృత్తి యొక్క అవసరం కన్పిస్తుంది" వీరి ఏకాంకికలను కొన్నిటిని 'రామాయణ దంపతులు, భాగవత భక్తులు, ప్రబంధ పరిస్థితులు' అను గుంపులుగ విభజించిరి మరియొక తరహా ఏకాంకికలను వేరు చేసి వానికి "స్వైరిణీ గుళికలు" అని పేరుపెట్టిరి వానిని గూర్చి "కథానాయికలు అహల్య, తార, రేణుక, కుంతి, చిత్రాంగి, మొదలగువారు. ఈ తార వాలి భార్య కాదు. చంద్రుణ్ణి వలచిన తార వీటిల్లో 'కుంతి' రేడియోలో వినిపింప బడినది, మద్రాసునుండి ఒకప్పుడు రంగస్థలం మీద వీటిని ప్రయత్నించలేదు. ఆ మాటకొస్తే వేటినీ ప్రయత్నించలేదు ' అని చెప్పిరి "కుంతి నాటికల్లోని అంశములు—సూర్యభగవానుని కృపవల్ల కుంతికి కర్ణుడు జన్మించుట, గంగా కుంతీ సంభాషణ కుంతి పరిచారికనుబిడ్డను నదిలో వొమలునట్లు నిర్దేశించుట, తరువాత కర్ణునకు కుంతికి సంభాషణ, పిదప యుద్ధరంగమున వీర స్వర్గమందిన కర్ణుని గురించి ద్రౌపదిపౌగడ్త. "ఈ విషయము లన్నియు ఒక్క పది నిమిషములలో నాటకరూపమున ప్రసారము చేయబడినది" అని ఈ నాటికనుగూర్చి వీరు తమవ్యాసమున ప్రస్తావించిరి

'చైతన్య గుళికలు' అను శీర్షికను ప్రసారమయిన కొన్ని ఏకాంకికలనుగూర్చి రచయిత ఇట్లు తెలిపిరి "ఇవి ఊహా దృశ్యాలేమో" అని ఒక మిత్రుడు వీనిని గూర్చి పలికెను ఇవి 'అద్భుత కలశం, వేణువు, పూరిల్లు, అరుంధతీ నక్షత్రం' మొదలైనవి వీటిని గూర్చి నాలోనేను ఆలోచించుకుంటూ నిరంతరం నిమగ్నుణ్ని కాగలను. అంత సన్నిహిత మనిపిస్తాయి, ఆతీర్లు, ఆవార్లు, వేణువు అంటుంది 'అంతా చీకిపోయాను. ఇన్నాళ్ళనుంచి శ్రీకృష్ణుడు లేకపోవడం'చేత అని రాధ అదే మిటో చూస్తాను అని వూత్తుంది వేణువు అది 'నా ప్రారబ్ధం' అంటూ పగిలి పోతుంది వేణువు ప్రధాన పాత్రధారి అయిన నీఏకాంకికను ప్రదర్శించడం ఏలా. ఇలాంటి వ్యూహాలు పలికించవచ్చు ఏనాటికయినా దీని ప్రదర్శన సాధ్యమవు తుందేమో"అను ఆశాభావమును వ్యక్తము చేసిరి.

సాంఘిక ఇతివృత్తముతోకూడిన ఏకాంకికలు "తెరవెనుక బొమ్మ, ఇంకా కొంతకాలముంటాను, కొరంకొట్టు, గనడప్ప, హేరమ్‌లో భారత్, ఇంటర్ ఖాళీ, నియోక్లబ్బులకు రాజరాజనరేంద్రుడు" వీనిలోకొన్ని ప్రచురింపబడినవని తెలిపిరి

ఇవిగాక "కాలంమార్పు, కాగజ్‌కపడా, రఘు-రభసి, పొదిలి, తాతయ్య సుస్తీ, బుడుగునిద్ర, రైల్లో పెళ్ళిచూపులు మిత్రస్థాన్, తాతయ్య, సుభద్ర, అందరూ మేధావంతులే, గొంతెమ్మకోరిక, హనుమంతుని ప్రణయం, ఏరువాక, దేవుని పాలికాపులు, మూలనున్న ముసలమ్మ, గృహంనుండి శరణాలయము వరకు, జనాభా, చిన్నచిన్న వ్యాపారాలు, జై జై నై నై, మోటారుబేరము, పగటి కల కాదు, ఏడున్నరంటే ఎనిమిదన్నమాట, దారిప్రక్క పొలంమధ్య ఇల్లు (పంటచేలు)" మున్నగు ఏకాంకికలు రేడియోలో ప్రసారితములు. వీనిలో కొన్నిం టికి మాత్రమే వ్రాతప్రతులు లభ్యమైనవి

'రైలు ప్రయాణాలు, పొదిలి' అను రెండు ఏకాంకికలను గూర్చిన వివర ములు "రైలు ప్రయాణాలలో ఐదుస్టేషన్‌లు, ఐదురంగాలు తుదకురాజమండ్రిలో బయలు దేరిన ఆంధ్రుడు మద్రాసు చేరుకుంటాడు ఇందులో పాత్రపోషణ, తత్త్వాన్వేషణ, తగిన సంభాషణ కానవస్తాయి ఉభయకుశలోపరి వల్ల బాగోగులు తెలుపుడు కానవస్తాయి అయితే అక్కడ కథలో కన్న కాలంలో ఎక్కువ విలువ కనిపిస్తుంది" అని రచయిత వివరించిరి ఎన్ని రంగములున్నను అవి ఏకాత్మకలే. ఈ ఏకాంకికలలో గీతికలు కూడా కలవు.

'పొదిలి' అను రూపకములో ఒక సంభాషణగేయము వచ్చును. ఇది ఆ ఏకాంకికలోని పాత్రధారి 'పొదిలి' కి ఎక్సైజు కానిస్టేబిలుకు మధ్య నడచిన కథ ఆ సంభాషణ నుదహరించిరి 'రూపకమంతయు చదివినగాని ఉత్కంఠ తీరదు" అని వీరు తెలిపిరి.

ఇక లభ్యమయిన ఏకాంకికలు పది. 'రైల్లో పెళ్ళిచూపులు' అనునది చిన్న ఏకాంకిక పేరయ్య పంతులుకుటుంబము, వారి మేనమామ బలభద్రరావు కుటుంబము రైలు ప్రయాణము చేయుట ఇతివృత్తము హాస్యపూరితము రైల్లోనే బలభద్రరావు కుమారునికి, పేరయ్య పంతులు చెల్లెలుకు పెండ్లి కుదురును. ఇది ఆనాటి సాంఘికస్థితి ని చూపుచున్నది. 'అందరూ మేధావంతులే' అను ఏకాంకిక హాస్య భరితమయినది ఒక వితంతువు కుమార్తెకు వివాహము కుదురుట కథాంశము. పెండ్లికుమారుడు ఆతనితో వచ్చినవారు భయపడుట వారి పిరికితనము వర్ణితము ఆనాటి మూఢాచారములు విమర్శింపబడినవి 'ఏడున్నరంటే ఎనిమిదన్న మాట' అను ఏకాంకిక భారతీయులు కాలనియమము పాటించక పోవుటనుగూర్చిన కథ. 'మిత్రస్థాన్' అనునది ఉబ్బసవ్యాధి పీడితుడగు అసిరయ్య బాధను తెలుపును. డాక్టర్లు వారి కర్తవ్యమును మర్చిపోయి రోగిని పరీక్షింపక పోవుటను విమర్శించును. 'జై జై నై నై ' అనుదానిలో ఎన్నికలలో జరుగు అన్యాయములను వ్యంగ్యముగ విమర్శింతురు, పాలలో కల్తీ, ఎన్నికలప్పుడు మాత్రము అభ్యర్థులు కనుపించి వాగ్దానము చేయుట, హరిజన సమస్యలు మున్నగునవి వాస్తవికముగ చూపిరి గాజులసెట్టి కథను కరుణ రసాత్మకముగ చూపును రవీంద్రనాథ్ ఠాగూర్. రచన 'కాబూలీవాలా' అను కథకు దీనికి సామ్యములు గోచరించును

బుజుగు నిద్ర బాలలకొరకు రచించినది. పాటలతోకూడి వినోదాత్మకముగ నున్నది

'చట్టము–సమస్య' అను నాటిక భారతిలో ప్రచురింపబడినది. ఇది సాంఘిక సమస్యలకు పరిష్కారము చూపును. చట్టము, సంప్రదాయము ఎన్నడు ఏ సమస్యను పరిష్కరించలేవని, వ్యక్తియే సమస్యను పరిష్కరించు వాడని చర్చింతురు

'సమమట్టం' అను నాటిక కూడ భారతిలో ప్రచురింపబడినది సంఘములో అందరును సమానులుగ ఉండవలెననిచాటు నాటిక ధనవంతురాలైనపొరుగింటామెకు బొట్టుంచుచు "కుంకుమ బొట్టున్నది కొంతమందిన్తైనా సమమట్టానికి తీసికొస్తుందను

కుంటాము" అని భావించును సంఘమున అందరిని సమమట్టమునకు తెచ్చుట అసాధ్యమని రచయిత సూచించును. కాని పశుపతమ్మ బిడ్డ నల్లగ ఉన్నను తన బిడ్డను ముద్దుగొనుననని సంజ్ఞాలేఖిని అనుటతో అందులకు సదానందుడు "చివరకు బిడ్డలను ముద్దు చేయటంలో అందరూ సమానులే"అనును. ఇది సర్వ మానవ మానవత్వమును చాటుచున్నది

వీనిలో 'ఏడున్నరంటే ఎనిమిదన్నమాట', 'జై జై నై నై', 'కాగజ్ పకడా' మున్నగు ఏకాంకికల శీర్షికలు,' 'బంధూక, సంక్రందన శర్మ, సంజ్ఞాలేఖిని, సంభ్రమ సింగ్' మున్నగు పాత్రల పేరు విచిత్రముగ తోచును.

రేడియోలో ప్రసారితములై బహుళ ప్రచారము గాంచిన వీరి ఏకాంకికలు సంఘములోని వివిధ సమస్యలను చర్చించుచు సంఘ సంస్కారణకు దారి చూపుచున్నవి ఇట్లు ఇవి సంక్షిప్త సుందరములై, వినోదాత్మకములై రసభరితములై రక్తి కట్టినవి.

# వ్యాసములు

ఆధునిక యుగమున తెలుగు సాహిత్యములో విశిష్టమైన శాఖగ గుర్తింపబడినది వ్యాసము. ఇది ఆంగ్ల సాహిత్య ప్రభావమున మన భాషలోనికి వచ్చి చేరినది. మన ప్రాచీన సాహిత్యమున వచనమున్నను అది నేటి వ్యాసము వంటి ప్రక్రియ కాదు ప్రస్తుతము మనకు లభించు వచన వాఙ్మయములో వ్యాసములు, విమర్శలు, పరిశోధనలు ముఖ్యమైనవి.

కవికొండల వ్యాస రచనలో విశిష్టమైన కృషి ఒనర్చిరి. వ్యాసమును గూర్చి కవికొండల ఇట్లు తెలిపిరి.[1]

"వ్యాసం వ్యాసం అంటే ఏదో అల్లెయ్యడం కాదు. వల్లె వేయడం కాదు. ఇదేం పోటీ బేరంతో కూడినది కాదు ఇదంతా తత్త్వాన్వేషణ, సుజ్ఞానార్జన అని తెలుసుకోండి పేరాను పేరాను పెంచి తుదకో సారం తేలేదే వ్యాసం." ఇట్లు వీరు ఈ ప్రక్రియలోని విశిష్టతను, క్లిష్టతను తెలియజెప్పిరి. తాను రచించిన వ్యాసములు వందకు పైగా కలవని వీరు తమ వ్యాసములో తెలిపిరి.

సారస్వత విషయములను గూర్చి 'ఆంధ్ర భాషా వైదుష్యము మున్నగునవి ఒక పది వ్యాసములు, 'సారస్వతము' అను మకుటముతో సంగీత మెట్లుండ వలయునో సాహిత్యమెట్లుండ వలయునో మొదలగు విషయములతో మరియొక పది వ్యాసములను రచించినట్లు తెలిపిరి. 'తెనుగుందనము' అను పేర ఇరవై వ్యాసములు తరువాత రచించినట్లును వానిలో మొదటి పది వ్యాసములు పాత పుస్తకములు, గేయ గ్రంథములు చదువుట మీద ఆధారపడినవని, తక్కిన పది 'కావ్య వస్తువు- వైవిధ్యము' మున్నగు విషయములను తెలుపునవని వివరించిరి. 'జాతీయతను' స్ఫురింపజేయు వ్యాసములను వ్రాసిరి "నేను వ్రాసిన వేమిటంటే' శీర్షికను వీరు చేసిన పది ప్రసంగములు 'దేశసేవ'లో ప్రకటితములు 'జంటలు' అను పుస్తకములో పది వ్యాసములు ప్రచురింపబడినవి

1 'నేను వ్రాసిన వేమిటంటే సారస్వత వ్యాసములు— కవికొండల, 'దేశసేవ

ఇవిగాక ప్రముఖుల వార్షికోత్సవములలో వెలయించిన ఉపన్యాసములు, విద్యార్థుల సభలలో చేసిన ప్రసంగములు, సాహిత్య, సాంస్కృతిక సమ్మేళనావసరములలో ఒనర్చిన ఉపన్యాసములు పెక్కులు గలవు. ఇవి పిదప పలు పత్రికలలో ప్రచురింపబడినవి. ఇట్లు ప్రసంగములతో కలిపి వీరి వ్యాసములు వందకు పైగా కలవు ఇవి క్రింది పత్రికలలో ప్రకటింపబడినట్లు తెలిపిరి "దైనికాంధ్ర, భారతి, కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రిక, సంవత్సరాది సంచిక, ప్రజామిత్ర ఢంకా, ఆంధ్రమహిళ, ప్రజాబంధు, దేశసేవ, మాతృసేవ, ఆంధ్రశిల్పి, కిన్నెర, ఆంధ్రప్రభ, ఆంధ్రభూమి, ఆనందవాణి, నవజీవిక, యాజ్ఞవల్క్య, గోల్కొండ, ప్రబుద్ధాంధ్ర" మున్నగునవి

వీరి వ్యాసములను ప్రధానముగ ఆరు తెగలుగ విభజింపవచ్చును. 1. సారస్వత వ్యాసములు 2 వివరణాత్మకములు 3. నేను వ్రాసిన వేమిటంటే—శీర్షికను వచ్చిన వ్యాసములు 4. ఖంటులు 5. ప్రసంగ వ్యాసములు 6. సూక్తులు.

## 1. సారస్వత వ్యాసములు :

మన తెలుగు భాషనుగూర్చి, కవితా ప్రక్రియలను గూర్చి, జానపద కవితా తత్త్వమును గూర్చి, కవులను గూర్చి వెలయించిన వ్యాసములీ కోవకు చెందును.

1 ఆంధ్రభాషా వైదుష్యము 2 భావకవిత్వము 3 మనము—మన తెనుగు 4. తెనుగున నవీన కవిత్వము 5. ఆంధ్ర కవితా ప్రాశస్త్యము 6. అఖిలాంధ్ర సారస్వతము 7 తెనుగు బాస సంప్రతింపు 8 తెనుఁగు శైలి 9 మనము- మన తెనుగు 10 వువూ వావో సమస్య 11 వ్రాతకోతలు 12. భాషకు కావలసింది 13. కవితా ప్రశంస 14 ఆంధ్ర సాహిత్యంలో రామనామ సంకీర్తనలు 15 ద్విపద–రగడ– దండకము 16 వీధి నాటక వ్యాసంగము 17. శతకాది బహుళ సాహిత్యము 18. పద్య సాహిత్యము 19 పద్య పఠనము 20 గీతికలు–రచనా విధానము 21. తెనుగు కవిత 22 కావ్యవస్తువు- వైవిధ్యము 23. గేయ కవిత్వము 24 తెనుగు తీపి 25 వైయాకరణ నిబంధనాలు 26 తెనుగు భాషా చరిత్రము 27. తెనుగు వాఙ్మయము 28. ఆంధ్రదేశ జానపద గేయాల విలువ 29 జానపదగేయ చిత్రాలు 30. సారస్వత ప్రదర్శనము 31. గ్రంథ రచనము 32. సారస్వత విజ్ఞానము 33 జానపద గేయము 34 కవిత్వ తత్త్వము 35. కవితా ప్రపంచము 36. కవితా సాక్షాత్కారము 37 కవితా

ప్రపంచము 38 ఉద్దీ 39. నన్నయ తిక్కన ఛాసరు స్పెన్సరులా 40 వీరేశ లింగం పంతులు- సారస్వత సేవ 41 గురుజాడ వారి కవిత 42 అడివి బాపిరాజు 43. రవీంద్రనాథ్ టాగూర్ 44 ఉమర్ ఖయ్యాం 45 కూడ్లేరి ఆంధ్రహృదయం 46. జేకుమళ్ళ కామేశ్వరరావు 48. ఖండ కావ్యము - సింహావలోకనము మున్నగునవి.

వీనిలో కొన్ని వ్యాసములు మాత్రమే లభించినవి. వానిని గూర్చి పరిశీలించదమైనది.

'భావకవిత్వము'అను వ్యాసము భావకవిత్వము క్రొత్తగ ప్రచారము పొందుచున్న దినములలో వ్రాసిరి. 'భావము యొక్క కవితా స్వభావమే భావ కవిత్వమ'నిని చక్కని నిర్వచన మిచ్చిరి, "వెంకటరావుగారి నిర్వచనము అత్యుత్తమము, అగాధమునై యున్నద"ని పాటిబండ తెల్పిరి.[1] క్రొత్తయేదియైనను దానిని నిరసించుట పరిపాటి, కనుక భావకవిత్వమును బావ కవిత్వమని హేళన చేయుచుండిరని, దాని స్వభావమును తెలిసికొను అవశ్యకము గలదని నొక్కి వక్కాణించిరి చిన్న వ్యాసమైనను ఇది ముఖ్యమైన అంశములతో భావకవిత్వ మనగనేమో పాఠకులకు సుస్పష్టమగునట్లు విలక్షణముగనున్నది 'కవిత్వ తత్త్వము'నందు తత్త్వమను పదమును గూర్చి కూలంకష విచారణ జరిపి కవిత్వము యొక్క స్వభావమే కవిత్వ తత్త్వమని సంక్షిప్తముగ, సుబోధకముగ చెప్పిరి. దీనిపై ప్రాచ్య పాశ్చాత్యుల అభిప్రాయములను ఉదహరణములతో చూపిరి వీరి విస్తృత గ్రంథ పరనమునకు బహు భాషా పాండిత్యమునకిది మచ్చు తునుక అని చెప్పవచ్చును. కవిత్వము యొక్క తత్త్వమును బోధపరచుటకు మహా కవుల పద్యములను కొన్నింటిని ఎన్నుకొనిరి. పాఠకుని హృదయమునకు హత్తునట్లు ఏ విషయమైనను చెప్పుటలో రచయితకుగల ప్రజ్ఞ అసామాన్యము. ఇట్టి తత్త్వమును గ్రహింపవలయుననిన పాఠకునికి దృష్టి విభవము. ఇంద్రియ నిగ్రహము' వ్యక్తి వికాసము ఆధ్యాత్మిక ప్రశాంతి అవసరమని ముగింతురు 'కవిత్వము యొక్క విలువ' అనువ్యాసమున కవిత్వమునకు గల విలువను అలౌకికముగ రూపొందించిరి

[1] అధునికాంధ్ర భావ కవిత్వ తత్త్వము- పాటిబంధ మాధవశర్మ. పు-43.

'కవిత్వము ఒక మనః స్థాయి సత్యము, అహింస, శౌచము, శాంతి, ఇంద్రియ నిగ్రహము ఒక నొక యమూల్య మానసిక తత్త్వమే' అని నిర్వచన మిచ్చిరి. 'కవిత్వము లేదనుకొన్నను మనసునకు తట్టుట, మనకెందుల కన్నను డెందంబున కందళించునది, మనము నేర్వకున్నను నేర్చినట్లు స్ఫురించు నట్టి స్వయంసంపన్నతయే దాని విలువ, కలిమి' అని కవిత్వము విలువను నిరూపించిరి విస్తృతమైన విషయమును సరళముగ సంక్షిప్తముగ చెప్పుటలో వీరికి సాటిలేని నైపుణ్యము కలదు ప్రతివిషయమును స్వతంత్ర దృష్టితో చూచును.

'తెనుఁగు శైలి' లో పురాణకాలము నుండి నేటివరకు తెలుగుభాషలో వెలసిన వివిధ గ్రంథముల నుండిపత్రికల నుండి రసవంతములగు ఉదాహరణముల నిచ్చి ఆయాకవుల'ఆయాకాలముల తెనుఁగుశైలిని మన కనులముందు నిల్పుటకు యత్నించిరి. ఇట వీరి విషయ పాండిత్యము, లోకపరిశీలన వ్యక్తమగును 10వ శతాబ్ది నుండి నేట వరకుగల సాహితీ ప్రక్రియలన్నిటిని స్పృశించి చూపుట అనిన సామాన్యము గాదు తెనుఁగు అనేక భాషల సంపర్కము పొందినను,పొలాల మీదఁ బడాల, ఇండ్లకబుర్లు, తెనుఁగు నుడికారము సమయోచితముగ బయల్వెడు నప్పుడు హృదయ మాంద్రోద్దీపితమై 'ఇది తెనుఁగని పించును' అని చూపి దాని నాధారముగ తెనుఁగు శైలిని యోజింపు మని పాఠకులను ప్రోత్సహించును, ఇందు అచ్చుతెనుఁగుపై వ్యావహారిక భాషపై వీరికిగల మమకార మనంతముగ తోచును వైయాకరణ నిబంధనలు-వ్యావహారిక నియమములు' అనువ్యాసమున పుస్తకం రచించడం అచ్చొత్తించడం, విమర్శకు పంపడం అన్నియు వ్యసనములే అనిరి విమర్శకుని లక్షణములను తెలుపుచు మార్గదర్శకమైనది చివరలో కవికొండల తమ గ్రంథము లలోని రచనా విధానమును, వాక్య నిర్మాణమును ఉదహరించిరి "ఖండ కావ్యము-సింహావలోకనము" అనువ్యాసము భారతిలో ప్రకటితమైనది 'నేటి ఖండ కావ్యమే సిసలైనదీ, సార్థకమైనదీ' అని సమర్ధింప గలగడమే ఈ రచన యొక్క పరమావధి' అనుచు ఖండకావ్యము తెనుగునసిసర్గముగ వెలసినదను విశ్వాసమును ప్రకటించిరి.

''తిమ్మన్న ప్రథమా శ్వాసంతో ఆగివుంటే అది ఎంచక్కటి ఖండకావ్యమ య్యేది గార్హస్థ్య ప్రవరుడు దాన తపోగ్ని హోత్ర పరతంత్రుడేని తిరోహితుడు కావడంతో స్వస్తిప్రజాభ్యః అంటిమా అదో ఖండకావ్యమ'' నిరి ''జంగం కథలు కొన్నీ జక్కుల పదాలు కొన్నీ వాటి పట్టులోనూ, పాకంలోనూ ఏదేశంలో

ప్రభవించిన ఖండకావ్యాలకూ ఏమాత్రం తీసిపోవ" ని నిరూపించుంచు గురజాడ నుంచి శ్రీ శ్రీ వరకు ప్రస్తావించిరి.

**2. వివరణాత్మకములు:-**

వీనిని రచయిత 'కల్పనా వ్యాసములుగ' పేర్కొనిరి' 'ఇవి కూడ నిజానికి కథలవంటివే చదువ మొదలు పెడితే పేజినుండి పేజీ అవిరళంగా అవగాహన చేసుకుంటూ చివరవరకూ వెళ్ళేదాకా విడువ బుద్ధికాదు'[1] అని వీనిని గూర్చి కవి కొండల చెప్పిరి.

'పొగకర్రలు' పేర ఎనిమిది వ్యాసములు, 'అని మేషములు' పేర పది వ్యాసములు' కలవుర 'అనిమేషములు రచయితయొక్క పాఠశాలా విద్యార్థి దశను నిరూపించును

మిగిలిన వ్యాసముల పట్టిక క్రింద ఈయబడినది 1 విమర్శన పంథ 2. పెద్ద-చిన్న 3 నిడదవోలు-ప్రకృతి దృశ్యము 4 నయనరేఖ 5. కనుపాపనీడలు a) వృంతంకు ఫ్రాక్చర్ b) అమనిపిట్ట c) మణి 6 లీలా పరాక్రమం 7 పోల్నాడు-పల్నాడు 8 జానపద గీతికల సామరస్యము 9 కార్యమాపూడి 10 పాఠకుని తన్మయత్వము 11 ఇలాకాకుండా అలా వ్రాస్తే ఎలా వుండేదో 12. మాట అందని నిజం 13. రణభీ 14 ఆంధ్రదేశ జానపదులు 15 తెనుగు బిడ్డ ఎవరితో పోదు 16. దామెర్ల రామారావు కళారాధన 17 స్వవిషయము 18. ఒకింత వెల్లడింపు 19 చైనాదే 20 ఆంధ్రలో కళయొక్క పునరన్వేషణ 21 కళాపోషణ

వీనిలో కొన్ని మాత్రమే లభించినవి.

**పాఠకుని తన్మయత్వము:-**

'పాఠకుడు 'పఠించుచు నేనెక్కడున్నాను అని యొకానొక సంప్రశ్నము ప్రశ్నించు కొనునంత పాఠకునకు స్వీయశక్తి గాక పరశక్తి నేనిక్కడున్నాను అని మారు పలుకు చుండెనేని యదియ పాఠకుని తన్మయత్వము' అని నిర్వచించిరి పాఠకుడు తనను, కవిని ఇరువురిని మరచిపోయినప్పుడిది సంభవమగునని ఉదాహరణ పూర్వకముగ విశద మొనర్చిరి. ఈ స్థితిని పొందుటకు శరీర స్వాస్థ్యము, నిర్మల మానసము, ప్రసన్న

---

1. నేను వ్రాసిన వేమిటంటే కల్పనా వ్యాసములు-కవికొండల, దేశసేవ.

తార్థశ్రీ హృదయము పొరకుననకు కావలయుననిరి రచయిత ఎట్టి క్లిష్టవిషయము నైనను చక్కని ఉదాహరణములతో సరళముగ రూపొందింతురు. గ్రంధరచనము మొదట మనుజుని క్రమవికాసమును, మానసిక పరిణామమును వివరించి పిదప భాష ఏర్పడిన విధాలమును చూపిరి గ్రంధరచనమనగానేమో చక్కటి నిర్వచనము నిచ్చిరి ' ఐక్యత వడసిన భాషా భావములకు కట్టుబాటులను, శైలిని నొడ గూర్చి గద్య పద్య ద్విపద గీతగేయాదుల మర్యాద నెలకొల్పి విజ్ఞానమో, రసమో వెల్లడించు నెయ్యదనయ్యది గ్రంధరచనమగుచున్నది' గ్రంధరచనమునకు భావము ప్రధానమా లేక భాష ప్రధానమా అను విషయమును చక్కగ చర్చించిరి సాధారణ భావ ప్రకటనము లెట్లు గ్రంధములు కాలేవో, శకుంతలా దుష్యంతుల ఉదాత్త ప్రణయగాధ ఎట్లు గ్రంథము కాగలదో చక్కగ అన్వయించి చూపిరి 'ఒక చిన్న భావమును స్ఫురింపజేసి దాన బ్రహ్మాండ రసమును ప్రతిబింబితము చేయుట భావ నిగ్రహము' అని దీని కుదాహరణముగ మను చరిత్రలో ప్రవరాఖ్యు నుద్దేశించి 'కలంచునే సతుల మాయల్ ధీర చిత్తంబులన్' అను అర్థాంతరన్యాసము ద్వారా నీతి బోధ గావించిరని చూపును ఇందు వీరి విస్తృత కావ్య పరిజ్ఞానము, విమర్శనాత్మక దృష్టి గోచరమగుచున్నది 'కార్యమాపూడి' అను వ్యాసము 'భారతి'లో ప్రచురింపబడినది. ఇందు పలనాటి యుద్ధము జరిగిన స్థలము కార్యమాపూడి యొక్క ప్రాశస్త్యము చక్కగ చూపబడినది. ' ఆ జోదుల నామరూపాదుల నుచ్చరించడానికి కూడా మన మీ నాట తగం" అని దేశభక్తిని జాగృతం కావిస్తారు పలనాడు శబ్దమునకు వ్యుత్పత్తిని చెప్పుటకు వీరు చేసిన ప్రయత్నములో వీరి పాండిత్యము, సునిశిత పరిశీలన స్పష్టమగును

'పొగకత్రలు' అను శీర్షికను వెలువడిన వ్యాసములు కధలవంటివని చెప్పిరి. 'పెద్ద-చిన్న' అను వ్యాసము చమత్కారముగ ప్రారంభింపబడినది' ఈ వ్యాపములు కవి ఆత్మీయములైన విషయములను తెలుపునట్టివి. జీవితము బుద్బుదప్రాయమే అని పరోక్షముగ శవదహన వర్ణనము మూలమున చాటి చెప్పిరి బీభత్స పూర్వకమైన సన్నివేశములు అలవోకగా మన కనులకు గట్టినట్లు వర్ణించిన వీరి వర్ణనా కౌశలమపూర్వము

'నిడదవోలు మడుగు-దృశ్యము' రచయితకు ప్రకృతిగల ప్రియత్వమునకు, స్వస్థానాభిమానమునకు గీటురాయి. 'నిడదవోలు నా చిన్నప్పట్నించి

నేను ప్రేమించిన ఆంధ్ర దేశపు తావుల్లో ఒకటి అఖండ గోదావరి తర్వాత ఖ్యాతిగాంచిన దాని సౌందర్య సరసత అనిర్వచనీయమని' పరవశింతురు 50 సంవత్సరముల క్రితపు గోదావరీ ప్రాంతపు స్థితి, ప్రయాణములు మన కనుల ముందుంతురు 'నయనరేఖ' అను వ్యాసమునందు రచయిత తన జన్మస్థానమును, బాల్య స్మృతులను నెమరువేయుదురు. ఎట్టి పరిస్థితులలోనైన కవి ప్రకృతిని గాంచి పరవశించుటయే కానవగును తాను పుట్టిన ఊరు, ఆడిన ఆటలు, పాడిన పాటలు, తన జన్మస్థానము యొక్క కొండలు. కోనలు, ఉద్యానములు, ఉత్తుంగ వారి నిపాతస్వనములు మన కనులముందు బొడగట్టించును.

'కనుపాప నీడలు' అను శీర్షికను రచించిన మూడు వ్యాసములు రచయిత వ్యక్తిగతములుగ తోచును. వీనియందు వీరికి తమ కుమార్తెలపైగల వాత్సల్యము, అవ్యాజానురాగము. ప్రకృతిపైగల ప్రేమ వెల్లడియగుచున్నవి వీరు 'స్వవిషయము' అను పేర రెండు వ్యాసములు రచించిరి ఇవి ఇతరుల వ్యాసములపై వీరు చేసిన విమర్శలు: మొదటిది 'ఒకింత వెల్లడింపు; కవికొండల భావకవిత్వ నిర్వచనముపై త్రిలింగ పత్రికలో వెలువడిన 'భావ కవిత్వము" అను వ్యాసముపై రచించినది రెండవది 'సారస్వత మీమాంస' ఇది 'చంద్రిక' అను పత్రికలో వెలువడిన 'నేటి సాహిత్యం' అను శీర్షికను వెలువడిన రెండు వ్యాసములు చదివి రచయిత వ్రాసిన వ్యాసము. ఇందు విమర్శకుని లక్షణములను పేర్కొని, సద్విమర్శకుని యొక్క అవశ్యకతను చూపిరి

## 3. జంటలు :

'జంటలు' అను పుస్తక రూపమున వీరు పది వ్యాసములు వెలువరించిరి. ఇవి రచయిత ఆయాప్రదేశములను సందర్శించి వాని ప్రాముఖ్యమును, తాను పొందిన అనుభూతులను తెలుపునట్టిది ఇవి ఆంగ్ల సాహిత్యములోని 'Travelogue'తో పోల్చవచ్చును వీని పేరును గూర్చి కవికొండల వారిట్లు తెలిపిరి. "జంటలు'లోని పది వ్యాసాలు ఒక ఊరికి ఊరు దగ్గరసా ఉండి, రెండేసి రెండేసి ఊళ్ళుగా నిరూపించటంచేత 'జంటలు' అను దానికి నామకరణం గావింపబడింది. ఇవి దూర ప్రయాణం మీద ఆధారపడి వుండే వ్యాసాలు "

దీనిని గూర్చి హరి ఆదిశేషువు గారిట్లు వ్రాసిరి.[1] "ఆంధ్రుల ప్రాచీన వైభవాన్ని వేనోళ్ళ కీర్తించిన వారిలో రాయప్రోలు, విశ్వనాధ మున్నగువారెందరో వున్నారు కానీ అవన్నీ పద్యరూపాలు. ఆ బాల గోపాలాన్ని అవి అలరింపలేక పోవచ్చును కానీ ప్రాచీన వైభవమును, శిల్పకళావైదగ్ధ్యమును వీరూ వారూ అని లేకుండా ఆ బాల గోపాలాన్ని అలరించేటట్లుగా, అందరికీ సుబోధకంగా తెలిపేవచన రచనలు గావించినవారు కవికొండల వారి జంటలు తెలుగులో విశిష్టమైన రచనల్లో ఒకటని చెప్పవచ్చును " ఆ కాలమునకు అనగా 1930 నాటికి వీరు నూతన ప్రయోగమును చేసిరనియే చెప్పనగును

కవికొండల రచించిన "జంటలలోని వ్యాసములు. 1- ఉండవల్లి-కొండపల్లి 2 భువనేశ్వరము-జగన్నాధము, 3 అంతర్వేది-మొగలితుర్రు, 4 పెద్దతిరుపతి-చంద్రగిరి, 5 రాజమహేంద్రవరము-ధవళేశ్వరము. ఈ వ్యాసములను గూర్చి కవికొండల వారిట్లు తెలిపిరి.[2] జంటలు పేరును గూర్చి సూచించుచు మొదటగ "భువనేశ్వరమన్ననూ, జగన్నాధమన్ననూ, శబ్దార్థమొక్కటిగానే తోచింది. అ దివ్య స్థలంబుల రెండింటియందును ఒకే మాదిరి కలశ శిఖరమ్ములు నభోమండలము నలంకరించినవి నిర్మానుష్యమైనట్టి, నిశ్శబ్దనంతమైనట్టి, భువనేశ్వరమందెట్టి శాంతిని గనగల్గితినో నేనట్టి శాంతినే సంకుల సమ్మర్ద జనాకీర్ణమగు జగన్నాధమే నేటికినాడు క్రొంగొత్త వెల్లను మెఱయవచ్చునప్పుడు మనము కాలభేదమును మఱువ, సమస్త మొక్కటియు, సమస్త మొక్క శాశ్వత మహదాశయముతో వినిర్మింపబడినదియ యని తేటతెల్లమగుచుండును రచయిత తాను చేసిన ప్రయాణములు, తాను పొందిన ప్రమోదములు, పరాభవములు, తనకు సంబంధించిన సొంత సావకాశములన్నియు తనవి కానటుల తలపోసికొనుచు కలత చెందక, కలలాగు చిత్రించుకొనుచు, వెనుకకు తిరుగుచు తనకు సంబంధించిన తారుమారు స్వరూపములలోతానై ప్రతిఫలించడమే కల్పన అది ఒక కనికట్టు వంటిది ఆస్వాల్డ్ కూల్డ్రే, దామెర్ల రామారావు, అడివి బాపిరాజులతో కలసి భువనేశ్వర యాత్ర చేసినట్లు కవికొండలవారు చెప్పి యున్నారు

---

1. జంటలు-పరిశీలన
2. పరిచయ వాక్యములు-ప్రకాశకులు-జంటలు
3- భువనేశ్వరము-జంటలు- కవికొండల

అనవేమారెడ్డి కాలమునాటి మాధ్యహ్నిక ఘంటా నినాదముతోను, రెడ్డి రాజుల వసంతోత్సవపు సొబగుల తోటి అజరామరమైన ఉండవల్లి- కొండపల్లి జంట ఇతర నగరములకు విజయవాడకు గల తేడాను, ప్రత్యేకతలను చూపిరి ప్రయాణమార్గము క్లిష్టమైన చోట ఈవిధముగా అందురు 'నేనదేమిటో ప్రయాణం ఎండలో వెడుతూన్నా నాకంటే కష్టపడి నడుస్తూందే పాటకపు జనుల్ని, పాటుపడే కూలీల్ని చూడ్డం తటస్థిస్తుంది. అప్పుడు వాళ్ళ కెండలేంది నాకెందేవిటని తప్పకుండా అన్పిస్తుంది ' చందు అను స్థానికుని సాయమున అక్కడగల శాసన సారాంశమును తెలుసుకొనుటలో రచయితకుగల చారిత్రక పరిశోధనాసక్తి బయల్పడును నాలుగవ అంతస్థులోని గుహలో కూర్చుని ఎదుట కానవచ్చు దృశ్యమును తనివితీర వీక్షించు టలో వీరి ప్రకృతి ప్రియత్వము చూడవచ్చును

వీరు కొండపల్లిని ఐదుమంది పరిచయస్థులతో కలిసి సందర్శించిరని తెల్పిరి. అక్కడ కొండపల్లి కళాకారులు చేయు బొమ్మలను చూచి వారి కళా నైపుణ్యమునకు విస్తుపోయిరి అక్కడ శాసనమును చూచి 'ఎవరైనా దీని విషయమైన సంపూర్ణ చరిత్ర వ్రాసి పంపిస్తే ఈ వ్యాసమును పూర్తి చేస్తాను లేనిచో అంతవఱకు ఈ వ్యాసము కూడా ఆ కోటగోడ యొక్క మొండిగోడలు లాగు అసంపూర్ణముగానే కనబడుతూ చదవరులకు వెనక్కి వెనక్కి తిరిగి చూడ మంటుంది'. ఈ వ్యాసము చరిత్రకారులకు ఉద్బోధకముగ నున్నదని చెప్పవచ్చును

రెండవ జంట ఒరియా రాజుల శిల్పకళా పోషణకు సాక్షీభూతమగుచున్న భువనేశ్వరము, జగన్నాథము.భువనేశ్వరమునందు అడుగడుగునగల గుడులన్నిటిని జూచి భక్తి పరవశులగుదురు దాక్షిణాత్య శిల్పములకు, ఈ శిల్పములకు గల తేడాను ఎత్తి చూపిరి వానిలో చేతులు నరుకబడిన లక్ష్మీదేవి విగ్రహము, వినాయకుడు, విశ్వకర్మ, కార్తికేయుడు, లక్ష్మీ నృసింహ విగ్రహములను కనులకు గట్టినట్లు వర్ణించిరి అచటి గుడుల శిథిలావస్థలను జూచి వీరి హృదయము ద్రవించిపోవును 'ఇన్ని గుడుల నింత చక్కని కళతో వినిర్మింపబడిన వానినింత నిర్మానుష్యములుగ నింత పూజా పునస్కారములు లేనివానినిగ నేలఁజేసితివి పరమేశ్వరా! సుప్రభూ!' అని విలపించిరి అందులకు గురువు వారి ననునయించును జగన్నాథములోని సముద్రమును చూచి ఉప్పొంగి వర్ణనలు చేసిరి. అ గుడిలోని విగ్రహముల అసంపూర్ణత్వమును గూర్చి భగవంతుని ప్రశ్నించును.

మూడవ జంట అంతర్వేది- మొగలితుర్రు, ఈ వ్యాసములలో తలమానికము వంటిది ఇందు భీష్మ ఏకాదశి పర్వదినాన, అంతర్వేదిలోని రథోత్సవమునకు జరుగు తిరునాళ్ళను కనులకు కట్టినట్లు చూపిరి. ఒకవైపు రాజు ఏనుగుమీద ఎక్కి వచ్చుట మరియొకవైపు పల్లీయుల సంబరములు. వారి హడావిడి. వారిలో అన్ని రకములకు చెందిన వారుందురు. ఒక ముసలమ్మ మనవడితోను, మనుమరాలితోను 'సాగర సంగమంలో సరిగంగ స్నానం చెయ్యాలటర్రా' అనును. ఒక తాత 'బతికినంత కాలం బతకబోను గదా- ఒక్కసారి అంతర్వేది నరసింహస్వామిని చూడాలి' అని కోరుకొనును ఒక ముత్తైదువ 'గుడిమీద మూకుడుంచి దాన్నిండా తైలమోసి దీప మెలిగిస్తాన'ని మ్రొక్కును. ఆ కాలమునాటి ప్రజల నమ్మకములు, వారి గాఢమైన భక్తి, ఆచారములు చక్కగ చూపిరి. పంటలు ఇంటికి చేర్చుకొని, వాతావరణ మనుకూలించి యుండగా భక్తితో మనమున కాహ్లాదము గొలుపునట్లుగ ఊరికి వేయిమంది చొప్పున బయల్దేరిరి'. ఈ మాటలు వీరి పరిశీలనా సామర్థ్యము నకు మచ్చు తునకలుగ నున్నవి.

ఒక జంట భార్యాభర్తలు, చంటిపిల్ల, ఓ మూడేళ్ళ ఎడపిల్ల. మగని నెత్తి మీద పెద్ద బస్తా మూట, కుడిచేతిలో పెరుగుబుడ్డి, ఎడమచేతిలో ప్రయాణములో ముందిక దొరుకవని నింపుకొనిన మంచినీటి చెంబు. చంటిబిడ్డ ఏడుపుతో బిడ్డను అడ్డాలలో వేసికొనిన తల్లి ఎత్తుకొనినగాని నడువనని మంకుపట్టిన ఎడపిల్ల. ఆ కుటుంబ మటులే మన కనుల ముందు కనిపించును. దారిని పోవు ఒక స్త్రీ 'రా అమ్మా! నేనెత్తుకుంటాలే!' అని ఆ ఎడపిల్ల నెత్తుకుని ఆ దంపతులతో ఎంతయో సయోధ్యతో యాత్ర సాగించును. ఆ పల్లీయుల నిష్కాపట్యము, సహజ సేవా భావము ఇందు మనోజ్ఞముగ చిత్రింపబడినవి.

తరువాతి జంట అవ్వ, మనుమరాలు "కుఱ్ఱదో దానికి పది పదునాలు గేండ్లుంటాయి అమ్మమ్మతో తీర్థానికి బయల్దేరింది. దిక్కులు చూడొద్దంటుంది అవ్వ. సిసింద్రీ అది చూడక మానదు ఇంతలో ఆ పిల్లదాని అత్తగారు, భర్త రాగా అవ్వ పిల్లని వారితో కలిపింది ఆ అత్తగారు కొడుకు, కోడలు పరస్పరము చూచుకొని మురిసిపోతూ, ముసిముసి నవ్వులు నవ్వుకొంటుండంగ వారిని వెంటేసు కుని జిలేబీ యినీ కొని పెడ్తుంది" చిన్ననాడే జరిగిన వివాహములు, వారి అమాయ కపు ప్రేమ, ముసలివారి వాత్సల్యము ఎంతయో సహజముగ చూపిరి మన ఆంధ్ర దేశమున జరుగు తీర్థయాత్రలు, తిరునాళ్ళ, సందడి, ప్రజల కోలాహలము,

ఉత్సవ దర్శనోత్సుకులగు జన సందోహమునకు కలుగు చిన్నచిన్న చికాకులు। వీనిని ఎగురగొట్టు సంఘటనలు, అచట అరమరికలు లేక కలసిపోయి ఒకరికొకరు సాయము చేసికొను పాటక జనము అన్నియును మనముందు ప్రత్యక్షమగును వారితో మనమును తీర్థయాత్ర చేసినట్లు సహజ సుందరముగ చిత్రించిరి. వీరికి పల్లీయులతోగల సాన్నిహిత్యమునకీ వ్యాసము నిదర్శనము

'మొగలి తుర్రుకోట'ను తమ్మునితోను ఇరువురు మిత్రులతోను కలసి సందర్శించి ఆ పాడుపడిన కోట, పనికిరాని చెఱువును జూచి రచయిత మనస్సు ద్రవీభూతమగును.అయినను ఆకోట లోపల వాసయోగ్యమగు భాగములో నివసించు రాచవంశీయులను చూచి ఆశావాది అగును కనుకనే కోటలోని మట్టితో చెఱువుని పూడ్చివేద్దామనిన బాలుని పలుకులను వారించి ఇట్లనును 'ఎన్నడూ అలా చేయ కూడదు ఆ చెరువు పూవులు పూస్తుంది. కోటలో రాచబిడ్డలు నీ యీడు వాండ్రెంద రిని చూశావుకదా। వారి చేతుల్లో కోట బాగుపడవచ్చును దానికి తిరిగి పూర్వపు టౌన్నత్యము రావచ్చును' అని గతించిన వైభవము మరల తలఎత్తగలదని ఆశిం చును

నాలుగవ జంట రాయల కాలములో ఆయన వలన పూజలనంది ఆతని తర్వాతి వారిని తన నీడనే చంద్రగిరిలో నిలబెట్టిన కలియుగ దైవము వేంకటేశ్వ రుని తిరుపతి, చంద్రగిరి కవిని తిరుమలలోని పావనాశన మెంతగానో ఆకర్షించినది. 'చెట్లల్లో చిరునవ్వులే, ఆకుల్లో పాలల్లే కనిపించి హోరుతో వినిపించినది పావ నాశన మహా వారినిపాతము నిజంగా పావనాశమే అంటూ ఉవ్విళ్ళూరిపోయి ఆ విస్ఫుటి స్ఫటికాచ్ఛ జలధార నభిషిక్తుడనై తనిసి పావనుడి నయ్యాను' అని వీరు అలౌకికానందము నొందిరి. చంద్రగిరికి పదునైదుగురు మిత్రులతో కలసి పిక్నిక్‌కు పోయినట్లు చెప్పిరి. 'పిక్నిక్'ను 'అల్పాహార సమేతమైన చిన్నిపయనము'నిరి వీరు చంద్రగిరిని గూర్చి చదువుటయేగాక జనపదసీమలో ప్రచారములోనున్న 'నిమ్మముల్లూ తొమ్మ నాటేనోయ్। ఓ రందగాడా। బంగారుమామా। చంద్రగిరి చీర లంపరా' అను జానపద గేయములో కూడ దాని ప్రస్తావనను విని చంద్రగిరిలో చీరల ప్రాశస్త్యమును గూర్చి ప్రశ్నించును కొండపైగల సరస్సు మనోహర ముగ నుండునని విని కష్టపడి అందరు కొండ ఎక్కుదురు అది రచయితకు మానస సరోవరమువలె భాసిల్లినదట ఆ ప్రదేశమంతయు పుచ్ఛపువ్వు వంటి వెన్నెల వ్యాపించగ మిత్రుడు వేళాకోళముగ 'కవీ। ఈ వెన్నెలేయేమో నీ చంద్రగిరి చీరంటే' అనును. అందుకక్కడ గల వాచ్‌మేన్ అందుకుని 'దీన్నె వెన్నెల అని

పిలవం. కీర్తిచీర అంటాము. చీకటి రాత్రులైనా యీ కొండమీద యిలా వెన్నెల కాస్తూంటుందనే వాడుక 'అక్క దేవతల'నే దేవతలు సందెలడగానే యీ కొండమీద యీక్రింద సంచారానికి దిగుతూ పెన్నెల్లాంటి చీర పడుస్తూంటారు. అదే కీర్తిచీర' అని వివరించును. ఆ గాధవలన పాటకు సంబంధించిన సమస్య తీరిపోయిందని రచయిత తృప్తిగా నిట్టూర్చును.

ఐదవ జంట రాజమహేంద్రవరము, 'ధవళగిరి, పుష్పగిరి, హేమగిరి' మొదలైన గిరులతో పెట్టని కోటవలె, అఖండ గౌతమిత్రవ్వని కందకమువలె ఏర్పడిన 'రాజమహేంద్రవరమంటే ఎఱుగని ఆంధ్రుడుండడు నాకదేమిటో ఆ పట్నం అంటే ఎక్కడలేని అభిమానమును' అని వ్యాసమును ప్రారంభించిరి అక్కడ వీరు విద్యాభ్యాసము చేయుటయేగాక లాయరుగా ప్రాక్టీసుకూడ చేసి ఉండుటచే ఆ నగరము వీరికి సుపరిచితము. ప్రేమపాత్రమైనది 'చారిత్రాత్మకముగను, ప్రక్కటి పురాణగాథలలోను ప్రసిద్ధి గాంచిన కోటగుమ్మము, రత్నాంగి మేడ, చిత్రాంగిమేడ, సారంగధరుని మెట్ట అను పేర్లు రాజమాహేంద్రవరపువాసుల నోళ్ళలో ఇంకా ఆడుతూ నిలిచే ఉన్నాయి. ఆ ఊరికి ఇంకా పాత వాసన పోలేదు ' అని వీరు చేసిన పురవర్ణనతో ఆ పురవాసులకే క్రొంగొత్త అందములు కనిపించును, ధవళేశ్వరమునకు నావలో ప్రయాణము చేసిరి 'ఈదరికీ అదరికీ సముద్రాన్ని జ్ఞప్తికి తెస్తూంటుంది ఆ చూపు ఈదర్ని తెల్లుపూల, ఆదర్ని శాశ్వతమైన పచ్చదనంతో అంతకంతకు దగ్గఱపడే పిచ్చుకలంక, మద్దూరు లంకా అవీ ఎదూరు గుండా ధవళేశ్వరము, ఆ ఊరి నీరాటరేవు, రేవులో పెద్దరావిచెట్టు, ఆ రావి చెట్టాకులన్నీ ఒకమారు గలగల ఒక్కమాఱు మిలమిల ' ఇట్టి వర్ణనలతో వారితో బాటు మనము అక్కడకు ప్రయాణము చేసినట్లు భావింతుము.

ఇట్లు ప్రాచీన అధునాతన కాలములోని ఆంధ్రుల వైభవములను, శిల్పకళానైపుణ్యము వెల్లివిరిసిన రంగస్థలములను, తెలుగువారి జానపదసీమలను, అచటి ప్రకృతి శోభలను కాంచి రచయిత పరవశించి తన అనుభవములను, ఆశయములను, ఆవేదనములను వర్ణనా చాతుర్యముతో మృదుమధురముగ మన కనుల ముందుంచిరి.

'అమరారామం' అను వ్యాసము భారతిలో ప్రచురింపబడినది. ఇది 'జంటలు లోని వ్యాసము వంటిదే. రచయిత 'అమరావతి'ని దర్శించిన అనుభవములను మన ముందుంచును కృష్ణవేణి "అమృత వాహినినైన నన్ను చూడు! నా అందం చూడు

నీ ఆకలి మరచిపో' అని చెవిలో రహస్యంగా బిల బిల ధ్వనులూత్తూ చేరబిలచి నట్లైన"దని దాని మనోజ్ఞరూపమును మనకు చూపును. "తెల్లని యిసక తిన్నెలు ఎండలో, రపల బొడి పరపులల్లే మిఱుమిట్లు గొలిపాయి. దూరపు కొండలు నీలాలుగా ఉండి, వాని వెనకాతల ఏమీలేనట్టుగా, అవే యీ యిహలోక నాటకరంగ స్థలాన కాఖరు తెరలన్నట్టుగా కనిపించాయి" అనుటలో వీరి వర్ణనా చాతుర్యము గోచరించును

4:'నేను వ్రాసిన వేమిటంటే శీర్షికను వెలువడిన వ్యాసములు:

వీరు 'నేను వ్రాసిన వేమిటంటే' శీర్షికను తమ రచనలపై తామే చక్కని విమర్శనాత్మకమైన ప్రసంగములు పది కావించియున్నారు. అవి 'దేశసేవ' పత్రికలో ప్రచురింపబడినవి ఇంత విపులముగ, విమర్శనాత్మముగ తమ రచనలను తామే పరిశీలించి వానిని పాఠకులకు విశదీకరించిన రచయితలు అరుదుగనుందురు. గురజాడ వారి లేఖలిట్టి కోవకు చెందిననవచ్చును. శివశంకరశాస్త్రిగారు 'నాలోమార్పు' అను వ్యాస పరంపరను వ్రాసిరి. శ్రీశ్రీ తన రచనలను గురించి రేడియోలో చెప్పుకొనిరి ఈ వ్యాసములు కవికొండల రచనలను కూలంకషముగ పరిశీలించుటకు దోహదమొనగించుచున్నవి. నేను వ్రాసిన వేమిటంటే- అను శీర్షికన 1 గీతికలు 2 -మహాగీతికలు 3 -ఖండ కావ్యాలు 4 -పద్యకావ్యాలు 5 -నాటకాలు, నవల, ప్రబంధము 6 -కథలు 7. సారస్వత వ్యాసములు 8. -కల్పనా వ్యాసములు 9 -ఏకాంకిలు 10 -సకపేతరములు కలవు.

'ఖండకావ్యములు' వ్యాసములో ఖండకావ్యమునకు నిర్వచనమునిచ్చి ఇట్టివి 300రచించితినని తెలిపిరి ఖండకావ్యమును గీతికకు గల భేదమును చూపిరి. తన రచనలను గూర్చి చెప్పుచు 'రచయిత కష్టెదుటే ఇది ఉత్తమమంటే ఇది సామాన్యమంటే సహించలేడని, ఉన్నంతలో మంచి తీసుకోమ'ని పాఠకులకు సూచించుచు తనమానసికానందమునకే రచనచేసితినని ఒకరు తన్ననుసరించినను, లేకున్నను తన మార్గమునకు అడ్డు రాకూడదని కోరుచు ఒక ఖండ కావ్యమును నిరూపించి రూపనిష్పత్తిచూపిన తక్కినవానికి కూడ అనుసంధించుకోగలరని వివరించి చెప్పిరి. కొన్నిఖండ కావ్యములలో తన ఆత్మీయత ఎట్లు ప్రకటితమయినదో చూపిరి,

"గీతికలు" వ్యాసములో 1916 నుంచి 1946 వరకు 1000 వరకు గీతికలు

వ్రాసితినని చెప్పిరి మొదట పద్యాత్మకములుగ నుండినను అనంతరము గేయరూప మును దాల్చినవని తెలిపిరి. 'శివరాత్రి ప్రభ' "నవోజయ" వంటిగేయములనేకములు రేడియోలో ప్రసారము గావింపబడినవని, మరికొన్ని సభలలో చదువబడి శ్రోతల అభిమానమునకు పాత్రములైనవని వివరించిరి పామర విలాసమును చూపు గేయములు "ముప్పావలా కూలొస్తది" మున్నగు వానిని గురించి, స్త్రీల కొఱకు, పిల్లల కొఱకు వ్రాయబడిన వానిని గూర్చి ప్రస్తావించిరి "మహాగీతికలు"లో విలాసినీ పైన తేయము"ను గూర్చి వివరించిరి "పద్య కావ్యములు" లో 'రావిరవళిక' మున్నగు వానిని గూర్చి విడమర్చిరి.

"నాటకములు, నవల, ప్రబంధము" అను వ్యాసమున "విప్రసందేశము" అను నాటకమును గూర్చి వివరించుచు అముద్రితములగు ఆరునాటకముల వివరములు తెలిపిరి "విజనసదనము" "ఇనుపకోట" నవలలను గూర్చి వానిలోగల సందేశ మును తెలుపుచు "సుకన్య" అను అముద్రిత ప్రబంధము ను గూర్చి ప్రస్తావించిరి

"కథలు" వ్యాసములో 300 పైగా గల కథలు వచన ఖండికల వంటివని చెప్పిరి ఇవి చాలవరకు గ్రంథరూపమును దాల్చినవి. కథలెలా ప్రారంభింపబడునో సూచించి నిర్మాణ పథక మన్నిటికంటె ముఖ్యమనిరి. "పెనుమంచిలి జైనదేవుడు" అను సంపుటము అయా ప్రదేశముల ప్రాముఖ్యమును తెలుపుచున్నదనిరి

"సారస్వత వ్యాసములు" లో తానురచించిన వివిధ వ్యాసములను గూర్చి వెలువరించిన ప్రసంగములు, రేడియోలో ప్రసారమైన వ్యాసముల వివరణ తెలిపిరి "కల్పనా వ్యాసములు "లో ఇవి చిన్న కథలవంటివని, ఆత్మీయములగు విషయ ముల నెన్నిటినో ప్రతిబింబించు చుండునని వివరించిరి. ఇవి 100 కు పైగా కలవని చెప్పిరి

"ఏకాంకికలు" లో ఏకాంకికలు ఏబది పైగా కలవని అధికభాగము మద్రాసు విజయవాడ రేడియో స్టేషన్‌ల నుండి ప్రసారమయినవని తెలిపిరి కొన్నింటిని గూర్చి వివరించి హాస్య సంఘటనలను పేర్కొనిరి తానురచించిన రెండు భాణములు, ఒక ప్రహసనమును గూర్చి వివరించిరి

## 5 ప్రసంగములు :-

వీరి ప్రసంగములు ముప్పయి పైగా కలవు. రేడియో ప్రసంగములు పది హేను వరకు గలవు రేడియోప్రసంగములను గూర్చివీరిట్లు చెప్పిరి. Revision

వ్యాసాల వల్ల దృశ్యం పునః పునః సాక్షాత్కారమై తీరును, మేలును చేకూరు స్తుంది. వీనివలన ఇతరులు జానపదగేయాలు ఎలా పాడతారో, ఎంత ఉత్సాహం వాటిపట్ల చూపిస్తారో తెలిసికోగలిగాను "

"ఇంకా అప్పుడప్పుడ వారి వారి వార్షికోత్సవాల్లోను, గ్రంథాలు చదవడం లోను, కీ శే గురుజాడ అప్పారావు పంతులు మీద కీ శే. వీరేశలింగం పంతులు మీద మరిన్ని కీ.శే వసురాయ ఏవిని గూర్చి ఉపన్యాసాలిచ్చి వాటిని వ్యాసాలుగా పొందు పరిచాను "కూల్డ్రే-అతని ఆంధ్రహృదయం' అని ఓనాడు వ్రా కుచ్చాను ఇవి గాక ఎన్నోసరకాలుగా విద్యార్థుల సభలో, ఒకప్పుడు సాహిత్య సమ్మేళనావసరాల్లో, మరొకప్పుడు పరించిన వ్యాసాలున్నాయి" వీనిలో చాలవరకు పలు పత్రికలలో ప్రకటింపబడినవి.

మద్రాసు ఆంధ్ర విజ్ఞాన సమితిలో ఇచ్చిన ఉపన్యాపమున తాను రచించిన భావగీతములను పురస్కరించుకొని "కవిత – భావగీతాలు అను విషయముపై చక్కని ఉపన్యాసము నిచ్చిరి ముగింపులో స్వీయ భావగీతములను చదివినట్లు తెలిపిరి.

గౌతమీ విద్యాపీఠోత్సవ కార్యక్రమమున "భాషను గూర్చిన పట్టింపు" అను ప్రసంగము నిచ్చిరి వేదముల ప్రాధాన్యమును తెలిపి బైబిల్, ఖురాన్, నేటి భారతదేశములోని శాస్త్రములన్నింట నిండి యున్నది వేదములే అను క్రొత్తవాద మును లేవనెత్తిరి మంత్ర తంత్రాలను గురించి స్వయముగా కృచేచేసి కాని, ప్రయోగముల ద్వారా కాని అనుభవమునకు తెచ్చి, విద్యాపీఠముట్టి వారిని తయారు చేయవలయనని సందేశము నిచ్చిరి రాజమండ్రిలోని హిందూ సమాజమున "తత్వ శాస్త్రము వేదాంతము లేక విజ్ఞానము" అను విషయముపై వీరిచ్చిన ఉపన్యాసము వీరికి వేదాంతములు భగవద్గీత, భాగవత, రామాయణ కావ్యములలో వీరి పాండి త్యము ప్రకటితముచేయును.

'తెనుగున నవీన కవిత్వము' అను విషయముపై రాజమండ్రిలోని మహిళా విశారద విద్యాలయమున ప్రసంగించుచు, 'నవీన కవిత్వము' నకు చక్కని నిర్వ చన మిచ్చిరి ఇప్పుడు ప్రాచీనములుగ నున్నవి ఒకనాడెట్లు నవీనములగునో ఉదా హరణపూర్వకముగా చూపిరి సంస్కృతము గౌరవమును పొందుచుకాలమున "తెలుగు గడ్డను దీపింపచేయు యత్నమున 'ఆంధ్రావళి మోదము బొరయునట్లుగ' తెనుగు

జగద్ధితమగునట్లు' వచించిన నన్నయాదులు నవీనులేయని నిరూపించిరి రాయ ప్రోలు నుండి శ్రీశ్రీ వరకు ఆయా కవుల నూతన ప్రయోగములను గీతికలతో నుదహరించుటలో ఆధునిక కవితయందు వీరికిగల అభినివేశము సుస్పష్టము.

రాజమండ్రి హిందూ సమాజమున ఇచ్చిన "కవిత్వ తత్త్వము-వేదాంత విజ్ఞానము" అను ప్రసంగమున 'కాఱు నల్లని మబ్బు' అను గేయము సమస్తము నెట్లు ప్రతిపాదించునో, 'చిన్న మెఱుంగు గుల్ల'అను గేయము వెనుకబడియున్న మన బ్రదుకు ఎంతటి పేలవమని తెలుపునో విశదీకరించి తన కవిత్వము నందలి వేదాంతతత్త్వమును చూపిరి 'ఒకదాన్లో ఏమీలేదు ఒకదాన్లో అంతావుందని అను కోవటం పొరపాటు' అని తన రచనలలోని తత్త్వమును తెలిపిరి.

'తెలుగు కథానికలో స్త్రీలపాత్ర' అను అంశమును భీమవరములో వివరించిరి విశాఖపట్టణము మెడికల్ కాలేజి విద్యార్థులకు "కావ్య సందేశము"న నేమిటో, దానినెట్లు పొందగలమో తెలిపిరి

గౌతమీ సాహిత్య సమ్మేళన సందర్భమున తన రచనా వ్యాసంగమును సింహావలోకనము చేసి 'ఈ విశాల ప్రపంచములో సజీవముగా పొడగట్టు కళా వికాసము వెల్లడించుట రివాజు అయినది' అని తన రచనాధ్యేయమును వివరించిరి.

రాజమండ్రి విజ్ఞాన ట్యుటోరియల్ కాలేజి యందు ఇచ్చిన ఉపన్యాసము, జానపదవాఙ్మయంలో 'అక్షర రూపందాలిస్తే, నాదరూపందాలిస్తే కవిత్వం కాని జాన పద వాఙ్మయము అక్షరరూపంలో ఇమిడియుండి కూడా కవిత్వం క్రింద జమకట్ట బడుతూ యుంద'నిరి. దాని స్వరూప స్వభావములను చక్కగా బోధపరిచిరి. నవ భారతి గురుకులములో పౌరశిక్షణ సందర్భమున 'జానపదగేయాలు, జానపద నృత్యాలు' అను విషయముపై ప్రసంగించుచు 'ప్రజాయత్తమైన గేయం, ప్రజల కొఱకు నిర్మింపబడినది జానపద గేయమని, ప్రజాయత్తమైన నాట్యము ప్రజల కొఱకు నిర్మింపబడిన నాట్యము జానపద నృత్యము ఇది ప్రజల పరమైనది' అని వాని రూపములను శ్రోతల కనులముందుంచిరి 'గుత్తాల గోపిరెడ్డి-వేట్రాయి స్వామి దేవుడా-పల్నాటి వీర చరిత్ర' మున్నగు గేయములను పాడిరి రాజమండ్రి రోటరీ క్లబ్‌లో 'జానపదగేయాలు' అంశముపై వివరించుచు 'ఆవేళకాదరుడు ఏను నీ మ్రొక్కు-పందుం సాంబ్రాణి దూపాను మ్రొక్కు-అచ్చ కర్పూరాలు ఆరతులకే

(్రముక్కు 'అను పాట ఒక గ్రుడ్డి ముసలియామె పాడుచుండగ విన్నానని చెప్పి 'ఆ పాటలను అట్లు వినుటయే సరియైన కృషి' అనిరి కొన్ని జానపద గేయములు చదివి వానిలోని నిసర్గమగు భావము నెట్లు గ్రహించగలరో, వానిలోని రసము నెట్లు ఆస్వాదింపవచ్చునో విడమర్చి చెప్పిరి. ఇవి పురాతన కాలమునుండి యున్నను మధ్యలో విస్మరింపబడినవి, ప్రస్తుతము పాశ్చాత్య భాషాసంపర్కముతో పునరుద్ధరింపబడుచున్నవని తెలిపిరి. వీనిలో పడవ పాటలని, పొలము పాటలని, పండగ పాటలని అనేక తెగలు కన్పించునని తెలిపిరి మన జానపదగేయములలో వర్ణింప బడినట్లు 'మన జాతియందులోను వర్ణింపబడి వుండదని' వీనిని పాడుట నేర్చుకొనిన భారతీయ సంగీత సాంప్రదాయములోని వైవిధ్యము బోధపడునని వాని విశిష్టతను చూపిరి. కనుక వీని నన్నిటిని సేకరించి విభజనలోకి తీసుకుని వచ్చిన తరతరాలుగ నిలచివున్న మనసంప్రదాయము గోచరింపగలదని, జానపదగేయములను సేకరించి భద్రపరుపవలసిన అవశ్యకమును గూర్చి తెలిపిరి. వీరు స్వయముగా ఇట్టి పలు గేయములను సేకరించిరి.

విద్యార్థుల కిచ్చిన అనేక ఉపన్యాసములలో వేదకాలమునాటి విద్యా విధానమును, ఆనాటి గురుశిష్యుల సంబంధమును వివరించి ఆ బంధము ఈనాడు పునరుద్ధరింపవలెనని కోరిరి 'విద్యార్థి' అను పదమునకు చక్కటి నిర్వచనము నిచ్చిరి. స్వాతంత్ర్యోద్యమమును ప్రచారము గావించుటకు చేసిన పలు ప్రసంగములలో జాతీయ పతాక ప్రాధాన్యము, ఆంధ్రరాష్ట్ర ఆవశ్యకత మున్నగు అంశములను ప్రస్తావించు చుండిరి. తాము రచించిన దేశభక్తిగీతములను పాడుటతో సభలను ముగించుచుండిరి.

## 6. సూక్తులు :

స్వాతంత్ర్యము రాక పూర్వము మన దేశమున జరిగిన దేశీయ సభల అధ్యక్ష ఉపన్యాసములను వీరు అనువదించిరి. దీని వలన ఆనాటి రాజకీయ వాతావరణము మనకు అవగాహనకు వచ్చును ఇవి తొమ్మిది వ్రాతప్రతులు కలవు.

ఇట్లు వీరి వ్యాసములను కూలంకషముగ పరిశీలించిన శిల్ప చాతుర్యము

అన్నిటియందు ద్యోతకమగును 'ఉత్తమవ్యాసం అనుభూతి, ఆలోచనలు సమంగా గ్రహించి తీరుతుంది'[1] అనుట వీరి వ్యాసము పట్ల వర్తించును.

ఇతి వృత్తమునగల వైవిధ్యము ప్రధాన అంశము. సాహిత్య విషయమైనను, చారిత్రక విషయమైనను పాఠకునకు కరతలామలకమగునట్లు చెప్పుటయే వీరి విశిష్టత వ్యాస ప్రారంభము కుతూహలము కలిగించునటుల ప్రారంభించుట 'వ్యాసమును సంభాషణలతో మొదలిడుట, చివర వ్యాస సారాంశమును క్లుప్తముగ చెప్పుట, సందేశమునిచ్చుట, గేయములు పఠించుటతో ప్రసంగమును ముగించుట మున్నగునవి వీరి వ్యాస రచనలోని ప్రత్యేకతలు.

చారిత్రక దృష్టితో ఆయా స్థలములను పరిశీలన గావించుట: 'జంటలు' లో మనము చూడవచ్చును. ఆ కాలమున 'జంటలు' వంటి వ్యాసరచన అరుదైనది. ఇందు వీరి పరిశీలనా చాకచక్యము, సహృదయత్వము, నిగ్గదేయునేర్పు, ప్రాచీన శిథిలములను చూచి ద్రవించు ఆర్ద్రత, కళాత్మకహృదయము అడుగడుగున గోచరించును శైలిధారాళముగ సాగిపోవును.

ప్రకృతి సోయగములను గాంచి పరవశించు వీరి హృదయము వర్ణనలం దెల్లడల గోచరించును. వీరి వర్ణనా సామర్థ్యము ఎనలేనిది.

'నేను వ్రాసిన వేమిటంటే శీర్షిక'న గల వ్యాసములో తమ రచనలకు సంబంధించిన అనేక వివరణల నీయడమేగాక, వానిపై విశదమగు విమర్శ కూడ చేసిరి. ఇట్టి రచనలు చేసిన వారు ఆ నాటికి అరుదు

ఈ రీతిగ వీరు వ్యాసములను రసఖండికలుగ మలచి తమ రచనా సామర్థ్యమునువెల్లడిచేసిరి 'ప్రతిభావంతుడగు రచయిత రసజగత్తున కందిచ్చు ఆలోచనామృతమేవ్యాసమ'ను మాట కవికొండల పట్ల యథార్థమైనది.

---

1. తెలుగు వ్యాస పరిణామం – కొలకలూరి ఇనాక్, పు-104,

# ఉపసంహారము

కవికొండల కృతులన్నియు కూలంకషముగ సమీక్షింపగ ఆధునిక సాహిత్య రంగమున వీరికిగల విశిష్ట స్థానము నిట్లు తెలియనగును

కవిత్వమే తన నిశ్వాసముగ, విశ్వాసముగ నెంచి తన తుది దినముల వరకు కవితా వ్యాసంగమును కొనసాగించిన సరస్వతీదేవి ముద్దుబిడ్డడు కవికొండల. దీని కొరకు తన వృత్తి సైతము లక్ష్యము చేయని కళాతపస్వి వీరు

'నా పాట మల్లె పువ్వు- నా మాట మంచి గంధం' అను వీరి మాట వీరి ఆత్మ విశ్వాసమునకు తార్కాణము. పాఠక జనులు తమ పాటకు కూలీయకున్నను, పాడుకొమనట్లుగ తన కవిత్వము తనలోని అప్రయత్న భావావేశపు వెల్లువ అని, అది తన సహజ భూషణమని తలచిన సహజకవి కవి కొండల. వీరిలో నిద్రాణమైన కవి హృదయము, ప్రతిభ, ప్రకృతి శోభలతో విలసిల్లు పరిసర ప్రాంతములకు స్పందించి వెలికి వచ్చినది. 'జీవనది యొకనాడు చిన్నదై యొకనాడు పెద్దదై యొకనాడు చిన్నదైనా-భావమది ప్రస్ఫుటము, ప్రోద్భలము, అద్భుతము, తన్మయ ప్రాభవంబు' అని ఎంచిన కవికొండల, ఒకచోట 'శివరాత్రి ప్రభ' వంటి గేయ ముతో సాహితీ శిఖరాగ్రముల నధివసించినను, మరియొకచోట సర్వసామాన్య స్థానమున చోటుచేసికొనును.

నవ్య కవిత్వము వెలువడు తొలి దినములలోనే, అనగా 1910లోనే, కవి త్వమునకు నాంది పలికిన కవికొండల కేవలము కవియే కాద, కథకుడు, నవలా కర్త, నాటకకర్త, వ్యాసరచయిత కూడ ఇట ముఖ్యముగ గమనింపవలసిన అంశము వీరి రచనలు వెలువడిన కాలము. ఆయా ప్రక్రియలు తెలుగు సాహిత్య రంగమున వ్యాపించు తొలి దినములలోనే వీరు ఆయా శాఖలలో గణనీయమగు కృషి యొనర్చిరి.

వీరి రచనలలోని వస్తు వైవిధ్యము వీరికి విశిష్టతను ఆపాదించిన అంశ ములలో నొకటి. ప్రకృతిలోని గడ్డిపూవు మొదలు గోదావరి నది వరకు, సుకారి పిల్లనుండి మహాత్మాగాంధీవరకు సమస్తమును వీరికి అర్థవంతములై, కవితాస్ఫోరక

ములే. 'కాదేదీ కవిత కనర్హమ'ను మడి వీరిపట్ల అక్షరముల సార్థకమై ఒప్పినది తమ రచనలలో ఒకటి గొప్పదని, మరియొకటి అల్పమని నిర్ణయించిన భరింపలే ననిన కవికొండలకు ప్రకృతిలోని అన్ని వస్తువులు భగవంతుని అంశలుగ గోచ రించును ఇట్లు 'పేరులేని చిన్ని పూవు, గవ్వ, మాలెత, దిక్కులేని శవం'మున్నగు వీరి కవితా వస్తువులు వీరి మానవతా వాదమును చాటుచున్నవి.

'కూర్చున్న పాటొస్తే-నించున్న పాటొస్తే-నడుస్తున్న పాటొస్తే-నేనేమి చేసేది' అను వీరి పలుకులు ప్రకృతిలోని ప్రతి అణువును తిలకించి పరవశించి పాడు వీరి మనస్సునకు దర్పణము పట్టుచున్నది అట్లే "ఊహదట్టక మాయమైనవి-ఊహ దట్టి గేయమవనివి-గేయమయి పూర్తిగానివి - నా కలం వెంబడి ఎన్ని ఉన్నాయో"-అనుట వీరి తీరని కవితా దాహమును చూపుచున్నది తన్ను ఇతరులు అనుసరించినను, లేకున్నను తన మార్గమునకు అడ్డు రాకున్న చాలునని ఎంచెను.

తనకు ప్రేరణ కలిగించిన అంశములు స్థలములు, కాలము తన రచనలతో బాటుగ పేర్కొనుట వీరి ప్రత్యేకత ఇది వీరి రచనలను పరిశీలించుటకు దోహదము గావించుచున్నది. వీరి భాష వీరికొక ప్రత్యేకత నాపాదించుచున్నది. 'కూకుదుంటే కూచొస్తదా' అను జానపదుల భాష ఒకచోట, సంస్కృత భూయిష్టమగు భాష మరి యొక చోట, గ్రాంధిక భాష ఒకపరి, వ్యావహారిక భాష ఒక పరి, సందర్భానుసార ముగ ఉపయోగింతురు గ్రాంధిక భాష ప్రచారముగాంచుచున్న దినములలో ఇట్లు వ్యావహారిక భాషయేగాక, జానపదుల భాషలో రచనలుగావించుట ఒక విధముగ విప్లవాత్మక చర్య అనియే చెప్పనగును ఆ కాలమున తమ రచనలను తామే ఆంగ్లములోనికి అనువాదము కావించుకొనిన తక్కువమంది తెలుగు రచయితలలో వీరొకరు

ఇక వీరి రచనలను ప్రక్రియాపరముగ పరిశీలించిన ప్రతిదానిలోను ఎన్న దగిన విశిష్టత గోచరించుచునే ఉండును

వీరి శతకములైదును భక్తి. జ్ఞాన, వైరాగ్య తత్త్వములను చాటుటయేగాక సరళసుందరములుగ నీతి ప్రబోధమును కావించుచున్నవి ఇవి మకుట రాహిత్య ముతో, వస్తు వైవిధ్యముతో నొప్పుచు శతకసాహిత్యములో ప్రత్యేకతను కలిగి యున్నవి వీరి ప్రక్రియను తన భక్తి మార్గమునకు సోపానముగ స్వీకరించి ధన్యత గాంచిరి.

లఘు కావ్యములలో రసమయమైన 'సంగ్రహ శాకుంతలమే' కాక 'రావి రవళికి' వంటి సాంఘిక పరిస్థితులకు అద్దము పట్టిన కావ్యములను కూడ వెల యించిరి.

నవ్య కవిత శాఖలన్నిటిలోను కవితలను వెలయించినను కొన్ని శాఖలలో తనదగు స్థానమును నిలుపుకొనిరి దేశభక్తి వెలయు తొలిదినములలోనే వైవిధ్య మును సంతరించుకొనిన పలుగీతికలను రచించిరి ఆనాడు వీరి దేశభక్తి గేయము లలో కొన్ని పాఠశాలలలో పాడబడి, మరికొన్ని రేడియోలో ప్రసారము గావింప బడి ఉత్తేజమునిచ్చినవి

"సంతుష్టి లేదు మదికిన్ సంతసమే లేదు తుదికిన్ - ముత్తైనరికెరుగువరకు చుక్క జిగికెగయు వరకు" అని ప్రకృతిలో నొక అణువుగ లీనము కావలయునని తహ తహలాడిపోయిన ప్రకృత్యారాధకులు వీరు అంతగ ప్రకృతిలో తాదాత్మ్యము చెందుట చేతనే శాద్వల సుమము నుండి మల్లెపూవు వరకు, కోయిల నుండి కాకి వరకు, పక్షి ఈక నుండి పరమాత్ముని వరకు కవితా వస్తువులుగ స్వీకరించి 'ప్రకృతి కవి'గ గుర్తింపు పొంది , తను గురువు అస్వాల్డ్ కూల్డ్రిగారిచే 'ఆంధ్రా వర్డ్సు వర్త్'గ కొనియాడబడిరి. జనపదములలోని, గ్రామీణజీవితములోని ప్రకృతి సుభగత్వమును సాక్షాత్కరింపచేసిరి ఉభయగోదావరీ తీర ప్రాంతములు వీరి గేయములలో మగ్గ మనోహరముగ రూపు దాల్చినవి

జానపద గేయములనిన వీరికి మక్కువ ఎక్కువ. మరుగుపడిన ఇట్టి గేయములను సేకరించుచు సభలలోని ప్రసంగముల చివర పాడుచుండిరి ఆ వరుస లలోనే పెక్కు గేయములు రచించిరి వీనియందు అమాయక, జానపద శృంగా రము మనోజ్ఞముగ చిత్రింపబడినవి

ఆ నాటి కాలమున సమాజములో అణగారిన వారి కడగండ్లను జీవితమున కత్యంత సన్నిహితముగ నుండు కవితా రూపమున వెలువర్చినవారు వీరే. గనిలోని కార్మికుడు, రాళ్ళు కొట్టు కూలి, అంట్లు తోము దాసి, టపారన్నరు మొదలగు కార్మి కులు, పొలములో పనిచేయు కాపు, గొడ్లుకాయు గొల్లవాడు, కోతకోయు పడుచులు మున్నగు పల్లీయుల కష్టసుఖములను యథాతథముగ చిత్రించిరి. కనుకనే అభ్యు దయ కవిత్వము వెలయక మునుపే, కర్షకకార్మికుల నింతగ తరచి చూచిన కవిగ, సాహిత్యమును నిజముగ ప్రజాస్వామికము చేసిన రచయితలలో నొకరుగ.వీరు

పేర్కొనబడిరి. ఇట్లు వీరు అభ్యుదయ కవిత్వమునకు దారి తీసిన వారిగ తెలుపవగును.

మన భాషలో బాల సాహిత్యమల్పముగ నున్న కాలమున సరళ సుందర గేయములు రచించి బాల వాఙ్మయమునకు ఇతోధికముగ సేవ కావించిరి.

ఆ కాలమున గాంధేయ సిద్ధాంతములకు ప్రభావితులై రచనలు గావించిన వారిలో వీరొకరు. మద్యపాన నిషేధమును, స్త్రీ జనోద్ధరణను ప్రబోధించు గేయములు పెక్కులు వెలయించిరి ప్రపంచ యుద్ధములకు ప్రేరితులై యుద్ధ గీతికలను రచియించిరి

ఇక వీరి కవిత్వమున అగ్రస్థానము నాక్రమించిన 'శివరాత్రి ప్రళ' గేయము తెలుగు కవితా లోకమునకే మకుటాయమానమై ఒప్పునట్టిదిగ కొనియాడబడినది. ఇది కవిత్వములో నూతన ప్రయోగమని, ఛందస్స్వరణములో ఇంతకుమించిన కావ్యము మన భాషలో లేదని, ఇది లేకుండ ఆధునిక కవితా సంకలనమేదియు సంపూర్ణము గాదని కీర్తింపబడినది 'ఇంప్రెషనిజమ్'కు చక్కని నిదర్శనముగ నిల్చిన ఈ గేయము మహాశివుని ప్రళయ తాండవమును మన అనుభూతికి తెచ్చి ఆధ్యాత్మిక భావమును చాటుచున్నది.

వీరి గద్య రచనలు రసవంతమై విశిష్టమై అలరినవి నవల వెలువడిన తొలిదినములలోనే సంఘ సంస్కరణ దృష్టితో. వీరు రెండు నవలలను రచించిరి ఇవి స్త్రీ పురోభివృద్ధి, గ్రామాభ్యుదయము, కులతత్త్వ నిర్మూలన మున్నగు అంశములను చాటి చెప్పినవి. ఆ కాలమునాటి రాజకీయ, సాంఘిక పరిస్థితులను, తెలుగు దేశము నందలి గ్రామ వాతావరణమును ప్రతిబింబించినవి

మన భాషలో చిన్న కథల రచనా విధము పరిణతి చెందుటకు మొదలైన కాలములో అనగా ఇప్పటికి సుమారు ఏబది ఏండ్ల క్రితము వీరు మూడు వందల కథలకు పైగనే రచించి ఒక విలక్షణ విధానమును నెలకొల్పిరి. వీరి ప్రపంచ పరిశీలనానుభవమునివి అడుగడుగున చాటుచు బడుగు ప్రజల కడగండ్లను చిత్రించిన కథలే అధికము. వైవిధ్యము, సంక్షిప్తత, వాస్తవికతలతో ఒప్పిన వీరి కథలు ఆ కాలము నాటి సంఘమునకు దర్పణములైనవి

రుక్మిణీకల్యాణగాథను రసవంతమగు నాటకముగ మలచిరి సంఘసంస్కరణ

అభ్యుదయ దృష్టితో సాగిన వీరి ఏకాంకికలు. ఏకాంకికా రచన సాగు తొలి దినము లలో వీరినిఏకాంకికలు ఆ దినములలో రేడియోలో ప్రసారమై ప్రచారమునుగాంచినవి.

వ్యాస ప్రక్రియలో వీరు విస్తృతమగు కృషి సల్పిరి. సాహిత్య వ్యాసము లలో వీరి పాండిత్యము, పరిశీలనా దృష్టి సామర్ధ్యము,కల్పనా వ్యాసములలో వీరి ఆత్మీయత రచనా చమత్కృతి గోచరించును. ఆంగ్లమున 'Travelogue'ను బోలిన వీరి 'జంటలు' అను వ్యాసములు తెలుగు వ్యాసములలో అపూర్వమైనవన వగును. ఇవి ఆంధ్ర దేశమునందలి యాత్రా స్థలములను వర్ణించు రసఖండికలై ఒప్పినవి. 'నేను వ్రాసిన వేమిటంటే' అను శీర్షికను వ్రాసిన వ్యాసములు ఆ నాటికి అరుదైన రీతిలో రచింపబడినవి తమ రచనా వివరములనిచ్చుటయే గాక ఆ రచనలపై విమర్శ కూడ చోటు చేసుకొనుట వీని విలక్షణత

ఇట్లు ప్రకృతి కవిగ, కార్మిక కవిగ, కథక చక్రవర్తిగ వాసిగాంచిన కవి కొండలను భావ కవిత్వమునకు, అభ్యుదయ కవిత్వమునకు వారధి అనదగును.

అనుబంధము _ 1

# FAREWELL ADDRESS IN THE YEAR 1915

K. Venkata Rao Garu,
History Assistant,
Taylor High School
NARSAPUR

Sir,

It is with mingled feelings of joy and sorrow that we the students of the Taylor High School, Narsapur, beg to approach you this evening to bid you a hearty farewell on the, eve of your departure from our midst, joy on account of the certain prospect of a brighter future before you, and sorrow because of our unavoidable seperation from you, an earnest well wisher of ours

We feel, we can never be too grateful to you for the valuable advice you gave us whenever we sought it, and for the high ideals of life you have implanted in us, during your discourses on the examplary lives of eminent men.

Your enthusiasm in teaching us according to the modern and most effective methods of instruction and the interest in outdoor games you have created in us, make your name remembered by us. Your obliging and sociable nature, simple and amicable manners, and your many noble qualities of head and heart, have endeared you to one and all of us.

We beg to request you to accept this Souvenir as a humble taken of our gratitude and respect for you, and pray that you may carry with your pleasant recollections of your short stay with us.

May god grant you and your family long life and prosperity.

We beg to remain Sir,
Your most obedient Students,
NARSAPUR

# అనుబంధము _2

## కాలానుక్రమణిక పట్టిక

1910 - ఆంగ్ల గేయములు

1911 - 17- ఆగడపలు (గే సం) విప్రసందేశము (నా)

1912 - 16- వివిధ కుసుమావళి (గే సం) భారతీయ సందేశము (నా)

1912 - 52- ప్రకృతి పాంచజన్యము (గే.సం)

1913 - 14- త్రయి (గే సం), అనాథాభ్యుదయము (ప)
ఆత్మవ్యక్తి (గే సం)

1915 - 22- ప్రకృతి చందనము (గే సం)

1916 - విజన సదనము (ప)

1919 - 22- మాతృదేశ సంకీర్తనము, జనపదములు, చదువులదుత్త (గే సం)

1919 - 23- చిట్టికైత (గే.సం), కోనేరు (ప్ర)

1919 - 24- కలరుతము (గే సం), కుమార కంఠము

1925 - 37- హరి వినోదము (శ)

1927 - నెల బాలుడు (గే), కవిత్వము యొక్క విలువ (వ్యా)

1928 - సారస్వత జిజ్ఞాస (వ్యా)

1929 - పొట్టికత (క), జంజలు (వ్యా)

1930 - తెనుగుశైలి, కల్పనా వ్యాసములు, పెద్ద చిన్న, పాఠకుని తన్మయత్వము (వ్యా)

1931 - 37- పొట్టిరవికలూ-వాలు జడలు (క)

1933 - ఇసుప కోట (న)

1934 - స్వవిషయము (వ్యా)

1935 - ఒకింత వెల్లడింపు (వ్యా)

1941 – ఆంధ్రదేశ జానపదులు, తెనుగుబిడ్డ ఎవరితో పోతు (వ్యా)

1942 – జానపదగీతములు, ఇలాకాకుండా అలా వ్రాస్తే ఎలా వుండేది (వ్యా)

1943 – కుంతి (శ్ర.నా), కార్యమాపూడి (వ్యా)

1944 – రణభీ (వ్యా)

1945 – నయనరేఖ, మాట అందని నిజం, కావ్యవస్తువు– వైవిధ్యము (వ్యా)

1947 – కనుపాప పీడలు (వ్యా)

1947 – 53– నేను వ్రాసిన నేమిటంటే శీర్షికను పదివ్యాసములు

1949 – కాలంమార్పు,కాగజ్ పకడా,రఘు–రజిని(శ్ర నా)సెమమంచిలి జైనదేవుడు (క)

1950 – రైల్లో పెళ్ళిచూపులు, తాతయ్య, మిత్రస్థాన్, పొదిలి, తాతయ్య నుస్తీ, బుడుగునిద్ర, జైజైనైనై (శ్ర.నా)

1951 – అందరూ మేధావంతులే, సుభద్ర, గొంతెమ్మ కోరిక, హనుమంతుని ప్రణయం, ఏరువాక (శ్ర.నా)

1952 – దేవునిపాలికాపులు, మూలనున్నముసలమ్మ (శ్ర.నా)

1953 – గృహమునుండి శరణాలయము వరకు (శ్ర.నా)

1954 – జనాభా, చిన్నచిన్న వ్యాపారాలు, మోటారు బేరము పగటి కలకాదు (శ్ర.నా)

1955 – ఏడున్నరంటే ఎనిమిదన్నమాట (శ్ర.నా)

1957 – దారిప్రక్క, పొలంమధ్య ఇల్లు (శ్ర నా)

(గే సం– గేయసంపుటములు, నా– నాటకము, ఏ– ఏకాంకిక, న– నవల, శ– శతకము, వ్యా– వ్యాసము, శ్ర.నా– శ్రవ్య నాటిక, ప్ర– ప్రహసనము, క– కథ)

# అనుబంధము - 3

## రచనలు - ప్రక్రియానుసార పట్టిక

I. సంప్రదాయ కవిత్వము :-

1. ప్రబంధము — సుకన్య (అ)
2. దండకములు — శ్రీకృష్ణ, గణ, సూర్య, శనేశ్వర దండకములు (అ)
3. లఘుకావ్య/ఖండకృతులు — శివపూజాకుసుమావళి, ఉత్తలి, రాధిక — రాజిగాడు (అ)
4. శతకములు : హరివినోదము (సంపుటి) — హరివినోదము, మనైక దైవ సంప్రార్థనము, శతధా, కందకుక్షి ద్విపదలాక్ష.

II. నవ్య కవిత్వము : (15 సంపుటలు)

ఆత్మవ్యక్తి, మాతృదేశ సంకీర్తనము, జానపదములు, కలరుతము, చదువుల ధుత్త ఆశ్వదష్టలు, చిట్టిక్రైత, భాషపుష్పరశి, ప్రకృతి చందనము, విశాల విశ్వము ప్రకృతి సాంధ్ర జన్మము, వెలబాల్యము, కుమారకంఠము, కవి కొండల గేయాలు, కవికొండలగీతాలు, శతపత్రమ్ (ఆంగ్లగేయ సంపుటి)

III. నవలలు :-

1 విజయపదనము 2 ఇనుపకోట

IV కథలు :- (7 సంపుటులు)

పొట్టికత, పొట్టిరవికలు వాలుజడలు, పెమమంచిలి జైనదేవుడు కథకుడిలో కథ, బొమ్మచిలుక, కవికొండల వారి సాహిత్యం- కథలు, కవికొండల వారి సాహిత్యం-హాస్యకథలు

V నాటకములు : ఇవి ఏడు. ఒకటిమాత్రమే లభ్యము.

విప్ర సందేశము (ముద్రితము) ఋషీవంద, యయాతి, త్రేతాయుగాంతము, విప్లవరసపుత్రము వియోగ విజయుడు, ప్రేమచిత్తు (అ)

VI ఏకాంకికలు

1. బాణములు — భారతీయసందేశము, అనాధాభ్యుదయము. అభినవవిద్యార్థి (అ)
2. ప్రహసనము — కోనేరు
3. ఏకాంకికలు (శ్రవ్య నాటికలు) 26 (వీనిపేర్లు 'ఏకాంకిక' ప్రకరణములో పేర్కొనబడినవి )

VII వ్యాసములు:

జంటలు సంపుటము, మిగిలిన ముద్రిత, అముద్రిత వ్యాసముల పేర్లు 'వ్యాసములు' ప్రకరణమున తెలుపబడినవి. (అ — అలభ్యము)

# అనుబంధము - 4

శ్రీ "కొండకొలకు — వికసితోత్పల" —'కవి'
శ్రీ కవికొండల వేంకటరావు B A,B L గారికి షష్టిపూర్తి మహోత్సవ
సందర్భమున సమర్పించిన

## సన్మాన పత్రము

ఆర్యా!

తమరు జన్మించిన కతమున ఒక్క శ్రీరంగ పట్టణమేగాక కోరుకొండ మహల్ యావత్తు పునీతమైనది, ఒక్క "కవికొండల" వంశమేగాక యావదాంధ్ర లోకము స్మరింప దగినదై యున్నది. తమరు 1910 వినాయకచవితి నుండి నేటి వఱకు గావించిన మాతృభాషాసేవ, ఆంధ్ర సారస్వత రచనము, నిరంతరము కొనియాడదగినది.

తమకీనాడు అరువదేండ్లు నిండిన తరుణమున షష్టిపూర్తి మహోత్సవము మేము సవిశాలాంధ్రముగా చేయుచు మిమ్ముల నభినందించు చున్నాము. మాయీ కొలదిపాటి సత్కారము నందుకొని ఇతోధిక సేవచే భాషాయోషామ తల్లిని తమరు వర్ధిల్ల చేయుచు మరి అరువదేండ్లు సుఖాన జీవింతురుగాక.

ఓ సుజ్ఞాన ఖనీ! ఎందరెందరో మహాకవులుదయించి పెంపొందిన పావన గౌతమీ తీరమున విద్యనభ్యసించి, వివేకమును చూఱగొని, ఛందాంతరములు పేరెన్నిక గన్న కవితా మాధురిని విరజిమ్మ. "కొండకొలకు వికసితోత్పలకవి" యని, "సహజకవి" యని, 'కార్మిక కవి' యని ప్రఖ్యాతి వడసిన మీకు జోహార్లు! మీ శైలి అపూర్వము మీ లోకయాత్ర నిరాడంబరము మీ ఆశయము హిమవన్న గోత్తుంగము. మీ ఆలోచన అంబోధిగంభీరము —

ఓ రాజమహేంద్ర వరపురనివాసీ! మీ కులము కవి కులము మీ కలము కవి కలము మీబలము కవిబలము "అభినవాంధ్ర" ప్రకాశ సంస్థ నామమున మీ గ్రంథములను 1924 నుండి వెలయించుచు పరంపరగ వీనినిప్పటికిని పాఠకుల చేతుల నవిరళముగా నలంకరింప చేయుచుండ మీ కీర్తి చంద్రికల ప్రాశస్త్యమే!

షడనః మీకు మేము వందనమాచరించి ఈ నిండు సభవారి యనుమతి వడసి మిమ్ములను "కవీ", "కవికొండల కవీ", "కొండకొలకు— వికసితోత్పల కవీ" జయ్ అన సాహసించుచున్నాము — జైహింద్

ఇట్లు
"శ్రీ కొండ కొలకు - వికసితోత్పల" "కవి"

రాజమహేంద్రవరము
20-7-1952

"కవికొండల వేంకటరావు"
షష్టిపూర్తి సన్మానసంఘం.

# అనుబంధము - 5

## కవికొండల వారి అముద్రిత పద్యములు - గేయములు

### తెల్లు పూత

తెల్లుం బూసిన పువ్వు, చంద్రిక లనేకభావమందంగనో
చెల్లా! సంద్రపు నుర్వుపోలిక నదీ శ్రీదేవి నుబ్బింపనో
పెల్లిన్ లేచిన దేహం గన్పడగ నేవేడ్కన్ విలోకించితిన్
మెల్లన్ గట్టనం బోవుచున్ నిశని మేల్మేలంచు నేమెచ్చితిన్

### స్త్రీ సంఘ ప్రార్థన గీతిక

అబలలము హక్కులిచ్చి ఆదరింపుమా!
ప్రభూ! మాయెడ ప్రభను గొలిపి ప్రజ్ఞ నిలుపుమా!
మహమదము, క్రిస్టియను, హైందవ మతుల
సహ వాసవతుల, జేసి సంఘము నడుపు ॥అబల॥
జవ్వనమున ( బెండ్లి సేసి చక్కనసాకు
పువ్వుం బోండ్లమ నిండ్ల ముక్కుగ నీకు ॥అబల॥
విద్య నిచ్చి విభవ మిచ్చి బుద్ధి నిచ్చి — మ
మ్ముద్ధరింపు మో యీశా! ముగ్ధలమనకు ॥అబల॥
సత్య శాంతిశౌచము లొగి జరుపు కొనుచును
నిత్యము నీ పదసేవను, నియతినుందు మోయీ ॥అబల॥

### లలిత కళ

బంగారు కొండలో పాలు పోసీకాచ,
పాలు పొంగి పోయి, నీళ్ళుమిగిలె,
నీళ్ళలో పాలోయ నీటు గాదూ కదర
నీళ్ళు ఇగిరె—
లలిత కళ అట్టిదే,
కాంచన కవితమై సంసారలలితమై
పడలి పడలి సారమెడసిపోవ
సార మెడసి పోవ సంసారమురి తడకెసె

## పూదేనె

చదువులన్నీ అదికి వెదకి చూస్తే ప్రేమ
చిన్ని పూదేనెలా చిలుకుతుండు,
కొన్న వారికి రాదు,
తిన్నవారికి లేదు.
అన్నవారికి బోదు
మన్నెంలో ఈగలమైనామూ తెర పెట్టి
తెరలోకి తేవాలి సిరి సిరి సిరి

## గోపాలుడు

కమ్మోరి సిన్నోడు—సిరిసిరిమువ్వ
కాసూలు కంచేలు—సిరిసిరిమువ్వ
బాపనోరి సిన్నోడు—సిరిసిరిమువ్వ
గాలి పాట అంతా ఉన్నారు.

## గౌతమీ నమో వాక్కులు

కొండలు మాత్రముత్తరపుఁ గొట్టకొసన్ మిగిలించు కొంచు, ను
ద్దండ ఝరీప్రవాహము ముదావహమై తనరార వంతెనన్
బెండువలెన గదల్చివటు వేడుక జూపుచు పోను పోను బ్ర
హ్మాండము మ్రింగు పోలికను నద్దరి కిద్దరి కేకనీరమై
కొండె సిగన్ రహించునది నోయన లంకల నావకట్టుది
ఙ్మండల రేఖ వృష్ఠ పరిమాణము జూపుచునంతు లేని క
న్పండువు గూర్చు గౌతమి నమామి నమామి నమామి వ్యామోహం

## గోదావరి వరద

నోట హూమ్మను పెద్ద పాటవము గలుగు
బెబ్బులి నాఁదోఁచి యుబ్బిపోతి,
సంకెళ్ళు తెగి క్రొత్త స్వాతంత్ర్యమల వడ్డ
జయలక్ష్మిలాగు గజ్జెల రుతిస్తి,
అఖిలాగమములు బ్రహ్మ ముఖమున కొకమాఱు
పలికిన రీతి శబ్దార్థమిడితి,

పర్వతంబులు వార్ధి సర్వంబు మేఘాలు
నీకుఁ దోడుగఁ గాని నివ్వటిలితి
మనుజుల మరుచు కొన్నట్టి మడులు, గుడులు
మేడలు, బజారు వీధులు, మెట్ట, గట్టు
నిలుచునట్టివె నీముందుః పిలిచెఁ గ్రొత్త
నిన్ను గోదావరీః నేడు నేస్తుఁడెవఁడొః

## బొబ్బర్లంక పైని

అపరాహ్ణంబు నివాత రోదసి సమీహార్హస్థాయి కించిత్త్వ న
ప్రవప వంశీతల మంజులాకసము బొబ్బర్లంకపెన్ బాయపై
నపుడే తోచెను నావయున్ దనకుఁ దానై సాగుచుండెన్ గదా
యపహాసాస్పద మంద మంద గతిఁ గమ్యస్థాన నిర్మోహియై

## భారతీయుని స్థిత ప్రతిజ్ఞ

నే భారతీయుడను సనాతనుండను
అయినా అస్పృశ్య దోషము నాదరింపను,
మానవు లందఱు ఒకటే: మాలలు బ్రాహ్మలు ఒకటే,
తాకిన మాత్రన తఱుగునె భాగ్యము,
సోకిన మాత్రన సురగునె యోగ్యత
నేల నడుచుటకు నీరు త్రావుటకు
కూడు కుడుచుటకు క్షోణితలంబున
ఎల్ల జనంబులు ఏకోదరులే
నే భారతీయుడను కర్మ తంత్రుడను
అయినా ఎవరి కర్మము వారిదె యనను.
అరక తోడుగా చరకచక్రం
చుఱుకుగ నడపితె చుట్టిండ్ల స్నీ
ప్రాసాదాలౌః రంగరంగ వై భోగ పరంపరః
నే భారతీయుడను కార్యశూరుడను
అయినా ఎదరవానిపై నిగవాలనిన్
ఎట్టి క్రౌర్యమును గట్టిపట్టుదల

సహన భావమున జయించి తీరెద
సత్యాగ్రహమే పరమసాధన
అహింసయే నాకాధారంబు
నే భారతీయుడను మోక్షపరుండను
అయినా మూల గూరుచుని ముక్తిమ్మనను,
తల్లి దేశమునకు దాస్యము బాపి
ఎల్ల సోదరులు ఉల్లాసముతో
స్వరాజ్య సఖులై సంతసించునెడ
చల్లగ వీడెద నీ శరీరమును

యుద్ధగీతి

అని మొనకు అంగవెయ్య
అందుకో విజయమ్మ !
నీతి నీయది యను
వియతి నీయదియను
నిర్మలాంతః కరణ
మార్గాన పేర్చుచు
లోక స్వతంత్రంబు
త్రైలోక్య విభవంబు
యోధుడా! యోధుడా ! అని మొనకు అంగవెయ్య
ప్రాక్పశ్చిమాకాశ వాయు విమానాల
దాడులని వెరవకుము
పసిఫికాట్లాంటిక్ టార్పెడో డ్రెట్‌నాట్ల
ధమ ధమల దంగవకు
సూర్యోదయంబయే సామ్రాజ్యమునకును
సూర్యతస్తామింపనటువంటి ఘన బ్రిటిష్
సామ్రాజ్యమునకునూ పోరాటమేమిటి?
ఆరాట పడబోకు
ఉరకు శతఘ్నితో
ఉఱుము గ్రుద్దెట్టగా
అరికాలిమంట నెత్తి కెక్కించుకుని
శరపరంపర శత్రు సైన్యముల చెండాడు
విశ్వస్వతంత్రమునకు
శాశ్వతైశ్వర్యమునకు — యోధుడా

# ఉపయుక్త గ్రంథ సూచిక

## 1. ప్రాచీన గ్రంథములు


1. శ్రీమదాంధ్ర మహాభారతము — నన్నయ
2. శ్రీమదాంధ్ర మహాభారతము — ఎఱ్ఱన
3. శ్రీమదాంధ్ర మహాభాగవతము — పోతన
4. పండితారాధ్య చరిత్ర — పాల్కురికి సోమన
5. భీమేశ్వర పురాణము — శ్రీనాథుడు
6. మను చరిత్రము — పెద్దన
7. అభిజ్ఞాన శాకుంతలమ్ (సం) — కాళిదాసు


## 2. నవీన గ్రంథములు


8. అందాల తెలుగు కథ (సావనీర్) — సంకలనము
9. ఆధునికాంధ్ర భావ కవిత్వ తత్త్వము — పాటిబండ మాధవశర్మ
10. ఆధునికాంధ్ర కవిత్వము — డా। సి. నారాయణరెడ్డి
11. ఆధునికాంధ్ర కవిత్వముపై ఆంగ్ల ప్రభావము — డా। కొత్తపల్లి వీరభద్రరావు
12. ఆంధ్ర నవలా పరిణామము — డా। బొడ్డపాటి వేంకటకుటుంబరావు
13. ఆంధ్ర యక్షగానవాఙ్మయ చరిత్ర — డా। ఎస్. వి. జోగారావు
14. ఆంధ్ర రచయితలు — మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి
15. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర — వంగూరి సుబ్బారావు
16. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర — డా। దివాకర్ల వేంకటావధాని
17. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము — కె వెంకట్రావు
18. ఆంధ్రావళి — రాయప్రోలు సుబ్బారావు
19. ఆంధ్ర శతక సాహిత్య వికాసము — డా। కె గోపాలకృష్ణారావు
20. ఎంకి పాటలు — నండూరి సుబ్బారావు
21. ఒక దశాబ్ది తెలుగు కథలు (1946-1955) — సంకలన కర్త — మధురాంతకంరాజారాం
22. తెలుగు కథానిక (సంకలనము) — ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడెమీ
23. తెలుగు కవితా వికాసం — డియ్యాల రామమోహనరావు

24 తెలుగు జానపదగేయ సాహిత్యము — డా॥ బి రామరాజు

25. తెలుగు నవల–నూరు సంవత్సరాలు (సంకలనం) — ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ

26. తెలుగు నాటక వికాసము — డా॥ పోణంగి అప్పారావు

27 తెలుగు వ్యాస పరిణామము — డా॥ కొలకలూరి ఇనాక్

28 తెలుగు సాహిత్యం–గాంధీజీ ప్రభావం — మొదలి నాగ భూషణ శర్మ

29 నాట్య శాస్త్రము — డా॥ పోణంగి అప్పారావు

30 ప్రబంధముల్లలో ప్రకృతి వర్ణన — డా॥ అంతటి నరసింహం

31. ప్రకృతి–కవిత–కావ్యము — కపిస్థలం రంగాచారి

32. బసవరాజు అప్పారావు గీతాలు — బసవరాజు అప్పారావు

33 మహతి (వ్యాస స[illegible]టి)

34. మహా ప్రస్థానం — శ్రీశ్రీ

35 ముత్యాల సరాలు — గురజాడ అప్పారావు

36. వ్యాస చంద్రిక — గురజాడ అప్పారావు

37. వ్యాస మంజరి — డా॥ కట్టమంచి రామలింగారెడ్డి

38. వేలూరి శివరామ శాస్త్రి కృతులు –సమీక్ష — డా॥ జంధ్యాల శంకరయ్య

39 పైతాళికులు (సంకలనం) —ముద్దుకృష్ణ

40 ఆంధ్ర శతక వాఙ్మయ చరిత్ర —వంగూరి సుబ్బారావు

41. శ్రీశ్రీ కవిత్వం — వస్తువు — సంవిధానం—డా॥ మిరియాల రామకృష్ణరావు

42. శ్రీశ్రీ సాహిత్యం (రెండు–వచన విభాగం)—శ్రీశ్రీ

43. సంస్కృత వాఙ్మయ చరిత్ర—మల్లాది సూర్యనారాయణశాస్త్రి

44. సారస్వత నవనీతము —దేవులపల్లి రామానుజరావు

45. సారస్వత వ్యాసాలు (సంకలనం —4వ సంపుటము
—పురిపండా అప్పలస్వామి

46. సారస్వత వ్యాసావళి —ఆంధ్ర శేషగిరిరావు

47. సాహిత్య దర్శనము —కాటూరి వేంకటేశ్వరరావు

48. సాహిత్య దర్శనము — ఆచార్య కె.వి.ఆర్.నరసింహం

49. సాహిత్య శిల్పసమీక్ష — పింగళి లక్ష్మీకాంతం

50. సాహిత్యంలో దృక్పథాలు — ఆర్.యస్.సుదర్శనం

## 3. ఆంగ్ల గ్రంథములు


1. Lyrical Ballads (2nd edition — W. Words Worth
2. The Prelude Book II — W. Words Worth
3. The Poetic works of Words Worth — W Words Worth
4. Poems in two Volumes —W. Words Worth
5. Words Worth - A Collection of Critical essays —M. A.Abrams
6. South Indian hours — O.J. Couldray
7. An Introduction to the Study of Literature — W. H. Hudson
8. Encyclopaedia of Americana
9. Encyclopaedia ofBritanica
10. Every man's Encycopaedia — Vol 12


## 4. పత్రికలు


1 ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచిక
2. ఆంధ్రప్రభ (దినపత్రిక)
3. కవి కొండల వెంకటరాయ షష్టి పూర్త్యుత్సవ సంచిక
4. కిన్నెర
5 గృహిణి
6 తెనుగువాణి—(ప్రపంచ తెలుగు మహాసభల సంచిక)
7. త్రివిక్ర
8. దేశసేవ
9. భారతి
10. శ్రీశ్రీ సన్మాన సంచిక
11 మహాకవి శ్రీశ్రీ అభినందన సంచిక
12 స్వాతి (మాసపత్రిక)
13 సౌభాగ్య


—0—